జీయాదాచంద్ర తారార్కం సర్వ సిద్ధాంత సౌరభం।

# సర్వ సిద్ధాంత సౌరభము

మూర్ఛితాధ్యాత్మ చైతన్య సంజీవన మహౌషధిః॥

ఆకాశవ న్నిర్మల నిర్వికల్ప
నిఃసీమ నిస్పందన నిర్వికారం ।
అంతర్బహిః శూన్య మనన్య మద్వయం
స్వయం పరంబ్రహ్మ కిమస్తి బోధ్యం ॥

వివేకచూడామణి 394.

ఆకాశమువలె నిర్మలమును, సంకల్ప వికల్ప శూన్యమును, అనంతము అక్రియము నిర్వికారము బాహ్యాభ్యంతర రహితము అద్వితీయమును అగు పరబ్రహ్మము నీవే! ఇంకను నీకు తెలియదగిన దేమి గలదు!



శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యాం శెట్టిగారు
భీమునిపట్టణము
విరాళము – రు. 516/-



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

**ఉద్దేశము:**

ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారిచేతను యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

**విధానము:**

సంవత్సరమునకు కనీసము రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

**విరాళములు:**

1) రు. 500/- మించు విరాళ మొసంగువారు మహారాజపోషకులు. ఒకముఖ్యగ్రంథమున వీరి ఫోటో ప్రకటింపబడును. వీరినామములు ప్రతి కుసుమమున ముద్రింపబడుచుండును. గ్రంథమాల ప్రచురణము లన్నియు ఉచితముగ వీరి కొసంగబడును.
2) రు 100/- లు మించు విరాళ మొసంగువారు రాజపోషకులు. ప్రతిగ్రంథమున వీరి నామములు ముద్రింపబడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుగూడ ఉచితముగ బడయుదురు.
3) రు 50/- మించు విరాళ మొసంగువారు పోషకులు. వీరినామములు అన్ని ప్రచురణముల ప్రకటింపబడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.
4) రు 25/- మించు విరాళ మొసంగువారు అభిమానులు. వీరు ప్రచురణముల 3/4 ధరలకు బడయుదురు.
5) రు 10/- మించు విరాళ మొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/8 తగ్గింపు ధరలకు బొందుదురు.

గ్రంథమాల మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి దోడ్పడుదురు గాక.

# విరాళకర్తలు

## మహారాజపోషకులు

1. శ్రీ బలభద్రుని చెన్నయ్య శెట్టిగారు అండ్ సన్స్
కమీషన్ మర్చంట్స్, ఆయిల్ మిల్స్, భీమునిపట్టణము రు 516
2. శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు అండ్ సన్
ఆయిల్ మిల్లు, భీమునిపట్టణము 516

## రాజపోషకులు

1. శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు, కమీషన్ మర్చంట్స్
నెల్లూరు 300
2. ,, పసుమర్తి శేషాచలం శెట్టిగారు, కమీషన్
అండ్ క్లాత్ మర్చంట్స్ ,, 100
3. ,, నూనె శేషాచలం శెట్టిగారు, కమీషన్ & రైస్ మిల్స్ ,, 116
4. ,, నూనె జగ్గయ్య శెట్టిగారు, రైస్ మిల్సు ,, 116
5. ,, చిత్తూరు మునుస్వామి మొదలియార్ గారు,
కమీషన్ మర్చంట్స్ ,, 116
6. ,, యడ్లపల్లి గోవిందుశెట్టిగారు, ఐరన్ ఫర్టిలైజర్స్ ,, 116
7. ,, కొత్తూరి రామయ్య కర్పూరపు రామకృష్ణమూర్తి
కంపెనీ, టుబాకో మర్చంట్స్ గుంటూరు 100
8. ,, పోలిసెట్టి సోమసుందరముగారు, ,, ,, 100
9. ,, కర్పూరపు వెంకటనారాయణగారు, ,, ,, 100
10. ,, వంకాయల కోటేశ్వరుడుగారు, ,, ,, 100
11. ,, పోలిసెట్టి సీతారామయ్యగారు, అడ్వొకేట్ బాపట్ల 232
12. ,, బూదరాజు వేం॥ నరసింహారావుగారు, డాక్టరు స్వర్ణ 100

4. కృష్ణాపత్రిక, బందరు 28-11-1953

శ్రీ అనుభవానంద గ్రంథమాలద్వారా "తెలుగునాటికి అనుభవంతో కూడిన తత్త్వబోధలు నిత్యోత్సాహముగా చేస్తున్న మహనీయులు శ్రీ అనుభవానంద స్వాములవారు. గొప్పపండితులేగాక గొప్ప కవులు కూడ. చక్కని భాషలో పాటలూ పద్యాలు వ్రాయగలరు. వ్రాశారు. స్వాములవారు ముచ్చటైన వ్యావహారిక భాషకూడా వ్రాయగలరనడానికి 'ఈ సాధన రహస్యం' నిదర్శనం.

పదమూడేండ్ల ఒక ఆడపిల్లకోసం వ్రాసినదైనందుకు ఎంతో సరళత్వము సాధించి కృతకృత్యులైనారు స్వాములవారు.

మొదటిఉత్తరంలోనే చిన్నపిల్లలకుసైతం బోధపడేటట్లు తత్త్వ విషయాలు చెప్పడంలో స్వాములవారికి చక్కని నేర్పు ఉన్నదని స్పష్టపడిపోతుంది. యీ విషయాలను వీరు విప్పి చెప్పిన ధోరణిచూస్తే ముచ్చట వేస్తుంది. పెద్దలు మనుకునేవారుకూడ పిన్నలై కూర్చుండి వినవచ్చు. ప్రతివారూ చదువుకోవలసిన గ్రంథం. ఉత్తమ సంస్కారంతో పుట్టిన ఒక బాలిక నిమిత్తంగా పుట్టిన గ్రంథం కావడంతో దీని పవిత్రత ఇనుమడిస్తున్నది.

5. కృష్ణాపత్రిక, బందరు 8-8-1956

'సాధన రహస్యం' విశిష్టతను గూర్చి మరల ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. ఆధ్యాత్మిక సాధనరహస్యములను వీరిందులో చిన్న ముద్దలూ, గుజ్జనగూళ్ళు చేసి తినిపిస్తున్నారు. లౌకిక ప్రపంచమున కూడా ఈ గ్రంథం చక్కని సంస్కారమునకు దోహదమై ప్రపంచ శాంతి సాధకం కాగలదని స్వాములవారి విశ్వాసం.

6. ఆరాధన, బందరు ఏప్రిల్ 1956

తీవ్రముముక్షుత్వంతో తంటాలు పడుతుండే సర్వసాధక లోకానికి అనగా అతి సామాన్యులకునూ అర్థంఅయ్యేలాగ ఆత్మతత్త్వ విషయాలను సిద్ధాంతము, సాధన అనే రెండువిషయాలను అందులోను రెండవ విషయాన్ని ప్రధానంగా వ్యావహారిక భాషలో శ్రీ మాతాజీకివ్రాసి లేఖా

రూపములో అందిచ్చినారు. వీటి నన్నిటిని ఆలోచించి సాధకుని కవసరమైన సర్వవిషయములు పండ్రొలిచి చేతిలోపెట్టినట్లు స్వాములవారు మన కిచ్చియున్నారీ గ్రంథములో. సిద్ధాంతములు తర్కభూయిష్టములు కాబట్టి విసివిపోయేవారంతా యీ గ్రంథం చదివి సనాతన ధర్మప్రకారం సాధనలో సోపాన పరంపరను తెలిసికోవచ్చును. ఈ గ్రంథంలో పరిభాషలో 'సుహృత్సమ్మితం'గా రచన ఉన్నది.

## 7. పండిత శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి. 6-9-1956.

శ్రీ అనుభవానందస్వామివారికి నమస్సులు. ధన్యోస్మి. అధ్యాత్మిక గ్రంథప్రచారమునకై తాము పట్టిన కార్యము ఎంతో గొప్పది. శ్లాఘనీయము. అవశ్యముగూడ.

'సాధన రహస్యము' కంటె ఆత్మసాక్షాత్కార మార్గమును విమర్శగా వివరముగా తెలుపు గ్రంథము దుర్లభము. జిజ్ఞాసతో సాధనకు దిగిన ఒక కుమారిని వ్యాజముగా నుంచుకొనుటచే ఈ గ్రంథము చాల గహనమైన విషయములనుగూడ సర్వ సుగ్రహముగా చేసి తెలుగువారిని ధన్యులను జేసినది.

## 8. శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

చిరివాడ 17-9-1956.

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య
అనుభవానంద స్వాములవారి సన్నిధి సాష్టాంగ నమస్కారములు.

అయ్యా,

సాధనారహస్యము చదువ మొదలిడుటయే నావంతు. చివరంట తీసికొనిపోవుట దానివంతు. తాము భిక్షువులు. తమ సాధనారహస్యము చదివినవారు తమ విజ్ఞానమునకు అనుభవమునకును భిక్షువులు.

జ్ఞానముచే శుష్కమయిన మనస్సులందుగూడ నిది రస సంచారము చేయగలదు. భక్తిభరితమయిన తమ అనుభవములో నిది ఒక చిటికె. ఇట్టి చిటికె లెన్నియో తమనుండి లోకమపేక్షించును.

దివ్యచిత్తమునకు సేవలెను.



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీ రామకృష్ణలీలా సంకీర్తనము : (చతుర్థ ముద్రణము)
   శ్రీ రామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి భక్తిప్రబోధకముగా 132 కీర్తనలు.
   1/16 డెమ్మీ. 200 పుటలు. రు 0-62

2. శ్రీరామకృష్ణాంజలి : (తృతీయ ముద్రణము)
   శ్రీ రామకృష్ణ వివేకానంద తత్త్వముల గురించి భక్తి ఉత్సాహపూరిత పద్యములు 100. 0-12

3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము : (ద్వితీయ ముద్రణము)
   భక్తితో తత్త్వవిషయముల ప్రబోధించు శతకము. 0-12

4. చిత్తప్రబోధ : (ద్వితీయ ముద్రణము)
   సాధకులకనేక అమూల్యరహస్యముల బోధించు శతకము. 0-12

5. సాధన రహస్యము : (ద్వితీయ ముద్రణము)
   ఆధ్యాత్మికాభివృద్ధికి మూలమైన యోగసూత్ర సాధన చతుష్టయముల చక్కని వ్యావహారిక భాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము.
   1/8 క్రౌను. 330 పుటలు. 2-25

6. అనుభవానందము : (ద్వితీయ ముద్రణము)
అద్వైతానంద విభూతిని వ్యక్తపరచు శతకము. 0-12

7. సాధనసుధ :
సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు
సలహాల నొసంగు పద్యగ్రంథము.
1/8 క్రౌను. 62 పుటలు. 0-50

8. మన శారదామాయి : శ్రీ మాతాజీ రచితము.
జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివ
రించు ఉత్సాహపూరిత సులభ గ్రంథము.
1/8 క్రౌను. 64 పుటలు. 0-50

9. మన వివేకానందుడు : శ్రీ మాతాజీ కృతము.
వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శములు
ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము.
1/8 క్రౌను. 68 పుటలు. 0-50

10. మన రామకృష్ణుడు : శ్రీ మాతాజీ రచన
జగద్గురు శ్రీ రామకృష్ణుని అద్భుతాదర్శ సాధన వివ
రముల సుగమము గావించు గ్రంథము.
1/8 క్రౌను. 74 పుటలు. 0-50

11. సర్వసిద్ధాంత సౌరభము : 1 వ భాగము.
దర్శనఖండము - ప్రథమభాగము - సాంఖ్యయోగములు-
శ్రీ కపిల పతంజలి మహర్షుల జీవితకాల విశేషముల
సిద్ధాంతములు ఇట చర్చితము.
1/8 క్రౌను. 350 పుటలు. ౬-౦౦

| | | |
|---|---|---|
| 13. | శ్రీ బొడ్డుపల్లి సీతారామస్వామి శాస్త్రిగారు, కర్లపాలెము | 100 |
| 14. | „ మంతెన వెంకటరామరాజుగారు, బుద్దాం | 116 |
| 15. | „ పులిపాక ప్రకాశరావుగారు, కరణం, అమృతలూరు | 100 |
| 16. | „ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, బందరు | 116 |
| 17. | „ వల్లూరి వేంకటసూర్యనారాయణగారు, అడ్వొకేట్ „ | 100 |
| 18. | „ యద్దనపూడి రామచంద్రరావుగారు, „ | 100 |
| 19. | „ తాడంకి వేంకటకృష్ణారావుగారు, అడ్వొకేట్ „ | 100 |
| 20. | „ మోటమఱ్ఱి దయానిధిగారు „ | 100 |
| 21. | „ తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు „ | 100 |
| 22. | „ చిత్రపు అచ్యుతరామయ్య పంతులుగారు, „ | 100 |
| 23. | „ దీవిసేతు మాధవాచార్యులుగారు, „ | 100 |
| 24. | „ అడ్డేపల్లి వేంకటరామయ్యగారు, „ | 100 |
| 25. | „ పిన్నమనేని లింగయ్యచౌదరిగారు, అడ్వొకేట్ „ | 100 |
| 26. | „ కనకదండి భాస్కరరావుగారు, B. Sc. ఇన్‌కంటాక్సు ఇన్స్పెక్టరు, విజయవాడ | 100 |
| 27. | „ బొమ్మదేవర హేమలతాదేవి బహదూర్‌గారు, ఏలూరు | 100 |
| 28. | „ వంకాయల రామచంద్రరావుగారు, „ | 100 |
| 29. | „ బండి వీరరాఘవమ్మగారు, చింతలపూడి (ప. గోదావరి) | 100 |
| 30. | „ బండి రామారావుగారు, చింతలపూడి „ | 100 |
| 31. | „ మంచిరాజు చినవెంకటరత్నంగారు, భీమడోలు | 100 |
| 32. | „ మావులేటి సోమరాజుగారు, గుండుగొలను | 100 |
| 33. | „ దుర్గంపూడి ధర్మరాజుగారు, „ | 100 |
| 34. | „ భీమవరము వర్తకసంఘ భవనగ్రంథాలయము, భీమవరము | 100 |
| 35. | „ విట్ట భీమశంకరంగారు, ఇన్‌కంటాక్సు ఆఫీసరు పాలకొల్లు | 100 |
| 36. | „ ఇమ్మడి సత్యనారాయణగారు, కమీషన్ మర్చంట్సు „ | 100 |
| 37. | „ బొండాడ వేంకటరాజు గుప్తగారు, క్లాత్ మర్చంట్సు „ | 100 |

38. శ్రీ బట్రెడ్డి తమ్మేశ్వరరావుగారు, పోస్టుమాస్టరు „ 100
39 „ రాజులపాటి వేంకటేశ్వర్లుగారు, „ 100
40. „ అడ్డేపల్లి సత్యనారాయణమూర్తిగారు,
యం. యల్. ఏ., „ 100
41. „ కలగ వెంకటసూర్యసత్య శంభుప్రసాద్ గారు, „ 100
42. „ దశిక రామారావుగారు, బి. డి., కొవ్వూరు 100
43. „ చిన్ని తరుణయ్యగారు, బి. ఇ., మెకానికల్
ఇంజనీయర్, ఇంజనీరింగు కాలేజి, కాకినాడ 100
44. „ కాళ్లకూరి సూర్యనారాయణగారు, విశాఖపట్టణము 100
45. „ కులుకూరి సన్యాసిశెట్టిగారు, మర్చంట్స్ „ 100
46. „ బెండపూడి పేరరాజుగారు, డాక్టరు M. B. B. S., „ 100
47. „ పలుకూరి జగన్నాధరావుగారు, „ 100
48. „ దేవులపల్లి కృష్ణమూర్తిగారు, బి. ఇ., ఎలక్ట్రికల్
ఇంజనీయర్ ఆంధ్రా యూనివర్సిటీ, విశాఖపట్టణము 100
49 „ ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, అనకాపల్లి 100
50. „ కలిగొట్ల సూర్యనారాయణ నాయుడుగారు,
ము॥ చైర్మన్, భీమునిపట్టణము 100
51. „ దుర్గా దానయ్యశెట్టిగారు, అండ్ సన్ „ 100
52. „ ఏడిద సూర్యనారాయణమూర్తిగారు, „ 100
53. „ రాయప్రెడ్డి అప్పారావునాయుడుగారు,
వైస్ చైర్మన్ „ 100
54. „ పొట్టా వీరరాజుగారు, „ 116
55. „ నుదురుపాటి వీరరాజుగారు, శిర్లపాలెము 100
56. „ నందగిరి వేంకటరామదాసు పంతులుగారు, „ 100
57. „ శారదా గ్రంథాలయము, „ 116
58. „ పోలిసెట్టి వేంకటరమణయ్యగారు, (రాజా) విజయనగరము 116

59. శ్రీ మాటూరు లింగమూర్తి గారు, క్లాత్ మర్చంట్స్ „ 100

60. „ మేఘాద్రి మహాలక్ష్మమ్మ గారు, గజపతినగరము 100

61. „ ఆడక్కి వేంకటకృష్ణ హనుమంతరావు గారు, శ్రీకాకుళము 100

62. „ భూసపాటి రామచంద్రరాజు గారు, బి. ఇ., ఎగ్జిక్యూటివ్, ఇంజనీయర్, పి. డబ్ల్యు, డి „ 100

63. „ కొత్త రమణాజీరావు గారు, కమీషన్ మర్చంట్స్ బొబ్బిలి 100

64. „ నంగునూరు మహబూబు రెడ్డి గారు, (దేశముఖులు) వరంగల్ 100

65. „ గైనేడి వేంకట అప్పారావు గారు, డాక్టరు, ఎల్. ఎం. పి., హైదరాబాద్ 100

66. „ వీరమనేని గోపాలరావు గారు, డిప్యూటీ డైరెక్టర్, సివిల్ సప్లైస్, „ 100

67. „ వారణాసి గారు, „ 116

68. „ సి. సీతారామయ్య గారు, అగ్రికల్చరల్ ఇంజనీయరు, అగ్రికల్చరల్ డైరెక్టరేట్ „ 100

## పోషకులు

1. శ్రీ ఎలిసెట్టి సుబ్బారాయుడు శెట్టిగారు, నెల్లూరు 58

2. „ వెలగపూడి సుందరరామదత్తు గారు, „ 50

3. „ విద్వాన్ గర్తి సత్యనారాయణ గుప్త గారు, విజయవాడ 50

4. „ పసుపర్తి సుబ్బరాజు గారు, జి. డి. ఎ., ఎఫ్. సి. ఎ., లైఫ్ ఇన్స్యూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, బందరు 50

5. „ తుమ్మల వేంకటేశ్వరరావు, భీమడోలు 50

6. „ కొండ ఈశ్వరరాజు గారు, గుండుగొలను 50

7. „ ఊనికిలి వేంకటరాజు గారు, „ 50

8. „ నుదురుపాటి సత్యనారాయణ గారు, భీమునిపట్టణము 58

9. „ పూసర్ల జు॥ అప్పలవరసయ్య అండ్ సన్స్ టింబర్ మర్చంట్స్, విజయనగరము. 58

# సర్వ సిద్ధాంత సౌరభము

## అ భి ప్రా య ము లు

---

### ప్రథమభాగము

**1. గోలకొండ పత్రిక, హైదరాబాదు 9-8-1954**

దర్శన, అద్వైత, వైష్ణవ, శైవ, బౌద్ధ, సమన్వయ ఖండములలో శ్రీ కపిలమహర్షి ప్రోక్త సాంఖ్య సిద్ధాంతము, శ్రీ పతంజలిప్రోక్త యోగ దర్శనము ప్రథమభాగమున పొందుపరచబడినవి. ముఖప్రబంధము, సాంఖ్య దర్శనము, యోగదర్శనము అను శీర్షికలతో యీవిషయము లన్నియు విపులీకరింపబడినవి. అనేక ఆంగ్లగ్రంథములనుండి అవసర మగుచోట్ల కొటేషన్లు యివ్వబడినవి. శైలి గ్రాహ్యముగనున్నది. ఇది తత్వజ్ఞానాన్వేషకులకు, సాధకులకు మిక్కిలి ఉపయోగకరముగా నుండును.

**2. ఆంధ్రపత్రిక, మద్రాసు 25-10-1954**

వీరు రెండు దర్శనాలను గురించి ప్రత్యేకంగా వేర్వేరధ్యాయా లలో వివరించారు. ప్రత్యేకంగా ఆయా ప్రకరణాలలో ఆయా సిద్ధాంతాలు దొరికినంతవరకు తత్కర్తల చరిత్రలు, సిద్ధాంతాలలోగల వాదోపవాదాలు మొదలైనవన్నీ విపులముగా వివరించారు.

సాంఖ్యానికి సంబంధించిన అధ్యాయంలో ప్రత్యేకంగా సంస్కృత సాంఖ్య కారికలుకూడ చేర్చారు. అలాగే యోగదర్శనానికి సంబంధించిన ప్రకరణములో పతంజలి యోగసూత్రాలు కూడా చేర్చారు.

మూలగ్రంథాలను గురించి వీరువ్రాసినదంతా సంస్కృత వ్యాఖ్యానాల వివరణ శైలిలో ఉదాత్తంగాను నిర్దుష్టంగాను సాగిపోయింది.

ప్రత్యేకంగాను తెలుగులో యీదర్శనాలను గురించి యింత విపులంగా వ్రాసినపుస్తకాలు చాలా అరుదుగా ఉన్నాయి. అందుచేత తెలుగులో యీదర్శనాలను గురించి తెలుసుకోదలచినవారి కిది అవశ్యం చదువవలసిన పుస్తకం.

**3. కృష్ణాపత్రిక,** బందరు 30-4-1955

శ్రీ స్వాములవారీ మహాగ్రంథమును ఆరు ఖండములుగా వెలయింప దలచినారు. అందు మొదటిదైన దర్శనఖండంలో మొదటి భాగముమాత్రమే యిది. ఎంత పెద్ద ఎత్తులో యీగ్రంథరచనను శ్రీస్వాములవారు సంకల్పించారో దీనివలన స్పష్టం.

శ్రీ స్వాములవారు అనుభవానందులే కాదు, సకలశాస్త్ర పారంగతులుకూడ. అన్నిశాస్త్రాలు వారికి కొట్టినపిండివలె అయిపోయినవంటే అతిశయోక్తికాదు. వివిధ సిద్ధాంతములనుగూర్చి ప్రాచ్య పాశ్చాత్య పండిత అభిప్రాయాలన్నీ వారికి హృత్కవిలి. మంచినీళ్లప్రాయంగా వాటిని ఉదహరించుకొంటూ పోగలరు.

తాత్త్వికదృష్ట్యా సాంఖ్య యోగ దర్శనములు ఒకజంట. సాంఖ్యానికి ఈశ్వరకృష్ణుని కారికలనూ, యోగానికి పతంజలి సూత్రాలనూ పరిపూర్ణంగా ప్రకటించి, వానితోపాటు యింకా అనేక యితర గ్రంథస్థ విషయాలను క్రోడీకరిస్తూ స్వాములవారు వ్రాసిన వ్యాసాలు జిజ్ఞాసువులెల్లరు చదువదగినవి.

ఈ ఆరు ఖండముల ప్రకటనములుగూడా పూర్తిఅయ్యే పక్షంలో యిది తెలుగులో ఒక మహాగ్రంథమై వెలయగలదనుటకు సందేహము లేదు. గ్రంథానికి కొలికిపూస ఆరవఖండమైన సమన్వయ ఖండమని ఊహింపవచ్చు. ఆసమన్వయం చేయడానికి శ్రీరామకృష్ణ పరమహంస సంప్రదాయానికి చెందిన స్వాములవారే ఉత్తమాధికారులు.

**4. ఆరాధన,** బందరు ఏప్రిల్, 1956

సాంఖ్య యోగదర్శనముల విపుల విమర్శన మీగ్రంథము. ఇది శ్రీ స్వాములవారు సంకల్పించిన 'సర్వ సిద్ధాంత సౌరభము'న నొక

తరంగము. హైందవ సాంప్రదాయిక సిద్ధాంతము లన్నింటి సారమును స్వాములవారీ గ్రంథమునందు వెలువరించ సంకల్పించి ఈ ప్రథమ భాగమున సాంఖ్య యోగ దర్శనముల పరామర్శించియున్నారు.

శ్రీ అనుభవానందస్వాములవా రాంధ్రదేశమున సుప్రసిద్ధ వ్యక్తి. కాని శ్రీవారింత పండితులని, పాశ్చాత్య ప్రాచ్య దర్శనములందు వారి పాండితి తలస్పర్శమని, వారి శోధన మద్భుతమని, వారి విచక్షణా మేధా విమర్శన శక్తు లనుపమములని, విషయనివేదన కౌశల్య మప్రతిమానమని యీ గ్రంథమును జూచిన దనుక చిరపరిచయులగు వారికిని తెలిసి యుండదు. ఈ గ్రంథమున ప్రాచ్య పాశ్చాత్య విమర్శకాగ్రణుల యభిప్రాయములతో గూడ దర్శనకర్తలు, వ్యాఖ్యాతలు, వారి జీవిత విశేషములు, విషయ ప్రమాణములగు గ్రంథములు ఆయా దర్శనసారము తద్విమర్శనలు వేయేల సర్వవిషయము లిందు సంగ్రహింపబడి యున్నవి. కావనీ గ్రంథము ఆయా దర్శన విషయముల నెరుంగగోరువారికి రసగుళిక యని చెప్పవచ్చు.

శ్రీ అనుభవానంద స్వాములవారీగ్రంథ పరంపరను బ్రకటించి ముముక్షు జనోపకారము నిట్లే ఒనర్చుచుందురుగాక యని మా నమస్కార పూర్వకాభ్యర్థనము.

5. డాక్టరు వి. యన్. శర్మగారు, Ph. D. మద్రాసు 1-2-1955

సర్వ సిద్ధాంత సౌరభమును చిత్రించడములో తమరు అనుసరించిన మార్గం ఎంతో బాగాఉన్నది. మనవారు యిట్టి ఉత్తమగ్రంథాన్ని చదివినగాని మన సంస్కృతి చక్కగా గ్రహించడానకి వీలుండదు. ప్రతి కళాశాలలో ఉన్నత విద్యాలయములో యిట్టి గ్రంథం ఉండి తీరాలి. విద్యార్థులు యీ గ్రంథాన్ని చదవడానికి ప్రారంభించారా, వారిని యీ కాలంలో ఎదుర్కొనుచున్న సమస్యలన్నిటిని సునాయాసంగా పరిష్కరించుకొనవచ్చు. విద్యార్థులకన్నా యీ గ్రంథాన్ని చదువవలసినవారు ఉపాధ్యాయులు. అప్పుడే ఉపాధ్యాయులు తమ విద్యుక్తధర్మాన్ని సొంతంగా నెరవేర్చినవారవుతారు. తద్వారా విద్యార్థులకు ఆదర్శమూర్తులు కాగలరు. తమ గ్రంథము లిట్టి కార్యకలా

పానికి ఎంతో సహాయపడగలవు. అందుచేత తాము ప్రారంభించిన పని అంతేవాసులందరికి వారి జీవిత వికాసానికి ఎంతో సహాయపడగలదు.

6. కవిశిరోభూషణ పండిత, నరసన్నపేట

శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు 29-2-1956

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారు రచించిన సర్వ సిద్ధాంత సౌరభము అను గ్రంథమును ఆమూలచూడము పఠికించి విస్మయానంద ముగ్ధుడనయితిని. వారి గ్రంథము అంధకూప నిపతితమైన మహారత్నమును ఉద్ధరించునట్లు ప్రమోదమును గూర్చినది. పాశ్చాత్యవాత్యాభిఘాతచే ప్రాచ్య విజ్ఞాన లక్ష్మి నేడు సమ్మూర్ఛితమైనది. ఈ సౌరభము నాఘ్రాణించిన నవనవ చైతన్యము తిరిగి తేజరిల్లును.

శబ్దప్రామాణ్యము ననుసంధించి ప్రతిభా విశేషముచే తత్త్వశోధన జేసిన ప్రాచ్యమహాశయుల వాఙ్మయముతో వాసిగాంచినవి షడ్దర్శనములు. పరమశాంతి చరమసీమయగు వేదాంత దర్శనమునకు సాంఖ్యయోగ దర్శనములు దక్షిణ వామపక్షములు. అట్టి పక్షముల ప్రచారము విశేషించి మనదేశమున క్షీణక్షీణమైనది. ఈ దురవస్థను గమనించి శ్రీ స్వాములవారు తమ సౌరభములో సాంఖ్య యోగములకు నగ్ర తాంబూలము నొసంగిరి. వారి పరిశ్రమ వాచామగోచరము ఊహాతీతము. వారి హృదయసీమను ప్రాచ్య ప్రాశ్చాత్య విజ్ఞానలక్ష్ములు గంగా యమునలవలె సరససంగతినిపొంది లోకమును తరింపజేయ సమకట్టినవి. ఈ సౌరభము నాఘ్రాణించిన నాస్తికత పటాపంచలగును. ఆస్తికత తిరిగి తేజరిల్లును.

ఆబాలగోప సులభశైలిలో మహత్తర విషయములను ప్రకటించిన శ్రీవారి యద్భుతశక్తి మిగుల శ్లాఘాపాత్రము. ఇట్టి భగవదంశాంశ సంభూతులు సనాతన ధర్మోద్ధరణకై అరుదుగా నావిర్భవింతురు. వారి సంకల్పసిద్ధికి నస్మదాదులు పరమేశుని ప్రార్థించుట కృతజ్ఞతాప్రదర్శనమే యగును.

ఆమూలాగ్రముగ శ్రద్ధతో శ్రీవారి గ్రంథములను పఠింపవలసినదిగా పాఠకమహాశయులను ప్రార్థింతును.

శ్రీ వారి చరణసరోజములకు నా వందన పరంపరలు.

శ్లో॥ జీయాదాచంద్రతారార్కం సర్వ సిద్ధాంత సౌరభం ।
మూర్ఛితాధ్యాత్మ చైతన్య సంజీవన మహౌషధిః ॥

## 7. శ్రీ సత్యానందస్వాములవారు — ఇనమడుగు

ఇది సాంఖ్య యోగాది దర్శనములను జిజ్ఞాసువులకు విపులముగా దెల్పు గ్రంథరాజము ప్రాక్పాశ్చాత్య పండితాభిప్రాయములను సవిమర్శకముగ నిందు జేర్చుటవలన ఈ గ్రంథము విశేషముగ శోభిల్లుచున్నది. ఎన్నో గ్రంథములను రచించి సందర్భోచితముగ ఉదాహరణముల నిందు జేర్చి ఇట్టి యుద్గ్రంథమును రచించిన శ్రీ స్వాములవారి ఓర్పు ప్రశంసార్హము.

## ద్వితీయభాగము

## 8. ఆంధ్రపత్రిక, మద్రాసు — 24-6-1956

భారతీయ తత్త్వ నిరూపకములు అయిన షడ్దర్శనాలను ఆధారంతో జతపరచి, విమర్శించి, తెలుగుజాతికి అందించే భూనికతో ఈ 'సర్వ సిద్ధాంత సౌరభము' ప్రారంభింపబడినది. తొలిభాగంలో సాంఖ్య దర్శనము, యోగదర్శనము తెలుగువారికి అందించిన స్వామివారే ఈ ద్వితీయ భాగమున వైశేషిక న్యాయదర్శనములను అందించినవారు.

మాక్స్‌ముల్లర్, రాధాకృష్ణన్, గంగానాథ ఝూ, ఆల్బర్టు ఐన్‌స్టయిన్ మున్నగు మహామేధావుల భావధారతో సరిపోల్చి విమర్శిస్తూ వివరిస్తూ, అనుభవానందస్వామివారు ఈ గ్రంథాన్ని రచించారు. మాధవాచార్యులవారు సంస్కృతమున 'సర్వసిద్ధాంత లేశ సంగ్రహము' రచించి చేసినంతపనిని వీరు 'సర్వసిద్ధాంత సౌరభము' ద్వారా చేయుచున్నారు. సర్వాంధ్రులూ మెచ్చి ప్రోత్సహించవలసినపని.

# తృతీయభాగము

9. ఆంధ్రపత్రిక, మద్రాసు 12-8-1956

భారతీయ విచారధార ఆరుదర్శనాలుగా రూపొందిందని అందరూ అంగీకరిస్తారు. వేదాలు ప్రభుసమ్మితాలు, ఈశ్వరదత్తాలున్నూ. ఆవేదాలను, ఆ వేదములను ప్రసాదించిన ఈశ్వరుని గవేషించిన మహర్షులు యావల్లోకమూ దిగ్భ్రమ జెందేట్లుగా దర్శనాలను రచించారు. ఈ దర్శనాలు ప్రతివారికి తెలియడం ఎంతో అవసరం. ఇందుకుగాను శ్రీ అనుభవానందస్వామి, సర్వసిద్ధాంత సౌరభాన్ని రచించారు. ఈ సౌరభంలో ఇది మూడవగ్రంథము. ఈ గ్రంథంలో పూర్వోత్తర మీమాంసలను గురించి ఉన్నది. ఈ గ్రంథంతో ఆరు దర్శనాలు పూర్తిఅయినవి.

'సాంఖ్యము ప్రకృతిపురుషుల పరిణామ సంబంధమును బోధించి, తత్సంబంధరహిత కైవల్యమును ప్రతిపాదింప, యోగము చిత్తవృత్తి నిరోధరూప సాధనల బోధించి, కైవల్యప్రాప్తి మార్గములను కైవల్య స్థితిని బోధించెను. వైశేషికము స్థూలసృష్టిపద్ధతిని వివరింప సిద్ధత్వమును దృష్టికందింప, న్యాయము తర్కమార్గమున దాని సమర్థించి, విమర్శకుల జయించి, మార్గమును పరిష్కరము గావించినది. మీమాంసాద్వయములో ప్రథమమైన కర్మమీమాంసశాస్త్రము జీవమీమాంసగావించి, వాని ప్రపంచ జీవనమున సుఖము చేకూర్ప యనేక కామ్య నిష్కామ్యరూప యజ్ఞయాగాదులను కర్మానుష్ఠాన పద్ధతిని బోధించెను. బ్రహ్మమీమాంసయు బ్రహ్మమును శాస్త్రోచిత న్యాయమార్గమున జర్చించి, జీవబ్రహ్మముల సంబంధముల వివరించి వారి సమానత్వ విచారముల గావించి, జీవుని బ్రహ్మమునజేర్చి యతని ఆనందస్వరూపునిగా గావించినది' (పేజీ 9). ఆరు దర్శనాలను గురించి పై వాక్యములవల్ల కొద్దిగా తెలుసుకోవటానికి వీలుపడుతుంది.

విషయాన్ని వివరించే ధోరణిలో ప్రాచ్యులు, అప్రాచ్యులు, అయిన ధిషణా దురంధరులు చెప్పిన వాటిని పుటంకిస్తూ, అక్కడక్కడే ఆయా వాక్యాలను తెనిగింపుగూడా చేరుస్తూవచ్చారు. అందువల్ల అసలు విషయాలు, ఆ విషయములో ఏఏ పెద్దలు ఏమేమి చెప్పిందీ

గూడా తేటతెల్లంగా తెలిసిపోతుంది. ఈ పద్ధతిని ఆరు దర్శనాలను గురించి - తెలుగువారికి తెలియచెప్పిన ఈ సర్వసిద్ధాంత సౌరభం తెలుగుల ఆదరాభిమానాలకు పాత్రంకాగలది, తత్త్వం బోధపరచుకోటానికి ఉపకరించేదిన్ని. తన జాతితరించాలనే పూనికతో యీ పనిని శ్రీ స్వామి నిర్వర్తించారు. గొప్పపని.

## ద్వితీయ తృతీయ భాగములు

**10. కృష్ణాపత్రిక, బందరు. 8-8-1956**

సౌరభము ప్రథమభాగమున సాంఖ్యయోగ దర్శనములు వివరించ బడగా, ద్వితీయభాగమున వైశేషిక న్యాయదర్శనములునూ, తృతీయ భాగమున పూర్వ ఉత్తర మీమాంసా దర్శనములునూ వివరించబడినవి. ఇక్కడితో సుప్రఖ్యాతమైన షడ్దర్శనముల వివరణతో దర్శన ఖండము పూర్తియైనది. ఇట్లే తాము సంకల్పించియున్న అద్వైత, వైష్ణవ, శైవ, బౌద్ధ, సమన్వయఖండములనూ శ్రీ స్వాములవారు త్వరలో వెలయించి ఆంధ్రలోకమున కొక అమూల్యమైన పెన్నిధిని సమకూర్చి పెట్టగలరను టకు సందేహంలేదు.

ప్రొఫెసరు మాక్స్ముల్లర్, మున్నగు ప్రాక్ప్రతీచీ విద్వ ద్వరేణ్యుల అభిప్రాయాలను ధారాళంగా ఆంగ్లమున నుల్లేఖిస్తూ, వెంటనే తెలుగున వాని యనువాదములను ధారాశుద్ధికి భంగం రానీయ కుండా కూర్చిన శ్రీ స్వామివారి రచనాధోరణిలో ఒక విశిష్టత ఉంది. మక్కిసరిగా అనువాదంచేయగల వీరినేర్పు ప్రశంసనీయము.

దర్శనముల పుట్టు పూర్వోత్తరములు, దర్శనకర్త కాల నిర్ణయా దులు, దర్శనములందు మీమాంసచేయబడిన తత్త్వస్వరూపము సకలమూ ఇందు చక్కగ సమీక్ష చేయబడియున్నది. దర్శనకారుల కాలమును క్రీస్తుశకారంభమునకు వీలైనంత చేరువుగా లాగుకొని వచ్చుటకు ప్రయ త్నించిన పాశ్చాత్య పండితుల నిర్ణయాలను స్వాములవారు త్రోసి పుచ్చినారు. సాంప్రదాయికముగ చెప్పుకొనబడు మన్వంతరముల లెక్కయే సరియైనదని వారి విశ్వాసము.

**11.** కవిశిరోభూషణ, పండిత

వాసా సూర్యనారాయణ శాస్త్రిగారు, నరసన్నపేట

29-9-1956

కొన్ని శతాబ్దములక్రితము శ్రీ జగద్గురు శంకర భగవత్పాదాచార్యులవారు శివాంశమున నవతరించి వైదికమత శత్రువులగు నాస్తిక మతములను రూపుమాపి యాస్తికతను ప్రతిష్ఠించిరి. నేటి యాధిభౌతిక ఝుళంఝుళిచే ఆధ్యాత్మికత అస్తికత క్షీణింపజొచ్చినవి. వైదిక వాఙ్మయమందు విశ్వాసము నశించినది. వానిని పరిహసించుట పరిపాటి కాజొచ్చినది.

ఇట్టి తరుణమున శ్రీపరమహంస పరివ్రాజకాచార్య శ్రీఅనుభవానంద స్వాములవా రుదయించి, ప్రాచ్య పాశ్చాత్యవాఙ్మయ సాగరములను మథించి, వానిసారమును సేకరించి, పాశ్చాత్యమహాశయుల సంవాదములను జూపుచు, 'సర్వసిద్ధాన్త సౌరభము' అను అమూల్యగ్రంథమును రచింప మొదలిడి అందు ప్రథమ ద్వితీయ భాగములయందు సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక దర్శనముల సర్వసారమును మృదుమధురశైలిలో ఆబాలగోపాల సంవేద్యముగా రచించి ప్రచురించిరి.

ఈ తృతీయ భాగమునబూర్వోత్తర మీమాంసాద్వయసారమును ప్రదర్శించి సర్వలోక ధన్యవాదములను బడసిరి. ఈగ్రంథరాజము నాస్తికులకు వాగ్బంధము, ఆస్తికులకు చిద్విలాసము. శ్రీకృష్ణపరమాత్మ 'మమ తేజోంశ సంభవమ్' అని నుడివినట్లు ఈశ్వరాంశ లేనిది యిట్టి మహత్తర గ్రంథరచన కొనసాగదు. అందు చరమలక్ష్యము దురవగాహము నగు వేదాన్తమును వివరించుట శ్రమసాధ్యము.

ఇది భాషాన్తరము లోనికి పరివర్తితమైన ఖండాన్తరములయందు గూడ విశిష్ట సంచలనమును గలిగించును. భారత సనాతన విజ్ఞాన జ్యోతి కిరణములను దశదిశల వెదజల్లును.

శ్లో॥ ఆస్తికత్వం ప్రతిష్ఠాప్య యుక్తిప్రామాణ్యపూర్వకమ్ ।
జీయాదాచంద్రతారార్కం సర్వసిద్ధాంత సౌరభమ్ ॥

12. డాక్టరు. వి. యన్. శర్మగారు, Ph. D. మద్రాసు
22-8-1958

పూజ్యురాలు సోదరి (మాతాజీగారికి) మీ భర్తుడు సోదరుడు శర్మ నమస్కారములు చేస్తూ వ్రాయటం.

పూజ్యులు శ్రీ స్వామిజీవారు మన సారస్వతానికి తద్వారా మన సంస్కృతిని నిలువబెట్టటానికి చేస్తూవున్న సేవకు వారి ఆప్తకోటికి సంబంధించిన మేమంతా ధన్యులం. శ్రీవారు మన ఆత్మవికాసంకోసం ప్రచురిస్తూ వున్న గ్రంథరాజములు ఎంత అమూల్యమైనవో మాటలతో చెప్పటం కష్టం.

2,3 భాగములు నాకందినవి. వాటిని చూచి పావనుడనయ్యాను. ఇతరపుస్తకాలలో లభించని అమూల్యవిషయాలు ఎన్నో ఈ గ్రంథాలలో వున్నాయి. వాటిని చదవటానికి అదృష్టంగలవారే ధన్యులు. అంత అదృష్టంగలవారు వృత్తచదవడంతో తృప్తిపడతారా? ఆ మహోత్తమమైన దివ్యరహస్యాలను అవగాహన చేసుకొని తమ నిత్యజీవితాలల్లో ఆచరణలో పెట్టటానికి కాయశక్తులా ప్రయత్నిస్తారు. అదేగా గురువు శిష్యుల నుంచి అస్తమానమూ వాంఛించేది! దానితో గురువు వూరుకోరు. శిష్యునికి కాయశక్తులా అతని సాధన సంపత్తికి తోడ్పడుతూ వుంటారు. బ్రహ్మవిద్యను మాకందరికి ఇలా అందుబాటులో నుంచడానికి మాకోసం సహాయం చేస్తూవున్న శ్రీస్వామీజీవారికి ధన్యవాదాలు.

మూడు భాగములు

13. ఆంధ్రప్రభ, మద్రాసు 22-7-1959

భారతీయ దర్శన లఘువిజ్ఞాన సర్వస్వం

సృష్టిమర్మ సంవేదకాలమున ఈ దర్శనాలలో చర్చ చాలవరకు సంస్కృతంలోనే ఉండడంవల్ల వాటిపై ఆధునికుల ఖండన మండనలు ఆంగ్లభాషలో ఉండడంవల్ల వాటిని ఆంధ్రావళికి సమగ్రంగా అందించే

పరమార్థంతో శ్రీ అనుభవానందులవారు 'సర్వ సిద్ధాంత సౌరభ'మన్న పేరుతో ఆరు ఖండాలుగా వెలయింపదలచిన వాటిలో ఇప్పటికి మూడు భాగాలు ప్రకటించారు.

విషయ దృష్టితోను కాలదృష్టితోను చరిత్రదృష్టితోను షడ్దర్శనాలలో న్యాయ వైశేషికాలను మొదట చెప్పడం మన సంప్రదాయం. కాని సాంఖ్యయోగాల ప్రసక్తి ఉపనిషత్తులలో స్పష్టంగా కానవస్తున్నందున శ్రీ అనుభవానందులవారు సాంఖ్యయోగాల వివరణలతోనే తమ గ్రంథరచనకు ఉపక్రమించారు.

శ్రీ అనుభవానందులవారు ఈ గ్రంథరచనలో సరికొత్త పద్ధతుల అనుసరించారు. అథస్సూచికలతో పాఠకులను విసిగించక ఆంగ్లోద్ధరణలనుకూడ మూలంలోనే యథాతథంగా ముద్రించి అక్కడే అనువదిస్తూ వచ్చారు. దీనివల్ల ఆంగ్ల పరిజ్ఞానం లేనివారికికూడా ఆంగ్లపండితులు నుడివిన విషయాలు తెలుస్తున్నాయి.

దర్శనప్రవర్తకుల కాలనిర్ణయానికి ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసులు కొనసాగించిన చర్చలను సమగ్రంగా పొందుపరచటమేకాక, దర్శనాల విపులచర్చ, మొదటిసంపుటిలో మూలసాంఖ్యకారికలను, యోగసూత్రాలను, ద్వితీయభాగంలో వైశేషిక సూత్రాలను చేర్చడం ఎంతో ప్రయోజనకరమైనది.

ఈ మూడుభాగాలను పఠించినవారికి షడ్దర్శనాల ఆపాతపరిచయం కాక సమగ్రజ్ఞానమే కలగగలదనడం నిస్సందేహం.

దర్శనాలకు జీవితసమస్యలతో సమన్వయం శ్రీ అనుభవానందుల వారు ఉద్దేశించిన ఉరవఖండంలో పాఠకులకు లభించగలదనడం ఈ మూడుభాగాల రచనలోగల విశేషశేముషీ పరిచయంద్వారా నిస్సందేహం.

ఏమైనా దర్శన విషయక 'లఘువిజ్ఞాన సర్వస్వం' అనదగిన యీ 'సర్వ సిద్ధాంత సౌరభము' ఆంధ్రావని ఇంటింటా గుబాళించి, వారి ఐహికాముష్మిక జీవితాన్ని సురభిళం చేయగలదని ఆశిస్తున్నాము.

## 14. పండిత శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తిరుపతి, 16-9-1956

శ్రీ అనుభవానంద స్వాములవారికి నమస్సులు.

తాము పంపిన సర్వ సిద్ధాంత సౌరభమును (దర్శన ఖండము) యథావకాశముగా చదివినాను, వానిని నాకు పంపినందులకు ధన్య వాదాలు.

'సర్వ సిద్ధాంత సౌరభము' మహాప్రియత్నము ఫలించిన రచన. అనూచానమైన భిన్నదర్శనములను చారిత్రకముగా పారిభాషికముగా వివరించుటకై తాము చేసిన వ్యాసంగము, సంగ్రహించిన విషయములు, అత్యద్భుతముగా ఇందు గోచరించుచున్నవి. దర్శన విద్యార్థులకు దీని యొుపయోగము అమూల్యము.

చిత్తగింపుడు. మరొకమారు తాము దయతో గ్రంథాలను పంపి నందులకు వందనాలు.

## 15. మహోపాధ్యాయసాహిత్యాచార్య,సాహిత్యసామ్రాట్, కవీంద్ర శ్రీ శివశంకర స్వామివారు, ఒంగోలు.

శ్రీమదనుభవానంద స్వామివారు 'సర్వ సిద్ధాంత సౌరభము' అను పేర మహాగ్రంథము రచించినారు. వీరి ఆంధ్రశైలి సరళము. భావ సుబోధకము. క్లిష్టములు గంభీరములు నగు భావములనుగూడ వీరు సుగ మము చేసినారు.

మన దర్శనములకు విరుద్ధములైన యభిప్రాయములను స్వామి వారు ఖండించి సత్యములైన సిద్ధాంతములను నిలువబెట్టినారు. ఆంగ్ల భాషలోను, గీర్వాణవాణిలోను కలగ్రంథము లనేకము పఠించి తుల నాత్మకములగు విమర్శతో ఈ బృహద్గ్రంథమును సంతరించినారు. శాస్త్రములకును (Sciences) మన భారతీయ తత్త్వమునకును సమన్వ యము చేపి, విద్వాంసులకుకూడ విశేష విషయములను వివరించి చూపి నారు. ఆధునిక శాస్త్రముల యెడ ప్రమాణబుద్ధికల నవనాగరికులకు నైతము సంశయవిచ్ఛేదకరమైన, సమ్యగ్దర్శనమును ప్రదర్శించినారు.

రచనలో స్వామివారు అనుసరించిన విధానము ప్రశంసనీయము. ప్రతిదర్శనమునకును ప్రవక్తలైన ఋషులచరిత్రలు, ఆచార్యుల చరితములు పరిశీలించి కాలనిర్ణయము చేయుటకై చక్కని ప్రయత్నము జరిగినది. గవేషణములో నిర్ధారితముకాని విషయములను గ్రంథకర్త అట్లే తేల్చి చెప్పినారు. విధాన భేదమున్నచో దానిని వివరించినారు.

ఇట్లు వివిధశ్రేణులకు చెందిన పాఠకలోకమునకు పరితుష్టి నొసగ నీ విపులగ్రంథము దర్శన విషయములను ఆంధ్రదేశమున వ్యాప్తము చేయ గలదు. ఇతి శివమ్.

## 16. శ్రీ ఎన్. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, పూజ్యపాద శ్రీ జగద్గురు శృంగేరి పీఠాధ్యక్షులకు

అంతరంగిక కార్యదర్శి, శృంగేరి 11-9-1956

పూజ్య స్వామీజీ

*a*) పూజ్యపాదులు మీ 'సర్వ సిద్ధాంత సౌరభము'న గొన్ని పుటలఁజూచిరి. షడ్దర్శన ప్రామాణ్యముగను మరియు మీ స్వానుభవాధారముగను గ్రంథమును మీరు రచించుట గమనించి శ్రీవారమితానందము నొందిరి.

*b*) శ్రేష్ఠమును సులభము నగు శైలిలో మనశాస్త్రప్రామాణ్యముతో, అధునిక యుగమున కనువగురీతి యీ గ్రంథము రచింపబడినట్లు గ్రహించి ఆనందించితిమని మీకు తెలియజేయ శ్రీ జగద్గురు మహా స్వాములవారు నాకాదేశించిరి. (20-3-1958)

*c*) శ్రీ పూజ్యపాదులు తమ 'సర్వ సిద్ధాంత సౌరభము'న పూర్వోత్తరమీమాంసా భాగమునుగూడ చదివిరి. ఈశాస్త్రముల గల వివిధ ముఖ్య సిద్ధాంతముల వివరించుటయేగాక తమ వ్యాఖ్యానమును రచించియున్నారు. శాస్త్రాభ్యాసమున అసక్తిలేనివారియందుగూడ యీ గ్రంథము తప్పక అసక్తిని కలిగించును. (19-3-1959)

17. శతావధాని

(శ్రీ) వేలూరి శివరామశాస్త్రిగారు, చిరివాడ. 17-3-1958

శ్రీ అనుభవానంద స్వాములవారి సన్నిధికి,

సాష్టాంగ నమస్కారములు విజ్ఞప్తి.

తమ సర్వ సిద్ధాంత సౌరభము మూడుభాగములు పఠించితిని.

ఇంత కొలదిమేరలో ఇంత గొప్పవిషయము నిముడ్చుటయు చెప్ప వలసిన విషయమంతయు చెప్పివేయుటయు జూడ నక్కజము. గహనము లగు విషయములను బాలురకును దెలియునంత తేలికగా చెప్పగలుగుట గొప్పవిశేషము.

ఈ గ్రంథములలో మీ కృషి సఫలమైనది, దానిని వినియోగించు కొనగల నేర్పు చదువరులది.

## చతుర్థ భాగము

18. పండిత (శ్రీ) రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు,

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి 16-8-1958

ప్రియమైన శ్రీ అనుభవానందులకు,

మీ శ్లాఘనీయమైన సర్వ సిద్ధాంత సౌరభము యొక్క నాలుగవ భాగమును దయతో పంపినందులకు అనేక కృతజ్ఞతలు.

ఆలస్యమునకు దయతో క్షమింపుడు. తమ గ్రంథమును సింహావలోకనము మాత్రము చేసితిని. శైలి మిగుల గంభీరముగను (impressive) మధురముగను (likable) కలదని మొత్తమునకు చెప్పగలను.

19. డాక్టరు (శ్రీ) బెజవాడ గోపాలరెడ్డిగారు,

రివిన్యూ అండ్ సివిల్ ఎక్స్పెండిచర్ - మంత్రులు - న్యూఢిల్లీ - 19-8-1958

My Dear Shri Swamiji.

I am thankful to you for sending me your book Sarva Siddhanta Saurabham Fourth Part. As I glanced

through the book, it appeared to be very interesting though dealing with an abstract subject. I am **very** happy the book is now made available to the Andhra Public. The Andhra Public must be beholden to you.

With best wishes–

ప్రియమైన శ్రీస్వామీజీ,

మీ సర్వ సిద్ధాంత సౌరభము గ్రంథమున నాలుగవ భాగమును నాకు పంపినందులకు కృతజ్ఞుడను. నిగూఢమైన విషయమును వివరించుచున్నను అది మిగుల మనోహరముగనున్నటుల ఆ గ్రంథమును చూచుటతోడనే నాకు తోచినది. ఆంధ్రప్రజానీకమునకు అది నేడు అందజేయబడినందులకు నే నెంతయో సంతసించుచున్నాను. ఆంధ్రులు తమకు తప్పక కృతజ్ఞులు.

అభినందనములతో ___

20. డాక్టరు. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు,
ఉపరాష్ట్రపతి న్యూఢిల్లీ 23-8-1958

My Dear Swamiji,

I received your book and read it with interest.

ప్రియమైన స్వామీజీ,

తమ గ్రంథమును అందుకొని సంతోషముగ చదివితిని.

21. కవిశిరోభూషణ, పండిత
శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు,
నరసన్నపేట 10-9-1958

దయతో పంపిన అద్వైతఖండమున ప్రథమభాగము చేరినది. శ్రీవారి ప్రతిభ విమర్శన పరిశ్రమలు ఉదితోదితములై దేదీప్యమానములగుచున్నవి. పాశ్చాత్యు లంతరించినను వారి సిద్ధాంత వ్యామోహము లంతరించ లేదు. తమ సౌరభమువంటి యుత్తమ గ్రంథరత్నములే వానిని తొలగింప నలంతములు.

**22.** గోలకొండ పత్రిక, హైదరాబాదు 15-8-1657

అందు ముఖప్రబంధము 147 పేజీలు, శ్రీ శంకరపూర్వాద్వైతము 262 పేజీలు. మతిము - దాని అవశ్యకత అనే సమస్యపై కలుగు సందేహములను తీర్చగలది యీ గ్రంథము.

భారతీయ విజ్ఞానమే పాశ్చాత్య విజ్ఞానానికి ప్రాతిపదిక అనేది ఈ గ్రంథంలో అనేకచోట్ల పాశ్చాత్యుల ప్రసంగముల ఉదాహరణములతో పేర్కొనబడుతుంది.

ప్రాచ్య పాశ్చాత్య తత్త్వవేత్తలచే ప్రశంసించబడిన భారతీయ తత్త్వశాస్త్రసారమును శ్రీ స్వాములవారు అక్షరాస్యుడైన ప్రతి ఆంధ్రునకు కరతలామలకం చేయ సంకల్పించి లోకానుగ్రహ కాంక్షచే ఈ దీక్ష బూనినారు అని అస్మదాదుల విజ్ఞప్తి. సోదరాంధ్రలోకం స్వాముల వారి కృషికి ప్రోత్సాహమిచ్చి ఆత్మోద్ధరణము చేసికొందురు గాక.

**23.** ఆంధ్రపత్రిక, మద్రాసు 30-11-1958

శ్రీ అనుభవానంద స్వాములవారు ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని సమగ్రంగా వెల్లడిచేయడానికి ఈ సర్వ సిద్ధాంత సౌరభ రచనకు పూనుకున్నారు. లోగడ మూడుభాగాలు వెలువడినాయి. ఈ నాలుగవ భాగంలో భారతీయ సంస్కృతి స్వరూప నిరూపణతో ప్రారంభించి వేదాలు ఎలా అద్వైతతత్త్వాన్ని ప్రతిష్ఠించినదీ వివరించారు. ఆదిశంకరులకు పూర్వం అ అద్వైతాన్ని ఎలా ప్రచారంలోనికి తీసుకొని వచ్చారో ఒక నిర్దుష్టక్రమంలో ఘట్టాలుగా తెలియజెప్పారు. స్వాములవారు ఆధ్యాత్మికభావాలు ప్రచారం కావడానికే ఈరచనలు సాగిస్తున్నట్లు స్థూలంగా చెప్పాలి. అందుకు ప్రోద్బలకంగా వివిధ వేదాంత పండితుల వ్రాతలను విస్తృతంగా ఉదాహరించారు. అయితే తాము నిరూపించదలచిన సత్యాన్ని అధ్యాయాంతాలలో చక్కగా వివరించి చెప్పారు. వేదాంతం ఒక వృత్తిగా పెట్టుకున్న మేధావులకు, వేదాంతం ఒక జీవన విధానంగా పెట్టుకున్న సత్పురుషులకూ అదేకదా భేదం.

ఇది నేటి విద్యార్థులకు పఠనీయగ్రంథ మవుతున్నది. ఆధ్యాత్మిక చింతను ఆకాంక్షించినవారికి అభ్యాసగ్రంథ మవుతున్నది. చరిత్రను తెలుసుకోవాలనే ఆసక్తిగలవారికి ఉపకరించే గ్రంథం.

పేరుకుతగినట్లు ఇది నిజంగా సర్వ సిద్ధాంత సౌరభం. శుష్క-వేదాంత తిమిరాన్ని పటాపంచలు చేయగల రచన—

**24.** డాక్టరు. పి. ఎస్. శర్మగారు, Ph. D. మద్రాసు

22-12-1958

పూజ్యులు శ్రీ గురుదేవులవారికి,

మీరు పంపిన పుస్తకాన్ని జాగ్రత్తతో చదువుతూ ఉన్నాను. అది బృహత్తరమైన గ్రంథం. విశ్వకోశమని చెప్పినా ఆ మాటలో ఆశ్చర్య మేమీ వుండదు. త్వరలో అయిదో భాగాన్ని కూడా తాము ముగించగలరని ఆశిస్తున్నాను. ఇటువంటి విజ్ఞాన సర్వస్వం మన వాఙ్మయంలో ఇంత వరకు వెలువడలేదు. అంతేకాదు. పాశ్చాత్య దేశాల్లో కూడా కనబడదు. అంచేత ఈ విజ్ఞానకోశాన్ని ఇతర దేశములకు పరిచయం చేయటం మన బాధ్యత.

**25.** కృష్ణాపత్రిక, బందరు 20-12-1958

శ్రీ అనుభవానంద స్వాములవారు పదహారు భాగములుగా వెలయింపదలచిన యీ 'సర్వ సిద్ధాంత సౌరభ' మహాగ్రంథమున, నాల్గవదియైన యీ ప్రకృతభాగమున అద్వైతభాగ మారంభింపబడి, శ్రీ శంకర పూర్వాద్వైతము విపులముగా సమీక్షింపబడినది. శ్రీ శంకరాద్వైత సమీక్షను ప్రత్యేకించి వేరొక భాగముగా వెలువరించవలెనని శ్రీ స్వాములవారి సంకల్పము.

శ్రీ శంకరాద్వైతమే సకల సిద్ధాంతములకూ మకుటాయమానమనెడి దృఢనిశ్చయము శ్రీ స్వాములవారిది. అదియే వారి సకల సిద్ధాంత సమన్వయ కృషికి ఏడంగడ. శ్రీ శంకరులు చేసిన అద్వైత సిద్ధాంత వివరణయందు ఎల్లకాలములవారికి అచ్చెరువుగొలిపే అపూర్వ విశేషమే ఉన్నా అసలు అద్వైతమనేది ఆయన క్రొత్తగా సృష్టించినది కాదు గనుక వేదాలలో దాని ప్రస్తావన ఏవిధంగా చేయబడ్డది వివరించడం మొదలు

కాని, శ్రీశంకర పరమగురువైన గౌడపాదాచార్యుని మాండూక్య కారికలను సమీక్షించడం వరకూ ఆయా కాలాలలో ఈ సిద్ధాంతప్రగతి శ్రీ స్వాములవారిందులో క్రోడీకరించినారు. దీనికి ఉపోద్ఘాతప్రాయంగా తొలుత సంస్కృతి, దాని నిర్వచనం, భారతీయ సంస్కృతీ వైశిష్ట్యము, వేద విజ్ఞాన మహత్వము మున్నగువాటిని గూర్చిన సమీక్ష కలదు.

గ్రంథరచన శ్రీ స్వాములవారి సహజధోరణిని ఆంగ్ల, సంస్కృత గ్రంథాలనుండి యనేక ప్రముఖవాక్యాల నుదహరిస్తూ ప్రవాహగతితో నడచినది. బౌద్ధవాదమునకుగూడ ఈ గ్రంథములో సముచితస్థానమొసగి శంకరుని అద్వైతవాదముపై బౌద్ధవాదము తన ప్రాబల్యము నెక్కువగా చూపియున్నదని అంగీకరించిన శ్రీ స్వాములవారి విశాలదృష్టి మెచ్చదగినది. ఆది శ్రీరామకృష్ణ పరమహంస బోధామృత సేవనం కలిగించిన కనువిప్పు.

26. శతావధాని పండిత

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, చిరివాడ 4-8-1959

శ్రీ అనుభవానందుల సర్వసిద్ధాంత సౌరభము ఆంధ్రదేశము నలుమూలల నలముకొనినది. విశేషించి యీ నాలుగవ కుసుమ సౌరభము హృదయ తర్పకముగా నున్నది. ఇందలి విషయములన్నియు అనేక సంప్రదాయముల తరాజులలో తూపబడి విలువకట్టబడినవి. ఈ రీతిగా ఈ గ్రంథము విద్యార్థులకును విద్వాంసులకును ఆనంద మొసగగలదని తలంతును. ఇట్టి విశాల స్వరూపముతోడనే ఉత్తరఖండముగూడ రచింపబడగలదని ఆశించుచున్నాను.

27. శ్రీ ఎన్. లక్ష్మీనారాయణ శాస్త్రిగారు,

శ్రీ శృంగేరి పీఠాధిపతుల అంతరంగిక కార్యదర్శి

శృంగేరి 4-8-1959

శ్రీ జగద్గురు స్వాములవారు పరిశీలించవలెనని తాము పంపిన సిద్ధాంత సౌరభము నాల్గవ భాగమును శ్రీవారు కడవరకు చూచినారు.

ఈ కాలమునకు తగురీతి అందరికి చక్కగా మనస్సులకు పట్టునట్లు వైజ్ఞానికుల వాక్యములనుండియే విజ్ఞాన సిద్ధాంతము అపూర్ణత్వమును చూపించి యుండుట యిది ఎటువంటి వారికికూడా భ్రాంతినివారకమై అధ్యాత్మ శాస్త్రములలో రుచిపుట్టించునదిగా యున్నది. ఏదో భాష్యము నపేక్షించక ఉపనిషద్వచనముల నుదాహరించి అద్వైత తత్త్వము యొక్క ప్రాచీనతను మరియు ఉపనిషచ్ఛ్రుతిపాద్యతను చూపించినారు. చివరయందు శ్రీ గౌడపాదాచార్యుల కారికలను విమర్శనము చేసినారు. బహుగ్రంథముల పరిశీలనాఫలమైన ఈ గ్రంథము తత్త్వవిమర్శకులకు బహుసాహాయ్యకముగ యున్నది. భగవదనుగ్రహము నొంది గ్రంథము విస్తృతప్రచురమై విమర్శకుల ఆదరమును పొందునటుల శ్రీ జగద్గురు మహాస్వాములవారు ఆశీర్వదించినారు.

**23. మహోపాధ్యాయ, ...**

శ్రీ శివశంకర స్వామివారు, ఒంగోలు, 1-9-1959.

శ్రీమదనుభవానందస్వామివారు ఏ గ్రంథము రచించినను లోకులకు సంశయవిచ్ఛేదము చేయుటకే. శ్రీ అనుభవానంద గ్రంథమాలలోని పుస్తకములు రత్నప్రాయములు. 'సర్వ సిద్ధాంత సౌరభము'లో నాలుగవ సంపుటి మకుటాయమాన మయినది. ఇందు అద్వైత చరిత్రమును సిద్ధాంతములును శ్రీ స్వామివారు గవేషణాపూర్వకముగా విస్పష్టము చేసియున్నారు. Sciences అనుదానికి తత్త్వశాస్త్ర మెట్లు తోడ్పడునో, Science ఎట్లు తుదకు తత్త్వములో పర్యవసన్నమగునో ఈ గ్రంథమున కానవగును.

ఈ పుస్తకము సర్వజనులకు పఠనీయము. ఇతి శివమ్.

---

ఓం

# సర్వ సిద్ధాంత సారము

## షష్ఠమ భాగము

## శ్రీ శంకరానంతరాద్వైతము

శ్రీ శంకరపూర్వ, శంకరాద్వైతము లెంత ప్రాధాన్యమో శ్రీ శంకరానంతరాద్వైతముగూడ నంత ప్రముఖమే. వేదజనిత అద్వైతవాహినిని నందుకొని, శ్రీ శంకరులు దానికి ప్రస్ఫుట స్వరూపమునొసంగ, అనంతర విదులు దాని బహుళ వ్యాపకము గావించి, నల్దెసల బ్రవహింపజేసి, సర్వసంశోభితము నొనరించిరి. అందు ముఖ్యముగ, సురేశ్వర పద్మపాదాది శ్రీ శంకరసాక్షాత్తు శిష్యులేగాక, వాచస్పతిమిశ్ర, విద్యారణ్య నిశ్చలదాసాది ప్రముఖ విద్యానిధులు ఆ అద్వైత స్రవంతిని వెల్లువగ జేసి సర్వోపయుక్తమును, సర్వతోముఖముగను నొనరించి మన కందించిరి.

అట్టి విషయముల నీ భాగమున స్పష్టముగ గాంచ నగును —

అచ్చులో —

# సమర్పణము

శ్రీ రామాది దశావతారములకున్, శ్రీలక్ష్మీ వాణీ ఉమా
శారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగా నొప్పు నా
పారావారము, రామకృష్ణగురున్, సర్వాధ్యాత్మికస్థానమున్
ఆరాధించుచు గ్రంథ మిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై.

శ్రీవిద్యా ప్రతిభాస్వరూపులు, మహోత్కృష్టానుభూతస్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులన్
భావించే నిడువాడ గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై.

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థసు
ప్రభకన్వేషణ లాముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్టతా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ 'సర్వ సిద్ధాంత సా
రభమున్' నేను సమర్పణంబిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై.

# సంకేతములు

అద్వై. అ : అద్వైతానుభూతి.
అ. శ్రీ. ప్ర : అనాత్మ శ్రీ విగర్హణ ప్రకరణము.
అ. అ : అపరోక్షానుభూతి.
ఆ. వి : ఆత్మానాత్మ వివేకము.
ఆ. పూ : ఆత్మపూజ.
ఆ. బో : ఆత్మబోధ.
ఆ. ష : ఆత్మషట్కము.
ఈ. భా : ఈశోపనిషద్భాష్యము.
ఉ. సా : ఉపదేశసాహస్రి.
క. భా : కఠోపనిషద్భాష్యము
కే. భా : కేనోపనిషద్భాష్యము
కే. అ. : కేవలోఽహం.
గీ. భా : గీతాభాష్యము.
చ. పం : చర్పటపంజరిక.
ఛాం. భా : ఛాందోగ్యోపనిషద్భాష్యము.
త. ఉ : తత్త్వోపదేశము.
తై. భా : తైత్తిరీయోపనిషద్భాష్యము.
ద. శ్లో : దశశ్లోకి.
ద్వా. పం : ద్వాదశపంజరిక.
ధ. అ : ధన్యాష్టకము.
ని. మా. పూ : నిర్గుణమానసపూజ.
ని. మం : నిర్వాణమంజరి.
ప్ర. సు : ప్రబోధ సుధాకరము.
ప్ర. ఉ. ర : ప్రశ్నోత్తర రత్నమాలిక
ప్ర. మ. మా : ప్రశ్నోత్తర మణి రత్నమాల

ప్ర. భా : ప్రశ్నోపనిషద్భాష్యము.
ప్రౌ. అ : ప్రౌఢానుభూతి.
బ్ర. అ : బ్రహ్మానుచింతనము.
బ్ర. జ్ఞా. మా : బ్రహ్మజ్ఞానావళీమాల.
బ్ర. సూ. భా : బ్రహ్మసూత్రభాష్యము
బృ. భా : బృహదారణ్యకోపనిషద్భాష్యము.
భ. గో : భజగోవిందస్తోత్రము.
మ. వా. ద : మహావాక్యదర్పణము
మా. పం : మాయాపంచకము.
ముం. భా : ముండకోపనిషద్భాష్యము.
యో. తా : యోగతారావళి.
ల. వా. వృ : లఘువాక్యవృత్తి.
వా. సు : వాక్యసుధ.
వి. చూ : వివేక చూడామణి.
వి. స. భా : విష్ణుసహస్ర నామ భాష్యము.
వే. డిం : వేదాంతడిండిమము.
శ. శ్లో : శతశ్లోకి.
స. ఆ : సదాచారము.
స. సు. భా : సనత్సుజాతీయ భాష్యము.
స. వే. సి. సా : సర్వవేదాంతసిద్ధాంత సారసంగ్రహము.
సౌం. ల : సౌందర్యలహరి.
స్వా. ని : స్వాత్మనిరూపణము
స్వా. ప్ర : స్వాత్మప్రకాశిక
హ. స్తో : హరిమీడే స్తోత్రము.

# విషయసూచిక

## శ్రీ శంకరాద్వైత సిద్ధాంతము

# సర్వ సిద్ధాంత సౌరభము

## ముఖప్రబంధము - పంచమ భాగము

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ
కర్తృభ్యో వంశఋషిభ్యో నమో గురుభ్యః

బృ. భా. 1. 1. 1.

చతుర్ముఖబ్రహ్మాది బ్రహ్మవిద్య సంప్రదాయకర్తలైన ఋషిపరంపరకును, గురుదేవునకు ప్రణామములు అను శ్రీ శంకర వాక్య సువిశాల తాత్పర్యమున 'శ్రీరామాది దశావతారములకున్' అను వచనములతో ప్రారంభించి సర్వగురు లోకమునకు నమోవాకము లర్పించి సర్వముముక్షు సంచయ విజ్ఞానార్థమై, ఆదివిద్వాంసుడైన కపిలాచార్య స్మృతితో నాందిని పఠించి మన సర్వసిద్ధాంత సౌరభ గ్రంథము స్వకీయ షోడశ భాగరూప షోడశ కళలతో నేటికి భాగచతుష్టయమున ప్రకాశించుచు, పంచమమున ప్రవేశించుట ఎంతయు ముదావహము. ప్రథమ భాగత్రయమున సాంఖ్య యోగ వైశేషిక న్యాయ మీమాంసా వేదాంతములతో నలరారి దర్శనషట్క కుసుమపరిమళమును ఆంధ్రావళి నల్గడల వెదజల్లి, 'భారతీయ దర్శన లఘువిజ్ఞాన సర్వస్వము'[1]; 'తెలుగులో ఒక మహా

1. ఆంధ్ర ప్రభ : మద్రాసు, 22-7-1956.

గ్రంథము'[2]; 'గొప్పపని'[3]; 'రసగుళిక'[4]; అను మొదలుగాగల అసంఖ్యాక పత్రికా సంస్తుతులచేతను 'బృహద్గ్రంథము, పరితుష్టి నొసగు నీ విపుల గ్రంథము'[5]; 'మహా ప్రయత్నము ఫలించిన రచన'[6]; 'షడ్దర్శన ప్రామాణ్యముగను, స్వానుభవాధారముగను రచించుట'; 'ఈ కాలమునకు తగురీతి అందరికి మనస్సునకు పట్టునట్లు వైజ్ఞానికుల వాక్యములనుండియే విజ్ఞాన సిద్ధాంతముల అపూర్ణత్వమును చూపించి యుండునది. ఎటువంటివారికి కూడా భ్రాంతినివారకమై, అధ్యాత్మ శాస్త్రములలో రుచి పుట్టించునదిగా ఉన్నది.'[7]; 'ఆస్తికత్వం ప్రతిష్ఠాప్య యుక్తిప్రామాణ్య పూర్వకం। జీయాదాచంద్ర తారార్కం సర్వ సిద్ధాంత సౌరభం॥'[8]; 'ఈ గ్రంథములలో మీ కృషి సఫలమైనది'; 'విశేషించి యీ నాలుగవ కుసుమ సౌరభము హృదయ తర్పకముగా నున్నది. ఇందలి విషయములన్నియు అనేక సంప్రదాయముల తరాజులలో తూపబడి విలువ కట్ట

---

2. కృష్ణాపత్రిక: బందరు, 30-4-1955.

3. ఆంధ్ర పత్రిక: మద్రాసు, 12-8-1956.

4. ఆరాధన: బందరు, ఏప్రిల్, 1956.

5. మహోపాధ్యాయ శ్రీశ్రీశ్రీ శివశంకరస్వాములవారు: ఒంగోలు, 1957.

6. పండిత శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు: శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము-తిరుపతి, 16-9-1956.

7. శ్రీ 1008 శ్రీమదభినవ విద్యాతీర్థపాదులు: శ్రీ శృంగేరి శంకరపీఠాధిపతులు-శృంగేరి. 11-9-1957, 4-8-1959.

8. పండిత శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు: నరసన్నపేట, 26-9-1956.

బడినవి'[9] అని పండితవర్యుల సన్నుతులచే నలంకృతమై సౌరభము దేశదేశముల బ్రస్తుతిగాంచియుండుటయు గపుం గడు ఆనందదాయకము. అటులే శ్రీ శంకర పూర్వాద్వైత మను చతుర్థ భాగముగూడ నత్యధిక ప్రశస్తి నార్జించినదై, 'పేరుకు తగినట్లు ఇది నిజంగా సర్వసిద్ధాంత సౌరభం. శుష్క వేదాంత తిమిరాన్ని పటాపంచలు చేయగల రచన' అని పత్రికలచేతను, 'విశ్వకోశ' మని పండితులచేతను నుతింప బడుటయు సంతోషకరము. ఈ భాగ చతుష్టయమున గల ప్రాచీన భారతీయాధ్యాత్మిక విజ్ఞానవీచికా ప్రసారము, దాని కాధారమూర్తులైన భారత ఋషివరేణ్యుల అకుంఠిత ప్రజ్ఞా వైఖరీ, మాధుర్యములే సౌరభ ప్రశస్తికి గారణములు. అందుల కనువుగ బ్రాక్పశ్చిమ పండితవర్యుల అమోఘకృషి ఫలిత వాక్యసంచయ ఉదాహరణములు గూడ మిగుల దోడ్పడియున్నవి. భారతీయ అమూల్యసంస్కృతీ స్మరణ కార్యనిర్వహణమునకై సారగ్రాహపారీణులైన అసంఖ్యాక పండితప్రకాండులచే నాస్వాదింపబడి, భావికాల జిజ్ఞాసువుల కొరకై పదిలపరుపబడిన అద్భుత భావసంపదను సౌరభము బహుళవిధి గ్రహించి, ఆనందించి, నిరీక్షించు అసంఖ్యాక ముముక్షువులకై అభివ్యక్త మొనరించి, అవిచ్ఛిన్నలీల నీ బ్రహ్మవిద్యాప్రవాహమును నేటిదనుక మానవకోటి కందించి యున్న సర్వ ఋషీశ్వరులకును, గురువర్యులకును, తన ఋణము నిసుమంత దీర్చుకొనియున్న దనుట కెట్టి సంశయము

---

9. పండిత, శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు: చిరివాడ, 17-3-1958, 4-8-1959.

లేదు. అటులనే తన బాధ్యతాయుత మహత్కార్య నిర్వహ ణమున కుపయుక్తమైన పండితశ్రేష్ఠులకును సౌరభగ్రంథము తన కృతజ్ఞతల హృదయపూర్వకముగ దెలుపుకొనుచున్నది. అట్టి సౌరభకార్యమునకు బలువిధముల సాదరాభిమానమున దోడ్పడుచున్న ఆంధ్రమహాజనులకును సౌరభము తన ఆనందము వ్యక్తపరచుచున్నది.

ముఖ్యముగ సౌరభముయొక్క దర్శనఖండ భాగత్రయ మును దిలకించి, ఆనందించి యీ యద్వైత ఖండరచనమునకు విషయసేకరణమున అత్యంత ప్రేమవాత్సల్యములతో పలయు గ్రంథాదుల బంపి, ప్రోత్సహించి రచనమునకు శక్తి నొసంగి యున్న శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్యులును ఋష్య శృంగపురవరాధీశ్వరులు నగు జగద్గురు పూజ్య శ్రీ దక్షిణా మ్నాయ శృంగేరి శ్రీమదభినవ విద్యాతీర్థ శ్రీపాదులకును, శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య జగద్గురు పూజ్య శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదులకును సౌరభము తన కృతజ్ఞతల నందజేయు చున్నది.

---

## భారతీయ సంస్కృతి

I would have you, day by day, fix your eyes upon the greatness of your country, until you become filled with the love of her, and when you are impressed by the spectacle of her glory, reflect

that it has been acquired by men, who knew their duty and had the courage to do it. సంపూర్ణ దేశ భక్తిలో మునుగునంతవరకు, నీ మాతృభూమి యొక్క ఔన్నత్యముపై మీ దృష్టుల ననుదినము ప్రసరింపజేయుట నా యభీష్టము. అట్టి యుత్కృష్ట తేజోవంత దృశ్యము నీ హృదయమున నాటినప్పుడు, తమ విధ్యుక్తధర్మముల గ్రహించి, తన్నిర్వహణమునకై యుచిత ధైర్యస్థైర్యములు గల వ్యక్తులచే నది సంపాదితమని యోచించుకొనుము అని ప్రాచీన గ్రీసుదేశ సుప్రశస్త తత్త్వవేత్తయగు (Piracles) పిరకిల్స్ పలికిన వాక్యమును, India, I loved before I came away. Now the very dust of India has become holy to me, the very air is now to me holy, it is now the holy land, the place of pilgrimage, the Tirtha![10] నే నీ దేశమునకు రాక పూర్వము నేను భారత దేశమును ప్రేమించుచుంటిని. కాని యిప్పుడు భారతభూమి యొక్క ధూళియే నాకు పరమ పవిత్రము. దాని వాతావరణమే పావనము. అది నాకు యిప్పుడు ఒక యాత్రాస్థలము. ఒక తీర్థము అను వివేకానందుని ఉత్తేజకర వాక్యములును, ఎట్టి పాషాణహృదయునిలో ప్రవేశించినను నతని గదలించి అతి సువిశాల దృష్టి గోచరించు భారతి సమగ్రస్వరూపమును ముందుంచి, ఆనందాశ్రు సంచయము నుబికించి, ఆనందనృత్యము జేయింప శక్తియుక్తములు. అంత జిజ్ఞాసువు భారతి నన్వే

---

10. Swami Vivekananda : The Life of Swami Vivekananda Vol 3 p 69.

పించి, గ్రహించి ఆమెయొక్క సహజాధ్యాత్మిక సౌందర్య మాధుర్యముల గాంచి, లో నిముడ్చుకొనజాలక, Search for truth is the noblest occupation of mankind; its publication a duty. సత్యాన్వేషణము మానవకోటికి బరమ కర్తవ్యము. దాని బ్రచారణము ఒకవిధి యను (Taylor) టేలర్ వాక్యము చందము ప్రస్ఫుటక్రియ దృక్పథమున దోచు భారతీయాధ్యాత్మిక పీయూషరసపానమున దా మాత్ర ముండనేరక, తత్సిద్ధికై సదా నిరీక్షించుచున్న యసంఖ్యాక ముముక్షులోకమునకై దాని విభజించి యిడవల దదుద్యుక్తుడగుటలో నాశ్చర్య మేమియు నుండదు. తరచి చూచిన గొలది, కాలావధుల నధిగమించి మానవమేధావధుల నతీతించు వేదములనుండి నేటిదనుక గల సమగ్ర భారతీయ సంస్కృతీ స్వరూపము, పూర్వభాగమున వర్ణింపబడియున్నటుల లౌకిక ధార్మిక పారమార్థికముగ త్రివిధస్వరూపమై సంపూర్ణాధ్యాత్మిక పరమావధినే దృష్టినుంచి, అయ్యాను ఆద్యంతమును తృతీయమునకై అనగా లౌకికధార్మికసంస్కృతుల పారమార్థికమునకే యుపయుక్తముగ సమన్వయించి పరస్పర వైరుధ్యమును దొలగించి వ్యావహారికముద్వార పారమార్థికమును అవలోకింపజేయుచు, చేబట్టి శిశువును నడిపించు మాతృదేవివోలె భారతీయ సంస్కృతిమతల్లి అసమ లీల అద్భుతస్వరూపమున మూర్తీభవించినట్లు ప్రత్యక్షమగును. మానవకోటిపై నామెకుగల ప్రేమ అమానుషము అనంతము కావుననే, సర్వాకర్షణీయ తత్త్వమై The greatness of Indian thought lies in the fact that her

cultural conception is that of the Eternal, the Spirit encased in evolving matter, involved and immenent in it. Her religion is the aspiration to the spiritual consciousness. Her whole Dhrma or Law is founded upon it. Her philosophy art and literature have the same upward look. Her progress is spiritual progress.[11] పరిణామించుచున్న ప్రకృతితత్త్వమున గప్పబడి యందిమిడియున్న నిత్యవస్తువుసుగూర్చిన తన వైజ్ఞానిక భావఝరియందే హైందవ సంస్కృతియొక్క వైశిష్ట్యము గలదు. ఆధ్యాత్మిక చైతన్య స్ఫురణాకాంక్షయే ఆమెయొక్క మతము. ఆమె ధర్మమంతయు దానిపై నాధారపడును. ఆమెయొక్క తత్త్వశాస్త్రమునకు, లలితకళలకు, సాహిత్యములకు నదే యూర్ధ్వదృష్టి రాజిల్లును. ఆధ్యాత్మికాభివృద్ధియే ఆమెయొక్క పురోగమనము. Hinduism has something to offer which is suited to all minds. Its very strength lies in its adaptability to the infinite diversity of human character and human tendencies.[12] అఖిల మనోప్రవృత్తుల కనుగుణ విధానముల నొసంగ హిందూధర్మమునకు వస్తువు గలదు. వివిధములగు మానవసంస్కార ప్రవృత్తులకు అనుగుణాన్వయ పద్ధతిలోనే దాని శక్తి గలదు. The highest and purest morality is the immediate consequence of the Vedanta.[13] ఉత్కృష్టమై పరమ

---

11. Sir John Woodroffe: Vedanta Kesari 1930.
12. Sir Monier Williams: Vedanta Kesari 1926 p 10.
13. Prof. Paul Deussen:-

పావన నైతిక తత్త్వమే వేదాంత సద్యోఫలితార్థము. Vedanta is the goal of courage, it is the gospel of life.[14] వేదాంతము అభయావధియు జీవనత్రాణము అనియు నసంఖ్యాక పండితవరేణ్యుల సంస్తుతుల కాకరమై సర్వతో ముఖాదర్శమున ఆమె విరాజిల్లుచుండుట విస్పష్టము. ఆ పరమ పావన అలౌకికోత్తేజ విభూషితకు సహస్రాధిక జోహారులు.

---

## మానవలక్ష్యము

ఎనుబది నాలుగు లక్షల జీవరాసులచే బ్రపంచము వ్యాప్తము. అందు ఒక్కొక జీవికి ఒక్కొక ఇంద్రియప్రవృత్తి ప్రధానమై ఆయా యనుభవ సంపాదనానంతరము సోపాన గతి బూర్వజీవత్వమును బాసి ఉత్తర జీవత్వమున కధిగ మించుట భారతీయపరిణామస్థితి. వృక్షాదులకు త్వగింద్రియము ముఖ్యముకాగ, కీటకాదులకు రసనేంద్రియము ప్రధానమై యుండును. పిపీలికాదులకు ఘ్రాణేంద్రియము ముఖ్యమైయుండ, భ్రమరాదులకు నేత్రము ప్రముఖమై యుండును. మృగాదులకు శ్రోత్రేంద్రియము ప్రధానమగుచుండ, ఒక్క మానవునకు మాత్రము వివేకముతోగూడిన మనస్సువాక్కు ప్రబల ప్రధాన మగుచున్నవి. ఈ విధముగ నీ ఇంద్రియ షట్కము స్థూలముగ నాయా జీవులకు బరమ ప్రమాణముగ వెలుగొందుచు

---

14. Dr. Mahendra Nath Sirkar : Prabuddha Bharata, 1956 p 409.

మొత్తమునకు ఎనుబది నాలుగు లక్షల రూపాంతరముల నొంది పర్యవసానమున సంపూర్ణ మానవత్వమును అభివ్యక్త మొనరించుచున్నది. కర్మేంద్రియ జ్ఞానేంద్రియ దశకమునకు మనోబుద్ధ్యాది అంతఃకరణ చతుష్టయమును జేర్చ చతుర్దశక మగుచున్నది. వాని కాధారముగ త్రిగుణములు ద్వంద్వము లుండుటచే 14 × 3 × 2 = 84 గ మారి ఆ ప్రవృత్తులు మరల నొక్కొకటి లక్షరూపాంతరము లొందుట గమనార్హము. అటుల జీవరాసులలో నొక్కొక విధమైన ఇంద్రియ ప్రవృత్తి ననుసరించి ఒక్కొక ప్రత్యేకత నొసంగి సర్వానుభవ పర్యవసానముగ జరుపువృత్తి నాబడు 'అహం బ్రహ్మాస్మి' అను సర్వోత్కృష్టానుభూతిని మానవునకు బ్రాపిలజేయు సర్వోపకరణప్రదాతయైన పరమేశ్వరుడు మానవునకు అత్యవసరమైన ఉచితానుచిత పరిజ్ఞాన విధానమును, ఘటనాఘటన సమర్థము అజేయమును అగు చిత్తమును ప్రసాదించి యున్నాడు. అంతియగాక దానికి సహకారి కారణముగ వ్యష్టిత్వమునుండి సమష్టికి గొంపోవ సాధనముగ వాగింద్రియమునుగూడ ధాత మానవున కొసంగి తన సింహాసనము నధిష్ఠింప మానవుడు సర్వ సమర్థుడగుటకు సర్వసంభారముల జేర్చి వాని సద్వినియోగమున తనస్థానము నాక్రమింప నవకాశ మొసంగి యున్నాడు. అందుచేతనే శ్రుతియు 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' (బృ. 2.4.5) ఆత్మ అనుభవవేద్యము, దానిగూర్చి శ్రవణము గావించి యోచించి మగ్నతనొందవలయునని యుపదేశించియున్నది. అట్లు మానవునకు సర్వేంద్రియములలో వాక్ మనములు అతిప్రధానములై

వానికి ముఖ్యమైన శ్రవణేంద్రియ సహాయమున జీవిత పరమావధియైన జన్మ సార్థకమైన 'సోహం' స్థితిని మానవు డధిష్టింప సమర్థునిగ జేయుచున్నవి. ఆ ఇంద్రియ ద్వయమును అట్లుపయోగింపనిచో నివి దురుపయోగమై మానవత్వము నకే భంగము వాటిల్లి మానవుడు పశుత్వమునకు గ్రుంగి నశించును.

అట్టి మానవుని అసమాన మానవతను దృక్పథమున నుంచి మేల్కొలుపుల బాడుచు, అద్భుతలీల ననాదికాలము నుండి మానవునకు ఆధ్యాత్మిక పథమున బాసటయై నిలచిన భారతీయాధ్యాత్మిక సంస్కృతి సర్వమానవకోటికి బరమ ప్రాణమై అభ్యుదయ కారణమై అనుష్ఠానయోగ్యమై విరాజిల్లు చుండుట సర్వ విజ్ఞలోకమునకు విదితము. ప్రస్తుత కాలమున మానవతకే అగౌరవము గలుగజేయుచు మనోవైకల్యమగు స్వాత్మహత్యారూప ప్రవృత్తినుండి మరలించి ఉత్తేజకరమార్గ గామిగ మానవాళి నొనరింప భారతవాణియే సమర్థమై శర ణ్యమైయొప్పారుట పూర్వగ్రంథమున ననేక పాశ్చాత్య పండిత ప్రకాండుల సహస్రాధిక వచనముల ద్వార గ్రహించియున్నా రము. విష్ణుసహస్రనామ స్తోత్రము 'వేదాంతగో బ్రాహ్మణ స్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ వైశ్యో ధన సమృద్ధ స్స్యాచ్ఛూద్రః సుఖమాప్నుయాత్' (విష్ణు.స.స్తో. 123) అను రీతి జతుర్విధ ప్రవృత్తులనున్న మానవకోటికి శుభమేర్పడును గాక అను సర్వతోముఖత్వమును గలిగి సర్వశ్రేయోభివృద్ధి కాంక్షించి అందు స్థూలములైన ఉత్తరత్రయము లోకాధారమై కృషిఫలితములై యొప్పినను, చతుర్థమైన వేదాంతము

మాత్రము అలౌకికమై సాధనజన్యముగాక అనగ అన్యాశ్ర యముగాక స్వాపేక్షికమై విరాజిల్లుటచే నది యీ బాహ్య ప్రపంచమున నలభ్యము. కాని 'పాషాణ ప్లవనం చాపి సద్యోత్కాల విపర్యయే । న క్వచిచ్ఛ్రుతి వాక్యానా మప్రా మాణ్యం తు విద్యతే॥' (మ.వా.ద. 159) కాలవైపరీత్యమున పాషాణ ముదకమున నీదులాడ వచ్చునుగాని ఏ కాలమున నైన శ్రుతివాక్యమున కప్రామాణ్యము సిద్ధింపదు అను శంకరు వచనచందము అజేయప్రమాణమై, 'అప్రాప్తే శాస్త్ర మర్థవత్' అలభ్య వస్తుసిద్ధిని సాధించి సార్థక్యము గాంచిన శాస్త్రము తత్సిద్ధి కాధారము; 'తత్ప్రామాణ్య స్యా దృష్టవిషయత్వాత్' (గీ. భా. 18.66) అదృష్టవిషయప్రాప్తియందే నది ప్రమాణ మగుచు, అట్లు ఆవరకమైన అజ్ఞానఫలితముగ నదృశ్యమై యొప్పు ఆత్మవిషయమున 'జ్ఞాపకం హి శాస్త్రం న తు కారక మితి స్థితిః' (బృ. భా. 1. 4. 10) నాత్మ వస్తుకర్తగాక శాస్త్రము భ్రాంతి నివారణము గావించి గుప్తమగు స్వాత్మ లాభము గలిగించు ననుచందము అద్వితీయ ప్రమాణమైన శ్రుతియే ప్రధానము. కాన నట్టి అనాదికాల పరంపరాగత శ్రుతి తాత్పర్యమును కూలంకషముగ నెఱింగి, తదుపదిష్టిత బ్రహ్మానంద స్రవంతి నాస్వాదించి శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వ ములు నా చక్షుద్వయ విభూషితులైన అభౌతిక ప్రజ్ఞాధురీణు లైన మహాత్ముల పవిత్ర చరణ సన్నిధాన విశేషఫలితమే వేదాంతసిద్ధి. అదియే పూర్వోక్త విధాన భారతీయ సంస్కృతి నిలయము. అదియే సర్వమానవోద్ధరణ కార్యకేంద్రము. కాన నీ విజ్ఞాన మెంత ప్రపంచమున వ్యాప్తినొంది అనుష్ఠాన

మున నుండునో అంత వ్యక్తిగతాత్మశాంతి విశ్వమున సుస్థాపిత మగును. వ్యష్టిసమష్టులకు సూక్ష్మదృష్టి బరిశీలించుచో, దార తమ్యము అభావముగాన, వ్యష్టితృప్తితో సమష్టి తుష్టియు కార్యకారణసంబంధమున నేర్పడును. తృష్ణారూపమైన అసంతృప్తియేగదా సర్వానర్థములకు మూలకారణము! అట్లు వేదాంత విజ్ఞాన వ్యాప్తితో దానిపై నాధారపడియుండు స్థూలములగు అధికార సంపత్సుఖాదులును వెనువెంట నేర్పడి సంఘము సుభిక్షమై శాంతి కాకరమై యొప్పారును.

ఈ రహస్యమును గ్రహించియే (Hegel) హెగెల్ పండితుడు The function of the mind, and task of philosophy, is to discover the unity that lies potential in diversity.[15] మనోప్రవృత్తియు, తత్త్వశాస్త్రముయొక్క కార్యము, నానాత్వమున నంతర్గతముగ నున్న నేకత్వమును నెరుంగుట యుండే గలదని వచించి యున్నాడు. అట్లు దర్శింపబడు ఏకత్వమున Behind everything the same divinity is existing.[16] సర్వాధారముగ నదే భగవత్తత్వ ముండుట గాంచి దానినుండి Out of this comes the basis of morality.[16] జనించు ధార్మిక సంస్థితిని గాంచి Do not injure another. Love everyone as your own self, because the whole universe is one[16] ఇతరుల బాధింపకుము. ఎల్లర నిన్నువలె ప్రేమింపుము. విశ్వమంతయు నేకమే గదా అని గ్రహించి, In injuring an-

15. Dr. George W. Friedrick Hegel : The Story of Philosophy of Will Durant, p 296.
16. Swami Vivekananda: The Complete Works, Vol 1 p 363

other, I am injuring myself; in loving another, I am loving myself [16] పరహింస యన స్వాత్మ హింసయే యగును. ఇతరుల ప్రేమించుట నన్ను ప్రేమించు కొనుటయే యగు నను రహస్యమును వివేకానందుని విచారణా విధానమున గ్రహించి, The highest and the purest morality is the immediate consequence of the Vedanta. ఉత్కృష్టమై పరమపవిత్రనైతిక వ్యవస్థ వేదాంత సద్యోఫలితముగ నేర్పడు ననియు జిజ్ఞాసువు గుర్తించును. అనగా శిశిరకుమార మిత్ర వచించియున్నటుల If the Indian sees God in himself, he sees Him also in others and even in the phenomenal universe around him[17] భారతీయుడు తనలో నీశ్వరుని గాంచి పరులలోను పరివృత భౌతిక విశ్వమునందును ఆ పరమేశ్వరుని గాంచును. ఆ యద్భుత రహస్యదర్శనమున It is only through the idea of the Impersonal God that you can have any system of ethics.[18] అమూర్త బ్రహ్మ భావమునుండియే నైతిక విధానము జనితమగుచున్నది. నైతిక జీవిత పద్ధతిని శాస్త్రములెల్ల బోధించుచున్నను, But no reason was forthcoming, no one knew why it would be good to love other beings as ourselves. And the reason why is there, in the idea of the Impersonal God.[18]

16. Swami Vivekananda: The Complete Works, Vol 1 p 363
17. Prof. Sisirkumar Mitra: The Vision of India, p 47.
18. Swami Vivekananda: The Complete Works, Vol 3 p 129.

కారణము కనుపించుటలేదు. అన్యుల తమనువలె నెందులకు ప్రేమింపవలెనో ఎవరికిని దెలియదు. కారణము నిర్గుణబ్రహ్మ భావమున గలదు. The whole world is one-the oneness of the universe-the solidarity of life.[18] సర్వవిశ్వము ఏకమే. జీవతత్త్వము ఏకమే. కావున The infinite oneness of the Soul is the eternal sanction of all morality, that you and I are not only brothers,-but that you and I are really one. This oneness is the rationale of all ethics and all spirituality.[19] నీవు నేను సోదరులము మాత్రమేగాక, ఒక్కటియే అను నిత్య ధార్మికానుశాసనము అనంతాత్మైకత్వమున గలదు. ఈ ఏకత్వము సర్వ ధర్మములకు, అఖిల తత్త్వార్థములకు ఉపపత్తి. This is the dictate of Indian Philosophy.[19] ఇదియే భారతీయతత్త్వ శాస్త్ర విధానము అని వివేకానందుడు వివరించి యున్నాడు. సాటివాని నెందులకు ప్రేమింపవలె నను ప్రశ్నమునకు సమాధానము ఏ శాస్త్రమునను గానరాదు. but it is in the Veda, is in the great formula "Tat tvam asi" which gives in three words metaphysics and morals all together.[20] కాని వేదములో గలదు. మూడుపదములతో తత్త్వార్థమును, ధర్మవిధానమును బ్రసాదించు 'తత్త్వమసి' అను వాక్యమున నది గలదు అనియు పాశ్చాత్య తత్త్వవేత్త పాల్

---

18. Swami Vivekananda: The Complete Works, Vol 3 p 129
19. Do. Do. Vol 3 p 189
20. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p 7

దేవసేన్ తెలిపియున్నాడు. ఆ కారణమున 'జన్మమృత్యు ప్రవాహేషు పతితో నైవ శక్నుయాత్। ఇత ఉద్ధర్తు మాత్మానం జ్ఞానా దన్యేన కేనచిత్॥' (ఉ. సా. 2 15.52) జనన మరణ ప్రవాహ పతితుని లేవనెత్తుటకు జ్ఞానముకంటె నన్యసాధనము లేదు. ముముక్షువు జ్ఞానముచేతనే యీ ప్రవాహమునుండి తరించును. జ్ఞానమన 'శ్రద్ధాభక్తీ పురస్కృత్య హిత్వా సర్వమనార్జవం। వేదాంతస్యైవ తత్త్వార్థేవ్యాసస్యాభిమతేతథా॥' (ఉ. సా. 2. 16. 67) శ్రుతివిశ్వాసమును, తదేకపరత్వమును గలిగి వ్యాసవిహిత వేదాంతశాస్త్రమునందు భక్తిగలవాడు ముక్తిని పొందును అను శంకరుల భావము ననుసరించి వేదాంతశాస్త్రమే సర్వముక్తి కారకమని స్పష్టమగుచున్నది. అట్టి వేదాంత శాస్త్రానుష్ఠాన మహిమాతిశయముననే పూర్వము వచింపబడిన ధార్మిక లౌకిక సంస్కృతులును సుస్థిరస్థాయి వనగలవని గ్రహించియున్నాము. కాన నీ శాస్త్రాధ్యయనము ప్రచురణము అనుష్ఠానములు అత్యంతావశ్యకములగుచున్నవని వేరుగ వచింప నవసరము లేదు.

---

## అద్వైతము

'సదసత్సదసచ్చేతి వికల్పాత్ప్రాగ్యదిష్యతే తదద్వైతం సమత్వాత్తు నిత్యం చాన్య ద్వికల్పితాత్'. (ఉ. సా. 2. 16. 33.) సత్తు అసత్తు సదసత్తులనెడి వికల్పనములకు బూర్వముండినదే అద్వైతము. అది ఏకము నిత్యము. అన్యము

వికల్పమే అనియు; 'వేదాంత సిద్ధాంత నిరుక్తి రేషా బ్రహ్మైవజీవః సకలం జగచ్చ। అఖండ రూపస్థితి రేవ మోక్షో బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణం॥' (వి.చూ.479) బ్రహ్మమే జీవుడును సకలవిశ్వము నగుననుటయే వేదాంత సిద్ధాంతము. అఖండ స్థితియే మోక్షము. బ్రహ్మాద్వితీయత్వ నిరూపణ మునకు శ్రుతులే ప్రమాణము అని శంకరులు అద్వైతమును దెల్పుచు, 'వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవః స్వయం బ్రహ్మైతజ్జగదాపరాణు సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః। బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సంత్యక్త బాహ్యాః స్ఫుటం బ్రహ్మీభూయ వసంతి సంతత చిదానందాత్మనైవ ధ్రువం॥' (వి. చూ. ३९५) వివరించి దెలుపదగిన దేదిగలదు? స్వయముగ జీవుడు బ్రహ్మమే. అణువునుండి జగముపర్యంత సకలము బ్రహ్మమే అను బ్రహ్మాద్వితీయత్వమును శ్రుతులు ఘోషించుచున్నవి. 'అహం బ్రహ్మాస్మి' యని ప్రబుద్ధమహా త్ములు బాహ్యవిషయముల స్మరింపక బ్రహ్మీభూతులై సదా చిదానందాత్మ రూపమున వర్తించెదరు. ఇది నిశ్చయము అనియు వివరించియున్నారు. 'బ్రహ్మాత్మనో రైక్యం శ్రుత్యుక్తం న విరుధ్యతే' (మ.వా.ద. 158) బ్రహ్మాత్మల ఏకత్వము శ్రుతి ప్రోక్తము అవిరుద్ధము అను అద్వైత శ్రేష్ఠత్వమును గూర్చి పూర్వభాగమున సాకల్యముగ గాంచి యున్నారము.

ఈ యద్వైత వేదాంత స్రవంతి అనాదిగత అవిస్పష్ట ప్రాదుర్భావ కేంద్రముగలిగి 'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్' (ఋ. 10. 10. 1) పురుషుడు సహస్రశిరస్సులు సహస్రనేత్రములు సహస్రపాదములు అనగ అనంతత్వముగల

వాడనియు 'ఏతావాన్ అస్య మహిమాఽతో జాయాంశ్చ పురుషః పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదాస్యామృతందివి' (ఋ. 10. 90. 3) అతనిమహిమ దేశకాల వ్యాప్తము. కాని. ఆపురుషుడు సర్వాతీతము. విశ్వభూతములెల్ల అతని కొక పాదముకాగ మూడుపాదములు అమృతమగు ద్యులోకము అనియు, 'సుపర్ణం విప్రాః కవయో వచోభిరేకం సంతం బహుధా కల్పయంతి' (ఋ. 10. 114. 5) ఆనందపర్ణములు గల ఆత్మ ఏకమైయుండ బుధులు తమరచనలచే బహుధా కల్పించుకొనుచున్నారనియు, నటులే 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' (ఋ. 1. 164. 46) 'యోఽన్యాం దేవతా ముపాసతే న స వేద, (శతపథ. 14.4) ఎవడు అన్యముగ దలంచి దేవత నుపాసించునో నత డజ్ఞుడు. 'సపర్యగా చ్ఛుక్రమకాయ మవ్రణం అస్నావిరం శుద్ధమపాపవిద్ధం' (య. వా. 40. 8) తేజోవంత మును, అశరీరమును, నిర్మలమును, అస్నావిరమును, శుద్ధ మును, పాపరహితమును అగు బ్రహ్మమును బ్రహ్మవిదుడు పొందును అను వివిధ మంత్రముఖమున వేదములనుండి ఆ స్రవంతి బహిర్గతమై సారవంతమగు ఉపనిషదారామ క్షేత్ర ముల బ్రవహించి, 'తద్వేద గుహ్యోపనిషత్సు గూఢం తద్బ్రహ్మ' (శ్వేతాశ్వతర. 5.6) వేదాంతాంతర్గతమైన ఉపనిష త్తుల నిగూఢమైన బ్రహ్మము, 'యే నాశ్రుతం శ్రుతం భవత్య మతం మత మవిజ్ఞాతం' (ఛాందోగ్య. 6.1. 3) దేనిచేత నశ్రుత ములు శ్రుతములగునో అదృశ్యంబులు దృశ్యముగను, అవిజ్ఞాత ములు విజ్ఞాతము లగుచున్నవో అనియు, 'ఉపాసకః క్రమేణాద్వైత సంస్థానం ప్రాప' (త్రి. మహానారాయణ.7) ఉపా

సకుడు క్రమరీతి నద్వైతస్థానమును బొందును; 'అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్ష జ్ఞానమేవ తత్ । అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే॥' (వరాహ.2.41) బ్రహ్మము గలదని గ్రహించుట పరోక్షజ్ఞాన మనబడును. 'అహం బ్రహ్మాస్మి' అని గ్రహించుట అపరోక్ష జ్ఞానమై సాక్షాత్కార మన బడును; 'అద్వైతం పరమానందం శివం యాతి తు కేవలం' (రుద్రహృదయ. 47) అద్వైతము పరమానందము శ్రేయస్కరము కేవలము; 'అభేద దర్శనం జ్ఞానం'(మైత్రేయ 2 3) 'మయి జీవత్వమీశత్వం కల్పితం వస్తుతో న హి' (సరస్వతీ రహస్య. 3 ) నా జీవేశ్వరత్వములు కల్పితములు యథార్థములుగావు; 'జీవో దేవ స్సదా శివః' (స్కాంద. 10) అను అసంఖ్యాక ఉపనిష ద్వాక్యములరూపమున విజృంభించి; 'తత్త్వమసి' 'అయమాత్మా బ్రహ్మ' 'అహం బ్రహ్మాస్మి' 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను జీవేశ్వరైక్యమును రూఢపరచు మహావాక్యము లనెడు సత్ఫలముల ఛాందోగ్య, మాండూక్య, బృహదారణ్యక, ప్రశ్నాది ఉపనిషత్తులలో జనింపజేసి, అసాధారణలీల ముముక్షులోకమునకు తారణోపాయముగ నుపయుక్తమై యుండుట చూచియున్నారము. అటులనే యీ అద్వైతవాహిని ఉపనిషత్ క్షేత్రములనుండి ఉబికి బాదరాయణ సూత్రాదుల బ్రవేశించి పొంగి మన్వాది శ్రుతుల ముంచి, భాగవతాది మహాపురాణముల స్రవించి, రామాయణభారతాది ఇతిహాసముల శైవ శాక్తాది తంత్రములపై బొంగి ప్రవహించి, ఏకోన్ముఖముగ బౌద్ధ వాదమున బ్రవేశించి, ఆర్యాసంగ నాగార్జునాదులచే బోషింపబడి, ఏక ప్రవాహముగా గౌడపాదుని కారికల

ద్వార శంకరు జేరి యుండినట్లు పూర్వగ్రంథమున నీ యద్వైత భావప్రవాహమునబడి మనము ఒకించుక చూచియున్నారము. అనగా నీయద్వైత పీయూషపానముజేయుని రచయితగాని, రచనముగాని పూర్వ మభావమని గవేషణాశీలునకు దోచక మానదు. దాని సర్వతోముఖత్వముతో బాటు దాని అజేయత్వముగూడ గోచరింపకబోదు.

అద్వైతము పూర్వోక్తవిధాన 'న మతాభినివేశిత్వాత్ న భాషావేశమాత్రతః ముక్తిర్వినాఽత్మవిజ్ఞానాత్' (వే.డిం.71) మతాభిమానము భాషావేశములగాక ఆత్మజ్ఞానముననే ముక్తి అను శంకరసూక్తిరీతి గేవలము అలౌకిక వృత్తి నుండు ననియు, 'సదిదం పరమాద్వైతం స్వస్మాదన్యస్య వస్తునోఽభావాత్' (వి. చూ. 228) స్వాత్మేతరవస్తువు గోచరింపకుండుటయే పరమాద్వైతము అను రీతి గేవలము పారమార్థికము మాత్రము గాక నద్వైతము పరమాదర్శ ధార్మికప్రవృత్తుల గలుగజేయు ననియు వినియున్నారము. ఇది అత్యద్భుతచందము అత్యాధునిక భౌతికశాస్త్ర సమాయుక్తమై వాని యందలి యసంపూర్ణత్వముల బూరించు మహాసమన్వయ సమగ్రశక్తియనియు గ్రహించియున్నారము. అనగా ఆధునిక భౌతిక విజ్ఞానాఘాతముల నెదుర్కొని సమన్వయించి తన బిడ్డలనుగ జేరదీయగల శక్తిసామర్థ్యముల ఒక అద్వైత విధానమే గలిగియున్నదనియు బూర్వగ్రంథమున గాంచియున్నారము. దానికి ఎప్పుడును ఎట్లును దేనితోడను గూడ భేదదృష్టి గలుగనేరదనుచు The main strength of Sankara's position is also that of Advaita generally,

that it seeks not to destroy but to fulfil. It has no quarrel with other systems; for, as has been said, one does not quarrel with one's own hands or feet. [21] విధ్వంసమునకేగాక నిర్మాణమునకే యత్నించు నను ముఖ్యవిషయము శంకర సిద్ధాంతమునకు సామాన్యముగా అద్వైతవాదమునకు ముఖ్యశక్తిని జేకూర్చి యున్నది అని సూర్యనారాయణశాస్త్రి వచించియున్నాడు.-is a superb system of logical idealism, and has termed 'systematized Upanishads'. [22] అను (Prof. Earnest P.Horrwitz) ఆచార్య ఎర్నెస్ట్ హోర్విట్జ్ వాక్యమురీతి నది అద్భుతసయుక్తిక సిద్ధాంతమై క్రమబద్ధ ఉపనిషత్తులనియు చెప్ప నొప్పును. మరియు పండిత రాధాకృష్ణ వచనములలో a system of great speculative daring and logical subtilety. Its austere intellectualism, its remorseless logic, which marches on, indifferent to the hopes and beliefs of man, its relative freedom from theological obsessions, make it a great example of a purely philosophical scheme. [23] అది యొకఅద్భుత యాత్రిక సాహసమును, తార్కిక సూక్ష్మమునై యున్నది. మానవుని విశ్వాసాశయములపై

---

21. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 71.

22. Prof. Earnest P. Horrwitz: Buddhists in Disguise, V. K. 1932, p 457.

23. Dr. S. Radhakrishnan: Sankaracharya of S. S. S. Sastry p. iv.

నిర్లక్ష్యముగ బయనించు దాని కర్కశమేధాశక్తి, నిర్దాక్షిణ్య తర్కము వైదికావరోధములనుండి దాని స్వాతంత్ర్యములు దాని శుద్ధతాత్త్విక విధానమున గొప్ప ఆదర్శముగ గావించెను. అందుచే నది a careful reasoned out system, the fruit of a vast learning and penetrating thought.[24] శ్రద్ధగా యుక్తిబద్ధమొనర్పబడిన సిద్ధాంతము, విశాల పాండిత్యము కుశాగ్రధీకుశలతల ఫలమే యిది అని ఎఫ్. హెరాల్డ్ స్మిత్ వచించునట్లు చాల జటిలమై యొప్పారి, If Sankara's Advaita seems to us to be abstract, it is because we are content to dwell on a level lower than the highest that is possible for us.[25] మనకు సాధ్యమైన ఔన్నత్యముకంటె దక్కువ స్థితిలో వసింప సంతృప్తులముగాన మనకు శంకరాద్వైతము జటిలమనిపించు నను ఆచార్య రాధాకృష్ణ వాక్యసరణి సామాన్యప్రజ్ఞావిదూరమై యొప్పారుచున్నది. అట్లగుట is only for the strong-hearted.[26] దృఢహృదయులకే యుపయుక్తమైయుండుటచే, శంకర పూర్వస్థితి ఎట్లున్నను, అనంతరమున మాత్రము, the majority of the best thinkers of India have been men belonging to this school.[27] భారతదేశమున

24. Prof. Harold Smith: Outline of Hinduism, p 76.
25. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2 p 655
26. Prof. Satischandra Chatterjee : An Introduction to Indian Philosophy, p 470.
27. Dr. George Thibaut: The Vedanta Sutras-Sankara Bhashya, p xv.

ఉత్తమమేధావులలో నధికసంఖ్యాకులు ఈ వాదమునకే చెందియుండుటను (G. Thibaut) జి. తిబాట్ మొదలగు తజ్ఞులు పలికియున్నారు. అందుచే Of hundred Vedantins, fifteen perhaps adhere to Ramanuja, five to Madhwa, five to Vallabha, and seventy five to Sankaracharya.[28] నూరు వేదాంతులలో పదునైదుగురు రామానుజునకును, అయిదుగురు మధ్వ, అయిదుగురు వల్లభునకును జెంద, డెబ్బది అయిదుగురు శంకరాచార్యునకు జెందియున్నారని డాక్టరు పాల్ దేవసేన్ తెలిపియున్నాడు. ఆ విధముగ అద్వైతవాదమాహాత్మ్యమున భారతావని అశేష శేముషీ దురంధరు లెక్కుడుగ నభివృద్ధిగాంచ భారతీయ ప్రజ్ఞారీతిని నెంతగనో నది పెంపొందించి యున్నదనుటయు సువిదితము.

ఈ విధముగ నద్వైతము లౌకిక ధార్మిక పారమార్థిక రంగముల నశేషోపయుక్తమై సర్వవిధముల నుత్కృష్టస్థానము నలంకరించి, సర్వతోముఖమై అఖిలమానవాభ్యుదయకారణ శక్తియై జెలరారుట గమనార్హము గర్వకారణము.

---

28. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p 2.

# సర్వ సిద్ధాంత సౌరభము

## అద్వైత ఖండము

## శ్రీ శంకరాద్వైతము

ఓం

# శ్రీ శంకరాద్వైతము

## ఉపోద్ఘాతము

---

## శ్రీ శంకరాచార్యులు

### శ్రీ శంకర ప్రస్తుతి

కాషాయాంబర ధారిణం గురువరం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధానమపరే హస్తాంబుజే పుస్తకం।
శిష్యాన్ పార్శ్వగతాన్ సుపుస్తకధరాన్ తేజోధికాన్ నిర్మలాన్
పశ్యంతం కరుణాకరం గుణనిధిం శ్రీ శంకరార్యం భజే॥

కాషాయవస్త్రముల ధరించినవాని గురువర్యుని వీరాసనోపవిష్టుని జ్ఞానముద్రాంకితుని పుస్తకహస్తుని, అధిక తేజోమూర్తులై నిర్మలులై పుస్తకధరులైన శిష్యుల నిరుపార్శ్వముల గలవాని, కరుణాకరుని గుణనిధిని శ్రీ శంకరాచార్యుని భజించుచున్నాడను అని సంప్రార్థితుడైన శ్రీ శంకరుడు One of the greatest men who have appeared in India [1] భారతమున నవతరించిన సర్వశ్రేష్ఠులలో నొకడని

---

1. Dr. Kailasanath Tryamkak Telang: Sankaracharya, p1.

కె టి. తెలాంగు, One of the greatest of the Indian thinkers[2] భారతీయ ప్రజ్ఞానిధి వర్యులలో నొకడని కె.ఎం. పనిక్కార్ greatest mind that ever dwelt in mortal body.[3] మానవశరీరమున నపూర్వముగ వసించిన ఉత్కృష్ట ప్రజ్ఞామూర్తియని డగ్లస్, tremendous intellectual power, throwing the scorching light of reason upon everything.[4] సర్వముపై దన సుతీక్ష్ణహేతువాదమును బ్రసరింపచేయు మహాద్భుత మేధాశక్తియని వివేకానందుడు, primarily a seer of highest type, who realised the truth with his unerring intuitive vision.[5] తన అకుంఠితాంతర్దృష్టిచే సత్యమును గ్రహించిన సర్వోన్నత శ్రేణికి జెందిన మహాత్ముడనియు, The whole of the national genius awoke once more in Sankaracharya.[6] జాతీయప్రజ్ఞా సర్వము మరల శంకరాచార్యునిలో జాగృతి గాంచినది అని సోదరి నివేదిత, Sri Sankara was an avatar of Siva.[7] శ్రీ శంకరులు అపరశివావతారమనియు 'పుంగవ కేతన', 'భవ ఏవ భవాన్', 'అభినవ శంకర', 'శంకర శ్శంకర

---

2. Dr. K. M. Panikkar: Religious Movements in Medieval India
3. Prof. Douglas Grant Duff Ainslie: The Science of Religion of Swami Yogananda.
4. Swami Vivekananda: The Complete Works, Vol 2 p 140.
5. The Editor: Vedanta Kesari, 1927.
6. Sister Nivedita: Sankaracharya of S. S. S. Sastry, p i.
7. MSS. of S. M.

స్నాతాత్' మొదలగు పదముల శిష్యుడైన పద్మపాదునిచేతను శంకరుడు వేనోళ్ల స్తుతింపబడియున్నాడు.

అంతియుగాక The rays of his genius have illumined the dark places of thought and soothed the sorrows of the most forlorn heart,[8] అతని ప్రజ్ఞా కిరణములు అనేక అంధకార బంధుర భావస్థానములను ప్రకాశ మొనరించి, గతిలేని హృదయగత దుఃఖముల దుడిచి వేసెను అని రాధాకృష్ణుడు కొనియాడి యున్నాడు. Never was any prophecy more conclusively vindicated than this, by the appearance of Sankaracharya.[9] శంకరావతరణమునకంటె నే జోస్యము విస్పష్టముగ స్థాపింపబడలేదని 'యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥' (గీ. 4.7) గీతావాక్యమును ప్రమాణముగ గైకొని సోదరి నివేదిత విదితము జేసెను. ఆధ్యాత్మిక దృష్ట్యా శంకరులు మానవజాతివాడు కాడనియు, He belongs to the humanity of Sukra.[10] శుక్రగ్రహమునగల అమానుష పురుషుడనియు బ్లావట్స్కీ వాక్యమును అనిబిసెంటు పునశ్చరణము గావించెను. అతని సిద్ధాంతము నంగీకరింపని వారైనను will not be reluctent to allow him a place among

---

8, Dr. S. Radhakrishnan: Sankaracharya of S.S.S. Sastry, p IV

9. Sister Nivedita: Sankaracharya of S. S. S. Sastry, p i.

10. Dr. Annie Besant: Sankaracharya of K.T. Telang, Note.

immortals.[11] అతని అమరులలో నధిష్ఠింపజేయ వెనుదీయు రని రాధాకృష్ణపండితుడు వాక్రొనెను. The name of Sankara is a name to conjure with not only in India, but also in other parts of the world.[12] శంకరునామము భారతమునందేగాక ప్రపంచమున నితరస్థానములగూడ మంత్రముగ్ధుల గావించునని రాజేంద్రప్రసాద మహాశయుడు ప్రకటించెను. అందుచే కె. టి. తెలాంగు అనునట్లు So enchanting, in fact, are all his surroundings, that it is no wonder that the admiration of an astonished people should have euhemerized him into an incarnation of the Deity.[13] ఆధారముగ అతని పరిసరములు మిగుల ఆకర్షవంతముగ నుండి ఆశ్చర్యచకిత ప్రజానీకముచే భగవదవతారముగ బరిగణింపబడుటలో నాశ్చర్యము లేదు. కావున (L. D. Barnett) యల్. డి. బార్నెట్ వాక్యములలో Sankara's title (Acharya) is well earned. శంకరుని ఆచార్య బిరుదము కష్టార్జితము, సముచితము.

ఇన్ని విధముల నగణితసంస్తుతుల కాకరమైన శ్రీశంకర భగవత్పాదులు అమానుష శక్తిసామర్థ్యములకు నిలయమై ప్రాచీనాధునిక ప్రాక్పశ్చిమ పండితులచే గొనియాడబడి యుండుట యందును ఆశ్చర్యములేదు. The life of Sankara

11. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2 p 638.
12. MSS. of S. M.
13. Dr. K. T. Telang: Sankaracharya, p 2.

makes a strong impression of contraries. He is a philosopher and a poet, a savant and a saint, a mystic and a religious reformer. [14] శంకరజీవిత చారిత్రము బలీయపరస్పర వైరుధ్యముల గోచరింపజేయును. అతడు తాత్త్వికుడు కవి, విద్వాంసుడు మహాత్ముడు, అనుభవసంపన్నుడు మతసంస్కర్త. అందుచే జూపరుల కొక్కొకవిధమున నవగాహనమై One sees him in youth on fire with intellectual ambition, and a stiff and intrepid debator, another regards him as a shrewd political genius, attempting to impress on the people a sense of unity; for a third, he is a calm philosopher engaged in a single effort to expose the controdictions of life and thought with an unmatched incisiveness; for a forth, he is a mystic who declares that we are greater than we know. [14] యౌవనమున ప్రజ్ఞాతృష్ణదాహముగలిగి అచంచల నిర్భయవాదిగను, నొకనికి దోచును; ఏకత్వభావమును ప్రజానీకములో గలుగచేయ యత్నించు సునిశిత రాజకీయ వేత్తగ మరియొకడు అతని గ్రహించును; జీవనమునగల వైరుధ్యముల బహిర్గతమొనరించు కృషిలోనుండి అజేయమైన తీక్ష్ణతగలిగియున్నను ప్రశాంత తత్త్వవేత్తగ దృతీయునకు గానుపించును. నాల్గవవానికి, మన మెరింగిన దానికంటె మనము అధికమని ప్రకటించు అనుభవవేత్తగ నుండును. ఆ విధముగ

---

14- Dr. S. Radhakrishnan : Indian Philosophy. Vol 2 p 450.

There have been few minds more universal than his. 14 అతనికంటె సర్వతోముఖమైన చిత్తములు చాల అరుదు అనియు రాధాకృష్ణపండితుడు వివరించియున్నాడు. అటులే రాష్ట్రపతిగూడ తన యాశ్చర్యమును వెలిబుచ్చుచు, ముప్పదియొక్క సంవత్సరములలో to study almost all philosophy, but also wrote a tremendous lot and tour all over the country from Cape Comorin right upto Himalayas. తత్త్వశాస్త్రము నంతటిని పఠించి, బహుళముగ రచించి, కన్యాకుమారినుండి హిమాలయములవరకు దేశమునంతటిని పర్యటించుట అసాధారణము అసమము అద్భుతము అనుటయు నుచితమే. జవహరిలాల్ నెహ్రూ పండితుడు గూడ He was a curious mixture of a philosopher and a scholar, an agnostic and a mystic, a poet and a saint, and in addition to all this, a practical reformer and an able organiser. 15 శంకరుడు తత్త్వవేత్తయు, పండితుడును, అనుభవవేత్తయు, కవియు మహాత్ముడును, వీనికన్నింటికి కనుగుణముగ నొక ఆచరణయోగ్యమైన సంస్కర్తయు మరియు సమర్థుడైన నిర్మాతయునై యొప్పును అని ప్రశంసించియున్నాడు. పాశ్చాత్యులు శంకరు నవగాహనము జేసికొనజాలరనియు, జిరుప్రాయముననే దశనామ సంప్రదాయమును స్థాపించి, ప్రత్యేక మతసంస్థాపనమున కవసరమైన గాఢ సంస్కృతవిజ్ఞానమును

---

14- Dr-S. Radhakrishnan : Indian Philosophy, Vol 2 p 450
15- Pandit Jawaharlal Nehru. The Discovery of India, p 152

ఆర్జించి, సంభ్రమాశ్చర్యముల గలుగజేయు గీతావళిని రచించి, అయినను అనుభవవేత్తలవలె నిశ్చింతగ తేజోమయ జీవితము గడిపిన శంకరుని this greatnesss that we may appreciate, but cannot understand. 16 ఆ ఔన్నత్యము మనము స్తుతింపగలముగాని, గ్రహింపజాలమని సోదరి నివేదిత స్తుతియించియున్నది. అజేయమైన తత్త్వవేత్తయై తార్కికుడై ప్రశాంతసువిశాల సమరసమూర్తియై Sankara taught us to love truth, respect reason and realise the purpose of life. Twelve centuries have passed and yet his influence is visible 17 శంకరుడు సత్యమును ప్రేమించుటకు, యుక్తిని గౌరవించుటకు, జీవితాదర్శమును బొందుటకు ఉద్బోధించి యున్నాడు. పండ్రెండు శతాబ్దములు గడచినను యింకను అతని ప్రభావము ప్రస్ఫుటము అని రాధాకృష్ణపండితుని వచనము. ఆకాలమున దేశము నల్గడల బర్యటించి తన ప్రబల ప్రభావమును నాటి సమకాలికులపై శంకరుడు ప్రసరింప జేసె నందురు గాని Many of them flourish even today shedding a kindly lustre that inspires the weak.... 18 ఆ ప్రభావము లనేకము లింకను నేటికిని దుర్బలులకు కరుణార్ద్ర ప్రకాశముచే నుత్తేజము నొసంగుచునే యున్నవని సూర్యనారాయణ శాస్త్రియు వ్రాసియున్నాడు. అందుచే శంకర భగవత్పాదుల

16. Sister Nivedita: Sankaracharya, of S S. S. Sastry, p iii.
17. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol 2 p 658,
18. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya. p 22.

యసాధారణ ప్రజ్ఞయు నిర్మలమైన అత్మయు, గంభీరమగు హృదయమును, ప్రశాంతమగు చిత్తమును ఘనమైన మనోభావమును బడసిన మానవుడు మరియొకడు గనబడడనుట ప్రస్ఫుటము.[19] దీనికంతటికి గీలకముగ నున్నదేది? అని విచారించినచో He spoke of things as he saw and not as he imagined.[20] తా నూహించినట్లుగాక దా జూచిన విషయముల బ్రసంగించుచు, ముఖతఃగాక హృదయముతో బలుకుచు, విశ్వహృదయుడై యలరారుటయే శంకరప్రఖ్యాతికి గొంత కారణమనియు జెప్పనొప్పును.

వేదములనుండి అసంఖ్యాక తత్త్వవేత్త లుండి మానవ మనోవృత్తుల సంస్కరించి చారిత్రకపురుషులై యొప్పినను, yet there are general synthesis, systematic conceptions put farward by a Badarayana or a Sankara which will remain land-marks of human genius. సర్వసామాన్య సమన్వయము, బాదరాయణశంకరులచేత బ్రతిపాదింపబడు సక్రమభావవిధానము మానవ ప్రజ్ఞాప్రతిభలో సుస్థిరచిహ్నములై నిలిచిపోవునని విక్టర్ కసిన్సు వచించు విధానమున, the most trust-worthy exponent of the Arya Dharma... was the great teacher Sankara.[21] ఆర్యధర్మమునకు సముచిత విశ్వసనీయ వ్యాఖ్యాత జగద్గురు

19. శ్రీ శేషులూరి కృష్ణస్వామయ్యగారు: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము అ. పు. 1.
20. The Editor : Vedanta Kesari. 1927.
21- Sir Monier Williams : Religious Thought and Life in India, p 54

శంకరాచార్యుడే యనియు, నతడు ఆర్యధర్మమున నవతార మనియు, అట్టి ధర్మగ్రహణమునకు we must look to Sankara rather than to the legendary Vyasa, even though the latter be the reputed author of the Vedanta Sutras. 21 వేదాంతసూత్రకర్తయని ప్రఖ్యాతి నొందిన పౌరాణికుడైన వ్యాసునికంటె శంకరునే మనము ప్రమాణముగ జూడవలయునని మోనియర్ విలియమ్స్ శంక రాధిక్యతను గొనియాడి యున్నాడు.

---

## కాలము

### శ్రీ శంకర విజయ గ్రంథములు

If we want to judge of a religion, we must try to study it as much as possible in the mind of its founder. 22 ఒక మతమును మనము పరీక్షింప దలచి నచో దాని నిర్మాతయొక్క చిత్తము ద్వారా సాధ్యమై నంత వరకు గ్రహింప యత్నింపవలయునని మాక్సుముల్లరు హెచ్చ రిక. ఈ విషయము యితర దేశముల నెట్లున్నను భారతావని మాత్రము చాల ముఖ్యము. వ్యక్తి భాషాజ్ఞాన కుశలుడై ఎన్ని

21. Sir Monier Williams: Religious Thought and Life in India, p 54.

22. Prof. F. Max Muller: An Introduction to Scientific Religion, p 191.

గ్రంథముల రచించినను, అఖండ ప్రవాహము చందము ప్రసంగించువాడైనను, భారత సంప్రదాయము ననుసరించి అతని పుట్టు పూర్వోత్తరములు, ప్రవర్తన మొదలగు ఆచరణ విషయముల మనము గ్రహించి, జీవితోపదేశముల కన్యోన్యత యున్న యంశమునే మనము అతనిని, అతని బోధల ప్రమాణములుగ స్వీకరించెదముగాని, అవి పరస్పర విరుద్ధములైన గ్రాలి నచో గ్రహింపము గదా గౌరవింపము అది శుద్ధ భారతీయ సంప్రదాయము.

ఈ విషయ సేకరణమునకు ఆ వ్యక్తియొక్క జనన నిర్యాణ కాలములు, మహాపురుష సన్నివేశములు, క్షేత్రములు, పర్యటన ప్రదేశములు మొదలగు విశేషములన్నియు నతి ప్రధానము. కాని యీ వివరములన్నియు గాలనిర్ణయముపై నాధారపడియుండుటచే నన్నిటికంటె నదియె మిన్నగ ప్రధానాంశమగుచున్నది. కాన శంకరు జనన కాల విషయముల నొకించుక బరిశీలించి చూచెదముగాక !

భారత చారిత్ర కాల నిర్ణయ విషయమున పాశ్చాత్య పండితులు కొన్ని అన్యాయముల గావించి యుండిరి. The tendency of the most European scholers and anti-quarians is to modernise everything Hindu. హిందూ సంబంధవిషయముల నన్నింటి నాధునికముగ జేయుటయే అధిక సంఖ్యాకులైన పాశ్చాత్య పండితుల, పురాతత్త్వ పరిశీలకుల యొక్క ప్రవృత్తిగ నున్నదని డాక్టరు భండార్కరు విచారించి యున్నాడు. ఈ విషయమును ప్రస్తావించుచు న్యాయాధిపతి తెలాంగు కూడ It appears to me that in these

days there has set in a powerfull tendency in Europe, to set down individual works and classes of works of our ancient Sanskrit to as late a date as possible.[2] మన ప్రాచీన సంస్కృతరచనలను గ్రంథములను సాధ్యమైనంతవరకు అత్యాధునికము గావించు బలీయు ప్రవృత్తి నేటి ఐరోపా దేశమున గలదని వాకొనియున్నారు. ఇట్టి పాశ్చాత్య పండితవర్గ బుద్ధియే తాత్కాలికమునకైన మన ప్రాచీనత్వమునకు హాని కలుగ జేయుచున్నదనియు నాతడు చింతించెను. వారి తీర్మానములలో ఇచ్ఛా నిచ్ఛలు అసూయా ద్వేషములు ప్రస్ఫుటక్రియ జరించినట్లును అతని నమ్మకము. కాని యథార్థమున The discussions of several Orientalists, their new theories based on untrustworthy records, have only tended to make confusion worse confounded, and have resulted in this historical problem remaining as remote from solution as ever.[23] అనేక ప్రాగ్విషయ విద్యావేత్తల విమర్శనలు అప్రామాణిక ప్రమాణములపై నాధారపడియున్న కలవరమును అధికము మాత్రముచేయుచు యీ చారిత్రక సమస్యను ఎప్పటికిని నిర్ణయింప సాధ్యము కాకుండ జేసియున్నవనియు భాష్యాచార్యులు శంకర కాలనిర్ణయ సందర్భమున వక్కాణించియున్నాడు. ఇందులకు గారణమేమన Very often facts and dates are taken by these writers from the writings of their predecessors or contemporaries

---

23. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 1

as the assumption that they are correct, without any further investigation by themselves. [24] సామాన్యముగ తన పూర్వులో సమకాలికులో వ్రాసిన రచనములనుండి కాల విషయముల దా ప్రత్యేక కృషి గావింపకయే నిర్దోషము లుగ గ్రహించు చుండుటయే అనియు నతని నిర్ణయము.

అంతియగాక అట్టి అసందర్భ నిర్ణయములకు హేతువు భారతీయ రచయితలు గూడ గారణము కాకపోలేదు. బాధ్యతా రహితముగ గవితాధోరణి గ్రంథముల నల్లి, దాని ప్రమాణ యుక్తములుగ దేశముపై ద్రోసిన రచయితలుగూడ నీ సంక్షోభమునకు గారణము.

అనేక భాషలలో శ్రీ శంకరుల చరిత్రమును రచించిన పెక్కురు పండితులు వారి అవతార కాలమును గూర్చి బహుళ వ్యత్యాసములతో వ్రాసియుండిరి. కొందరు క్రీస్తుకు బూర్వ మైదవ శతాబ్దమనియు, గొందరు క్రీస్తుకు బిమ్మట ఎనిమిదవ శతాబ్దమనియు, నింక గొందరు యీ యవధుల మధ్య ననేక కాలముల నిర్ణయింప జూచిరి. అట్లు శంకర కాల నిర్ణయ సమస్య సుమారు పదమూడువందల సంవత్సరముల తారతమ్యముతో భారత చారిత్ర కథనములో నొక క్లిష్ట అనివార్య సమస్యయై రూపొందియున్నది. అద్దాని విచారించి తీర్మానింప జాలక వారి రచనలే ముఖ్యములుగాని వారి జన్మాది వివరములు కాదను వారుందురుగాని పూర్వమే వచింపబడినట్లు విద్యకంటె వ్యక్తియే ప్రధానము. వేయి రచనలకంటె వ్యక్తి

24. Pandit N. Bhashyacharya: The Age of Patanjali, p 35.

యొక్క అనుభవాదులే ముఖ్యము. అవియే గౌరవార్హము లనియు బూర్వము పేర్కొంటిమి.

శ్రీ శంకర అవతార కాల నిర్ణయమునకు ముఖ్యముగ గొన్ని విధానములు గలవు. I. బాహ్య ప్రమాణములు. ఇందు (1) శ్రీ శంకర జీవిత చరిత్రము, (2) పురాణాది యితర గ్రంథములు, (3) శంకరు బ్రస్తావించు యితర రచనలు, (4) మతములు, (5) అందు బ్రస్తావింపబడిన వ్యక్తులు, రాజులు, గురువులు. II. అంతర ప్రమాణములు. (i) శ్రీ శంకర రచనములగల గురు, రాజ, పట్నాది ప్రస్తావములు. వీని గ్రమ రీతి విచారించి చూచెదముగాక !

---

## శ్రీ మాధవాచార్య కృతము

Perhaps the best known life of Sankara is the Digvijaya attributed to Madhava Vidyaranya. [25] మాధవ విద్యారణ్యునికి సంబంధింప జేసిన శంకర దిగ్విజయము బహుశః సుప్రసిద్ధము. కాని ఆ గ్రంథకర్త మిగుల సాహసమున శంకరు కాలమునకు సంబంధింపని మహాపురుషులను శంకరునకు అనుసంధింప జేసె ననియు, నెట్లన ఆరు ఏడు శతాబ్దములకు జెందిన కుమారిలుని, పదియవ శతాబ్దమునను్న శ్రీ హర్ష ఉదయనాచార్యులను, పదునొకండవ శతాబ్దికి జెందిన శ్రీ కంఠుని శంకరునితో గలిపి, శంకరునితో నోటమి

25. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 3.

పొందినట్లు సూచించి యున్నాడని సూర్యనారాయణ శాస్త్రి వ్రాయుచు ఇట్టి యనేక దోషములిందు గోచరము గాన దీని కర్తృకమున సందేహములు వొడము ననియు, నందుచే నీ గ్రంథము విస్తృతమై యున్నను ప్రామాణికముగ గ్రహింప రాదనియు వచించి యున్నాడు. అట్లే సి. ఎన్. కృష్ణస్వామి అయ్యరు గూడ నీ గ్రంథము విద్యారణ్య కర్తృకమా అని సంశయించి, రచనా విధానము లోపభూయిష్టమై యుండు టచే విద్యారణ్యకృతము కానేరదనియు, గాన విద్యారణ్యుడు మాధవుడను వేరొకనిచే వ్రాయించియుండునేమో అనియు సందేహించెను. ప్రస్తుతము మాధవ విద్యారణ్యులకు భాషా శైలులలో బహుళ వ్యత్యాసము గోచరముగాన నీ మాధవా చార్యుడు శృంగేరికి జెందిన అర్వాచీనుడై యుండునని భాష్యా చార్యుడు స్పష్ట పరచెను. [26] అదియునుగాక విద్యారణ్యుడే రచించియున్నచో దన ఆశ్రమ నామధేయము జేర్పక బూర్వా శ్రమ నామధేయము నేల నుంచెనో అవ్యక్తము. మరియు దన గ్రంథముల నధ్యాయ ప్రారంభాంతములందు గురుస్తుతియు స్వీయ నామమును దెలుపుకొను విధాయకమును విద్యారణ్యు డేల యిందు విరమించెనో సందేహాస్పదమని భాష్యాచార్యుడు సంశయించెను. [26] మరియు విద్యారణ్యునకు మాధవ సాయ నులను సోదరులుండ, వారి కాత్మశాంతికై వేదభాష్య శంకర విజయముల రచించి, సాయన మాధవుల బేరుంచెననియు గొందరు వాకొనిరి. ఏ దెట్లున్నను యిది విద్యారణ్యకృతము

26. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya; p 18.

కాదని విద్యారణ్య కాలాంతర కృతమనియు బండితాభిప్రాయము.

ద్వైతవాదియైన నారాయణపండితుడు తన 'మణిమంజరి'లో శంకర నింద బహుళముగ గావించియుండుటచే రచనా విధానమునసైనను మాధవుడు తత్సమాధానముగ శంకరుయం దనేక మహిమాదుల జూపించి ఆధిక్యతను నిరూపింప నీ కృతిని రచించెనేమోయని కొందరు వాకొని యున్నారు.27 ఆ కారణముననే Even the less spurious accounts are not free from the fabulous.28 స్వల్పముగ గల్పితములైన ఘట్టమునుగూడ కృత్రిమములే యని సూర్యనారాయణశాస్త్రియు వాకొనెను.

అయినను మాధవుడు శంకర జనన కాలమును గూర్చి నిర్ధారణముగ వచింపక 'లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారం శ్రీ పార్వతీవ సుఖినీ శుభవీక్షితే చ। జాయా సతీ శివగురో ర్నిజతుంగసంస్థే సూర్యే కుజే రవిసుతే చ గురౌ చ కేంద్రే॥' (2. 71.) శుభలగ్నమున, శుభవీక్షణమున, రవ్యంగారక శనైశ్చరగ్రహము లుచ్చస్థితినుండ, గురువు కేంద్రమును బొందియుండ, శ్రీ పార్వతీ దేవి కుమారస్వామిని బ్రసవించినట్లు శివగురుదీక్షితుని ధర్మపత్ని ఆర్యాంబ మగశిశువును గనెనని తెలిపెను. ఇందు అవసర వివరము లెవ్వియు గానరావు. కాన దీని ననుసరించి కాల నిర్ణయముగావించుట

27. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 2.

28. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p.3.

దు స్తరము. అయినను కేరళ పండితుడైన పిచ్చయ్య సహా శయుడు గుణించి, గణించిఆ గ్రహసంపత్తి క్రీ. త. 805 లో దటస్థించియున్నదని నిర్ణయించె... కాని the horoscope given in the Madhava's book is a mere imitation of Rama's and is therefore, worthless. 30 మాధవ గ్రంథస్థమైన జాతకచక్రము శ్రీరాముని చక్రమున కనుకరణమే గాన నిరుపయోగము అని కృష్ణస్వామి అయ్యరు త్రోసి పుచ్చెను.

అట్లయినను మాధవీయము ననుసరించి చూచినచో నీ క్రింది విషయములు స్పష్టములు. 'కేరళేషు' (2. 1) 'అగ్రహారః కాలట్యభిఖ్యోఽస్తి మహాన్మనోజ్ఞః'. (2. 3) అనుటచే కేరళ దేశమునగల కాలటి నామక మనోజ్ఞమగు అగ్రహారమున, 'శివగురుః' (2. 5) 'ఆర్యాంబ' లకు శంకరుడు జనించెనని (2. 71) తెలియుచున్నది. ఈ కాలటి గ్రామము ఆల్వేనగరమునకు ఆరుమైళ్లి దూరమున గలదనియు, శంకరుడు నంబూద్రి బ్రాహ్మణుడనియు సూర్యనారాయణ శాస్త్రి వాక్రొనెను. 31 కాని యీ నంబూద్రి శబ్దమందుగాన రాదు. శంకర సంకల్ప మీడేరినపిమ్మట, నిజస్థానమును జేర దలంపు దోచ, 'ఇంద్రోపేంద్ర ... ధామునైజం ప్రతస్థే' (1౩. 107) ఇంద్రాదిదేవతలతో ఋషిపుంగవులతో బరివేష్టితుడై శంకరుడు

29. శ్రీ శ్రోత్రియులారి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము అ. పు. 1

30. C N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 12.

31. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p.2

కేదార క్షేత్రమునుండి (16. 100) నిజస్థానమైన కైలాసమును జేరినట్లు బాలగా నిజశరీరమును త్యజించినట్లు మాధవుడు గ్రంథమును ముగించెను.

---

## శ్రీ వ్యాసాచలకవి కృతము

వ్యాసాచలకవి రచించిన శంకరవిజయ మొకటి గలదు. కుంభకోణ పీఠమునకు 53వ ఆచార్యులైన మహాదేవేంద్ర సరస్వతీ స్వామియే యితడని యందురు. దరిదాపు 520 శ్లోకములు మాధవీయమున నున్నవిగనే యున్నటుల పండితాభిప్రాయము. మాధవీయమునగల 'యత్రావిద్యాక్షతిరపి ఫలం తస్య తావస్యకర్తా ధన్యో వ్యాసాచల కవివరస్తత్ప్రతిజ్ఞాశ్చ ధన్యాః' (1. 17) 'కవేః కర్మణః కర్తా వ్యాస ఇవాచలః స్థిరబ్యాసౌ కవి శ్రేష్ఠశ్చేతి వ్యాసాచల కవివరో మాధవో ధన్యః' వ్యాసునివలె సుస్థిరుడైన కవియగుటచే వ్యాసాచలకవి మాధవుడేయని తద్వ్యాఖ్యాత రామకుమార సూనుడైన ధనపతి తెలుపుచున్నాడు. ఇట్టి వ్యాసాచలుడన 'కశ్చన మాధవాత్ప్రాచీనః కవిః' అని భ్రాంతినొందుట తగదనియు హెచ్చరించి యున్నాడు. కాని ఆ నామమును వహించిన పూర్వ పీఠాధీశ్వరు డాగ్రంథమును రచించెనని కొందరి వాదము. అయినను యీగ్రంథము శంకరావతారమును గూర్చి యిట్లువచించినది. 'అబ్దేకలే రసలవర్ష శరాక్షి సంఖ్యే, శ్రీనందనే దినమణావు దగధ్వభాజి। రాధేథి పంచమి

తిథావసితేతరాయాం వారే రవే రదితిభే శుభయోగయుక్తే॥ లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారం శ్రీ పార్వతీవ సుఖినీ శుభవీక్షితే చ। జాయాసతీ శివగురోర్నిజ తుంగ సంస్థే సూర్యే కుజే రవిసుతేచ గురౌ చ కేంద్రే॥ (4.20,21) కలిలో 2593వ సంవత్సరమునకు సరియగు నందన సంవత్సరమునం దుత్తరా యణమున, వైశాఖమాస శుక్లపక్ష పంచమీ భానువాసర పునర్వసు నక్షత్రమందు, శుభగ్రహయుక్త శుభలగ్నమున సూర్యాంగారక శనైశ్చర గ్రహము లుచ్చస్థితిని, గురువు కేంద్రమును బొందియుండ, శివగురు దీక్షితుని ధర్మపత్ని, పార్వతీదేవి కుమారస్వామినివలె, సుఖముగ బుత్రునిగాంచెను. వ్యాసాచల కవి నామకుడు సర్వజ్ఞ విష్ణువను నామధేయము గలిగిన విద్యాతీర్థుడే యనియు, నితడు కామకోటి పీఠాధిపతి యనియు, వ్యాసాచల క్షేత్రవాసియగు సారంగపాణుల తనయు డగుటచే నారాయణార్థ నామధేయము గలిగె ననియు, నీతడే విద్యారణ్యులకు బరమగురువులనియు, నిది ప్రాచీన శంకరవిజయ మగుట దానినుండి మాధవుడు కథావస్తువును, శ్లోకముల గ్రహించె ననియు కృష్ణస్వామయ్య వక్కాణించియున్నాడు[32] కథావస్తువులో దారతమ్యము లేక పెక్కు శ్లోకముల యథా తథముగా స్వీకరించి, సుమారు ఏబది వత్సరములలోనే విద్యా రణ్యుడు తన పరమగురురచిత గ్రంథమును మరలవ్రాయ నవసర మేమియై యుండునో! అటులే యైనను ప్రథమ శ్లోకమున 'ప్రణమ్య పరమాత్మానం శ్రీ విద్యాతీర్థరూపిణం' (1. 1) అను

32. శ్రీ శేషబూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము. అ. పు. 21

చోటగాని, 'వ్యాసాచల కవివరః' (1. 17) అను చోటగాని విద్యాతీర్థ వ్యాసాచల నామముల ఏకత్వ సూచిత పదముల మాధవుడు ప్రయోగింపలేదు. మరియు 'ప్రణత్వా పరమాత్మానం శ్రీ విద్యాతీర్థరూపిణం। ప్రాచీన శంకరజయే సార సంగృహ్యతే స్ఫుటం॥' (1. 1) అను శ్లోకమున ప్రాచీనశంకర విజయ కర్త విద్యాతీర్థుడని స్ఫురింపదు. అటులే వ్యాసాచల కవియే నీ ప్రాచీన శంకరజయ కర్త యని మాధవ రచనమున సూచితము కాలేదు. కాన నీ సంశయము విచారణీయము.

మరియు వ్యాసాచల కవికృత గ్రంథమున శ్రీ శంకర నిర్యాణ ప్రస్తావము గావించుచు, కలి 2625 వ సంవత్సరము రక్తాక్షి ( క్రీ. పూ. 477 ) నామ సంవత్సర వైశాఖ శుద్ధ ఏకాదశీ దినమున కాంచీ కామాక్షీదేవి ఆలయమున నుండు కాలమున, స్వ శరీర త్యాగ కాంక్ష జనించి, అష్టవర్ష ప్రాయుడును వర్ధమాన పుత్రుడును అగు నొక బాలునికి దురీ యాశ్రమము నొసంగి, సర్వజ్ఞ మునినామ మొసంగి, కామకోటి పీఠాధ్యక్షునిగ నాతని గావించి, అతనికి సురేశ్వరాచార్యుని సంరక్షకునిగ నియమించె ననియు, అట్లు తన కార్యముల ముగించి బ్రహ్మైక్యము నొందెననియు, నటుల కామ కోటి పీఠము సర్వకేంద్రమై విరాజిల్లెననియు వ్రాయబడెను [32]

తన పరమగురు గ్రంథమునకు విరుద్ధముగ విద్యారణ్యు డనబరగుమాధవుడు తన గ్రంథములో శంకరుని కాంచీ పుర వాసమును బ్రస్తావింపక, కామకోటి పీఠ స్థాపనాది విషయముల

32. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 21.

సూచింపక, పర్యవసానమున శంకరుని నిర్యాణమును గూడ తద్గ్రంథమునకు విరుద్ధముగ కేదారక్షేత్రమున జరిగినట్లు రచించుట గమనార్హము. అందుచే విద్యాతీర్థునికిని వ్యాసాచల కవి కృత మన బరగు శంకరవిజయ కావ్యమునకు సంబంధము దూరమని తోచును.

గ్రంథ కర్తృత్వ మెట్లున్నను, యీ గ్రంథము వలన శంకర జనన మరణ కాలములు స్పష్టమగుచున్నవి. కలి 2593 అనగా క్రీ. పూ. 509 లో శంకరుడు జనించి, కలి 2625 అనగా క్రీ. పూ. 477 లో సిద్ధిపొందినట్లు తెలియుచున్నది. ఈ కాల నిర్ణయము కామకోటి పీఠ సమ్మతము.

---

## శ్రీ ఆనందగిరి రచితము

ఆనందగిరి లిఖిత శంకరవిజయముగూడ ప్రధానమైనదే. ఈ ఆనందగిరి శంకరుని సాక్షాత్తు శిష్యునిగా జెప్పుకొని జగద్గురు జీవితవిశేషముల నుగ్గడించెను. కాని It is very much to be doubted whether this was written by Anandagiri, the famous disciple of Sri Sankaracharya, for the work is partly in poetry and partly in prose, and the nature of the style and many grammatical errors, show that the author must have been only a biginner.[33] యీ రచనమున సంస్కృత

33. Pandit N. Bhashyacharya : The Age of Sankaracharya, p 15.

విద్యా ప్రారంభకునిసూచించు అనేక వ్యాకరణదోషములును, శైలియు గోచరించుచు, గొంత గద్యము కొంత పద్య రూపముగనుంటచే శంకరుల సుప్రఖ్యాత శిష్యుడైన ఆనందగిరి దీనికి కర్తయనుట మిగుల సందేహాస్పదమని భాష్యాచార్యులు వ్రాయుచు, 32, 33, 34, 44 అధ్యాయములలో ఇంద్ర కుబేర యమ చంద్రాదిక సిద్ధాంతముల శంకరుడోడించినట్లు ఇతర గ్రంథముల లేనివిషయముల నీతడు వ్రాసెననియు, నవి కేవలము కల్పితములనియు నతడు వచించెను. అంతియుగాక శంకరునకు లక్ష్మణహస్తామలకులను యిరువురు శిష్యులున్నట్లును, వారిలో లక్ష్మణుడు కాలాంతరమున విశిష్టాద్వైతవాదియైన రామానుజుడుగ నయ్యెననియు, హస్తామలకుడు ఉడిపిజేరి ద్వైతమును బోధించెననియు, క్రీ. శ. 1017 లోని రామానుజుని, క్రీ. శ. 1119 లోని మధ్వాచార్యుని శంకరునితో ముడివైచి శిష్యులనుగ జేయుట కేవలము అసంభవ మగుటయేగాక అసందర్భమగుచు నీ కర్త శంకర శిష్యుడుకాక, మధ్వానంతరకాల జన్ముడని బోధపడుచున్నదనియు భాష్యాచార్యుల వాదము. 33

'పంచపాదిక కర్తారం పద్మపాదం సనందనం। వార్తికాది గ్రంథకారంవిశ్వరూపం సురేశ్వరం॥ పృథ్వీధరాఖ్యం శ్రీమద్ధస్తామలక యోగినం। తోటకం చానందగిరిం ప్రణమామి జగద్గురుం॥' అను గోవర్ధన మఠ గురుపరంపర శ్లోకము ననుసరించి తోటకాచార్యునకు ఆనందగిరి యను పర్యాయనామ

33. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya. p 15

ముండుటచే నా యానందగిరి తోటకాచార్య నామముననే వ్యవహరింపబడుచు ప్రశస్తిగాంచి యున్నను యీ గ్రంథకర్త తాను శంకర సాక్షాత్తు శిష్యుడైన ఆ యానందగిరియే యని చెప్పికొనుటచే (Wilson) విల్సన్ మొదలైన కొందరు పండితులు విశ్వసించి, యీ గ్రంథమును ప్రాచీనమనియు విశ్వాసనీయమనియు వాకొనియున్నను అది కేవల మర్వాచీన మని కృష్ణస్వామి అయ్యరు తెలుపు34 This seems to be quite modern work written in the interests of the schismatic Mathas on the Coromondal Coast which have renounced obedience to the Sringeri Matha where Sankaracharya's legitimate successor resides 35 శంకరాచార్యుని న్యాయబద్ధమైన ప్రతినిధియున్న శృంగేరిమఠ అనువర్తనమును త్యజించిన తూర్పుతీర మతభేద శాఖయు మఠపక్షముగ రచింపబడిన ఆధునిక రచన యిది అని తంజావూరు జిల్లా న్యాయాధిపతియు, పేరొందిన సంస్కృత విద్వాంసుడును అయిన, Dr. Burnell డాక్టరు బర్నెల్ స్పష్టపరచెను.

కాని ఆనందగిరి 14 వ శతాబ్దమునకు జెందినవాడై, చేర దేశమున సూర్యనారాయణ అను నాతని కుమారుడై పూర్వాశ్రమమున జనార్దనుడని పేర్వడసియుండెను. ఇతడు శుద్ధానందుని దగ్గర ఆశ్రమ స్వీకార మొనర్చి ఆనందగిరి యనియు, ఆనందజ్ఞాన అనియు నామముల గలిగియుండెను.

---

34. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 2.

35. Dr. Burnell: MSS. of S. M.

ఇతడు మహాప్రజ్ఞానిధియై శంకర భాష్యముల కనేక టీకలను విరచించెను. ఇతని రచనలు సుమారు 1500 గ్రంథములని ప్రతీతి అని పండితాభిప్రాయము.[36] ఇతడు జనార్దనుడే యనియు, నతనికి సర్వజ్ఞవిష్ణువను కుమారుడుండెననియు, గాన నితడు 14 వ శతాబ్దమున వాడనియు కుప్పుస్వామిశాస్త్రి గారు వ్రాసియున్నారు.[37] శుద్ధానందుడే తన గురువని ఆనందగిరి తన రచనలలో చెప్పుకొనియుండుటచే శంకర సమకాలీనుడు కానేరడనియు స్పష్టము. ఈ గ్రంథమును రచించిన 'ఆనందగిరి' యనువాడు శ్రీ మదాచార్యుల భాష్యములకును, సురేశ్వరాచార్యుల వార్త్తికములకును వ్యాఖ్యానములం గావించినవాడును, శ్రీ కామకోటి పీఠమును 'ఆనందజ్ఞానుల'ను నపర నామధేయముతో నలంకరించినవాడునై యున్నాడ'ని కృష్ణస్వామయ్యగారు వ్రాసెను.[37] కాని యితడు కామకోటి పీఠమున నాల్గవవాడైన శుద్ధానందమునిపిమ్మట ఐదవవాడుగ అధిపతి యగుటకు క్రీ. పూ. 55 వ సంవత్సరమువాడై యుండుట కష్టసాధ్యమగుటచే నితడే ఆ పీఠాధిపతియగుటయు ననుచిత మని కొందరి వాదము.[38] ఇతడు 14 వ శతాబ్ది వాడనియే నిర్ధారణము. కాని యితడు శంకర విజయకర్త యనుటకు నాధారములు గానరావు. అట్లగుటచే గామకోటి మఠమునకు

---

36. మహామహోపాధ్యాయ శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య శాస్త్రి: తర్కసంగ్రహము.

37. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 20

38. MSS. of S. M.

జెందిన అనంతానందగిరి యను మరొకరు దీని రచించియున్నట్లు వ్యక్తము. దీనినిగూర్చియే డాక్టరు బర్నెల్ స్పష్టముగ వ్రాసి యుండెను. ఈ అనంతానందగిరి రచనము ఇతర విజయముల కంటె గొన్ని నూత్నవిషయముల దెలిపియుండుటచే గమనార్హము. అందుచే తోటకాచార్యులనెడు నామధేయముగల ఆనందగిరియొకడును, శుద్ధానంద శిష్యుడైన ఆనందగిరియొకడు, అనంతానందగిరి అను వారొకరుగా పూర్వానందగిరు లుండుటచే నింత కలవర మేర్పడియున్నది.

కాని కృష్ణస్వామయ్య, టీకాకారుడైన ఆనందగిరిగూడ ఒకప్రాచీనశంకరవిజయమును రచించినట్లు తెలుపుచున్నాడు.[39] ఆ శంకర విజయమున శంకరజననమునుగూర్చి యిట్లు లిఖింప బడి యున్నది. 'ఈశో౽ప్యభూత్సమద విద్వదభేద్య దర్ప, సర్పాహి తుండికవి దగ్ధ సహస్రసేవ్యే। విద్యాధిపత్యపరనామ్ని కులే శివాఖ్యాత్ ఆర్యాపతే రవి సహస్ర రుచిఃకుమారః॥ (3. 85) 'తిష్యే ప్రయాత్యనల శేవధి బాణనేత్రే, యో నందనే దినమణా వుదగధ్వభాజి। రాధే౽ దితేరుడుని నిర్గతమంగలగ్నే ఽప్యాహూతవాన్ శివగురు స్స చ శంక రేతి॥' (3. 86) ఏ కేరళ దేశమునందు సర్వతుల్యులగు విద్యావంతుల దురహంకార మనెడు విషమును నివారింప సమర్థులగు సహస్రాధికమగు పాములవాండ్రు నాబడు గొప్ప పండితులు గలరో అట్టి వారిచే సేవింప బడుచుండు విద్యాధిపుండను వాని వంశమున కలి ప్రారంభము పిమ్మట 2593 వ సంవత్సరమునకు సరియైన నందన

39. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 23

వత్సరమునం దుత్తరాయణమున, వైశాఖ శుద్ధ పంచమి పునర్వసు నక్షత్ర యుతంబగు కర్కాటకలగ్నమున శివగురు సతి ఆర్యాంబ గర్భమున మహేశ్వరుడు సహస్ర కిరణ తేజము గల సూర్యునివలె జనించెను. ఆ శిశువునకు శివగురు శంకరుడని పేరుంచెను అని గలదు. మరియు నిర్యాణ ప్రస్తావమున, కలి॥ 2625 వ సంవత్సరమున శ్రీ శంకరులు కాంచీ కామకోటి పీఠమునందు సర్వజ్ఞమునులను దన తర్వాత ఆచార్యునిగా నియమించి, అతని రక్షణ కర్తగా సురేశ్వరాచార్యుని నేర్పరచి, శ్రీ కామాక్షీ ఆలయమునం జేరి, ప్రాపంచిక మనోరథముల వీడి, మర్త్య శరీరమును త్యజించి, సామాన్యుల కలభ్యమైన బ్రహ్మైక్యము నొందెను అని ఆ గ్రంథము తెలిపి యున్నది.

ఆనందగిరి యను పరనామ ధారియైన అనంతానంద గిరి రచనమును జూతము. 'ప్రాప్తే తు దశమే మాసి విశిష్టా గర్భగోళతః। ప్రాదురాసీ న్మహాదేవః శంకరాచార్య నామతః ॥ 'ఆసీత్తదా పుష్పవృష్టిః దేవ సంఘైః ప్రచోదితా । నేదుర్దుందుభయో ర్దివ్యాః స్వర్గలోకే చిరం సుఖం॥' (2 అ) విశ్వజిత్తను బ్రాహ్మణోత్తముని ధర్మపత్నియగు విశిష్టా గర్భమున పదిమాసములు నిండిన పిమ్మట మహాదేవుడు శంకరాచార్య నామమున ఉద్భవించెను. అప్పుడు దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. స్వర్గలోకమున దివ్యములైన దుందుభులు మ్రోగెను. ఇందు ఇంతకంటె జననకాల వివరములు కానరావు. ఈ రచయిత పూర్వోక్తరీతి సాహసించి రామానుజ మధ్వాచార్యుల శంకరానుయాయులుగ జిత్రించుట విచిత్రము. ఈ విషయమున

సర్వజ్ఞుడను బ్రాహ్మణుడు చిదంబర క్షేత్రమున నుండెను. అత నికి విశిష్ట అను కుమార్తెయు నుండెను. ఆమెను విశ్వజిత్తు అను నతనికి వివాహము జేసెను. కొంతకాలమునకు విశ్వజిత్తు తపమునకై భార్యను వీడిపోవ, విశిష్ట చిదంబరేశ్వరుపై భక్తి గలిగియుండి, అతని ననుగ్రహమున శంకరుని గనినట్లు యీా రచన. ఈ రచనమును అవ్యక్త ప్రసంగముగ వ్రాసివుచ్చుచు కృష్ణస్వామయ్య యీా క్రిందివిధముగ దెలుపు చున్నాడు. కాంచీ కామకోటి పీఠము నలంకరించిన ఆచార్యస్వాములపైకి ముప్పదియారవవాడగు అభినవ శంకరాచార్యస్వామి చిదం బర క్షేత్రనివాసులగు విశ్వజిత్తు అను విప్రోత్తముని తనయుడు. విశ్వజిత్తు మరణించుకాలమునకు అతని ధర్మపత్ని విశిష్టాదేవి గర్భవతిగనుండి, సహగమనమునకై సంసిద్ధము కాగ బంధు వులు నివారించిరి. కాలాంతరమున నామె మూడు వత్స రముల అనంతరము కలియుగాబ్దములు 3889 విభవ సంవ త్సర వైశాఖ శుద్ధ పుష్యమీాయుక్త దశమీా దినమున, అనగా క్రీ.త. 788 న మగశిశువును గాంచెను. కాని ఆమె లజ్జచే నతని అరణ్యముల ద్యజింప, వ్యాఘ్రపాదుడను మునీంద్రదంపతు లతని పెంచి, విద్యాబుద్ధుల గరపి ప్రవీణుని గావింప, చిదం బరక్షేత్రమున కేతెంచిన కామకోటి పీఠాధీశ్వరుడు యీా బాలకునిగూర్చి విని, ఆనందించి, తురీయాశ్రమము నొసంగి పీఠాధ్యక్షునిగ గావించెను. అతడును ఆదిశంకరు వోలె దేశ ముల బర్యటించి విద్యచే దిగ్విజయము గావించి, కాశ్మీరమున సర్వజ్ఞ పీఠము నధిరోహించి, ఏబదివత్సరముల పీఠాధిపత్య మునసుండి, కలి 3941 సిద్ధార్థి సంవత్సర ఆషాఢబహుళ అమా

స్వదినమున హిమాచలమందలి ఆత్రేయపర్వతమున దత్తాత్రేయ గుహాయందు బ్రవేశించి బ్రహ్మైక్యము నొందెను.39 అట్లు శంకరు బుట్టు పూర్వోత్తరములనొసంగు అనంతానందగిరి కృత ఆచార్యవిజయము శ్రీ శంకరుల శిష్యుడైన తోటకాచార్యులనెడు ఆనందగిరివలనగాని, శంకరుని భాష్యత్రయ వ్యాఖ్యాతయైన ఆనందజ్ఞానులచేగాని వ్రాయబడక ఆనందగిరి నామధేయముతో మరియొకరు వ్రాసినటుల దోచుచున్నదని కృష్ణస్వామి అయ్యరు విశదపరచెను.40

ఆనందగిరియొక్క శంకరవిజయమునగల వ్యాఖ్యానముల తెలాంగుపండితునుగూడ ఇట్లు వివరించి యున్నాడు. శంకరుడు సన్న్యసించినపిమ్మట జన్మస్థలమును వదలెను. అప్పటికే అతనికి పెక్కురు శిష్యులు గలరు. చిదంబరము నుండి అతడు బయలుదేరి మయూరార్జున, రామేశ్వరముల బర్యటించి, అనంతశయనమున మాసము వాస ముండి, సుబ్రహ్మణ్యపురము భవాని నగరము, కువలయపురములద్వార ఉత్తరమున ఉజ్జయినికి జేరెను. అటనుండి పశ్చిమముగ బ్రయాణించి, అనుమల్ల, అరుంధ మగధపురముల దర్శించి, ఇంద్రప్రస్థ యమప్రస్థములనుండి ప్రయాగక్షేత్రమును జేరెను. అంత కాశీ కురుక్షేత్ర బదరీల దర్శించి, అయోధ్య గయలచేరి జగన్నాథమునకు ఏతెంచెను. రుద్రపురమున కుమారిలుని

39. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 23

40. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas. p 10.

జూచి, హస్తినాపురము దగ్గరగల విజయబిందు నగరమున మండనమిశ్రుని ఓడించి, తుంగభద్రాతీరమున శృంగగిరిలో నొక పాఠశాలను స్థాపించి, అట వచ్చినకుండి, అహోబిల వేంకటగిరుల మీదుగ గాంచీపురమును జేరెను. శివ విష్ణు కాంచీనగరముల బ్రతిష్ఠించి అట శరీరము ద్యజించెను. పర్యవసానకాలమున దన శిష్యపంచకమునకు శైవ వైష్ణవ శాక్త సౌర గాణాపత్యముల స్థాపింప నాజ్ఞనిడెను.[41]

దీనిని వివరించుచు తెలాంగు మహాశయుడు I must confess that even after a great deal of time and labour—, I am as far as ever from being able to comprehend the geography of the tour of Sankaracharya as related by Anandagiri—. Many of the names cannot be found noted in our modern maps[41] ఆనందగిరి వర్ణించిన శంకరాచార్య పర్యటనమునగల భూగోళ విధానము, నేనెంత కాలప్రయాసల నుపయోగించినను నా కవగతము కాలేదని సమ్మతించుచున్నాను. అనేక నామములు మన ప్రస్తుతకాల దేశపటములలో గానరావు అని అతడు వ్రాసియున్నాడు. కాని ఆనందగిరి సూచించిన చిదంబరము దక్షిణమునగల పోర్టోనోవో దగ్గరగల చిలుంబ్రము అయి యుండుననని సందేహించి యున్నాడు.[42] కాని చిలుంబ్రములో విశిష్టకు అధిష్ఠానదేవుడైన నటరాజు లేడుగదా! ఈ విధముగ నీ యానందగిరికృత శంకరవిజయము

41. Dr. K. T. Telang: Sankaracharya, p 28.
42. Dr. K. T. Telang: Sankaracharya, p 30.

అనేక సమస్యలను దారిదీసి జిజ్ఞాసాలోకమున మిగుల సంక్షో
భమును లేవదీసినదని తోచుచున్నది.

---

## శ్రీ చిత్సుఖీయము

చిత్సుఖాచార్యునిచే రచింపబడిన 'బృహచ్ఛంకర విజయ'మను గ్రంథ మొకటి గలదు. అందు 'తతః సా దశమే మాసే సంపూర్ణశుభలక్షణే। షడ్వింశే శతకే శ్రీమద్యుధిష్ఠిర శకస్య వై॥ ఏకం త్రింశేథవర్షే తు హాయనే నందనే శుభే। మేషరాశిం గతే సూర్యే వైశాఖే మాసి శోభనే॥ శుక్లే పక్షే చ పంచమ్యాం తిథ్యాం భాస్కరవాసరే। పునర్వసుగతే చంద్రే లగ్నే కర్కటకాహ్వయే మధ్యాహ్నే చాభిజిన్నామ ముహూర్తే శుభవీక్షితే। స్వోచ్చస్థే కేంద్రసంస్థే చ గురౌ మందే కుజే రవౌ॥ నిజతుంగగతే శుక్రే రవిణా సంగతే బుధే। ప్రాసూత తనయం సాధ్వీ గిరిజేవ షడాననం॥ ఉదయాచల వేళేవ భానుమంతం మహౌజసం। దుర్నిరీక్ష్యే స్వతేజోభి ర్భాసమంతం దిశోదశ॥' అంతట శుభసూచికములతో గూడిన పదియవ మాసము సంప్రాప్తింప, యుధిష్ఠిర శక 2631 సరి యగు నందన అనగ క్రీ.పూ. 509 వ సంవత్సరమున వైశాఖ శుద్ధ పంచమి భానువారము పునర్వసు నక్షత్ర కర్కాటక లగ్నమున రవి కుజ గురు శనైశ్చర గ్రహము లుచ్చస్థితిని కేంద్రమును బొంది శుక్రు డుచ్చస్థితిని బుధుడు మేషరాశి రవితో గూడి యుండ శివగురు పత్నియగు ఆర్యాంబ, పార్వతి

కుమారస్వామిని బ్రసవించినట్లు పుత్రుని గనెను. ఆ బాలుడు ఉదయించిన సూర్యునివోలె దశదిక్కులకు దన తేజమును బ్రసరింపజేసెను అని యీ గ్రంథము శంకరు జననకాలమును దెలుపుచున్నది.

అటులే శంకరనిర్యాణము క్రిందివిధముగ నీ గ్రంథము చిత్రించినది. ఆసేతు హిమాచల పర్యంతము సకల శాస్త్రజ్ఞులకును సమ్మతమగు నద్వైతమును స్థాపించి, శూల చక్రాది చిహ్నముల ధరించియుండిన శైవవైష్ణవాది షణ్మతముల పై దురాచారములనుండి దొలగించి, సన్మార్గ ప్రవిష్టుల గావించి, ఆకాశ వాణిని జయించి, పండితోత్తమసేవ్యుడై కాంచీ నగరమునందలి సర్వజ్ఞపీఠము నారోహించి, శ్రీ శంకర యతిసార్వభౌముడు ఈ భరతఖండమున ముప్పదిరెండు వత్సరములు వర్ధిల్లి, ఆశ్రయించిన కాంచీమండల ప్రభువగు రాజసేన భూపాలునకు సర్వ ప్రజలకు ధర్మముల బోధించి, యుధిష్ఠిరశకము 2663 నకు సరియగు క్రీ. పూ. 477వ సంవత్సరమున గామాక్షీ దేవాలయమున శరీరమును జాలించి బ్రహ్మైక్యము నొందెను.43

కాని చిత్సుఖాచార్య జీవితవిశేషములుకూడ విచారణీయములే. ఇతడు శంకరునకు గోవిందభగవత్పాదాచార్య సన్నిధానమున సహాధ్యాయుడనియు, నాటి నామము విష్ణుశర్మ అనియు, కేరళమునగల గోకర్ణక్షేత్రవాసి యనియు, కృష్ణస్వామయ్య విశ్వాసము. శంకరునితో దేశమునల్గడల బర్యటి

43. శ్రీ క్రోష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 26

టించి, శంకరుసన్నిధి సన్యసించి, కాంచీనగరమున శంకరు నిర్యాణమువరకు వెంట నితడుండినట్లు యీ గ్రంథము చూపెట్టును. ఇతడు శంకరుగంటె 5 వత్సరములు పెద్దయటగూడ. శంకర నిర్యాణానంతరము ఇతడు ద్వారకాపీఠమును బ్రహ్మస్వరూపాచార్యుల తర్వాత గలి 2654 వ సంవత్సరమున అనగ క్రీ. పూ. 447 సంవత్సరములో నధిష్ఠించి, ఎనుబదియవ వత్సర ప్రాయమున గలి 2668 లో క్రీ.పూ. 434 వ సంవత్సరములో సిద్ధిగాంచినట్లు కృష్ణస్వామయ్య వ్రాసియున్నాడు.[43]

చిత్సుఖాచార్యుడు జ్ఞానోత్తముని శిష్యుడై శుక ప్రకాశముని గురుడనియు, నితడనేక గ్రంథములు లిఖించె ననియు గొందరి భావము. ఇతడు వంగీయుడనియు, శ్రీహర్షుని 'ఖండఖండ ఖడ్గము'నకు వ్యాఖ్య వ్రాసెననియు, 13 వ శతాబ్దమునకు జెందినవాడనియు గొందరి అభిప్రాయము. ఇతడు శంకరవిజయకర్తయని ఆధునికు లెవ్వరును దెలిపియుండలేదు. కాన నిదియు నర్వాచీనమే గాని ప్రాచీనమని విశ్వసింప నసర్హమనియే తోచును.

---

## శ్రీ చిద్విలాసీయాదులు

చిద్విలాసయతి యను నతడు ఒక శంకరవిజయవిలాసమును నిర్మించెను. ఇది కాలనిర్ణయమున కెట్లును ఉపయోగ

43. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము. అ. పు. 26

పడక వసంత పునర్వసులనుమాత్రమే ప్రస్తావించి శంకర జన్మ కాలమును దెలిపియున్నది. కాలటిగల శివగురు ఆర్యాంబలనే, మాధవ చిత్సుఖులతోబాటు నితడు శంకరు జననీ జనకు లుగ సమర్థించెను. శంకరదిగ్విజయ మను పేర సదానందు డొక గ్రంథమును విరచించెను. ఇందు కాల నిర్ణయోపయుక్త విషయ మెద్దియును లేదు. కేరళీయ శంకరవిజయము నా నొండు గ్రంథము గలదు. అందు నందన వైశాఖ శుద్ధపంచమి పునర్వసు నక్షత్రాదికము జెప్పబడినదిగాని శకము దెలుపబడ కుండుటచే నదియు ననుపయుక్తము. పై నుదాహరింపబడిన శంకర విజయములుగాక, విద్యాశంకర (శంకరానంద) గోవిందనాథ, రాజచూడామణి దీక్షిత, వల్లీశయకవి, మొద లగు రచయితల విజయములు పెక్కుగలవు. కాని యవియు పూర్వ గ్రంథములపై నాధారపడి యుండుటచే యథార్థ చారిత్ర గ్రహణమునకు నిరాధారములు.

---

## విజయ సమీక్ష

పై వివిధ శంకర విజయ సమీక్షను ననుసరించి చూచి నచో, We have at present no work which can be truly considered as his (Sankara's) biography, written during, or immediately after his time.[44]

---

44. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 44.

శంకరు కాలమునగాని అతని నిర్యాణ తత్క్షణానంతరమునగాని నిర్మితమైన జీవితచారిత్రము ఒక్కటియైన ప్రస్తుతము మనకు గానరాదు. The dates of the biographies being several centuries later, it is not be wondered at that the traditions were different from one another.[45] రచయితలు అనేక శతాబ్దముల అనంతర కాలపు వారగుటచే వానివాని సంప్రదాయములలో దారతమ్యముండుటయందును ఆశ్చర్యములేదు. అంతియగాక ఒక్కొక్క లేఖకుడు తనకు జెందిన ప్రదేశమునకు, మతమునకు అనుగుణ రీతి శంకర చరిత్రమును రూపొందించియున్నట్లును విదితము. అందుచే నవి అప్రామాణికములైన ఆయాకాలముల సాంప్రదాయిక గాథలనే తెలుపుచున్నవనుటకు ప్రబలకారణము గలదని భాష్యాచార్యులు తీర్మానించెను.[45] దీని ననుసరించి చూచుచో, It is plain that after the time of Sri Sankaracharya his school became variously divided, and every individual belonging to a particular division wrote a work.[46] శంకరానంతర కాలమున నతనిమతము వివిధరీతుల విభజ్యమై ప్రతియొక్కరు ఒక్కొక్క పక్షమునకు జెంది రచనలగావించి యున్నటుల స్పష్టమనియు నతని నిర్ణయము. మరియు We find the life of Sankara shrouded in myth, none of which adds

---

45. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 14.

46. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 31.

to his greatness.[47] శంకర జీవితగాథ అతని గౌరవము నినుమడింప జేయు జాలని అభూతకల్పనములతో నిండియున్నదనియు సూర్యనారాయణశాస్త్రి చింతించెను.

అయినను బైసమీక్షవలన కొన్ని ముఖ్య విషయములు విస్పష్టమగుచున్నవి. ఒక్క అనంతానందగిరి కాక సర్వేతరులును శంకరుడు, కేరళదేశమునకు జెందిన కాలటి గ్రామవాసులగు ఆర్యాంబ శివగురులకు జనించెనని పర్యవసానముగ దెల్పుచున్నారు. అటులే శంకరుని జీవితకాలము ముప్పదిరెండు వత్సరములనియు నిర్ణయింప నగుచున్నది. అటులే జనన కాలముకూడ క్రీ. పూ. 509 నందననామ సంవత్సర వైశాఖ శుద్ధపంచమీ భానువాసర పునర్వసు నక్షత్రమున అనియు నిస్సంశయము.

---

## పురాణములు

స్కాంద పురాణాంతర్గత శివరహస్యములో శ్రీ శంకర చరితా ప్రస్తావము గలదు. 'మదంశేజాతం దేవేశి కలావపి తపోధనం । కేరళేషు తదా విప్రం జనయామి మహేశ్వరి॥... కల్యాదిమే మహాదేవి సహస్ర ద్వితయాత్పరం । ... స్వజామీశే మదంశతః ॥ కేరళే శలలు గ్రామే విప్ర పత్న్యాం మదంశతః। భవిష్యతి మహాదేవి శంకరాఖ్యో ద్విజోత్తమః॥'

47. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 1.

(16.అ. 9. అం.) ఓ పార్వతీ కలి ప్రారంభము నుండి రెండు వేల వత్సరములకు బైపడిన పిమ్మట కేరళ దేశమున గల శలల గ్రామమున ఒక ద్విజోత్తముని గర్భవాసమున నా యంశమున శంకర నామధేయుడగు తపోధనుడైన విప్రుడొకడు జనించును అని జననమును దెలిపి అంత శంకర జీవిత విశేషముల క్లుప్తముగ వచించి యున్నది.

'నిందంతి వేద విద్యాం చ ద్విజాః కర్మాణి వై కలౌ। కలౌ రుద్రో మహాదేవః శంకరో నీలలోహితః ॥ ప్రకాశతే ప్రతిష్ఠార్థం ధర్మస్య వికృతాకృతిః । యేతం విప్రా నిషేవంతే యేన కేనాపి శంకరం । కలిదోషాన్ వినిర్జిత్య ప్రయాంతి పరమం పదం ॥' (40.అ) కలిలో బ్రాహ్మణులు వైదిక కర్మ నింద జేయువారగుదురు. మరల ధర్మమును యథాస్థితి స్థాపింప భగవంతుడగు శంకరు డవతరించును. ఆ భగవంతునే విప్రులెట్లు సేవించెదరో అట్లు కలి కలుషములనుండి తరించెదరు అని లింగపురాణము శంకరావతరణమును సూచించియున్నది.

'కలౌ రుద్రో మహాదేవో లోకానాం ఈశ్వరః పరః। స దేవతా భవేన్నౄణాం దేవతానాం చ దైవతం ॥ కరిష్యత్యవతారం స్వం శంకరో నీలలోహితః । శ్రౌత స్మార్త ప్రతిష్ఠార్థం భక్తానాం హితకామ్యయా ॥ ఉపదేక్ష్యతి తత్ జ్ఞానం శిష్యాణాం బ్రహ్మసంజ్ఞితం। సర్వవేదాంతసారం హి సర్వ్వస్మాచ్చ తు దర్శనాత్ ॥ యేతం విప్రా నిషేవంతే యేనకేనాప్యుపాయతః। విజిత్య కర్మజాన్ దోషాన్ యాంతి తే పరమం పదం॥' (27.అ) కలియుగమున దేవదేవుడగు మహేశ్వరుడు తన భక్తుల హితము గోరినవాడై శ్రౌత స్మార్త ధర్మముల యథా

ప్రకారము స్థాపింప సర్వవేదాంతసారమగు బ్రహ్మజ్ఞానమును సర్వశాస్త్రాభిప్రాయములను శిష్యుల కుపదేశింప నవతరించును. ఎవరా భగవంతుని నెటుల సేవించెదరో వారు కర్మజమైన దోషములనుండి ముక్తులై తరింతురు అని కూర్మపురాణ పాఠము.

'కల్యాదౌ ద్వి సహస్రాంతే లోకానుగ్రహకామ్యయా।
చతుర్భిస్సహ శిష్యైస్తు శంకరోఽవతరిష్యతి॥' (36. అ) కలి ప్రారంభమునుండి రెండువేల వత్సరముల తావల ప్రజల ననుగ్రహించుటకై నలుగురు శిష్యులతో భగవంతుడైన శంకరు డవతరించునని భవిష్యత్పురాణ వాక్యము.

'లోకానుగ్రహ తత్పరః పరశివః సంప్రార్థితో బ్రహ్మణా, చార్వాకాది మతప్రభేద నిపుణాం బుద్ధిం సదా ధారయన్। కాలట్యాఖ్య పురోత్తమే శివగురు ర్విద్యాధినాథశ్చ యః, తత్పత్న్యాం శివావతారకే సముదితః శ్రీ శంకరాఖ్యాం వహన్॥ కాంచ్యాం శ్రీ కామకోటిం కలిమల శమనీం కల్పయిత్వా సురేశే, శ్రీ విద్యారాజ పీఠార్చన మహిత మహారాజ్య సామ్రాజ్యలక్ష్మీం। సంవేశ్యాత్మీయ శిష్యే సకలభువన సమ్మోదహేతో ర్మహాత్మా, చిద్రూపస్యానుభూతిం భజతి భవ మహాంభోధి సంతారణాయ॥' (72. 7) పరమశివుడు బ్రహ్మచే సంప్రార్థితుడై ప్రజల ననుగ్రహింప, చార్వాకాది మతముల ఖండింప నసాధారణ ప్రజ్ఞతో వెలయుచు గాలటి యను ఉత్తమ గ్రామమున, విద్యానాథ తనయుడగు శివగురుని ధర్మపత్ని గర్భమున శంకరనామధేయమున నవతరించి, కాంచీనగరమున గలి కలుషవినాశిని శ్రీ విద్యారాజపీఠము

నర్పించుటచే మహిమనొందిన మహారాజ్య సామ్రాజ్య లక్ష్మీ స్వరూపిణియగు కామకోటిని గల్పించి, అందు సర్వజనానందముకొరకై తన శిష్యుడగు సురేశ్వరాచార్యుని నియమించి, సంసారసాగరమును దరింపజేయుటకై చిన్ముద్రతో జ్ఞానానందానుభవమును జేయుచుండును.

పై పురాణవాక్యములు కేరళదేశమును, కాలటిగ్రామమును శివగురుల బ్రస్తావించుటయేగాక, గలిపిమ్మట ద్విసహస్ర వత్సరానంతర మనుటయు గమనార్హము. అనగా క్రీస్తునకు బూర్వమనియే నిర్ణయము.

ఈ పురాణములు శంకరుని ట్లు నుతించుచుండ,

'మాయావాదం అసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధమేవ చ ।
మయైవ కథితం దేవి కలౌ బ్రాహ్మణరూపిణా॥' (1. 14)

శాస్త్రవిరుద్ధమును ప్రచ్ఛన్న బౌద్ధమును నగు మాయావాదము బ్రాహ్మణరూపమును దాల్చి నాచేత గలిలో జెప్పబడును అను వాక్యముల పద్మపురాణము శంకర సిద్ధాంత నింద గావించియున్నది.

ఈ పురాణ వాక్యములగూర్చి యోచించి, Certain Puranas are also said to make mention of the birth of our philosopher; those portions of the Puranas which are said to treat of him are not generally known to exist.[48] కొన్నిపురాణములు మన తత్త్వవేత్తనుగూర్చి సూచించినట్లు వచింపబడును. కాని ఆ పురాణభాగములు సామాన్యముగ నా పురాణముల గాను

48. Pandit N.Bhashyacharya:The Age of Sankaracharya, p26

పింపవు అని భాష్యాచార్యులు వాకొనెను. పద్మపురాణ వాక్యములు must only be additions by some antagonist of Advaita philosophy.[48] అద్వైత సిద్ధాంత ప్రతివాది యొకనిచే జేర్పబడినవనియే యతడు నిర్ణయించెను.

---

## ఇతరములు

శ్రీ మాధవీయ శంకరవిజయము ననుసరించి 'అనుభూత జాతకతరంగిణి' కర్త, శ్రీ శంకరుడు కలిలో 3907 సంవత్సరమునకు సరియగు శాలివాహన శక 728 అనగ క్రీ. శ. 805 వ సంవత్సరము అనగ నీశ్వరనామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమీయుక్త ఇందువాసరమున అవతరించి నట్లు వ్రాసియున్నాడు. కాని యీ నిర్ణయము క్రీ. శ. 788 వ సంవత్సరమున జనించిన అభినవ శంకరులకుగూడ నన్వయింపక బిమ్మట నుండుటయు, క్రీ. శ. 805 వ సంవత్సరము ఈశ్వర కాక పార్థివ సంవత్సరమై యుండుటచే కృష్ణస్వామయ్య దీనిని త్రోసిపుచ్చెను.[49]

'సకలార్థసాగర' మను గ్రంథమున గల 3058వ వత్సరములో నీశ్వర సంవత్సర వైశాఖ శుద్ధ పంచమీ భానువారము

---

48. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p26

49. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము అ. పు. 3

ఆర్ద్రానక్షత్రమున శంకరు డుద్భవించినట్లు గలదు. దీని ప్రకారము క్రీ. శ. 44 వ సంవత్సరముగ నేర్పడును.49

నూరటూ యజ్ఞేశ్వరశాస్త్రి కర్తృకమైన 'ఆర్యవిద్యా సుధాకరము'న, కలిలో 3889 సంవత్సరములకు సరియగు విభవనామ సంవత్సర వైశాఖ శుద్ధ దశమీ దినమున శంకరు డుదయించినట్లు, అనగా క్రీ. శ. 788 సంవత్సరమని గలదు. దీనినే మరికొందరు సమర్థించిరి. నాగపూడి కుప్పుస్వామయ్య పండితుడు తన '(శ్రీ) శంకరాచార్య చరిత్రము'న నదే వత్సరమును గైకొని వైశాఖ శుద్ధ పంచమీ ఆర్ద్రానక్షత్రమని తెలిపి యున్నారు.49 కాని 'శంకరేంద్ర విలాస' మను గ్రంథమున విభవ వైశాఖ శుద్ధ దశమి పుష్యమీ నక్షత్రమున శంకరానంతరము 38 వ కామకోటి పీఠాధిపతి జనించినట్లు గలదని కృష్ణస్వామయ్య వాకొనును.50

సదాశివేంద్ర సరస్వతి విరచిత 'పుణ్యశ్లోక మంజరి' కలిలో 2625 వ సంవత్సరము అనగా రక్తాక్షి (క్రీ. పూ. 477) శుద్ధ ఏకాదశి దినమున శంకరుడు దివంగతుడైనటుల వచించుచున్నది.

ఈ గ్రంథము లన్నింటిని దరచిచూచి, శంకరుడు క్రీ. పూ. 477వ సంవత్సరమున సిద్ధిపొందుట స్థిరమనియు, నందుచే క్రీ. పూ. 509వ సంవత్సరమే ఆతని జనన సంవత్సర

---

49. శ్రీ క్రోష్టులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 3

50. శ్రీ క్రోష్టులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 8.

మనియు కృష్ణస్వామయ్య నిర్ణయించెను.[51] ఈ కాల నిర్ణయ కృషిలో నతని ప్రవేశము ప్రశంసార్హము.

రామభద్ర దీక్షిత కృత 'పతంజలి చరిత' లో గూడ శంకర ప్రస్తావనము గలదు. కాని యందు కాల నిర్ణయాధారము లెవ్వియు గానుపించవు. ఇచ్చట నెనిమిదవ సర్గలో నసందర్భముగ శంకర ప్రస్తావనము గావింప బడియున్నది. ఇది మాధవీయ శ్లోకముల ననుసరించి యున్నదని కొందరి వాదము.

పై సమీక్ష ప్రకారము అయిదుగురు శంకర విజయాది చరిత్రకారులు అనేక గ్రామముల శంకర జన్మస్థానముగ సూచించి రనియు, నందు శృంగేరికూడ గలదనియు, శివ రహస్య కవిచరిత్రములు కేరళమున శశల గ్రామమును, ఆనంద గిరి చిదంబరపురమును, మాధవుడు కాలటిని, ఆర్యవిద్యా సుధాకర కర్త యజ్ఞేశ్వరశాస్త్రి కల్పి అను గ్రామమును సూచించి యున్నారని తెలాంగు పండితుడు సమీక్షించెను.[52]

---

## శ్రీ శంకర పీఠములు

శంకర విజయాదిక గ్రంథములు యీ విధముగ నానా రీతుల నడచియున్నవిగదా అని శ్రీ శంకరభగవత్పాద స్థాపిత

---

51. శ్రీ క్రోత్తపల్లి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, ౨. పు. 33.

52. Dr. K. T. Telang: Sankaracharya, p 3.

మఠముల ద్వార కాలాదిక నిర్ణయమును గావింప యత్నించినను ప్రయోజనము స్వల్పముగనే యున్నది.

శంకర స్థాపిత మఠములలో నతి ప్రాచీనమని చెప్పబడు శృంగేరి పీఠమున నుపయుక్త నిదర్శనము లెవ్వియు గానరావు. ఇంక క్రీ. శ. 1331 సంవత్సరమునుండి 1386 వరకు శృంగేరి పీఠాధ్యక్షుడైన విద్యారణ్యుని ముందు పదునొకండుగురు అధ్యక్షులు మాత్రమే పేర్కొనబడి యున్నారు. అందుచే క్రీ.శ. 773వ సంవత్సరమున విశ్వరూపాచార్యుడు నిర్యాణమునొందుటయు నతడే యీ పరంపరకు ప్రథమాచార్యు డగుటయు గాన నగును. కాని యితడు క్రీ. పూ. 27వ సంవత్సరమున శ్రీ శంకరాదేశమున పీఠము నధిష్ఠించినట్లు శృంగేరి సారము. ఈ సంప్రదాయము ననుసరించి శంకరుడు క్రీ. పూ. 43 వ సంవత్సరమున నవతరించి క్రీ.పూ. 11వ సంవత్సరమున సిద్ధిబొందుట జరిగెను. కాన విశ్వరూపుడు శంకరకాలముననే అనగ శంకరునికి షోడశవర్ష ప్రాయముననే శృంగేరి పీఠాధిపతి యయి నట్లును, పిమ్మట జాగ్రదవస్థ సమారాధ వర్షములు జీవించి నట్లును వ్రాయబడియున్నది. ఈ గణనమున విశ్వరూపుడు క్రీ. పూ. 27వ సంవత్సరమునుండి క్రీ.శ. 773వ సంవత్సరము వరకు అనగా పూర్తిగ 800 వత్సరములు జీవించియుండెనని తెలియుచున్నది. ఇది అసంభవమనియు నా 800 వత్సరములు 80 సంవత్సరములయి యుండుననియు, నందుచే శంకరులు క్రీ. శ. ఏడవశతాబ్దము వారై యుండుననియు భాష్యాచార్యు డూహించెను.53

53. Pandit N.Bhashyacharya: The Age of Sankaracharya, p29.

ఆ పీఠము నలంకరించిన ఆచార్యులలో క్రీ. శ. 9వ శతాబ్దమునకు జెందిన 9వ పీఠాధ్యక్షుడు విద్యాశంకరుడు సిద్ధిపొందినపిమ్మట, సుమారు 600 సంవత్సరములు పీఠము అధ్యక్షులు లేకనుండ, 14వ శతాబ్దమున విద్యాతీర్థుని అభిమతానుసారము విద్యారణ్యుడు తనగురువగు భారతీకృష్ణతీర్థుని పీఠాధిపతిగ గావించెనని కృష్ణస్వామయ్యగారు వ్రాసెను.[54] భారతీకృష్ణతీర్థుడు శంకరానంద, విద్యాతీర్థుల శిష్యుడనియు, నితడు విద్యారణ్యుని సోదరుడనియు దెలియుచున్నది. విద్యాతీర్థుడు కుంభకోణ కామకోటి పీఠాధ్యక్షుడనియు నతడే జీర్ణమైయున్న శృంగేరి పీఠమును విద్యారణ్యునిద్వారా పునరుద్ధరించెనని కొందరి వాదము. కాని విద్యాతీర్థుడు శృంగేరి ఆచార్యుడేయనియు కామకోటి పీఠమునకు దీర్ఘసంప్రదాయము కాదనియు మరి కొందరివాదము కాని క్రీ. శ. 77 వ సంవత్సరమునుండి క్రమరీతి ఆచార్యులు వారికాలమున్ గలిగియుండుటచే దాని ప్రోసి రాజనుటయు భావ్యము కాదు. ఇక మార్గాంతర మెద్దియున్న, శంకరానంతరము యీ పీఠము విశ్వరూపాచార్యునిచే నలంకరింపబడి, అంతట కారణాంతరములచే ప్రసిద్ధిబాసి అధ్యక్షులు లేక క్రీ. శ. 768 వ సంవత్సరమున నిత్యబోధఘనాచార్యుడధ్యక్షుడగు నంతవరకు కాలక్షేపము జేయుచుండవచ్చుననుట ఉచితమేమో! శంకరకాలము ననుసరించి వీని యన్వయములు రూపొందించు టుచితము. ఈ యసంపూర్ణ ఆచార్యపరంపర నాధారముజేసికొని it is easy perhaps to reconcile

---

54. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము. అ. పు. 29

small discripancies and take 788 A.D. as the year of the Guru's birth, as Max Muller does.[55] యిందు గల కొన్ని లోపములసమన్వయించి మాక్సుముల్లరు వచించురీతి శంకరుడు క్రీ. శ. 783 సంవత్సరములో జనించినట్లు వాకొనుట ఉచితమని కృష్ణస్వామి అయ్యరు వాదించును. అట్టి నిర్ణయమునకీ పరంపర అవకాశము నొసంగజాలదని స్పష్టము.

ద్వారకయందు నెలకొనియున్న శారదాపీఠము ప్రకారము శంకరుడు యుధిష్ఠిరశకము 2633 వ సంవత్సర వైశాఖ శుద్ధపంచమినాడు జనించినట్లును, ఆశకముననే 2638 సంవత్సరమున ఉపనయనము, 2639 సంవత్సరమున సన్న్యాసమును, 2640 వత్సరమున గోవిందుని దగ్గర బ్రహ్మోపదేశమును, 2643 సంవత్సర కార్తీకబహుళ త్రయోదశినుండి మాఘశుద్ధ దశమివరకు ద్వారకాపీఠస్థాపనము, 2648 వత్సర ఫాల్గుణ శుద్ధ నవమినుండి శృంగేరీ పీఠప్రతిష్ఠయు, 2649 సంవత్సరము మండనమిశ్రునికి సన్న్యాస మొసంగి ద్వారకా పీఠాధ్యక్షుని గావించుట, 2654 సంవత్సరమున హస్తామలకుని శృంగేరి అధ్యక్షుని గావించుట, 2655 వత్సరమున జగన్నాథమున గోవర్ధనపీఠము ప్రారంభము, పద్మపాదుని ఆచార్యునిగ నొనర్చుట, యుధిష్ఠిరశక 2666 సంవత్సరమున కార్తీక శుద్ధ పూర్ణిమ శంకరులు సిద్ధిపొందినట్లు తెలుపబడియున్నది. అనగ క్రీ. పూ. 505 నందన సంవత్సరమున జనించి క్రీ. పూ. 472 సంవత్సరమున శంకరుడు సిద్ధిపొందినట్లు యీ నిర్ణయము.

---

55. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas. p 12.

పూరీ జగన్నాథ గోవర్ధన పీఠ గురు పరంపర ననుసరించి యుధిష్ఠిర శకము 2655 సంవత్సరము వైశాఖ శుద్ధ దశమి శ్రీ శంకరుడు జగన్నాథ పీఠమును స్థాపించి అందు పద్మపాదాచార్యుని అధిపతిని గావించినట్లు గలదు. కాని మరి యితరవివరములు అభావము. కాని యీ మఠస్థాపన కాలము శారదా పీఠముయొక్క పట్టికకు సరిపోవుచున్నది.

బదరికాశ్రమమునగల జ్యోతిర్మఠము చాలకాలము ఖిలమై యిటీవలనే పునరుద్ధరింప బడియున్నది. దాని గురు పరంపర లభ్యము కాదు.

ఇట్లు శ్రీ శంకర స్థాపితములని ప్రఖ్యాతములైన నాలుగు గాక కాంచీనగరమున గామకోటి పీఠము గలదు. ఇదియు శంకరస్థాపితమే యను వాదు గలదు. దీని ననుసరించి కలియుగాబ్ది 2593 నందన సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి పునర్వసు నక్షత్రమున శంకరు డుద్భవించినట్లు గలదు. పూర్వోక్తరీతి 'పుణ్యశ్లోక మంజరి' కథనరీతి గలిలో 2625 సరియగు రక్తాక్షినామ సంవత్సర అనగా క్రీ. పూ. 477 శుద్ధ ఏకాదశినాడు శంకరుడు బ్రహ్మైక్యము నొందినట్లును తెలుపబడియున్నది. కామకోటి పీఠాధిపతుల సంస్తుతించు 'గురురత్నమాల' ననుసరించియు నిదేకాలములు స్పష్ట పడుచున్నవి.[56]

పై శంకర స్థాపితములనబడు అయిదు మఠములలో శృంగేరి క్రీ. పూ. 43 నుండి క్రీ. పూ. 11 వరకును; కామ

56. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 29.

కోటి క్రీ. పూ. 508–509 క్రీ. పూ. 477 వరకును; ద్వారక క్రీ. పూ. 506 నుండి క్రీ. పూ. 473; గోవర్ధనము దీని ననుస రించియే యుండుట గమనార్హము. ఈ ప్రకారము యీ మత ములు పరస్పర విరుద్ధకాలముల దెల్పుచు స్వసంప్రదాయ ముల సక్రమ పద్ధతి నిలువబెట్టుకొనజాలక దమ మతముల కాధారమైన (శ్రీ) శంకర భగవత్పాదుల కాలనిర్ణయముననే యింతవ్యత్యస్తముగ నుండుట గడుంగడు విచారకరము. స్వసంప్రదాయస్థులే యిటులుండ నిక నన్యుల విషయము నం దాశ్చర్యమావంతయు నవసరములేదు. వారెల్లరు వరిపరివిధ ముల గాలనిర్ణయమును గావించి సమస్యను అధికతర క్లిష్టత్వ మున జిజ్ఞాసువుల ద్రోసివైచిరి. ఆ విషయము నింకను బరిశీ లించెదముగాక.

---

## పురుష సంబంధము

శంకర చారిత్రమున గొందరు రాజులతో మహామహు లతో శంకరునకు సంబంధ మేర్పడినట్లు తెలియుచుండుటచే వారి జీవితకాలము ననుసరించి శంకరు కాలమునుగూడ నిర్ణ యింప సాధ్యమగునేమో యత్నింప నగును.

సుధన్వ మహారాజునుగూర్చి చరిత్రలో ననేక సమయ ముల బ్రస్తావింప బడియుండుటయేగాక శంకరుడుగూడ సుధన్వునిగూర్చి తన రచనములలో సూచించియున్నాడు.

'జినవిజయ' మను జైన గ్రంథము కుమారిల శంకర సుధన్వా దుల దెలిపియున్నది. అందు కుమారిలుని నిందించి, సుధన్వ రాజుగూడ నదే కాలమున నుండెనని దెలుపుచు నతని 'దుష్టః' అని దూషించినది. 'సుధన్వో నామకో రాజా సోపి దుష్ట స్తథా భువి! జినానాం యేన సాధూనాం కృతం కదన మద్భుతం॥' (9. 9) ఆ దుష్ట ప్రభువు సుధన్వుడుగూడ నదే కాలమున నుండెను. వాని కాలమున ధర్మిష్టులగు జైనులు మిక్కిలి హింసింపబడిరి అని తెలిపియున్నది. ఇతడు ద్వారకాధిపతియై యుండి ప్రథమతః జైనమతావలంబకుడై కుమారిల ప్రాబల్యమున దర్వాత వైదిక మతానుష్ఠానపరుడుగ నొనర్పబడెను. అంత యుధిష్ఠిరశకము 2649 వ సంవత్సరము అనగా క్రీ.పూ. 490 వత్సరమున శంకరునకు శిష్యుడయ్యెను. అట నతడు శంకరువెంట నెల్ల చోట్లకు బర్యటించి యుధిష్ఠిరశక 2663 అనగా. క్రీ. పూ. 478 వ సంవత్సరము శంకరుని గూర్చి 'విజ్ఞాన పత్రిక' యను నొక తామ్రశాసనమును బ్రకటించెనని తెలియుచున్నది. కాన నతనికాలము ననుసరించియు శంకరుడు క్రీ. పూ. 500 సంవత్సర ప్రాంత జన్ముడేయని తెలియబడును.

శంకరుడు నేపాళమున కేగి అటగల వృషదేవవర్మ అను బౌద్ధరాజును వైదికమతమున జేర్చినట్లును, అట్లు శాసన మొందు గల్గునట్లును, శంకరప్రసాదలబ్ధుడై కుమారునిగాంచ నాశిశువునకు శంకరవర్మ అను నామ మిడినట్లును చరిత్రము. ఇతడు నేపాళీయ సూర్యవంశ రాజులలో బదునెనిమిదవ వాడుగ నున్నాడు. ఈ వంశము కలిశక 1389 సం॥ నుండి కలిశక 3001 సం॥ వరకు అనగ క్రీ. పూ. 1712 నుండి

క్రీ. పూ. 100 సం॥ వరకు పాలించినట్లును, అంశు వర్మ దేవ వర్మ 18 వ వాడై, శంకరుడు నేపాళమును క్రీ. పూ. 487వ సంవత్సరమున చేర, నాదేశమును పాలించుచున్నట్లు నేపాళ రాజవంశావళి తెలుపుచున్నది. వీరినే పార్వతీయ వంశస్థులనియు నందురు.

చిద్విలాసయతి తన శంకరవిజయములో శంకర కాలమున వారణాశిని రత్నసింహుడను రాజు పాలించుచుండినటుల వ్రాసియున్నారు. శంకరునకు అనుచరుడై యీ రాజు శంకరు గారి నగరముననే యుండగోర, శంకరు డందులకు నిత్యకౌశల పరివ్రాజకత్వమే తనకు ప్రధానముగా జెప్పెనట. కాని యీ రాజుయొక్క కాలము తెలియరాదు.

'కొంగుదేశరాజక్కాల్' అను గ్రంథము శంకరుడు ప్రథమ త్రివిక్రమ దేవుడను రాజును శైవమునకు మార్చినట్లు తెలుపునవియు, నితడు స్కందపురాధీశ్వరుడనియు నందురు కాని యితని కాలము క్రీ.శ. 178 సం॥గ కొందరి తీర్మానము.

శంకరు జననకాలమున కేరళమున పాలించు రాజు రాజశేఖరుడని వాకొనబడినది. ఇతని కాలనిర్ణయ మింకను జేయబడలేదు.

'బృహచ్ఛంకర విజయ' కర్త శంకరుని కాలమున మగధదేశమును 'హాలుడ'ను ఆంధ్రరాజు పరిపాలిచుచుండినట్లు వ్రాసెను. అటులే 'గురురత్నమాలిక' అను గ్రంథముగూడ దెలుపుచున్నది. ఇతడు యుధిష్ఠిరశక 2644 అనగా క్రీ.పూ. 495 నుండి 490 సంవత్సరమువరకు పాలించెనని పురాణ

ప్రమాణముల ననుసరించి కృష్ణస్వామయ్య తీర్మానించెను.[57] ఈ విషయమునే తెలుపుచు కోట వేంకటాచలంగూడ గ్రిందిరీతిగా వ్రాసియున్నాడు. మగధరాజ్య పాలకులైన శాతవాహన వంశ రాజులలో 18 వ వాడైన అరిష్ట శాతకర్ణి కాలములో అనగా కలిశక 2582 నుండి 2608 సంవత్సరము సరియగు క్రీ. పూ. 519 నుండి 494 సంవత్సరములో గ్రీ. పూ. 509వ సంవత్సరమున శంకరులు జనించిరనియు, 21వ చక్రవర్తి యగు పురంద్రసేనుని కాలములో గ్రీ. పూ. 484-463 సంవత్సరములో అనగా గ్రీ. పూ. 477వ సంవత్సరములో సిద్ధిపొందెననియు దెలిపియున్నాడు.[58] ఈ రాజులమధ్యవాడై 19 వ వాడైన హాలుడు క్రీ. పూ. 494-489 సంవత్సర కాలమున బాలించుటచేత నతనికి శంకరు సాంగత్యమేర్పడి యుండవచ్చును. ఇట్లు శంకర కాలమునాటి ప్రభువుల కాలముల జూచియున్నాము. వారికాలముల ననుసరించియు శంకరులు క్రీ. పూ. 500 సంవత్సరప్రాంతముల జనించినట్లు స్పష్టము.

శంకరాచార్య చారిత్రమున నతి ముఖ్యఘట్టములనదగినవి కుమారిల మండనమిశ్రులతో శంకరుని సమాగమము. మండనునిగూర్చి కాలాంతరమున విచారించెదము. ప్రస్తుతము కుమారిలుని గూర్చి చూచెదము. 'జినవిజయ' మను జైనగ్రంథ మూలమున గుమారిలు చారిత్రము కొంత స్పష్టము. 'ఋషిర్వార స్తథా పూర్ణం మర్త్యాక్షౌ వామమేళ

57. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య, చరిత్రము, అ. పు. 36.

58. శ్రీ కోట వేంకటాచలం: కలిశక విజ్ఞానము, భా. 2. పు. 107.

నాత్। ఏకీకృత్య లభేతాంకః క్రోధస్యాత్ తత్ర వత్సరః॥ భట్టాచార్య కుమారస్య కర్మకాండైక వాదినః। జ్ఞేయః ప్రాదుర్భవ స్తస్మిన్ వర్షే యుధిష్ఠిరే శకే॥’ ఋషి=7, వార=7, పూర్ణం=0, మర్త్యాక్షౌ=2. వీనిని త్రిప్పివేసిన 2077 యుధిష్ఠిర శకమున కర్మకాండ ప్రవర్తకుడైన కుమారిలుడు జనించెనని గలదు. జైన బౌద్ధుల యుధిష్ఠిర శకము కలిపిమ్మట 468 వత్సరము తర్వాత ప్రారంభించును గాన కలిశక 3102–468=2634–2077=క్రీ.పూ.557వ సంవత్సరము కుమారిలుని బుట్టుక యని యర్థము[59]. ఇతడు ఆంధ్రోత్కల రాష్ట్రముల మధ్యగల జయమంగళ గ్రామమున, మహానదీతీరమున, ఆంధ్ర జాతిలో చంద్రగుణా యజ్ఞేశ్వరులకు జనించెననియు నాగ్రంథ వాక్యము. చిత్సుఖాచార్య శంకరవిజయమున శంకరులకంటె కుమారిలుడు 48 వత్సరములు జ్యేష్ఠుడని చెప్పబడి యుండుటచే 557–48=క్రీ.పూ. 509 శంకర జనన మనియు విదితమగుచున్నది. శంకరులకు 15 వ సంవత్సరము పూర్తియయిన పిమ్మట కుమారిలు కలిసెననియు నీ గ్రంథమే వాకొనును. జైనవాద ఖండనమునకై ప్రామాణిక గ్రంథ శ్రవణార్థము కుమారిలుడు జైనునివలె ఆమత గురువు నాశ్రయించి పఠించుచుండ, నొకదినమున వారెరెంగి యతని బహిష్కరించి ద్రోయ నతనికి నేత్రమొండు గ్రుడ్డియయ్యెను. అంత నాతడు పట్టుదలతో రాజుల స్వాధీనము గావించుకొని, జైనుల నోడించి వైదికము నెల్లెడల స్థాపించి, దా గావించిన జైనగురు ద్రోహ

59. శ్రీ క్షేమలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 31.

పాపపరిహారార్థము స్వశరీరమును తుషాగ్ని బ్రవేశింపజేసిన కాలమున శంకరు డాతని దర్శించినట్లు చరిత్ర. నాటికి కుమారిలునకు 48+15=63 వత్సరముల ప్రాయముగుచున్నది.[59] అనగా 557-63=494 క్రీ. పూ. సంవత్సరమున నతడు శరీరత్యాగము జేయుచు గర్మమార్గమును వాదింప మండనమిశ్రుని గలుసుకొన శంకరున కాదేశించినట్లును, వెంటనే శంకరు డందేగినట్లును గ్రంథములు తెలుపుచున్నవి. ద్వారకాపీఠ పాఠము ననుసరించి మండనునితో శంకరునకు వాదము యీ కాలముననే జరిగియున్నట్లు వ్యక్తమగుచుండుటచే కుమారిల శంకర సంబంధమునగూడ శంకర జననకాలము క్రీ. పూ. 509 సంవత్సర మనియే నిర్ధారణము అగుచున్నది.

శ్రీ శంకరాచార్యుని గురుపాదులైన గోవింద భగవత్పాదుని కాల నిర్ణయము ననుసరించియు శంకర కాలమును దీర్మానింప నగును. కాని గోవిందుని విషయముగూడ జాల సమస్యలకు లోనై యలరారుచున్నది.

బృహచ్ఛంకరవిజయ కర్త కథనమున గోవిందుడు పూర్వాశ్రమమున జంద్ర శర్మయనియు, నతడే శ్రీహర్ష విక్రమాదిత్యుని జనకు డనియు గలదు. క్రీస్తుకు బూర్వము మాళ్వా రాష్ట్రమును బాలించు బ్రాహ్మణరాజు కొక కుమార్తె గలదు. ఆమెను ఆకాలమున నఖండ విద్వాంసుడై యుండిన చంద్రశర్మకిచ్చి వివాహము జేసెనట. వారికి శ్రీ హర్షవిక్రముడు జనించెను. కుమారుడు రాజ్యపాలనమునకు బూనిన

59. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 31

పిమ్మట నీ చంద్రశర్మ గౌడపాదు నాశ్రయించి సన్న్యసించి గోవింద భగవత్పాదులైనట్లు చరిత్ర తెలుపుచున్నది. గౌడపాదుడు పతంజలినుండి వ్యాకరణమును, శుకబ్రహ్మనుండి బ్రహ్మవిద్యను గ్రహించెనని వీరి వాదము. విక్రముడు నేపాలమునుగూడ పాలించెను. ఇతడు పారసీకులను పారద్రోలెను. ఆ పారసీకులు 'శకే' అను దేశమునుండి వచ్చినవారనుటచే విక్రమునకు 'శకారి' అను బిరుదము ప్రాప్తించెను. ఇతడు కలి 2645 క్రీ.పూ.457వ సంవత్సరములో మరణించెను. నాటినుండి శ్రీహర్షశకమని యొక కాలమానము ప్రారంభింపబడియున్నది. ఇతడుగాక ప్రమరవంశస్థుడైన విక్రమాదిత్యుడను మరొకడు ఉజ్జయినీపాలకుడు గలడు. అతడు క్రీ.పూ. 57వ సంవత్సరమున విక్రమశకమును బ్రారంభించెను. అతనికుమారుడే శాలివాహనుడు. ఈ శాలివాహనుడు క్రీ.త. 54వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఇతడును క్రీ.త. 78 లో శకుల నోడించియుండుటచే నాటినుండి శాలివాహనశకము ప్రారంభింపబడియున్నది. అందుచే శ్రీహర్షశకము క్రీ.పూ. 457 నను, విక్రమశకము క్రీ.పూ. 57 నను, శాలివాహనశకము క్రీ.త. 78 ప్రారంభింపబడినట్లు చరిత్ర. కాన నీ గణనము ననుసరించి యీ గాథ సత్యమైనచో, ననగా జంద్రశర్మయే గోవిందుడైనచో, ద్వారకా సంప్రదాయము ననుసరించి శంకరుడు గోవిందునిదగ్గర యుధిష్ఠిరశక 2640 అనగా క్రీ.పూ. 498వ సంవత్సరమున తన పదవయేటనే సన్న్యసించినట్లు తెలియుచున్నది.

గోవిందుని ఈ చరిత్రయేగాక మరియొక విచిత్రగాథయు గలదు. పూర్వాశ్రమమున జంద్రశర్మయనబడు నీతడు గౌడ

పాదునివద్ద వ్యాకరణభాష్యాదుల నభ్యసించి, తర్వాత నాలుగు వర్ణములలో నలుగుకుకన్యల బరిణయమాడి, వారివలన క్రమముగ వరరుచి, విక్రమాదిత్య, భట్టి, భర్తృహరుల గాంచెననియు నొకగాథ. అందు వరరుచి పాణినికి సహాధ్యాయుడై ప్రఖ్యాతి నొందిన వ్యాకరణవేత్త యయినట్లును, విక్రమార్కుడుజ్జయిని చక్రవర్తిగా బ్రఖ్యాతి నొందినట్లును, భట్టి మహాకవియై విక్రమార్క ఆస్థానమున జెల్వొందినట్లును, భర్తృహరియు 'వాక్యపది' మొదలగు వ్యాకరణగ్రంథములను శతకములను సృజించి ప్రఖ్యాతకవిగను విద్యావేత్తగను రూపొందినట్లు యీ గాథమూలమున దెలియుచున్నది.[60] ఈ విషయమును భాష్యాచార్యులు ప్రస్తావించి The tradition that Govindabhatta was the father of Vikramaditya does not rest on any evidence.[61] గోవిందుడు విక్రమాదిత్యుని జనకుడను సాంప్రదాయికమైన వాడుక ప్రమాణబద్ధముగాదని, భట్టి భర్తృహరులు సోదరులు కాకుండుటయే గాక వారు,వారిరచన ప్రమాణముల ననుసరించి చూచినచో వివిధకాలములకు జెందినవారనియు వక్కాణించెను. ఆ గోవిందభట్టు సన్న్యసించి గోవిందయోగి అయినట్లును అగోచరమునియు నతని వాదము. ఈ చారిత్రము రామభద్రదీక్షితకృత పతంజలి చరిత్రలో గూడ గలదు. పతంజలిశాపతప్తుడైన గౌడపాదుడు

---

60. శ్రీ క్షేమలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. పు. 4.

61. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 28.

బ్రహ్మరక్షస్సుగ మారి, సమర్థునికి దనవ్యాకరణ భాష్యమును బోధించినపిమ్మటనే శాపవిమోచనమని గురువైన పతంజలి ఆదేశమగుటచే ఉత్తరదేశముల గ్రుమ్మరుచు జంద్రశర్మను గాంచి, అతనికిబోధించి శాపవిమోచనము నొందెననియు నా చారిత్రములో నభివర్ణితము. అట్లు గౌడునివద్ద అధ్యయనము గావించినపిమ్మట చంద్రశర్మ నల్గురు భార్యల స్వీకరించుట యుక్తిబాహ్యముగ నున్నది. అంత మరల విరక్తుడై బదరికా శ్రమమునగల గౌడు నాశ్రయించి అతను సన్న్యసించినట్లు చెప్పబడినను పతంజలిచరితలో బ్రహ్మరక్షస్సు చంద్రశర్మ కుప దేశించిన వెను వెంటనే స్వరమును బొంది నల్గురుపటచే మరల గోవిందుడు గౌడునట్లు ఆశ్రయించెననుసందేహము గలుగక మానదు.62 అందుచే ఆ బ్రహ్మరక్షస్సు గౌడపాదుడు గాదను సంశయముకూడగలదు. కాన నీగాథ హాస్యాస్పదమని గొందరిభావము.

పై గాథల ననుసరించి చంద్రశర్మ గోవిందపాదుడై నర్మదా నదీతీరమున అమరేశ్వరమున శిష్యులకు బోధించు చుండి నర్మదాద్వీపమైన మాంధాతద్వీపమున క్రీ. పూ. 494 లో సిద్ధిపొంద, నట గోవిందాచార్యునపుత్రుడైన విక్రమా దిత్యుడు ఓంకారనాథ దేవాలయమును నిర్మించి ప్రతిష్ఠించె ననియు తెలియుచున్నది.63 శ్రీహర్ష విక్రమాదిత్యుడు ఉజ్జయినీ చక్రవర్తియయి శకుల నోడించి క్రీ. పూ. 457 లో

62. MSS. of S. M.

63. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము అ. పు. 5

నొక శకమును బ్రారంభింప, గుప్తవంశ చక్రవర్తియయిన చంద్రగుప్తుడుకూడ విక్రమాదిత్యబిరుదమును గలిగియుండి, పారశీకుల బారద్రోలి క్రీ. పూ. 270 లో మగధాధిపతిగ నుండెను. మరల మాళవదేశాధిపతియైన విక్రమాదిత్యుడు క్రీ. పూ. 57వ సంవత్సరమున పట్టాభిషిక్తుడై నూత్నశకము నారంభించియుండెను. ఈరీతిగ ఇర్వురు విక్రమాదిత్య నామ ధారు లుండుటచే చరిత్రకారులకు గొప్ప క్లిష్టత్వ మేర్పడి యున్నది. ఇదమిత్థమను నిశ్చయమునకు రా గష్ట మేర్పడు చున్నది. అందుచే చంద్రశర్మయే గోవిందు డనుటకు బలీయ మైన ప్రమాణ మభావమేమో యని దోచుచున్నది. అయిన నీ గోవిందపాదు డెవడు? ఇంకను అనిర్ణీత విషయమేనా? ఇతనికి గోవిందభట్టు అను నామముండుటచే నది పూర్వాశ్రమ నామమై యుండి. ఆశ్రమస్వీకరణానంతరము భగవత్పాద శబ్ద ముతో గోవింద భగవత్పాదాచార్యుడై యుండునేమో! పూర్వాశ్రమమున శంకరనామము గలవాడు తురీయాశ్రమ మున శంకరభగవత్పాదులై యుండుట విదితమే గదా!

ఇంతవరకు శంకరజీవితమున సంబంధించియున్న కొందరు వ్యక్తుల జీవితకాలములను జూచియున్నారము. గోవిందుడే చంద్ర శర్మ అయి యుండినచో శంకరజననకాలము పూర్వమువలెనే క్రీ. పూ. 500 ప్రాంతములకు బోవుననుటకు సందియములేదు. అట్లు కాదేని గోవిందునిద్వార శంకర కాలనిర్ణయము గాక శంకరునివలన నతని కాలనిర్ణయ మేర్పడుటయే జరుగును.

ఇంతవరకు జరిగిన మీమాంస శంకర జీవితసంబంధ వ్యక్తులగూర్చి వారికాలములద్వార శంకర కాల నిర్ణయము.

ప్రస్తుతము శంకరకృత గ్రంథముల బ్రస్తావింపబడిన కాల నిర్ణయావకాశము నొసంగు విషయముల బరిశీలించెదముగాక.

సుధన్వప్రభువును గూర్చి మఠామ్నాయాది గ్రంథములలో శంకరుడు ప్రస్తావించియున్నట్లును, అతడు ద్వారకా దేశాధిపతియై క్రీ.పూ. ఐదవశతాబ్దిలో నున్నట్లును పూర్వము గాంచియున్నారము. అటులే 'న హి వంధ్యాపుత్రో రాజా బభూవ ప్రాక్పూర్ణవర్మణోఽభిషేకాదిత్యేవం' (బ్ర. సూ. భా. 2.1.18) పూర్ణవర్మ పట్టాభిషిక్తుడు కాకపూర్వము వంధ్యాపుత్రుడు రాజు కాడు. 'సర్వగుణసంపన్నే పూర్ణవర్మణి రాజన్వ సతతో తద్వత్' (ఛాం. భా. 3.19.1) సర్వగుణసంపన్నుడైన పూర్ణవర్మ లేనిచో నతని రాజ్యమే లేనట్లగునను చందము అనియు పూర్ణవర్మనామము ప్రస్తావింపబడియున్నది. అందుచే శంకరుడు ఆ ప్రభువుకాలము వాడను వాదము గలదు. ఈ పూర్ణవర్మ నామమును శాస్త్రగ్రంథముల బ్రథమతః గుర్తించిన తెలాంగు పండితుడు, శంకరుడు పూర్ణవర్మ పట్టాభిషేకమును సూచించెనుగాన నతడా కాలమువాడై యుండునని యూహించుచు పట్టాభిషేకమునుగూడ శంకరుడు తిలకించి యుండుననియు భావించి, రాజవంశావళుల బరిశీలించి ఇరువురు పూర్ణవర్మల గాంచెను. అందు ఒకడు జావాద్వీపమును పాలించియున్న యతడు. అతడు భారతమునకు జెందినవాడు కాకుండుటచే, శంకరు డాతని విషయ మిందు ప్రస్తావించుట అహేతుకము, ఇక ద్వితీయుడో, హ్యూయాంగ్ సాంగ్ అను చైనాపండితునిచే వాకొనబడియుండుటచే షుమారు క్రీ. శ. 540 ప్రాంతము వాడగుటచే శంకరుడును అదేకాలమువాడై

యుండునని తెలాంగు భావించియుండెను.64 శశాంకుడను రాజు బౌద్ధులకు ప్రాణప్రదమైన బోధివృక్షమును నరికివేయ, అశోకవంశమునకు కడపటివాడైన యీ పూర్ణవర్మ చింతించి, దానిని 1000 ఆవుల పాలతో నభిషేకించి, చిగిరింపచేసి, దాని రక్షణార్థము చుట్టును 24 అడుగుల ఎత్తు గోడను నిర్మించి నట్లును అది హియాంగ్‌సాంగ్ నాటికి 4 అంగుళులు జీర్ణించి నట్లును హియూంగ్‌సాంగ్ గాథ. అందుచే పూర్ణవర్మ హియాంగ్‌సాంగులకు మధ్య కాలవ్యవధి ఎక్కువగనేయుండును గాన శంకరుడు ఆనాటివాడు అనగా క్రీ. శ. 590 ప్రాంతము వాడు కాజాలడని భాష్యాచార్యులు వక్కాణించెను.65

మరియు పూర్ణవర్మనామముతో రాజవర్మనామము కూడ భాష్యమున స్మరింపబడియుండుటచే నారాజు ఎవరో గ్రహింపవలసియున్నది. కాని అప్పుడట్టి రాజెవ్వరును అగోచరము. అంతియగాక 'పూర్ణవర్మ' శబ్దమునువలె వసుమిత్ర, దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్ర శబ్దముల 'న హి వసుమిత్రో వంధ్యాపుత్రవదనభాసత ఇతి కశ్చిదాచక్షీత' (బ్ర.సూ.భా. 2. 2.28) వసుమిత్రుడు వంధ్యాపుత్రునివలె భాసిల్లుచున్నాడని ఎవ్వడు చెప్పడు గదా! 'దేవదత్త యజ్ఞదత్తౌ మందప్రజ్ఞౌ విష్ణుమిత్రస్తు మహాప్రజ్ఞః' (బ్ర.సూ.భా. 3. 4. 20) దేవదత్త యజ్ఞదత్తులు మందప్రజ్ఞులును విష్ణుమిత్రుడు మహాప్రజ్ఞుడనను వ్యవహారము యుక్తముగాని దేవదత్త యజ్ఞదత్తులు మందప్రజ్ఞులు,

64. Dr. K. T Telang: Sankaracharya.

65. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 38.

వీరిలో నొకడు మహాప్రజ్ఞుడు నతు వ్యవహారము యుక్తము కాదుగదా అని భావవివరణసంబంధమున శంకరుడు యీశబ్దముల నుపయోగించియున్నాడు. ఈ నామములు సాక్షాత్తు వ్యక్తుల నామములుగాక ఉదాహరణమునిమిత్తమై యుపయోగింపబడు సర్వనామములై యుండుట ప్రత్యక్షము. అట్లే ప్రాగ్వ్యక్త పూర్ణవర్మ రాజవర్మనామములు సందర్భోచితముగ నుపయుక్తమయిన పదజాలమే గాని వానికి ఎట్టి వ్యక్తితో సంబంధముండవలసిన అవసరములేదని దోచుట సహజము.

అదేవిధముగ 'న హి దేవదత్తః స్రుఘ్నే సన్నిధీయమాన స్తదహరేవ పాటలీపుత్రే సన్నిధీయతే' (బ్ర.సూ. భా. 2. 1. 18) స్రుఘ్నమున సన్నిధీయమానుడగు దేవదత్తుడు ఆ కాలముననే పాటలీపుత్రమున సన్నిధీయమానుడు గాడుగదా అనువాక్యమున స్రుఘ్న గ్రామ పాటలీపుత్రము లుదాహరింపబడియున్నవి. అందుచే శంకరు డా స్థలము లుండిన కాలములో నుండియుండునని తోచును. కాని పాటలీపుత్రము హిందూదేశమునకు ముఖ్యనగరముగనుండి పతంజలి మొదలైనవారిచే సంస్తుతింపబడినది. క్రీ. శ. 750 వ సంవత్సరమున నది గంగచే ముంపబడినది. ప్రస్తుత పాట్నానగరము గ్రీ. శ. 1541 లో నుద్ధరింపబడినట్లు ఆధునికచరిత్రము. అటులే స్రుఘ్న నగరము థానేశ్వరముదగ్గర యమునచెంతనే యుండినట్లు, నేడది సుఘ్ అనబడినదనియు జరిత్రకారుల కథనము. ఈ రెండు పట్టణము లభ్యుస్థానములనుండి శంకరుచే ప్రస్తావింపబడి యుండెను. గ్రంథముల నుదాహరించి యున్నంతమాత్రమున గ్రంథకర్త ఆ నగరివాడనుట అనుచితము. అంతియగాక నా

6

నగరద్వయము నశింపక బూర్వమనుటచే నా కాలనిర్ణయము క్రీ.తర్వాతనేయని సిద్ధాంతింప నవసరము గానరాదు. అవి క్రీ. పూర్వమే మహాప్రాభవతపదమునుండి యుండనగును గదా! అందుచే నీ పట్టణనామ ప్రస్తావనమాత్రమున శంకరు కాలనిర్ణయము కానేరదనియే తాత్పర్యము.66

ఈ రీతి శంకర గ్రంథస్థమైన వ్యక్తుల పట్టణముల నామములద్వారమునైనను శంకరుకాలనిర్ణయ మసాధ్యమనియే స్పష్టమగుచున్నది. అందుచే బూర్వోక్తచందము శంకర విజయాది చారిత్రక గ్రంథముల ననుసరించిగాని, శంకరకృత గ్రంథముల విచారించిగాని శంకరుకాలము కష్టసాధ్యమగు చున్నదనుట సువిదితము. అయినను ఈ యూహాగానము లన్నింటికంటె శంకర స్థాపిత మఠసంప్రదాయము లన్నియు నేకోన్ముఖముగ క్రీస్తుకు బూర్వకాలమునే సూచించుచుండు టచే, సుధన్వ, కుమారిలాదివ్యక్తుల కాలముగూడ క్రీస్తుకు బూర్వత్వమునే అనుసరించుచుండుటచే, శంకరుడు క్రీ. పూ. 500 ప్రాంతములవాడనియే దోచును. అదియు క్రీ. పూ. 509 అనియే తీర్మానించుట ఉచితమనియు విదితము.

---

## ఆధునిక పండితాభిప్రాయములు

పై విషయముల సాకల్యపరీక్షగావించి కుంభకోణ కళాశాలలో నుపన్యాసకుడైన ఎన్. కె. వేంకటేశ్వరయ్యర్

66. శ్రీ కోట వేంకటాచలం: కలిశక విజ్ఞానము, ౩. పు. 58.

తన 'శ్రీ శంకరాచార్య-వారి కామకోటిపీఠము' అను గ్రంథమున,[67] టి. యస్. నారాయణఅయ్యర్ తన The Age of Sankara 'శంకర కాలము' అను గ్రంథమునను,[67] కోట వేంకటాచలం తన కలిశక విజ్ఞానమునను శ్రీ శంకరుడు క్రీ. పూ. 509 వ సంవత్సరముననే జనించినట్లు నిశ్చయించిరి.[67] అటులే రాజవైద్య జి. కె. శాస్త్రి తన భగవద్గీతలో శంకరుడు 2500 వత్సరములకు పూర్వుడని తెల్పియున్నాడు.[68]

గౌతమబుద్ధుడు అయిదవ శతాబ్దమున ఏసుకు పూర్వ మున్నట్లు తలంచి, బుద్ధనిర్యాణానంతరము 80 వత్సరములకు శంకరు డుద్భవించినట్లు అనిబిసెంటు వ్రాసినట్లు తెలాంగు తెలిపియున్నాడు.[69] అనగా బుద్ధ శంకరు లొకే శతాబ్దమునకు జెందినవారగుచు, ఇరువురును క్రీ. పూ. 500 ప్రాంతముల వారేయని ఆమె తీర్మానము. కాని బుద్ధకాల నిర్ణయము ఇంకను అస్థిరమే. క్రీస్తుకు పూర్వము 1887 వ సంవత్సరము అతడు జనించి 1807 లో నిర్యాణమునొందినట్లు గొందరు గట్టిగా వాదించుచున్నారు.[70] కాన బుద్ధునితో శంకరుకాలమును ముడివెట్టి తీర్మానించుటయు ప్రమాద భూయిష్ఠముగ నేయున్నది.

---

67. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 2, పు. 9.

68. Rajavaidya G. K. Shastri : Sri Bhagavadgita, p 16.

69. Dr. Annie Besant : Sankaracharya of S. S. S. Sastry, Note

70. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 2, పు. 35

వ్యాస శుక గౌడ గోవింద శంకర రూపముగా గురు పరంపరయగుటచే బాదరాయణుడు గౌడపాదునకు పరాత్పర గురు వగుచున్నాడు. పతంజలిసూత్రములకు వ్యాసభాష్య ముండుటచే నతడు పతంజలి అనంతరమనియు, బతంజలి క్రీ. పూ. 100 లకు జెందినవాడనియు, కాన నతనినుండి అయి దవవాడైన శంకరుడు గ్రీ. త. మొదటి శతాబ్దమునకు జెంది యుండుననియు దలంచి, గ్రీ. త. 700 సంవత్సరము దోష భూయిష్ట మనియు ఆచార్య వి. బి. Athavale అథవేలు భావించెను.71 ఈ నిర్ణయము షిమోగలోని శంకరపీఠసంప్ర దాయానుసారమనియు, నందు శంకరుడు విక్రమశకము 107 వ సంవత్సరమున సిద్ధిపొందెననియు, నందుచే నది క్రీ. త. 50 అగునని అతనివాదము.71 కామకోటిపీఠమున 67 గురు, ద్వారకాపీఠమునకు 72 గురు గురుపరంపరలో గోచరించుటచే గ్రీ. త. 1911 నుండి గణించినచో దరమునకు 25 సంవత్సర ములవంతున సుమారు 1850 వత్సరములు లెక్కకు వచ్చుటచే శంకరనిర్యాణము గ్రీ. త. ప్రథమశతాబ్దమగుచున్నదనియు నతని నమ్మకము.71 కాని యీ నిర్ణయపద్ధతి ఆదినుండి దోష సహితముగనే యున్నది. ప్రథమతః వ్యాస గౌడపాద సంబం ధము అంతసన్నిహితము కాదు. బాదరాయణవ్యాసుడు, పతంజలి యోగభాష్యకర్తయు నొకరనుటకు అవకాశము అభావము. అందుచే సూత్రకర్త అయిన బాదరాయణ వ్యాసుడు కలియుగప్రారంభమున నున్నవాడని నిర్ణయము గాన నతడు క్రీ. పూ. 3102 లకు బూర్వుడైయున్నాడు. అత

71. Prof. V. B. Athavale: Prabuddha Bharata, 1957 p. 296

నికి గౌడపాదునకు చాలదూరము. కాన బాదరాయణు ననుసరించి 5 తరములు లెక్కించు శంకర కాలనిర్ణయము చాల అహేతుకము. అంతియగాక పూర్వము మనము చూచినట్లు కామకోటి పీఠసంప్రదాయము క్రీ.పూ. 509 అనియు, ద్వారకా పీఠమువారు క్రీ. పూ. 505 అనియు దీర్మానించియుండ నిక అసంపూర్ణములైన పరంపరల ననుసరించి లెక్కించుట అసమంజసము. కాన శంకరుడు క్రీ. త. ఒకటవ శతాబ్దమువాడు కానేరడు.

శంకరుడు తన 'తత్త్వవార్తిక' ములో 'కాళిదాసు'ను స్మరించియుండుటచే కాళిదాసు తర్వాతనే శంకరుడు జనించె నని బడును. కాని కాళిదాసు విక్రమాదిత్యుని ఆస్థానములో అష్టదిగ్గజములలో నొక డగుటచే నేవిక్రముని ఆస్థానమున అను సంశయము సహజముగనే యేర్పడును. విక్రము లనేకులుగదా! విక్రమాదిత్య శకము అనునది క్రీ.పూ. 56 న గలదుగాన శంకరుడు అంతకు బూర్వ ముండెననుట జెల్లదను Fergusson ఫెర్గూసన్ వాక్యమును ఆధారముగ గైకొని శంకరుడు క్రీ. పూ. 43 అని సమ్మతించుచు, Charles Johnston F.T.S చార్లెసు జాన్‌స్టన్ భావించెను. కాని అదియు నహేతుకముగనే తోచును. విక్రమాదిత్యులును కాళిదాసులు ఒకరుగా నుండకుండుటయే కారణము.

'కేరళోత్పత్తి' అను గ్రంథము శంకరుని క్రీ. త. 400 వత్సరముల నున్నవాడుగను, కేరళమున రాజుగనుండి ఇస్లాము మతమును స్వీకరించి, మక్కాలో మరణించిన చారుపెరుమాళ్ కాలమునాటివాడనియు, శంకరుడు 38 వత్సరములు

జీవించినట్లును వచించినది.[72] కాని దీని దోషయుక్తముగ భాష్యాచార్యులు వ్రాసిపుచ్చెను.[72] నాలుగువర్ణముల శంకరుడు డెబ్బదిరెండుగ విభజించెననియు, కేరళదేశచారిత్రమును శంకరుడు విరచించినట్లును యీ గ్రంథము వ్రాసియున్నది. కాని చార్లెస్‌మాల్ యొక్క మక్కాన్జీపై క్రీ. త. 838 అని లిఖింపబడి యుండుటచే నీ కథనము విశ్వసనీయముకాదు. ఈ గ్రంథము అభూతకల్పనాయుక్తమని పండితాభిప్రాయము.

ఎన్. భాష్యాచార్యులు విశిష్టాద్వైతావలంబకుడై యున్నను, జిజ్ఞాసువై విషయముల కూలంకషముగ బరిశీలించి, పాశ్చాత్య నిర్ణయములు అసత్యములని విశ్వసించి, విచారించి, క్రీ. త. నాల్గవశతాబ్ద మధ్యమునుండి ఆరవ శతాబ్దము ఆఖరువరకుగల నీమధ్యకాలమున శంకరుడుండి యుండుననియు, నందుచే క్రీ. త. అయిదవశతాబ్దములో నుండి యుండుననియు నిర్ధారించెను.[73] కాని ఇదమిత్థమని అతడు తీర్మానింపలేకపోవుటయేగాక, సాంప్రదాయిక కాలముల ద్రోసిపుచ్చుటకు గారణముల నాతడు జూపలేదు. పరంపరలు లోపభూయిష్ఠముగనున్నను, శంకరమఠములన్నియు నేకోన్ముఖముగ క్రీ. పూర్వకాలమునే శంకరుకాలముగ జూపుచుండ దానిని గాదనుటకు బ్రబలకారణము గానుపింపదు.

పూర్వము మీమాంసింపబడిన పూర్ణవర్మ ప్రస్తావన నాధారముగనొని, క్రీ. త. ఆరవశతాబ్దాంతమున శంకరు

---

72. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 3–9.

73. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 48.

ఉండునని కాశీనాథ త్ర్యంబక తెలాంగు ఊహించెను 74 అపూర్ణవర్మ చారిత్రకపురుషుడు కానేరడని పూర్వము వ్రాసియున్నాను. కాని అట్టి అవిస్పష్ట ఆధారములపై నాధారపడి కాలనిర్ణయము గావించుట అనుచితము.

తారానాథుడు రచించిన బౌద్ధచరిత్రమును ఆధారముగ గైకొని, Dr. Fleet డాక్టరు ఫ్లీట్ క్రీ. శ. 7 వ శతాబ్దమున శంకరు డుండెనని వాకొనెను. ఈ కాలమునే డాక్టరు Burnel బర్నెల్ కూడ సమర్థించెను. కాని యా గ్రంథము అనేక లోపముల గలదగుటచే నప్రమాణమని భాష్యాచార్యులు త్రోసిపుచ్చెను.75

పై జూచిన కల్లోలిత మీమాంసలో it is safest to assume that Sankara flourished some time between the middle of the 7th and the first quarter of the 9th century.76 క్రీ. శ. ఏడవశతాబ్ద మధ్యమునుండి 9 వ శతాబ్దము ప్రారంభమధ్యలో శంకరుడుండినట్లు సమర్థించుట క్షేమమనియు, క్రీ. శ. 788-820 వరకు గల కాలము గాదనుటకు ప్రబలకారణములు గానరావనియు, సూర్యనారాయణశాస్త్రి వ్రాసెను. ఈ కాలమును Teile టైలి పండితుడు ప్రతిపాదింప Pathak పథక్ పండితుడు బలపరచె

74. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas. p 13.

75. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము. అ. 2, పు. 11

76. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 9

నని యు నతడు వ్రాసెను. అనగా Itsing ఇటసింగ్ సూచించిన భర్తృహరి కాలమునకును అనగా క్రీ. త. 600-650, వాచస్పతిమిశ్రుని కాలమునకును అనగా క్రీ. త. 841 మధ్యలో శంకరకాలమని నమ్మకమును వ్యక్తపరచెను.77 ఎక్కువ విచారణము ననుసరింపకయే ఎ. బి. కీత్78, ఏ. ఏ. మాక్డోనెల్,79 ఆచార్యఎర్నెస్టు హార్విట్జ్,80 కె. బి. పథక్,81 ఆచార్య ఎఫ్. మాక్సు ముల్లరు,82 ఆచార్య వెబ్బర్,83 ఆచార్య విల్సన్,83 సురేంద్రనాథ దాసు గుప్త,84 నాగపూడి కుప్పుస్వామి అయ్య,85 భండార్కర్,86 మొదలగు పండితు లందరు యీ కాలమునే సమర్థించిరి. వీరందరికి బెల్గాంలో గోవిందభట్ట ఎల్లేకరు అను నతని దగ్గర దొరికిన

---

77. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 6.
78. Dr. A. B. Keith: A History of Sanskrit Literature, p 476.
79. Dr. A. A. Macdonell: The History of Sanskrit Literature p 402.
80. Prof. Earnest P. Horrwitz: Buddhists in Disguise, V K. 1932.
81. K. B. Pathak: The Antiquity.
82. Prof. F. Max Muller: India, What It Can Teach Us, p 360.
83. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము అ. 2, పు. 11
84. Prof. Surendranath Das Gupta : A History of Indian Philosophy, Vol. 1 p 431.
85. మహామహోపాధ్యాయ శ్రీ నాగపూడి కుప్పుస్వామి శాస్త్రి: శంకరాచార్య చరిత్ర.
86. Prof. Surendranath Das Gupta: A History of Indian Philosophy, Vol 1 p 423.

మూడు పుటల వ్రాత ప్రతిగ్రంథము. శంకరుడు కలి 3887 లో అనగా క్రీ. త. 788 లో జనించి కలి 3921 అనగా క్రీ. త. 820 లో సిద్ధిపొందినట్లు గోచరించుట ప్రబలకారణమైయున్నది. కాని ఆకాలము కామకోటి శంకరాచార్యుల కాలము అని పూర్వమే చూచియున్నారము. కావున కృష్ణస్వామిఅయ్యరు యీవిషయ సమీక్షగావించుచు, శంకరుడు ఆరవశతాబ్దము వాడని గొందరు క్రీ. త. 788 వాడని గొందరు భావించు చున్నారు గాని, It need hardly be observed that nothing conclusive has been arrived at by either party, nor is it likely to be until better data becomes available.[87] ఈ యిరుపక్షములలో నెవ్వరును ఒకనిర్ధారణమునకు రాలేదని స్పష్టము. ఈ కాలముకంటె మరియొక సముచిత కాలము నిర్ణయింపబడువరకు యీ కాల నిర్ణయము అనిర్ధారితమే అని వక్కాణించియున్నాడు.

శంకరులు ఒక్కరుగాక అయిదుగురు గలరనియు, నందు ప్రథముడాది శంకరుడు కాలటి గ్రామమందు జనించి, కాలాంతరమున భాష్యముల రచించెననియు, ద్వితీయుడు కామకోటిపీఠమునలంకరించిన ఏడవ ఆచార్యుడైన కృపాశంకరు డనియు, నితడే షణ్మతాచార్యుడై ఆయామతముల నుద్ధ రించుటయేగాక శృంగేరి శిథిలావస్థలోనుండ దాని నుద్ధరింప తనశిష్యుడైన విశ్వరూపాచార్యుని నియోగించెననియు, (ననగా వీరి దృష్టిలో విశ్వరూపుడు సురేశ్వరుడు కాదనిభావము) అంత

87. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p.12.

ద్వితీయశంకరుడు కేరళరాజగు కులశేఖరుని ఆశీర్వదించిన కామకోటిపీఠమునకు 14 వ ఆచార్యుడైన ఉజ్జ్వల శంకరాచార్యుడనియు, అటుతే సొల్లవవాసు కామకోటిపీఠమునకు 18 వ ఆచార్యుడైన మూకకవి అని ప్రఖ్యాతి నొందిన మూక శంకరేంద్ర సరస్వతి అనియు, నిక నైదవవాసు కామకోటి పీఠమునకు ౩౮ వ ఆచార్యుడుగ నధిష్ఠించిన అభినవశంకరాచార్యుడనియు Sri Sankaracharya and His successors at Kanchi '(శ్రీ) శంకరాచార్యులు కంచిలో వారి అనుచరులు' అను గ్రంథమున బేర్కొనిరి.౩౮ ఈ అయిదవ శంకరుడే క్రీ. త. 788 లో చిదంబరక్షేత్రమున తండ్రి విశ్వజిత్తు మరణించిన తర్వాత విశిష్టాగర్భమున గజగర్భముద్వార జనించినవాడని ఇతని వాదము. కాశ్మీరములో సర్వజ్ఞపీఠము నలంకరించి హిమాలయముల దత్తగుహలో నదృశ్యమైనదిగూడ నీశంకరుడే అని యితని నమ్మకము. కాని యీ వాదము ఎంతవరకు సముచితమో విచారణీయము. ఆదిశంకరుడే షణ్మతస్థాపకుడని ప్రఖ్యాతి. అతడే సర్వజ్ఞపీఠము నధిష్ఠించినట్లు సంప్రదాయ మగుడి.

కాని క్రీ. త. 788 లో జనించిన శంకరుడు సుప్రసిద్ధుడై యుండుటయు, కాలాంతరమున, ననగా నీ శంకరవిజయ గ్రంథములుగాని, బెల్గాములో లభించిన 24 పంక్తుల వ్రాత గ్రంథముగాని 13 వ 14 వ శతాబ్దములలో విరచితము లగుటచే, క్రీస్తు పూర్వ శంకర జీవిత విశేషముల, క్రీస్తు అనంతర శంకర జీవితమునకు అన్యోన్యమేళన మేర్పడి నాటి దేశమునగల వాడుక గాథల జేర్చి రచయితలు వ్రాయుటచే

---

38. MSS. of S. M.

నింత సంక్షోభము శంకర భగవత్పాదుల జీవితములో నేర్పడియున్నది. శంకర పీఠాధిపతులందరును ప్రత్యేక నామముల గలిగియున్నను, శంకరాచార్య బిరుదమును గలిగియుండుటయను నీ కలవరమునకు ముఖ్యకారణముగ గానుపించుచున్నది. ఈ సుప్రఖ్యాతుడైన యీ యుగపురుషులో నెవరెవరే కార్యముల గావించినదియు దీర్మానింప గష్టసాధ్యము. ప్రథముడు ఉపన్యాసకుడు వాది మాత్రుడై అద్వైతమును స్థాపింప, ద్వితీయుడు భాష్యాది గ్రంథ రచనము గావించి దాని సుస్థిరత్వము నేర్పరచినట్లు అనిబిసెంటు, లెడ్బీటరులు అభిప్రాయ పడియున్నారు.[89] ఏదెట్లున్నను ఆదిశంకరుడు క్రీస్తుకు పూర్వము 509 సంవత్సరమునందే కాలటి గ్రామమున శివగురు ఆర్యాంబలకు జనించి, దేశపర్యటనము గావించి, కర్మ బౌద్ధాదివాదుల జయించి, రాజుల ప్రాపకమున అద్వైత సిద్ధాంతస్థాపనము గావించి, ౩౨వ ఏటనే సిద్ధిపొంది చరితార్థతను బొందెనని దీర్మానించుటయే యుచితము. ఆమహానీయుని జీవితగాథను నిక సూక్ష్మముగ జూచి ఆనందించెదముగాక!

---

89. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 2, పు. 12

# శ్రీ శంకర జీవిత చరిత్ర

## జన్మభూమి

శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయం।
నమామి భగవత్పాదం శంకరం లోక శంకరం ॥

శ్రుతి స్మృతి పురాణాదిశాస్త్రములకు నిలయమైన వాడును, కరుణాన్వితుడును, లోకమునకు సుఖప్రదాతయు నైన శంకర భగవత్పాదాచార్యులకు నమస్కరించుచున్నాడను.

'యైరిమే గురుభిః పూర్వం పదవాక్య ప్రమాణతః।
వ్యాఖ్యాతాః సర్వవేదాంతా స్తాన్నిత్యం ప్రణతోఽస్మ్యహం॥'
( తై. భా. 1.1 ) శాస్త్రవాక్యముల ప్రమాణముగ గైకొని అనువగు తర్కములో సర్వవేదాంతములకు బూర్వము వ్యాఖ్యానముల నిర్మించి యుండిన గురు లోకమునకు నమస్కరించుచున్నాను అను చందము మానవ బుద్ధి కతీత కాలమున జనించి, యావత్ప్రపంచమున అభ్యుదయ కారణమును, పశుత్వమునుండి పరిణమించి మానవత్వమునకును, మరల నందుండి దేవత్వమునకు నభివృద్ధిగాంచి, సర్వ భౌతిక సృష్టి కతీతమైన చిన్మయానందరూప 'అహం బ్రహ్మాస్మి' స్థితిలో సామాన్య మానవుడుగూడ సంస్థితుడై యుండుట కెల్ల నదుపాయముల బ్రసాదించి, అనాదికాలమునుండి నేటివరకు నా యాధ్యాత్మిక

స్రవంతి నవిచ్ఛిన్నలీల బోషించుచున్న మన వేదాంతాంతర్గత ఉపనిషద్వాహిని నెంతని పొగడగలము! భారతమాతృ అదృష్టమో అనునట్లు ఆ ఆధ్యాత్మిక వాహినితో దా నవినాభావ సంబంధమును బొందించుకొని, నా నిత్య స్రవంతిని తన యందే జనింపజేసి, అందేపోషించి పెంచి, తనయందే సుస్థిరత నుండజేసి, తన నుండియే నీమానవాభ్యుదయ కారక మహా వాహినులు ప్రపంచమంతటను మారుమూలలనుగూడ ప్రవహించుచందము అతి విశాల హృదయమున ననాదికాలము నుండి నేటిదనుక వ్యవహరించుచున్న భారతమాతృ యదృష్టాతిశయమును నెంతని స్తుతింపగలము! అవును. శరీరాంతర్గతమైన రక్త ప్రసరణమూల కేంద్రమైన హృదయము, సమగ్ర శరీరారోగ్యమునే కాంక్షించి ఎల్లెడల రక్తమును బంపుచుండునుగాని ఆ జీవనాధారమైన రక్తమును దనయందే స్వార్థమున నుంచుకొనునా? అట్లగుచో అది స్వాత్మహాని యగునుగదా! ఇటులే మన భారతి తన అపూర్వ అపార ప్రేమతత్వమున దన ఉపనిషదధ్యాత్మిక సౌరభమును ప్రపంచము నందంతటను ప్రసరింపజేయుటయం దాశ్చర్యము లేదు.

ఈ ఆధ్యాత్మిక సంస్కృతీ సౌధమునకు పునాదియు కుడ్యములును అలంకారములును అగు అద్వైత తత్త్వము 'యస్మాజ్జాతం జగత్సర్వం యస్మిన్నేవ ప్రలీయతే। యేనేదం ధార్యతే చైవ తస్మై జ్ఞానాత్మనే నమః॥' (తై. భా. 1.1) ఏ జ్ఞానాత్మనుండి యీ సృష్టి ఆవిర్భవించి, ఎవనిచే తరింపబడి మరల నెవనిలో లయింపబడుచున్నదో అనురీతి ఆవిర్భావ స్థితి తిరోభావముల కాధారమైన ఏ జ్ఞాన స్వరూపమైన పర

బ్రహ్మముగలదో, 'శ్రీహరింపరమానందముపదేష్టారమీశ్వరం। వ్యాపకం సర్వలోకానాం కారణం తం నమామ్యహం॥' (అపరో.1) జడాజడమైన సమస్తప్రపంచమునకు కారణుడు సర్వవ్యాపకుడైన ఈశ్వరుడు పరమానంద స్వరూపుడు సర్వోప దేష్టయునైన శ్రీహరికి నమస్కరించుచున్నానని శంకరుడు అన్నటుల నీ ఆధ్యాత్మిక విద్యను ప్రపంచమున బోధించు ప్రథమ గురువై యొప్పుచున్నాడు. అందుచేతనే 'నారాయణం పద్మ భవం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ। వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవింద యోగీంద్ర మథాస్య శిష్యం॥ శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకం చ శిష్యం। తం తోటకం వార్తిక కార మన్యా నస్మద్గురూ స్సంతత మానతోస్మి॥' అని నారాయణాది శంకరశిష్య పర్యంతమున అద్వైతవిద్యా గురుపరంపరగల ప్రఖ్యాతుల సాంప్రదాయిక స్తుతిశ్లోకము జేర్కొనుచున్నది. అనగా 'సత్యయుగ సంబం ధ్యాచార్యత్రయం బ్రహ్మా విష్ణు రుద్రా శ్చేతి। త్రేతాయుగ సంబంధ్యాచార్య త్రయం వసిష్ఠ శక్తి పరాశర శ్చేతి॥ ద్వాపర సంబంధ్యాచార్యో ద్వౌ వ్యాసశుక ఏవా। కలియుగసంబంధ్యా చార్యత్రయం గౌడ గోవింద శంకరాచార్య శ్చేతి॥' (ద్వాదశ మహావాక్యసిద్ధాంత) అని వైకుంఠపురి రచిత గ్రంథమున దెలుపబడినట్లు ప్రస్తుతగోచరమై చతుర్యుగపర్యంత గురువుల ద్వార నీ అసాధారణ నిఃశ్రేయసకారకవాహిని ప్రవహించి మనకు లభ్యమానమగుచున్నది. అనగా నీ అద్వైత రసస్రోత అనాదికాలమునుండి అసంఖ్యాక గురుపరంపర రూపమున ఆధునిక ప్రపంచమునకు లభించుట విస్పష్టము.

కాని అగణిత గురుముఖతః అకుదెంచిన నీ యమృత వాహిని యొక్క చో నాయా పాత్రననుసరించి విజృంభించుచు, నాకాలమున బ్రస్ఫుటలీల నానాటి ప్రపంచమును నొక పెను వెల్లువవోలె ముంచివెత్తుచు, బ్రపంచమున నొక స్పందనము గలుగజేసి నూత్నచైతన్యమును గలుగజేయుచున్నది. అట్లు ప్రపంచశ్రేయోదాయక చైతన్యము నావిర్భవింపచేసిన మహా ప్రజ్ఞులు ప్రజ్ఞాశక్తు లనుటతో లోకము తృప్తి గాంచక, 'శంకరం శంకరాచార్యాం కేశవం బాదరాయణాం । సూత్ర భాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః॥' శంకరుడైన శంకరా చార్యునకు, కేశవుడైన బాదరాయణ వ్యాసునకును, అనగా సూత్రకార భాష్యకారులకు పునః పునః నమస్కరించు చున్నాను అనురీతి నా మహాపురుషుల నవతారపురుషులుగ గుర్తించి వ్యవహరించుటయు సముచితమేయగును. 'యథా యథా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత । అభ్యుత్థాన మధ ర్మస్య తదాత్మానం సృజామ్యహం॥ ...ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' (గీ. 4.7,8) అనుగదా గీతావాక్యము! అందుచే నీ ప్రఖ్యాత మహాపురుషుడైన శంకరాచార్యుని విద్యాధినాధుడై వైరాగ్యాలంకృత రూపుడైన పరమశివునితో బోల్చి అతడే ధరాతలంబును దరింపజేయ మానవాకృతి దాల్చెనని జిజ్ఞాసులోక మతని స్తుతించి, ఉత్తేజమును బొందు చుండుట అత్యంత సముచితము. అట్టి మహాత్ముల గని The mother of Saints and Seers ఆత్మజ్ఞుల మాతృదేవిగ బ్రశస్తిగనిన ఓ భారతాంబ! అట్టి ధన్యకు సహస్రాధిక ప్రణామములు.

ఈ విధముగ ఆధ్యాత్మిక విద్యానుభవ సంపదకు బుట్టినిల్లై కల్పవృక్షమైన భారతదేశమున, కేరళాభిధానమైన ప్రాంతము దక్షిణాగ్రమున గలదు. ఇది సస్యశ్యామలమై సంపద్విభూషితమై రాజశేఖరనామక ప్రభువుచే సక్రమరీతి బాలింప బడుచునుండెను. అందు 'అగ్రహారః కాలట్యభిఖ్యోఽస్తి మహాన్మనోజ్ఞః' (మా. శం. వి. 3.2.3) మనోజ్ఞమైన కాలటి అను బ్రాహ్మణాగ్రహారము గలదు. 'దేశేస్మిన్ విలసతి కారటితినామ్నా। గ్రామః' (1.37) కారటి అని లక్ష్మణశాస్త్రి కృత గురువంశకావ్యము దెలుపుచున్నది. చిద్విలాస యతి కృత శంకరవిజయము కాలటిని కాలడియని వాకొనినది. కాని యీ పదములన్నియు కాలటి శబ్దమునకు రూపాంతరములుగనే స్పష్టమగుచున్నవి. కాని ఆనందగిరికృతమైన శంకరవిజయము ఒక్కటియే చిదంబర క్షేత్రమును వక్కాణించియున్నది. కేవలము వాసస్థలముననేగాక పూర్వోక్తచందము యీ గ్రంథము శంకరు మాతాపితల విశిష్టవిశ్వజిత్తులనుగా జేసియున్నది. అయినను శంకరుడు చిదంబరమున జనించియుండుననియు బిమ్మట కాలటికి కుటుంబము తరలిపోయియుండి వాసమేర్పరచుకొనియుండుననియు సీతానాథదత్తు మొదలగు పండితులు సమన్వయింప యత్నించిరి.[90] కాని చరిత్రాకథన విధానమున గూడ బెక్కు వ్యత్యాసములు పొడకట్టుచుండుటచే నా యోచన అసాధ్యమని దోచెడిని. అందుచే కేరళీయ కాలటి అగ్రహారమే శంకరజన్మస్థానముగ నిర్ధారింప సమంజసము.

---

90. శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రి: ఆంధ్రసూత్ర భాష్యము, భా.1, పు. 18.

## వంశము

అందు విద్యాధిరాజు నానొక విద్వద్వరేణ్యుడైన ద్విజోత్తము డుండ నతనికి విద్యాపారంగతుడైన శివగురు వను పుత్రుం డుండెను. కాలాంతరమున అతనికి ఆర్యాంబయను సుగుణవతి నిచ్చి వివాహ మొనరించిరి. ఈ కుటుంబము కేరళమున గల నంబూదిరి బ్రాహ్మణవంశస్థులని తెలిసెడిని. తిరుచూరు ఆళ్వై ప్రాంతమున నేటికిని ఆ వంశస్థులు కొందరు గలరు. అంతియగాక శంకరుడు బదరికాశ్రమమునగల శ్రీనారాయణ దేవాలయమును పునరుద్ధరించి, అందు పూజాదికైంకర్య నిర్వహణమునకు కేరళమునుండి నంబూదిరి కుటుంబము వారనే నియోగించినట్లు చరిత్ర యగుటయు, నేటికిని అచ్చట నావంశమువారే పూజయొనర్చుచుండుటయు యీసమస్యను నిర్ణయించుచున్నది. బదరికాశ్రమాలయమును నిర్మించిన పిమ్మట తల్లియగు ఆర్యాంబనుండి సందేశమును గొనివచ్చిన తన బంధువైన అగ్నిశర్మయను నతని ఆ యాలయమున శంకరుడు నియమించినట్లు చిత్సుఖాచార్యుని శంకరవిజయ కథనము. ఎట్లైనను అచట నంబూదిరీయు లుండుట శంకర బ్రాహ్మణ శాఖాసంబంధమును దెలుపుచున్నదని దీర్మానము.

ఈ నంబూదిరి బ్రాహ్మణులు ఆంధ్ర బ్రాహ్మణులేయను నొక వాదము గలదు. ఆంధ్రబ్రాహ్మణవంశ రాజులైన శాతవాహనులను రాజులలో కదంబవంశమునకు జెందిన మయూరవర్మ అను నాతడు కేరళదేశమును పాలించెను. అప్పుడు ఆదేశమున బ్రాహ్మణులు లేకుండుటచే నారాజు తన స్వస్థల

మైన గోదావరి మండలమునగల సర్పవరము నాబడు అహి క్షేత్రమునుండి కొన్ని కుటుంబముల నటకు గొనిపోయెను. ఆకుటుంబములకు జెందినవాడే శంకరుడు. ఈ విషయము అహి క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు బ్రహ్మకైవర్త పురాణము నందే గాక, మద్రాసు దొరతనమువారిచే ప్రకటింపబడిన (Sects) తెగలు అను గ్రంథము 7 వ భాగములో గలదు.[91] ఆంధ్రబ్రాహ్మణ కుటుంబముల మయూరవర్మ వెంటగొంపోయి యుండినట్లు దీనగలదు. అందుచేతనే నంబూదిరీల సంప్రదాయ కథలును మయూరవర్మవరకు జెప్పుచున్నవి. ఈ విషయమును పై గ్రంథములయొక్క 5 వ భాగమున సుబ్రహ్మణ్యఅయ్యరు గూడ యిట్లే వ్రాసెను. 'కేరళోత్పత్తి'అను గ్రంథముగూడ నిదే విషయమును దెలుపుచున్నది. మయూరవర్మ క్రీ. పూ. ఆరు అయిదు శతాబ్దముల వాడగుటచేత, శంకరుడు క్రీ.పూ. 509 న జనించుటచే పై విషయము నిస్సందేహమనియే దోచెడిని. అట్లయినను, కేరళములో చిరకాలముండి ఆదేశగత ఆచారవ్యవహారముల గలిగి బూర్తిగ ఆంధ్రత్వమును విస్మరించినవారి నాంధ్రులని యనుకొనుట ప్రయోజనశూన్యము. ఆవిధముగ నేడును తమిళదేశమున కన్యాకుమారివరకును, అటులే భారతమున అంగ వంగ కళింగ కర్ణాటక కాశ్మీర ఘూర్జరాది యనేకరాష్ట్రముల తెలుగువా రెందరులేరు. వల్లభ నింబార్కులు ఆంధ్రులై యుండియు సింధు బొంబాయి రాష్ట్రముల దమ మతప్రచారము సాగించి, అందే పీఠముల స్థాపించి ఆంధ్రముతో సంబంధముల జాలవరకు ద్రుంచి యుండ

91. శ్రీ కోట వెంకటాచలం: కలిశక విజ్ఞానము, భా. 3. పు. 56.

లేదా! వారిని ఆంధ్రులే యనుకొని ఏమి ప్రయోజనము? అట్లు అయియున్నను, నామము గాని వెనువెంటగాని శంకరు గ్రహించి, తత్సిద్ధాంతము ననుసరించి, ప్రశస్తి గాంచిన ఆంధ్రులొక్క-రైనను గానరారు. విజయనగర సామ్రాజ్యమున విద్యారణ్యుల వరకు అనగా వేయివత్సరములు ఆవిషయమున ఆంధ్రావని నిద్రించినదేమో అనిపించును. విద్యారణ్యుడుగూడ కర్ణాటకుడను వాదము గలదు. ఎట్లైనను శంకరాచార్యుని వంశము నంబూదిరి అనియు గోంళీయమనియే ప్రస్తుతమునకు దీర్మానము.

ఈ విషయమున మరియొక విచిత్రము గలదు. కేరళ కాలటియే శంకర జన్మస్థానమని అధిక సంఖ్యాకులును, తమిళమునగల చిదంబరమని ఆనందగిరియు దెలుపుచుండ, శంకరుడు తన అసంఖ్యాక గ్రంథముల నెచ్చటనైన తన పుట్టుపూర్వోత్తరములగాని దేశప్రస్తావనముగాని, చివరకు పట్టణముల ఉదాహరణములగాని చేసి యుండకుండుట విచారకరము. మీదుమిక్కిలి అతడు, ఉత్తరదేశమునగల పూర్ణవర్మ, సుధన్వ, రాజవర్మ, దేవదత్త యజ్ఞదత్త మొదలగు పురుషుల నామధేయములను, స్రుఘ్న పాటలీపుత్ర మొదలగు పట్టణనామముల దెలిపియుండుట కొంత విచారణీయము. గ్రంథరచనము నైన శంకరునికి దక్షిణాపథమునగల ప్రసిద్ధ నగరముగాని ప్రభువులు గాని స్ఫురింపకుండుట శోచనీయము. అందుచే శంకరుడు దక్షిణదేశస్థుడు కాడనియే కొందరు వాదింప నవకాశ మేర్పడుచున్నది. కాని చిన్నతనముననే తల్లియాజ్ఞగొని, నర్మదా తీరమునగల గోవిందునిజేరి, కాలమున నధిక భాగమును ఉత్తరదేశముననే గడిపియుండుటచే దక్షిణ

దేశ నామముల వ్రాయ శంకరునకు స్ఫురించి యుండదని సమాధానము జెప్పికొనవచ్చును. కాని శృంగేరిని స్థాపించి అందు అధిక కాలము వాసముండి, కంచి కామాక్షిని యంత్ర బద్ధముగావించి, ఆమె అనుగ్రహము నార్జించి, అందును కొంత కాలముండిన, కొందరి వాదము ప్రకారము కాంచీపురముననే నిర్యాణము నొందిన శంకరుడు తన మాతృభూమినేగాక దక్షిణాపథము నంతటి బూర్తిగ దన గ్రంథముల మరచి ప్రస్తా వింపకుండుట విచిత్రము, విచారకరము. యతుల కన్నియు నొక్కటియే యని సమర్థించుకొనజెంచినను, ఉత్తర దేశ నామ ములగూడ బ్రస్తావింపకుండ కేవలము యజ్ఞదత్త దేవదత్తాది నామములవోలె సామాన్యపదముల నన్వయించి యుండవల యును. అందుచే శంకరవంశ నిర్ణయము సమస్యాపూరితముగనే యుండుట విచారకరము.

---

## జననము

పూర్వవిషయము ననుసరించి, శివగురు దీక్షితునికి సంతానప్రాప్తి లేకపోవుటచే, నార్యాంబాసహితుడై వృషాచల క్షేత్రమునగల వృషభేశ్వరుని గూర్చి పుత్రార్థమై దారుణతపస్సు గావించెను. ఆ యుగ్ర తపోఫలితముగ బరమేశ్వరానుగ్రహ విశేషమున నార్యాంబకు బూర్వోక్త చందమున క్రీ. పూ. 509 అనగా నందన నామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి

భానువారము పునర్వసు నక్షత్ర కర్కాటక లగ్నమున అయిదు గ్రహము లుచ్చస్థానములనుండ మగశిశు వుద్భవింప నానంద వార్ధిగ్రుంకుచు, వృషాచలేశ్వర కృపాప్రసాదలబ్ధుడగు నా శిశువునకు శంకరుడని నామకరణ మొనర్చిరి. ఆర్యాంబ తపమునకు సంతసించిన కైలాసాధిపతియగు పరమేశ్వరుడు స్వప్నమున నామెకు దర్శనంబిడి ప్రజ్ఞావంతుడైయుండి అల్పాయుష్కుడైన బాలుడు కావలయునా లేక చిరకాలముండినను మందప్రజ్ఞుడు వలయునా యని ప్రశ్నింప, నార్యాంబ ప్రజ్ఞావంతునే గోరినట్లు మాధవుని కథనము. కాని పూర్వము మార్కండేయ చరిత్ర ననుకరించి, శంకరు అల్ప జీవిత కాలమును సమన్వయింప నీ కథ కాలాంతర కల్పనమని అభిప్రాయము.

---

## బాల్యము

ఇట్లుద్భవించిన బాలచంద్రుడు దేదీప్యమానముగ ప్రజ్ఞా తేజోరాశివోలె నభివృద్ధిగాంచుచుండుట గాంచి జననీజనకులు విద్యాబుద్ధుల నేర్పింప శంకరు గురుసన్నిధానమునకు బంపిరి. ఆగురు లెవ్వరో తెలియరాదు. జన్మాది ప్రథమవత్సరముననే శంకరు డసాధారణ ప్రజ్ఞచే సంస్కృత కేరళ భాషాక్షరముల గ్రహించి, రెండవ వత్సరప్రాయంబున నా భాషల పఠింప శక్తుడై, మూడవయేట కావ్య పురాణముల నధ్యయనము

గావించుటయేగాక వ్యాఖ్యానింప శక్తిగడించినట్లు మాధవ గాథ. గురుసన్నిధానమున నింకను విద్యను బెంపొందించి, శ్రుతిస్మృతి పురాణేతిహాసాదులను, ఇతరశాస్త్రములను సంపూర్తిగ బఠించి విద్వాంసుడై తన యేడవయేటనే గృహమునకు దిరిగివచ్చెను. ఆప్రాయముననే 'బాలబోధ సంగ్రహము'ను గ్రంథమును నిర్మించి వేదరహస్యముల సహాధ్యాయులకు బోధించుచుండినటులగూడ ప్రతీతిగలదు. అనగా నీ సకలవేదవేదాంతాదీ శాస్త్రార్థముల శంకరుడు సాధ్యము గావించుకొని, రెంటు మూడువత్సరములలో విద్వన్మణియని ప్రఖ్యాతుడగుట కేవలము పరమేశ్వరానుగ్రహ విశేషమో కాక పూర్వార్జిత పుణ్య మాహాత్మ్యముననో యైయుండును. అట్టి అసమాన పూర్ణప్రజ్ఞులే మానవకోటి దరింపజేయగల అవతారపురుషులై కాలాంతరమున రూపొందుట సహజము. అటులే శంకర భగవత్పాదులును జగద్గురు వరేణ్యులై నాటినుండి సహస్రాధిక వర్షానంతరము నేటివరకు దన దేదీప్యమాన విద్యా తేజోపుంజముల నప్రతిహతముగ బ్రసరింపజేయుచు, నజ్ఞానాంధకార మగ్నమైయున్న నసంఖ్యాక హృదయముల దీప్తివంతముల జేయుచునున్నాడు. అందుచే నట్టివారు కేవలము కారణ జన్ములు కానేరరు. అందుచేతనే పూర్వవచనమురీతి శంకరుడు భూగోళమునకు జెందినవాడు గాడనియు, నతడు శుక్రగోళమునకు జెందిన దివ్యపురుషుడయి యుండియు, అజ్ఞమానవోద్ధరణకార్యమును మనసా ధరించి జనించిన అమానుష మనుష్యమూర్తి యనియు దివ్యజ్ఞాన సంఘసంస్థాపకురాలైన బ్లావట్స్కీ తెలిపియుండుట జూచియున్నాము. అట్టి అద్భుత

ప్రస్థానత్రయీధురీణుల నవతారపురుషులని భావించి అర్చించుటయు సహజమేయగును.

---

## పితృవియోగము

అట్లు సర్వజ్ఞవిద్యావిశిష్టుడైన పుత్రునికి ఉపనయనము గావింప శివగురువు సంకల్పించియుండి దురదృష్టవశమున దివంగతుడయ్యెను. చిత్సుఖీయము ననుసరించి శివగురువు కుమారుని ఉపనయనము గావించి లోకము వీడినట్లుగలదు. ఇట్లు శంకరుడు తన బాల్యముననే తండ్రిని గోల్పోవుట, దురదృష్టవశమున కాలాంతరమున ననేక అపోహలకును అపవాదులకును అవకాశమొసంగి అద్వైతప్రత్యర్థుల దోషారోపణావకాశమును, అద్వైతవాదులకు చింతయు గలుగజేసినది. మధ్వమతమునకు జెందిన పండిత నారాయణాచార్యులనువారు యీ వాదము జాలదూరమునకు లాగినవారై శంకరద్వేషి అగుటచే, దన 'మధ్వవిజయము' 'మణిమంజరి' కావ్యములలో శంకరుని, మణిమానుడను రాక్షసుడే యిట్లు అద్వైతమతనాశనమునకై జనించెనని దూషించుచు, నంతటితో తృప్తిగాంచక, శంకరు దల్లియగు నార్యాంబను భర్త చిన్నతనముననే మరణింప, గాలాంతరమున దుశ్శీలయై శంకరుని గనెనని వ్రాసెను.92 ఎవరో ఒక చిన్న విధవ తన స్నేహితులతో శివాలయమున కరుగ, దోడిమిత్రులు శివుని బిడ్డలకై ప్రార్థించుచుండ నామెయు నట్లే గోరెననియు,

---

92. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas-p 10.

నందులకు పరమశివుడు మెచ్చి వల్లెయని వరమొసంగ, నామెకు పుత్రుడొకడు గలిగెనను కేరళీయగాథనొండు శంకరునకు ముడిపెట్టి యీ కల్పనము నతడు గావించెను. ఈ గాథను విశ్వసించుటకైనను కేవలము దుశ్శీల అనుటగాక పరమేశ్వరుడామెప్రార్థనము నంగీకరించి పుత్రునొసంగుట విచిత్రము. అనగా నామె పెడత్రోవబోవ భగవంతుడే కారణభూతుడా? ఇట్లు అసందర్భ కల్పనముల గావించి, లోకోత్తర మహాపురుషుల నిందించి సాధింపగల్గునది లేకపోవగ, ఆ కల్పనకర్తలే లోకమున నప్రఖ్యాతి కాకరమగుదురనిన సమంజసము. అట్టి కల్పనలచే మన సంకుచితత్వమే వ్యక్తముగాని ఆ మహాపురుషులకు గాని, వారి సిద్ధాంతమునకు గాని ఎట్టి కళంకమేర్పడునని భావించుట కేవలము భ్రాంతియే యగును. మధ్వ మతాధ్యక్షుడా కాలమునగల శృంగేరీ పీఠాధ్యక్షునిచే గొన్ని కష్టముల బొందియుండుటయే యీ 'మధ్వవిజయ' 'మణిమంజరి' గ్రంథముల బుట్టుకకు గారణమనియు నా గ్రంథకర్త ముందుగనే వ్రాసి, తన క్రోధనివారణార్థము యీ నిందలతో గూడిన నింద్య గ్రంథముల రచించి, నిందలపాలగుట చింతనీయమేయగును.[93] నాటి శంకరపీఠాధ్యక్షుడు కావించిన ద్వైతాచార్య నిరసనము ఆ శృంగేరీ అధిపతిపై బ్రతిఫలించుటకు మారుగా, ఆదిశంకరు మీదికే యీ గ్రంథకర్త ధ్వజమెత్తి ప్రవర్తించుట యుక్తి బాహ్యము కాక తప్పదు. అందుచే నసూయాగ్రస్తుల కల్పనలే యీ కట్టుకథలనియు, నవి కేవలము నిరాధారములనియు బండితనిర్ణయము.[93]

93. C.N.Krishnaswami Aiyar: The Three Great Acharyas, p3.

## ఆత్మసన్న్యాసము

ఇట్లు చిరుప్రాయంబుననే పితృవియోగమును బొందిన శంకరుడు విద్యాలాభమున గలుగు సర్వనశ్వరత్వ, బ్రహ్మ నిత్యత్వ తాత్పర్యగ్రహణమునకు దోడుగ పితృవియోగము ప్రపంచ నశ్వరత్వము స్థిరమను విశ్వాసమునకు దారితీయగ, దీవ్రముగ యోచనారతి మునింగి, అస్థిర ప్రపంచముతో సంబంధము నరికట్టుటకు దీర్మానించుకొనెను. ఈ కాలముననే అగస్త్యుడను నొక మునీశ్వరుడేతెంచి, జూచి ఆనందించి అతని భవిష్యజ్జీవిత విశేషముల నార్యాంబకు దెలుపుచు శంకర సన్న్యాసాదిపరిణామముల వెలిబుచ్చెను. దీని కనుగుణముగ శంకరునకు వివాహ ప్రయత్నములుగూడ జరిగినట్లును, దాని కతడు సమ్మతింపనట్లును గాథలు తెలుపును గాని, నాటికి ఎనిమిది తొమ్మిది వర్షముల శంకరప్రాయము వివాహసన్నద్ధము కాజాలదు. అంత చిరుప్రాయంబున గేరళమున నుద్వాహములు జరుగుట అరుదు. అయినను ప్రజ్ఞాశీలుడైన నతని గాంచి కన్యాప్రదానము గావింప గొందరు సంసిద్ధులై యుండ వచ్చును. అందుచే శంకరుడు జన్మతః సిద్ధుడై యుండుటచే, నతని జీవిత కర్తవ్యము తద్భిన్నమగుటచే నీప్రాపంచిక శృంఖలముల నుండి విముక్తినొంద స్థిరసంకల్పుడై శంకరుడు మాతృసమ్మతికై ఆమెనర్థించెను. సన్న్యాసస్వీకరణమునకు మాతృదేవి అంగీకారము ప్రధానమనిగదా శాస్త్రము! కాని భర్తృవియోగమున గ్రుంగిపోయియున్న ఆర్యాంబ సుతుసన్న్యాసమున కొడంబడునా? అంతియగాక నితడు ఏకైకపుత్రుడు

గదా! మందమతియైన వీడజాలని మాతృహృదయము విద్వన్మణియగు శంకరు నెట్లు వీడ మనగలదు? అందుచే నందులకు సమ్మతింపదయ్యెను. తన తపోఫలితముగ గన్నకుమారుని, పరమేశ్వర వరప్రసాద లబ్ధుడైన పుత్రుని నిమిషమైని వీడియుండజాలదు అట్లగుచో శంకరు మేధాశక్తి ప్రపంచమున కెట్లు సద్వినియోగమొందుట? నిష్ఫలమగుట లేనా? కాని భగవంతుడు విచిత్రలీల నొక సంఘటనమును సృష్టించెను. ఒకదినమున తల్లితో శంకరుడు గ్రామమునకు జేరువ నున్న పూర్ణనదికి నిత్యస్నానార్థమై నిత్యకార్యక్రమము ననుసరించి వెడలెను. నదీమధ్యమున స్నానమాచరింపుచుండ నొక మొసలి శంకరు పాదమును బట్టి లోనికి లాగుటకు యత్నించెను. వెంటనే తనకు మృత్యుకాలమాసన్నమైనదని తలంచిన శంకరుడు తల్లిని బిలిచి, ప్రమాదమును తెలియబరచి,సన్న్యాసి ననిపించుకొని మరణింప నాకాంక్షను వెలిబుచ్చి తీవ్రముగ తల్లిని వేడుకొనెను. అంబకు జననియు మిగుల చింతించి, తన అసహాయస్థితికి మిగుల వాపోయి, కర్తవ్యమన్యముగ దోచకుండుటచే పుత్రుని శ్రేయోభిలాషిణియగుటచే, సన్న్యాసి మరల నీ జనన పరంపరలో బడడను గాఢ విశ్వాసముతో నట్టి జన్మమరణ ప్రవాహమునుండి సుతుడు విముక్తినొందుటయే తన యీప్సితార్థము కావుటచే వల్లెయని ఆశీర్వదించెను. అంత శంకరుడు సన్న్యాస సంబంధములగు ప్రైష విరజాది కొన్ని మంత్రముల మనసా స్మరించి ఆత్మసన్న్యాసమును స్వీకరించెను. కాని దైవవశమున బాలుని బంధింప యత్నించిన ఆ మకరి ఆ బాలు లోనికి గొంపోవ శక్తిజాలక వ్యర్థసంకల్పమై

బాలు బరిత్యజించి పారిపోయెను. అందుచే శంకరుడు మృత్యుముఖమునుండి బయటపడి యెట్టకేలకు ఒడ్డును జేరెను. అది యొక పవిత్రదినము, తత్త్వార్థశాస్త్ర మహాభాగ్యము, ముముక్షులోకమునకు భాగ్యోదయ ముహూర్తము. నాడు ఆశ్వయుజశుద్ధ పౌర్ణమి. అశ్వని నక్షత్రమయి శంకరునకు దొమ్మిదివర్షముల ప్రాయము.

ఈ గాథను శంకర కల్పితముగా గొంద రారోపించెదరు. అనగా శంకరుడు మాతాజ్ఞ గైకొన నెన్నివిధములుగనో యత్నించి విఫలుడై మార్గాంతరము గానక, ఈ మకర పన్నాగమును బన్ని మాతృ సమ్మతిని బొందెనని వారి భావము. కాని పవిత్రమైన సాధన చతుష్టయ పరిపక్వమైన సన్న్యాస గ్రహణార్థము శంకరుడే యిట్లు అనృత వాక్యముల జననిని వంచించి సన్న్యసించె ననుటగంటె అన్యాయము యుక్తి బాహ్యము వేరొండు గానేరదు. అది స్వమతవ్యాఘాతదోషమగును. అట్టి అసందర్భమునకు శంకరుడు ఒడిగట్టె ననుట కేవల మయుక్తము. విచిత్ర దైవ సంకల్పము కొందరి జీవితములలో నపూర్వ సంఘటనముల బ్రాపిలజేసి నా కారణమున నా వ్యక్తుల నమానుషవ్యక్తులనుగ రూపొందింప నిట్టిసంఘటనముల గల్పించుచుండును. ఒక చినిగిపోయిన ఉపనిషద్వాక్యముగల కాగితమే దేవేంద్రనాథఠాకూరును మహర్షిగా నొనరించినది! జ్యేష్ఠసోదరుని చిన్నమందలింపు వాక్యమే వెంకటరమణుని మహర్షిగా జేసినది. అటులే నాటి రాచకీయ వాతావరణమే అరవిందుని యోగిపుంగవుగా బరిణమింపజేసియున్నది. కాన నిట్టి అపూర్వ విచిత్ర సంఘటనముల మానవయుక్తికి

నీడ్చి సమన్వయింపబూనుట అయుక్తము. అట్లు అన్వయింప బూని ప్రధానమూర్తిపైన నభాండముల మోపుటయు మిగుల అసమంజసము.

---

## సద్గురుసన్నిధి

ఇట్లు మాత్రాజ్ఞను గైకొనిన శంకరుడు,జనని యెప్పుడు సంకల్పించిన అపుడు తల్లి దరిజేరుటకును, పర్యవసానమున నామె అంత్యక్రియల దానే స్వయముగ నొనర్చుటకును వాగ్దానమొసంగి, సక్రమసన్న్యాస స్వీకరణమునకు విద్యాభివృద్ధికిని పరివ్రాజకుడై గృహమువీడి బయలుదేరెను. 'షడంగాది వేదోముఖే శాస్త్రవిద్యా కవిత్వాది గద్యం సుపద్యం కరోతి। మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిం॥' (గుర్వష్టకం. 3) శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషాది షడంగసహిత చతుర్విధ వేదములును, సకల శాస్త్రములును కంఠస్థములై యున్నను, గద్యపద్యాత్మక రచనమునం దుత్తీర్ణత పొందియున్నను, గురుపాదపద్మముల జేరనిచో నేమి ప్రయోజనము? అను గాఢవిశ్వాసముగల వాడగుటచే తన కుచితమై శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వములయం దారితేరిన సద్గురూత్తముని సేవ నభిలషించి అతనికై యన్వేషింప మొదలిడెను.

నాడు దేశమంతయు నాశ్రమములచే నిండియుండెను. కర్మసిద్ధాంతావలంబకుడైన కుమారిలుని దారుణాఘాతములచే

నెల్లెడల నడగారిపోయినవి పోగ, నింకను అనేక ప్రదేశముల జైన బౌద్ధాది విశ్రాంతి కాకరములగు ఆశ్రమస్థానములును, వారి అధ్యక్షులై పాండిత్యానుభవ విశిష్టులైన గురువులు గలిగి విరాజిల్లుచు నున్నవి అటులే బౌద్ధాదికముల నడంచి, రాజాశ్రయము నార్జించి, దేశదేశముల వ్యాప్తిజెంది, అగ్నికార్యాది నిత్య నైమిత్తికకర్మ జన్యమైన పవిత్రధూమములచే నిండి, ఆవేద ఘోషచే సమ్మూర్ఛములైన ప్రభాకరమిశ్ర కుమారిలభట్ట మండన మిశ్రాది గురులోకమునకు జెందిన ఆశ్రమములు దేశవ్యాప్తములుగ గలవు. అటులే జైన బౌద్ధాది సిద్ధాంతముల సమ్మతింపక మీమాంసాది కర్మానుష్ఠానముల విశ్వసింపక, నొక అజేయమును శ్రుత్యుక్తమును, న్యాయసమ్మతమును, అనుభవ వేద్యమును అయిన ఉపనిషత్ప్రబోధిత వేదాంతమార్గము నవలంబించుచు, నందు నగ్రస్థానము నధిరోహించి శిరోభూషణము పగిది వికసించు అద్వైతసిద్ధాంత ఘోషలను ధ్వని ప్రతిధ్వనుల వాతావరణమును ముంచి, ఆశ్రితుల నద్వైతానుభూతమైన సోహం స్థితి నుంచుచున్న సన్న్యాసాశ్రమములును బహుళ వ్యాప్తముగనే అలరారుచున్నవి. కాన శంకరు జేయాశ్రమమును జేరుటయా యను మీమాంస అవసరము లేకయే, జన్మతః అకుదెంచిన వాసనాబలముచే, నితః పూర్వమే ఆత్మ సన్న్యాసమును గైకొనియుండుటచే సహజముగ నాతని నిరీక్షణాదృష్టులు అద్వైతాచార్య స్థానములకై నన్వేషింప దొడంగెను.

దేశదేశముల బర్యటించి గ్రహించియో, కర్ణాకర్ణికగ నాలకించియుండియో, కాక భగవదాదేశముననో; నర్మదానదీ

తీరమున శిష్య పరివృతుడై ఆశ్రమమున నున్న గోవింద భగవత్పాదాచార్యుని సన్నిధికి శంకరుడొక శుభ సమయమున జేరెను. ఆ యమరేశ్వర నగరప్రాంతమగు గోవిందు నాశ్రమంబున '(శ్రీ) గోవింద భగవత్పూజ్యపాద శిష్య (శ్రీ) శంకర భగవతః' (స సు. భా. 2. 43) అని తా దరువాత సగర్వముగ జెప్పుకొనుట కర్హుడైన సద్గురు సన్నిధానము నతడు జేరెను. ఆ గురుశిష్యులకు అసాధారణ భక్తివాత్సల్యములు కాలాంతరమున గలిగి తా కారణజన్ముడై యున్నను, గురు సన్నిధాన మహిమచేతనే తనకా విద్యాప్రాప్తి సంసారదుఃఖ నివృత్తి ముక్తియు లభించినవనియు గాఢముగ విశ్వసించి, కాలాంతరమున 'అఖండానంద సంబోధో వందనాద్యస్య జాయతే। గోవిందం తమహం వందే చిదానందతనుం గురుం॥' (స వే. సి. సం. 1) ఎవనికి వందనమొనరించుటచే అఖండానంద బోధ సంప్రాప్తించునో అట్టి చిదానంద స్వరూపుడైన గోవిందగురువు నకు నమస్కరించుచున్నానుఅనియు, 'వేదాంతవాక్యపుష్పేభ్యో జ్ఞానామృత మధూత్తమం। ఉజ్జహారాళివద్యో నస్తస్మై సద్గురవే నమః॥' ( ఉ. సా. 2. 18 233 ) వేదాంతవాక్యములనెడి పుష్పములనుండి జ్ఞానామృతమునా మకరందమును దీసి మన కొసంగిన భ్రమరతుల్యుడైన సద్గురువునకు జోహారులు. అను రీతి బెక్కువిధముల శంకరునిచే గురుస్తుతి జేయింప నీ అపూర్వ సంబంధము కారణమయ్యెను. అవును. శిష్యుని శక్తి సామర్థ్యముల, లోటుపాటుల, జన్మసంస్కారముల సమగ్రలీల నవగాహన మొనరించుకొని, శిష్యాభ్యుదయమును గాంక్షించి, వత్సలత బోధించి, శిక్షించి, శిష్యుని దనకుమించినవానిగా జేయు

గురువే గురువుగాని యితరు లగుదురా? గురు లక్షణము లన్నో నదియే ముఖ్యముగాని అన్య మెద్దియు గానేరదు. ఆ విధమునననేగదా రామకృష్ణపరమహంసదేవుడు వివేకానందుని జిత్రించినది! ఆ గురుశ్రేష్ఠులు శిష్యుల శ్రేయమునే స్వప్నములగూడ కాంక్షించి, శ్రమించి, వారికొఱకై అవసరముల ద్యజించి, శిష్యుల లోకమున నజేయులనుగను పరమాదర్శపూర్ణులనుగను రూపొందించి అమరపీఠము నలంకరింప జేసిరి. శిష్యుల యశోగరిమముందు వారు అప్రధానులుగ స్థూలదృష్టికి గోచరమైనను, వారి అతిసూక్ష్మయశస్సే అట్టి అమానుష శక్తియుక్తులగు శిష్యవరేణ్యుల దయారు జేసినదని గ్రాహ్యము. ఆ విధముగ గోవింద శంకరద్వయము ప్రపంచ చారిత్రమున నొక అసాధారణ ఆత్మశక్తిస్వరూపములు. చిద్విలాసయతి కథనము ననుసరించి, గురుప్రశ్నకు శంకరుడు తన సహజవిద్యావినయ సౌందర్యరాశి ఉట్టిపడునట్లు తాను కేరళమున శివగురు బ్రాహ్మణుని సుతుండనియు, చిన్నతనముననే పితృవియోగము కలిగి మాతృపోషణమున విద్యాబుద్ధుల బొందినట్లును వచింప ప్రేమహృదయుడైన గోవిందు డుప్పొంగి ఆనందించి కౌగిలించి శంకరు శిష్యునిగా బరిగ్రహించెను.

అంత గొంతకాలము శంకరుడు అత్యంతాసక్తితో గురుసేవ జేయుచు, విద్యాధ్యయనానుష్ఠానాదుల గాలము గడుపుచు, గోవిందుని కానందదాయకముగ నుచితసర్హతలనార్జించి, సర్వసద్గుణ సంఘాతాతిశయ తేజోవిభూషితుడై విరాజిల్లుచుండ, గోవిందయోగీంద్రు డమందానందమున హృదయము వికసింప, నొక శుభముహూర్తమున అనాదినుండి గురుపరంపరానుగత

వేదవేదాంగ పురాణేతిహాసాది శాస్త్రముల ననుస్యూతమై ప్రఖ్యాతమై మహాప్రవాహమైయొప్పు తురీయాశ్రమ మన బరగు సన్న్యాసాశ్రమమును శిష్యరత్నమైన శంకరునకు బ్రసాదించెను. అనాది కాలగతమైన యీ సన్న్యాసవాహినీ తలము వేదప్రోక్త 'సంవర్తకారుణి శ్వేతకేతు జడభరత దత్తాత్రేయ శుక వామదేవ హారీత కా' (భిక్షుకోపనిషత్త్వాది ప్రభృతులను, 'గోధా ఘోషా విశ్వవారా పాలోపనిషత్॥' (బృహద్దేవత. 11. 82.87) మొదలగు సన్న్యాసినులగు బ్రహ్మవాదినులనుండి వసిష్ఠ కౌశిక ధౌమ్య సులభాది పౌరాణిక మహావ్యక్తులతో, బుద్ధ గౌడపాద గోవిందాది పర్యంతముగల అసంఖ్యాక యతిసార్వభౌముల తనలో సుస్నాతుల గావించి, ఆనందమున ముంచి సంసారతాప విముక్తులను గావించి యున్నది. అట్టి సన్న్యాసస్రవంతిలో శంకరునిగూడ సుస్నాతుని గోవిందయతి చేయించి, శంకరున కాత్మశాంతిప్రదాత యయ్యెను. కాని ఎందులకో శంకరనామము మార్పులేక అటులే యుండి చివర భగవత్పాద శబ్దము మాత్రము జేరి యున్నది. పూర్వాశ్రమనామమును ద్యజించుట నాటి కింకను లేదేమో! గోవిందునికి బూర్వనామముగ గోవిందభట్టు అని గొందరు వాకొనియుండుట యిందు గమనార్హము. అదియే రూఢియైనచో నతడును గోవిందపదమును విసర్జింపక భగవత్పాద పదమును చేర్చుకొనినయట్లు తన ముఖ్యశిష్యునికి గూడ నట్లే యొనర్చియుండునని దోచెడిని. ఈ విషయమును ఉత్తరగ్రంథమున గాంచెదముగాక.

## గోవిందయతి

శంకర గురుపాదుడైన గోవింద యతీంద్రుని విషయమొక అగాధము. క్రీస్తుకు బూర్వము ఆరవ శతాబ్దమున మాల్వా రాష్ట్రపరిపాలనము గావించిన పావ్వార వంశమున రాజునకు పుత్రసంతానము లేకుండుటచే దన పుత్రికను అసాధారణ ప్రజ్ఞాశీలుడును, మహాపండితుడును అయిన చంద్రశర్మ అను బ్రాహ్మణునకు తన కూతు నిడి వివాహమాచరించెను. అంత నామెకు శ్రీ హర్ష విక్రము డుదయింప, నారాజ్యము అతనికి సంక్రమింప, నంతవరకు గృహస్థాశ్రమము ననుసరించియున్న చంద్రశర్మ గౌడపాదాచార్యు నాశ్రయించి, పాతంజల మహా భాష్యాది శాస్త్రాధ్యయనము గావించి, సన్న్యసించి, గోవింద భగవత్పాదాచార్యుడైనట్లు కొందరి కథనము.94 క్రీ. పూ. 494వ సంవత్సరమున నర్మదా నదీ తీరమునగల మాంధాత ద్వీపమునగల వైడూర్యమణి పర్వతమున ఓంకారము నుచ్చరించుచు నితడు సిద్ధి బొందె పుత్రుడైన శ్రీహర్ష విక్రమాదిత్యుడు, పితృ్యణవిముక్తికై అట ఓంకార నాథాలయమును నిర్మించినట్లు కొందరు నిరూపించుచున్నారు.95

మరియొక గాథకూడ గలదు. చిదంబరమునకు బుండరీక క్షేత్రమున గౌడపాదాచార్యుడు పూర్వాశ్రమమున

94. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 3.

95. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 2, పు. 37.

వ్యాకరణము నభ్యసించుచుండెను. అతడే ద్రవిడాచార్యుడని కొందరి నమ్మకము.96 కాని గౌడపాద ద్రవిడాచార్యు లొకే వ్యక్తిగ శంకరాదు లెటను దెలుపకుండుట విదితము. గౌడ పాదుడు అన్యమనియే అధికసంఖ్యాకులైన పండితుల తీర్మా నము. ఆవ్యాకరణ భాష్యమును సాక్షాత్తు పతంజలి మునీంద్రుని చెంత బఠించుచుండెనట. కాని పతంజలి కాలమునకును గౌడ పాదుని కాలమునకును గొన్ని శతాబ్దముల వ్యత్యాసము గోచ రించుచున్నది. సమన్వయము కష్టసాధ్యమే యగును. అట్లధ్య యనము గావించుచుండ నొకనాడు పతంజలి నిత్యపద్ధతి ననుస రించి దెరవెనుకనుండి తన సహస్రఫణులతో దెర కావల నుండు సహస్ర శిష్యులకు భాష్యము నుపదేశించుచుండెను. ఇంతవరకు నతిశ్రద్ధాళులై శ్రవణముగావించుచున్న శిష్యులు గురుముఖమును దర్శించి ఆనందించు సంకల్పమున నాదెర నొకించుక దొలగించి చూడగా నొనుండి ఆదిశేషుని సహస్ర శిరములనుండి వెల్వడు అగ్నిజ్వాలలచే నాశిష్యగణము భస్మీ భూత మయ్యెను. కాని అదృష్టవశమున గౌడపాదాచార్యుడు మాత్రము ఆసమయమునకు గుర్వాజ్ఞ లేకయే కార్యాం తరుడై వెడలియుండి, అనంతరము అరుదెంచి చూచి, సహ పాఠులందరు సమసియుండుట కచ్చెరువందుచుసుండ నా ఆది శేష స్వరూపుడైన పతంజలి ఆతని దిలకించి, విషయము గ్రహించి, తన ఆజ్ఞలేనిది కార్యాంతరవృత్తి జనుట కాగ్ర హించి, బ్రహ్మరక్షస్సగునట్లు గౌడపాదుని శపించెను. కాని

96. శ్రీ శేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 2, పు. 1

కించిన్మాత్రము కనికరించి అర్ధ్యానికి నీశాస్త్రము నుపదేశించిన వెంట శాపవిముక్తి నొందున ట్లనుగ్రహించెను. అంత గౌడ పాదుడు దేశదేశాంతరముల గ్రుమ్మరుచు, కాలవశమున చంద్ర శర్మను గాంచి ఆనందించి, పాతంజల భాష్యము నతని కుప దేశించి శాపవిముక్తి నొందినట్లు పతంజలి చరిత్రాదిక గ్రంథ ముల రచనము.

కాని యిందు అనేకలోపములు గానబడుచున్నవి. యోగసూత్రము మహోనిగ్రహాదికము నుపదేశించి ఋతంభరప్రజ్ఞా తాది సమాధి సంస్థితుల గోణికాపుత్ర సన్నిధిని గ్రహించి, అనుభవించి ప్రచారముగావించిన పతంజలి మహర్షి తన దర్శ నము గోరిన శిష్యుల దహింపజేయుటయం దెట్టి ఔచిత్యమును గానుపింపదు. అటులే క్రోధముగాని గౌడపాదుని శపించుటయు నన్యాయము అయోగ్యము. ఈ గాథ పతంజలికి ఔన్నత్యము గల్పింప రచింపబడినదైనను, కానికే న్యాఘాతముగనుండుట విచారకరము. కాని గౌడపాదుడే ఆబ్రహ్మరక్షస్సు అని నిరూపింప సాధ్యము కాదు. పతంజలి శపించు ఘట్టమున నా శాపగ్రస్తుడు గౌడపాదుడని వచింపబడలేదు. (పతంజలి,5.20) అంత నతడు దేశముల గ్రుమ్మరుచుండునంత కాలము రక్షస్సు నామముననే బరగెను. కాని గౌడపాద నామము అగోచరము. 'పతంజలి శిష్యో రక్షః' (5.27), ఉజ్జయినీ నగరవాసియైన చంద్రగుప్త (5.31) నతని భాష్యోపదేశము నర్థించి నప్పుడును అతడు రక్షస్సునామముననే బరగినట్లు గలదు. మహాసద్వ్యయము ఫణీంద్ర భాష్యము నతనికి బోధింప, నా రక్షస్సునకు ఆకృతి మారి 'దివ్యమూర్తి రాసీత్' (5.34) దివ్యమూర్తిగనయ్యెను.

అంత నీభాష్య ప్రచారము గావింప చంద్రగుప్తుని శాసించి అతడు 'దివ మగమత్' (5. 35) దివిని బొందెనని యుండుటచే గాలాంతరమున నాతడు గౌడపాదరూపమున శంకరాదులకెట్లు గోచరించెనో వచించుట దుర్లభము. అట్లుగాక మరల నాతడు వేదాంతగురు ప్రాప్తికై బర్యటించి, బదరికాశ్రమమునగల శుక బాదరాయణుల నర్థించి ఆత్మబోధను బొందినట్లును గొందరు వచించెదరు.[97] ఏదెట్లున్నను, గౌడపాదాచార్యుడే పతంజలి శాపగ్రస్థుడైన వాడని నిరూపింప అసాధ్యమగు చున్నది. పూర్వోక్తమురీతి వారి జీవితకాలములుగూడ చాల సుదూరములు.

గౌడపాదాచార్యుని యొద్ద భాష్యశాంతి గావించిన చంద్రగుప్తుడు చాతుర్వర్ణములలో నొక్కొక్క కన్య నుద్వాహ మాడి, ఒక్కొకరివలన వరరుచి విక్రమాదిత్య భట్టి భర్తృ హారియను నల్వుర పుత్రులంగనెను. వారికిగూడ నీతడు ఫణీంద్ర భాష్యము నుపదేశించి, కొంతకాలమునకు విరక్తిజనింప బదరి కాశ్రమమునకేగి, గౌడు నాశ్రయించి, సన్న్యసించి, గోవింద ముని యను నామధేయంబు వహించి, కొంతకాలమట వేదాంత శ్రవణముగావించి, నర్మదా తీరమున అమరేశ్వరము జెంత ఆశ్రమమునొండు నిర్మించి, శిష్యులకు అద్వైత ప్రబోధ గావిం చుచుండ శంకరు డేతెంచినట్లు కొందరి వాదము.[98] పర్యావ

---

97. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 3, పు. 4.

98. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, అ. 3, పు. 3.

స్థానమున నతడం దేశరీరముద్యజింప, నందు తన కుమారుడైన శ్రీహర్షవిక్రము డొక ఆలయమునుగూడ నిర్మించినట్లు వారి తలంపు. కాని ఈ కథన మెంతవరకు సమీచీనమో తెలియరాదు. గాకని గాథయే సంశయాస్పదమై యొప్ప దానిపై నాధార పడియుండు నిదియు సందేహాస్పదమే యగును. గురుపరంపర జెప్పుకొను నపుడు నెల్లర బ్రస్తావింపక ముఖ్యుల గీర్తించుట సహజమగుటచే, ద్వాపరాంతమున గల బాదరాయణ శుకుల యనంతరము గోవిందుని మధ్యలో గౌడపాదుడే ప్రఖ్యాతుడై యుండెనని సమన్వయించుకొనుట ఉచితము. ఏదెట్లున్నను గోవిందుని పూర్వాశ్రమ విషయమును వ్యక్తపరచు నొక ప్రమాణమేమియు గోచరింపకుండుట విచారకరము. అతనిని శంకరు గురుమూర్తిగ నెరుంగుటయేగాక నితర వివరము లెవ్వియు గానరావు. శంకరుడైనను ఎచ్చటను ఆ విషయమే తెలుపలేదు. గోవిందుడు శంకరు నాకర్షించిన విద్వాంసుడును అనుభవమూర్తియునై యున్నను, రచయిత యను నిదర్శనము లెవ్వియు గానరావు. కొందరిమతము ననుసరించి గోవిందయతి 'యోగతారావళి' 'అద్వైతానుభూతి' 'అవధూతగీత'ల రచించినట్లు గలదు. కాని యీగ్రంథములు శంకర రచనము లని వ్యాప్తి జెందియున్నవి. అంతియగాక శంకరకృత 'ఆత్మబోధ'కు గోవిందుడు వ్యాఖ్యరచించినట్లును కొందరి భావము.99 శిష్యగ్రంథమునకు గురువు వ్యాఖ్య రచించుట ఎంతవరకు సంభావ్యమో విచారణీయము. అయినను ప్రస్ఫుటక్రియ గోవిందుని గ్రంథము లెవ్వియును మనకు బ్రాప్తింపలేదని తజ్ఞుల

99. Vidya Kalpataru Press, Madras

యభిప్రాయము. అందుచేతనే వతని శంకరుగురువుగ నెంచుట మాత్రము స్పష్టమని వచించి, because of our almost total ignorance of his identity and achievements. The less we know, the less there is to question.[100] అతనిగూర్చి మనకు సంపూర్తిగ నేమియు దెలియకుండుటయే కారణమనియు, ఎంత తక్కువదెలిసిన నంత తక్కువగ సంశయము లుండునని సూర్యనారాయణశాస్త్రి వక్కాణించెను.

---

## పారివ్రాజ్యము

శంకరు డట్లు గోవిందగురుపాదునివద్ద బ్రహ్మమంత్రోపదేశము నొంది, మరల సుమారు వర్షద్వయము గురుసన్నిధి వేదాంతశ్రవణము గావించి సర్వశాస్త్ర విద్యాపారంగతుడై బ్రహ్మవిద్యాతేజోబలమున అపర భాస్కరుడై వెలుగొందు చుండెను. నాటికే గ్రంథరచనము గ్రంథవ్యాఖ్యానములం దారితేరి శంకరు డపర చతుర్ముఖుడో యనునట్లు భాసిల్లు చుండెను. రూప వైరాగ్యములందు తదంతర్గత శివత్వ ముట్టి పడుచుండెను. అప్పటి కింకను శంకరునకు ద్వాదశవర్షములు నిండలేదు. ఆయద్భుతమూర్తినిగాంచ నెవడు ముగ్ధుడై పాదముల బడడు! అట్టిచో నిక గురుదేవుని ఆనందమునకు హద్దెక్కడ ఉండును!

అట్టి శిష్యరత్నమును వీక్షించి, అతని సంపూర్ణత్వ సర్వజ్ఞత్వముల కుప్పొంగి భరతఖండమున నద్వైతవిద్యా

100. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 10.

ప్రచారమూచే నన్యమతముల నడంప శంకరుని గోవిందుడు నియోగించెను. అంత గుర్వాజ్ఞయు ఆశీర్వచనబలములు కర ముల సంధించి, ధైర్యోత్సాహములు మెఱ్ఱునంట, జేగీయ మాన ఆనందోల్లాసములు వెంటరా, యువయతీశ్వర సార్వ భౌముడైన శంకరు డపర శంకరువోలె విద్యాసారథను ముందిడుగుచుండ పారివ్రాజ్యమునకై బయల్వెడలెను. అట్లు నిజగుర్వాశ్రమమునుండి వెంటనే పర్యటన సంసిద్ధుడు గాక, గౌడపాదగురు దర్శనార్థమై శంకరుడు గోవిందు నర్థింప, వల్లె యని శిష్యు వెంటగొని, గోవిందుడు బదరికాశ్రమమున నున్న గౌడపాదునివద్దకు శంకరు గొనిపోయినట్లును, అట 120 వత్సర ములు గల నాగురోత్తంసుని, తన పరమగురు దర్శనమున శంకరుడు ముగ్ధుడైనట్లును కొందరందురు.101 అట శంకరు విద్యాపాటవమును, రచనావిధానమును గౌడపాదుడు గ్రహించి, ఆనంద తరంగములు హృదంతరాళమున నుప్పొంగ, నద్వైతబోధను క్షుణ్ణముగ గావించి, తన మాండూక్య కారికలకు భాష్యము నిర్మింప ఆజ్ఞారూపమైన అనుజ్ఞ నొసంగ, శంకరుడు దాని అచిరకాలముననే రచించి గౌడపాదున కర్పింప, దాని గాంచి, గౌడుడానందమున వికసిత వదనుడై తన భావ విధానమును శంకరుడు సమగ్రముగ గ్రహించెనని సంతసించి, అడేరీతి బ్రస్థానత్రయమునకు అనగా ఉపనిష త్సూత్ర గీతలకుగూడ భాష్యముల రచింప శంకరున కాజ్ఞా పించెను. అచటనే తన ద్వాదశ వర్షప్రాయముననే శంకరు

101. శ్రీ శ్రేష్ఠులూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, ఆ. పు. 11.

లాభాష్యగ్రంథముల రూపొందించి, తన గురులోకమునకు అమందానందము గలుగజేసి, గురు ఋణ విమోచనము నొందెను. అందులకు సమ్మోదితుడైన గౌడపాదుడు, అసాధారణ ప్రజ్ఞగలిగిన యీ అసర శంకరుని దన గురువర్యుడైన శుక బాదరాయణులకు జూపించి, శంకరునకు ఆశీస్సుల నందింప సంకల్పించి, శంకరుగొని శుక బ్రహ్మగల కైలాసమునకు వెడలెను. అంత శంకరకృతగ్రంథముల శుకవ్యాసులాకర్ణించి ఆనందించి, అద్వైత సిద్ధాంతస్థాపన కార్యము నతనిపై నుంచి, అదృశ్యులై మహాకైలాసమునకు బోయిరి. ఆవ్యాస శుక ద్వయము అదృశ్యులగుటతోడనే వెంట నరిగిన గౌడపాదాచార్యుడును అదృశ్యముకాగ శంకరుడు చింతించి, కైలాసాధినాథుడైన శంకరు బ్రార్థింప, నాశివశంకరుడు సాక్షాత్కరించి, తనను బరివేష్టించియున్న వామదేవ బాదరాయణ శుక గౌడపాదాది మహనీయుల జూపించి, పుస్తకహస్తుడై తన దక్షిణామూర్తి స్వరూపమును శంకరునకు సాక్షాత్కరింప జేసెను. అంత శంకరుడు తిరోగమించి బదరికాశ్రమమును జేరి, అటనుండి విద్యాప్రబోధకొరకై విద్యానిలయమై, సర్వసిద్ధాంత సాగరమైన కాశీనగరమును జేరెను.

కాని పైగథిత గాథ మాధవీయమున గానుపింపదు. పైవర్ణనమున గౌడపాద శుక బాదరాయణత్రయము శంకరు నాశీర్వదించి అదృశ్యులైరని యనుటలో నామూర్తిత్రయము తమ స్థూలశరీరములతోగాక సూక్ష్మశరీరముల శంకరునకు దర్శనము నొసంగియుందురను తలంపు సహజరీతి దోచును. శంకరు రచనములు అనగా మాండూక్యకారికాభాష్యము

కారికాకారుడైన గౌడపాదుని చేతను, సూత్రభాష్యము సూత్ర కర్తయైన బాదరాయణుని చేతను అంగీకరింపబడినవని దెలుపుట కనుట కతిశయోక్తిగ నీగాథ కల్పింపబడియుండునేమో అని దోచెడిని. అందుచే బండితులా గాథను త్రోసిరాజనిరి. చిత్సుఖాచార్యుడుమాత్రము దీని జిత్రించెను.

---

## కాశీవాసము-రచనలు

అంత శంకరయతీంద్రుడు వారణాసీనగరమునుండి విద్యాప్రచారము గావించుచుండ శిష్యు లాకర్షింపబడి దగ్గరకు జేర మొదలిడిరి. అందు బ్రథముడు కాలాంతరమున పద్మపాదాచార్యుడగు సదానందుడు. ఇతడు చోళరాజ్యమైన దక్షిణాపథమునజిదంబర క్షేత్ర వాసియై, కుటుంబమున బరంపరాగతమైన మీమాంసాశాస్త్రమును ముఖ్యముగ ప్రాభాకర వాదము నధ్యయనము గావించుచు, శంకరు ప్రఖ్యాతి నాలించి ఆశ్రయించెను. ఈ గురుశిష్యుల అన్యోన్య ప్రేమభక్తు లకుంఠితములు. కాలాంతరమున నాతడు శంకరున కెల్లు తోడ్పడి కిటుసమయముల నుపయుక్తమైనదియు, నిటులే శంకరుడును అతని మాటనే యెల్లు మన్నించుచుండినదియు గానబడును. శంకరు వెంట బర్యటించి, శంకరున కండదండయై ప్రవర్తించి ముఖ్యుడని ప్రఖ్యాతిని గాంచినవా డీ పద్మపాదుడు. అందుచే నితనిపై అన్యశిష్యుల కసూయ జనించుచుండ శంకరుడు గ్రహించి, అతని అచంచల గురుభక్తిశక్తుల బ్రదర్శింపజేయ

నొక దినమున గంగకావలదరి బా నుండి, సదానందుని రా నాజ్ఞ నొసంగ, వెంటనే నా గురుభక్తిప్రపూరితుడైన శిష్యాగ్రమణి గంగోదకముపై నడిచి గురుని జేరెను. ఒక్కొక అడుగు నత డిడుచుండ నతని కాలూనుస్థలమున గంగాతరంగిణి యొక్కొక పద్మము నుంచుచు, నతని నద్దరి జేర్చుటచే నాడు అతనికి శంకరు డానందమున బద్మపాదుడని నామకరణ మొసంగెనని ప్రతీతి. కాని నామము ననుసరించి తర్వాత యీగాథ కల్పితమనియే దోచును. ఎట్లైనను యితడే శంకర శిష్యులలో నతి ప్రాధాన్యము నార్జించిన వాడనుట ముఖ్యము.

కాని పద్మపాదుడు ప్రథముడుగాదని మరియొక వాదము గలదు. గోవిందుని జేరుటకు బూర్వమే గోకర్ణక్షేత్రమున తన్నివాసియగు విష్ణుశర్మ యను నాత డొకడు శంకరు జేరి, యంత గోవిందు సన్నిధి శంకరునితోసహా విద్యాదుల నేర్చి ఉత్తీర్ణుడయ్యెను. శంకరుడు కైలాసాదిశమున బర్యటించి, బదరికాశ్రమమున వేచియున్న విష్ణుశర్మను గలిసికొని, గోవిందుని జేర బయనించి, మార్గమధ్యమున విష్ణుశర్మయొక్క ప్రార్థనపై నతనికి సుఖాశ్రమము నొసంగి చిత్సుఖాచార్యుడను యోగపట్టము నిడెను. అంత నతడు శంకరు వెంట బర్యటించుచు బదరికాశ్రమమున ఆలయనిర్మాణ సమయమున, గాలటిలో నార్యాంబదర్శన కాలమున, కాంచీపురమున గామాక్షి ప్రతిష్ఠాది కార్యనిర్వాహణకాలమున నుండి శంకరుడు కాంచీపురమున బ్రహ్మైక్యము నొందగా ద్వారకాపురి కేగి, అట ద్వారకాపీఠమున బ్రహ్మస్వరూపాచార్యులకు బిమ్మట అధ్యక్షుడై, పదునాలుగువత్సరములు ఆపీఠము నలంకరించి, క్రీ. పూ.

434 వ వత్సరమున దనకు ఎనుబది వత్సరములు నిండగ సిద్ధి బొందెను. ఇతడు శంకరునికంటె అయిదు సంవత్సరములు జ్యేష్ఠుడనియు బ్రతీతి. కాని యితని బ్రస్తావనము చిత్సుఖాచార్య రచితమని చెప్పబడుచున్న బృహచ్ఛంకరవిజయమున గాక, తదితర గ్రంథముల గానరాదు. కాని యితడు జ్ఞానోత్తముని శిష్యుడనియు, శుకప్రకాశముని యొక్క గురువనియు స్పష్టము. ఇతడు సుమారు 13 గ్రంథముల రచించినట్లును తెలియగలదు. ఇతడు 13 వ శతాబ్దమువాడని పండిత నిర్ణయము.102 కాన నీగ్రంథమును అతని ప్రియతముడైన శిష్యుడు రచించి, గురు ప్రాముఖ్యమును నినుమడించు తలంపుచే చరిత్రరచనమున గొన్నిసమస్యలమాత్రము కల్పించె ననుట యుక్తము.

అట్లు వారణాసి నివాస మేర్పరచుకొని, అద్వైత విద్యాప్రదర్శనము గావించుచు, అద్వైత సిద్ధాంత ప్రబోధక మైన రచనల గావించుచు శంకరుడు గొన్ని వత్సరము లుండెను. కాశీ నివాసకాలముననే 'మనీషా పంచకము'ను శంకరుడు రచించినట్లు ప్రతీతి. ఒకదినమున మాధ్యాహ్నిక స్నానార్థమై శంకరుడు శిష్యపరివేష్టితుడై గంగకు బోవుచుండ మార్గమధ్యమున గొన్ని శునకములచే బరివృతుడైన నొక ఛండాలు డెదురయ్యెను. శిష్యులాతనిగాంచి గుర్వాగమనమును దెలుపుచు దూరముగ బోవ నతని నాజ్ఞాపింప, నాఛండాలుడు శంకరు సంబోధించుచు నద్వైత రహస్య ప్రదీప్తములైన గొన్ని విషయముల బ్రశ్నించెను. దూరముగబో శాసింపబడునది జడమగు శరీరమా, లేక సర్వాంతరమైన ఆత్మయా? ఈ ఒక్క

102. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2.

ప్రశ్నతో శంకరుడు ఎదుటగలవాడు ఛండాలుడు గాడనియు, సాక్షాత్తు శివుడే యీ రూపమున వచ్చి, తనను బరీక్షింప నెంచెనని గ్రహించి వెంటనే యీ రచనమును గావించెను. అంత బరమశివుడు సాక్షాత్కరించి అదృశ్య మయ్యెను. ఈ గాథ అంతయు సముచితమే. అద్వైతవాదము బ్రహ్మమును సర్వాతీత మనుటయేగాక, అదియే సత్యము, సర్వేతరము మిథ్య అని బోధించుచుండ, నిక నంటరానితన మెపట అని యథార్థమున నొక ఛండాలుడే ఎదురుదిరిగి ప్రశ్నించియుండ వచ్చును. అందుల కుచితసమాధానమును కవిసార్వభౌముడైన శంకరుడు ఒసంగియుండవచ్చును. అట్టు యథాతథముగ గాక దానిని అభౌతికము అవ్యావహారిక మొనగ్చుట అసమంజస మనిపించును.

అటులే ఆ కాలమున నొకదినమున శంకరుడు, ఒక విద్యార్థి కేవలము వ్యాకరణసూత్రముల బఠించుచు నుండ గాంచి, భక్తితన్మయత్వమున మునుంగునట్లు 'భజగోవింద' శ్లోకముల జెప్పినట్లును చరిత్ర. అదియు సమంజసమే ప్రౌఢులు ప్రాథమికుల జూచి విచారించి ఆతురత జెందుటయు సముచితమే.

అంత గొంతకాలమునకు శంకరుడు పూర్వ మనేక పర్యాయములు దా వాసముండియున్న బదరికాశ్రమమునకు జనెను. అచటనే తన పండ్రెండవయేటనే శంకరుడు ఉపనిష ద్భాష్య, సూత్రభాష్య, గీతాభాష్యములను రచించినట్లు కొందరందురు. ఆభాష్యములు కాశీనగరముననే రచితములని గొందరు వచించెదరు. ఎటులైనను ఏ గ్రంథములు ఎప్పుడెచట నిర్మితములో స్పష్టముగవచింప నసాధ్యమే యగును. బదరి

కాశ్రమమున శిష్యపరివేష్టితుడై శిష్యేతర శ్రోతలనేకులకు భాష్యశ్రవణము బ్రసాదించుచుండ, నతని ప్రఖ్యాతి దిగంతముల నిండెను. సంతసించు వారివోలె లోకమున నసూయాగ్రస్తులై కంటగించుకొను వారును బహుళముగనే యుందురు. ఆ కాలమున నొక విచిత్రసంఘటనము జరిగెను. ఒకనాడు భాష్య శ్రవణకాలమునకు వృద్ధబ్రాహ్మణు డొక డరుదెంచి, శంకర వ్యాఖ్యానమును పలువిధముల ప్రశ్నించుచు, ఖండించుచు దీవ్రముగ శంకర సిద్ధాంతమును ముఖ్యముగ సూత్రభాష్యమును ఎదుర్కొనెను. యువకమూర్తియై విద్యాచక్రవర్తియైన శంకరుడు వెనుకంజ వేయక నా వృద్ధునితో సమర్థముగ వాదించుచుండెను. ఈ తాత మనుమ లిరువురు హోరాహోరిగ నహోరాత్రములు ఒకవారము బోరాడిన పిమ్మట, నా వృద్ధుడు శంకరసిద్ధాంతమునకు సంతసించి, అనుమతించి వెడలి పోయెను. ఈ ఘట్టముగూడ మతస్థాపకుల జీవితములలో సామాన్యమే అయినను ఆవృద్ధుడు గట్టివాడగుటచే నతని సూత్రకర్తయైన వ్యాసునిగా జిత్రించి, శంకరుడుగూడ గుర్తింపలేని అతని నిజవ్యక్తిత్వమును పద్మపాదుడు గ్రహించి, శివకేశవ సంవాదము నిక జాలింప నర్థింప, శంకరు డప్పుడు గ్రహించి విరమించెనట. ఇందును సూత్రభాష్యము న్యాయసమ్మతమని యనిపించుటకు నావృద్ధ శంకరసమాగమమును వ్యాస శంకర సమాగమముగ నన్వయించినట్లు ప్రస్ఫుటము. అంతియగాక "కృతే విశ్వగురు ర్బ్రహ్మ త్రేతాయాం ఋషిసత్తమః। ద్వాపరే వ్యాస ఏవ స్యాత్ - కలావత్ర భవామ్యహం॥"(5.25) కృతయుగమున బ్రహ్మయును, త్రేతాయుగమున వసిష్ఠుడును

ద్వాపరమున వ్యాసుడును జగద్గురువులు. కలియుగమున జగద్గురువునై నేనే అవతరించితిని అను మఠామ్నాయ మహాను శాసనమున శంకరవాక్యము. 'తథా చ వ్యాసాదయో దేవాదిభిః ప్రత్యక్షం వ్యవహరంతీతి స్మర్యతే' (బ్ర సూ. భా. 1. 3. 33) వ్యాసాదులు దేవాదులతో ప్రత్యక్షముగ వ్యవహరించిరని స్మరింపబడు చున్నదను శంకరవాక్యములు వ్యాసుని ప్రాచీనునిగనే దెలుపుచున్నవి. గాని శంకరుకాలమువాడని అర్థస్ఫురణము కలుగుటలేదు. అందుచే నావృద్ధుడు వ్యాసేతరుడై వ్యాసతుల్యుడైన ఒక మహావ్యక్తి అయి యుండును. అప్పటికి దాదాపు శంకరరచనము లన్నియు ముగిసి, పై విధాన నితరుల విమర్శనలు చర్చలతో నవసర సవరణల గాంచి ఒక విశిష్టరూపమును బొందియుండెను. అందుచే శంకరు డిక నెట్టి ఆటంకము లేక, ఆటంక మొదవినను ప్రత్యర్థుల భావజాలములగూడ గ్రహించి, తదనుగుణ పూర్వపక్షసిద్ధాంతముల సంసిద్ధపరచుకొని యుండుటచేత దేశముల దిగ్విజయ యాత్ర కుపక్రమించి, దేశమునగల సర్వేతర సిద్ధాంతముల ఖండించి జయించి, పరిపుష్టమై జగచ్ఛ్రేయో సిద్ధివిలసితమైన అద్వైత సిద్ధాంత ప్రసరణమునకై దేశపర్యటనము గావింప నుద్యుక్తుడయ్యెను.

---

## దిగ్విజయయాత్ర

చిద్విలాసయతి విజయము ప్రకారము నాడు కాశీనగర పాలకుడైన రత్నసింహుడు శంకరుని అప్రతిహత విద్యావైభవ

సంపత్తిని గ్రహించి, గౌరవించి, అచ్చటనేయుండి తన కానంద
మును గలుగ జేయుమని ప్రార్థింప శంకరుడును, నిజ
కర్తవ్య స్ఫూర్తి గలిగినవాడు కావున, నొక రాజాశ్రయమున
నొకచో గాలక్షేపము గావింప డానవతరింపలేదని యెఱింగి,
'పరివ్రాజకత్వమే తన ధర్మమని అతనికి దెలిపి, అటనుండి పయన
మయ్యెను. ఆనందగిరి చిద్విలాసుల కథనము ననుసరించి
చూచుచో నాడు శంకరుడు సామాన్య సన్న్యాసివలె బర్య
టింపక, రాజప్రాపకమున సిద్ధించిన అనేక రాజ లాంఛనాది
పటాటోపములతో దేశముల దిగ్విజయయాత్ర గావించినట్లు
తెలియును. ద్వారకాధీశ్వరుడైన సుధన్వమహారాజు శంకరు
గురువుగ స్వీకరించి, గురువర్యుని సేవాలాలసుడై శంకరు వెంట
నంటి యుండినటుల ముందు దెలియగలదు. కొందరి అభి
ప్రాయము ననుసరించి అప్పుడు శంకరునకు ఇరువది అయిదు
వత్సరములుండెను.103 కాని కొందరు శంకరుడు కుమారిలుని
గలియునప్పటికి పదునైదువర్షముల ప్రాయమేఅని తలంతురు.104

ప్రథమతః శంకరుడు తీర్థరాజ మగు ప్రయాగక్షేత్ర
మును జేరి త్రివేణీసంగమస్నానాదుల నాచరించుచు, నందలి
జిజ్ఞాసువులకు బోధించుచు, ప్రత్యర్థుల నోడించుచునుండ, నొక
నాడు మీమాంసాశాస్త్ర వ్యాఖ్యాన దురంధరుడైన కుమా
రిల భట్టు ఆత్మపవిత్రతకై తుషాగ్ని బ్రవేశింప నున్నాడని
విని, అంతకుమున్నె అతనితో సంభాషింప నభిలషించుచున్న

103. C.N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 21.

104. జీవవిజయము: సంస్కృత చంద్రిక, 9, పు. 6.

శంకరుడు వెంటనే సమీపమునగల రుద్రపురమునకు కుమారిలు జూడ నేతెంచెను. ఈతడు జైన బౌద్ధ సిద్ధాంతముల నాయా గురువులనుండి నిగూఢరూపమున గ్రహించి, గుర్తింపబడి, బహిష్కరింపబడి, క్రోధావేశమున నామతముల రాజాశ్రయ బలమున రూపుమాపియుండి, అవసానకాలమున గురుద్రోహ మహాపాతక నివారణార్థము ప్రాయశ్చిత్తపూర్వకముగ నిష్ఠుతుషాగ్ని బ్రవేశించి, మరణింప నుద్యుక్తుడైనట్లు పూర్వమే గ్రహించియున్నారము. శంకరుడటకు జేరునప్పటికే అతడు అగ్నిప్రవేశము గావించినట్లును, కొంతవరకు దహింపబడినను అతడు శంకరునితో గొంతతడవు ప్రసంగించి, ఆనందించి, మాహిష్మతీనగరమునగల తనశిష్యుడైన మండనమిశ్రుని జూపించి దేహత్యాగము జేసినట్లును జరిత్ర వివరించును. కాని సర్వసంసిద్ధుడైయున్న కుమారిలుని శంకరుడు దర్శించి, చర్చించి, అతని సంకల్పమును మార్పయత్నించి విఫలత నొంది యుండును. కుమారిలుడు సుధన్వాది అనేక బౌద్ధప్రభువుల సంస్కరించి, వైదికకర్మాగాములనుగ నొనర్చి, వారిద్వార దేశమున వైదికమత స్థాపనము గావించిన మహాపురుషులలో నగ్రగణ్యుడు. అతనికాలమున నతని కెదురు అనునదియే లేదని చెప్పనొప్పును. అతడు కామరూపమనబడు అస్సాము దేశమువాడని తమిళదేశస్థుడనియు నందురుగాని, అతని ప్రత్యర్థులైన 'జినవిజయ' కర్తలు అతని ఆంధ్రుడనియే తెలుపుచున్నారు. కాని అతని జీవితకాలమంతయు ఉత్తరదేశముననే గడచి, అచటనే అతని ప్రభావము ప్రసరించెనుగాని ఆంధ్రమున బ్రబలినట్లు గోచరింపదు. అది ఆంధ్రుల దురదృష్టము.

అతడు క్రీ. పూ. 494 వ సంవత్సరమున అనగా శంకరునకు పదునైదవ వర్షప్రాయమునందు దివంగతుడై యుండెను. అతడే జీవించియుండి, శంకరునకు అతనికి సంవాదము జరిగి యున్నచో చరిత్ర మఱియొకరూపము నొందియుండెడిది. ఆప్రజ్ఞాశక్తి జయించినను, ఓడినను నాటి తాత్త్విక ప్రపంచ స్వరూపము వేరువిధముగ నుండెడిది. అయినను, The story is not vouched for by any known history, and it has no significance to commend it.[105] ఈ శంకర కుమారిల సమాగమ గాథ చారిత్రక సాక్ష్యములుగలదిగా లేకుండుటచే దాని సమ్మతించుటయందు ప్రాముఖ్యతలేదని సూర్యనారాయణశాస్త్రి అభిప్రాయము. ఈ కథనము నిష్ప్రయోజనమని వచించి, for chronology does not favour it,[106] కాలక్రమము అనుగుణముగ లేదనియు దెలిపి, దానికి చారిత్రక ప్రామాణ్యము లేదని కృష్ణస్వామి అయ్యరు వ్రాసి యున్నారు. కుమారిలునకు శంకరునకు ప్రాచీనుడనియు వారిరువురిసమాగమము దుర్లభమని భాష్యాచార్యుల వాదము.[107]

---

## శంకర మండన సంవాదము

జంతి యతిసార్వభౌముడు కుమారిలునితో జర్చింప నవకాశమును గోల్పోయినందులకు వగచి, కుమారిలుని

---

105. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 17.
106. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 29.
107. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p17

ముఖ్యశిష్యుడును, బావమరదియునైన మండన మిశ్రునితో వాదమునకై మాహిష్మతీపురమునకు వెడలెను. ఈ నగరము మగధసామ్రాజ్యమునకు రాజధానిగనుండెనని మాధవాదులు వచింప, నది హస్తినాపుర సమీపమున యని ఆనందగిరి వ్రాసెను. రఘువంశము(6.43)యీనగరము నర్మదాతీరమున గలదని తెలుపుచున్నది. అటులే మాఘకావ్యముగూడ (2.64) తెలుపుచున్నట్లు తెలాంగు తెలుపుచున్నాడు. ఎట్లైనను మండనపండితుడు అచట రాజగురువగుటచే నత్యధిక భోగభాగ్యముల దులదూగుచు, ననేక శిష్య సంచయమునకు గర్మకాండ ప్రబోధ గావించుటయేగాక, అతని గృహప్రాంగణమున ముందు నుంపబడిన చిలుకలును 'స్వతః ప్రమాణం పరతః ప్రమాణం కీరాంగనా యత్ర గిరం గిరంతి' (8.6) వేదములు స్వతః పరతః ప్రమాణములే అనురీతి పఠించుచుండు సంపూర్ణ వైదిక కర్మభావ సమ్మర్దమైన వాతావరణమును అతడు అత్యంత శక్తియుక్తుడై గావించియుండెను. ఇతడు కుమారిలుని శిష్యుడగుటయేగాక అతని బావమరది అనియు దెలియుచున్నది. మరియు 'మీమాంసానుక్రమణిక' 'విధివివేక' మొదలైన గ్రంథములగూడ రచించి అప్పటికే ప్రఖ్యాతుడై యుండెను. ఇట్టి ప్రత్యర్థితో శంకరుడు వాదించి జయించి అద్వైత ప్రతిష్ఠ గావింపవలయును. శంకరు జీవితమున నీ సంఘటనయే అత్యంత ప్రధానమై, అతని జీవిత విధానమున నొక నూతనాధ్యాయమును బ్రారంభింప జేసినదని జెప్ప నొప్పును. మండనుని ఓటమితో, నాటి కర్మవాదులందరును దలయొగ్గుటయేగాక మగధాధీశ్వరునితో బాటు

అనేక రాజవశ్యులు శంకరునకు అధీనులై, శంకర సంకల్పమైన అద్వైతసిద్ధాంత స్థాపన కార్యమున విజయము చేకూర్చిరి. అందుచే ఈ సంఘటనము మిగుల ప్రధానము.

కుమారిలు ఆదేశమున మాహిష్మతీనగరమున కేతెంచిన శంకరుడు, మండనుని విద్యావైభవాదుల విషయము పూర్వమే వినియుండెను ఆనందమున నతని నెదుర్కొనుటకు నేతెంచియుండుటచే నతని రాజభోగ్య వైభవాదుల గూడ గాంచి ముగ్ధుడై అతనితో వాదింప నతని గృహమున కరిగెను. మండనమిశ్రు డితడు గాదనియు, నా మండన మిశ్రుడు 'బ్రహ్మసిద్ధి' అను అద్వైత గ్రంథమును రచించి యుండెననియు, నితడు శంకరునకు పూర్వుడనియు సూర్యనారాయణశాస్త్రి అభిప్రాయము.108 మాధవుడు తన గ్రంథమున 'మండన పండిత' (8. 1, 4, 7, 33, 52, 133) 'మండన' (10.73) మొదలగు పదముల నుపయోగించుచు 'మండన మిశ్రః' (10.74) అనికూడ ఉపయోగించి యున్నాడు. పరాభూతుడై అతడే సురేశ్వరుడైనట్లుకూడ (10.104) మాధవుని గ్రంథము. కాని అద్వైత గ్రంథకర్తయగు మండనుని మిశ్రపదము కర్మమార్గగామి అయిన మండనునికి గాలాంతరమున సంక్రమింపబడి యుండవచ్చునని సూర్యనారాయణ శాస్త్రి సమ్మతము. అంతియగాక మండన మిశ్రుడు వేరనియు, శంకరుడు వాదించినది విశ్వరూపాచార్య నామధేయుడనియు గురువంశ కావ్యరచయిత రామశాస్త్రి కథనము. (2.45) కుమారిలుడే 'శిష్యో మమాస్తి మగధేషు స విశ్వరూపా' అని

---

108. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 17

వచించును. అతనికే ఉభయభారతి అని సరస్వతీ స్వరూపమైన పత్నిగలదనియు కుమారిలుఁడు శంకరునకు దెల్పెను. (2.45) ఆవిశ్వరూపుడే 'సురేశ్వరాచార్య సంజ్ఞాం' (2.51) సురేశ్వరాచార్య నామమును తురీయాశ్రమమున గైకొనినట్లును గురు వంశ కావ్యము తెలుపుచున్నది. పూర్వోక్తచందము, శంకర కాలానంతరము అనేకశతాబ్దములు గతించిన పిమ్మట నానా దేశములగల గాథల ననుసరించి యీ చరిత్రము అల్లబడి యుండుటచే నిట్టిదోషములు సహజముగనే పొడముచుండును. మండనుడే విశ్వరూపుడై ద్వితీయ నామమును గలిగియుండ వచ్చును. కాని మిశ్రపదము పూర్వాచార్యునినుండి కాలాంతరమున నితనికి అన్వయింపబడి యుండనగును. అందుచే మిశ్ర పదములేని మండన పండితుడే విశ్వరూపాచార్యుడు. అతడే శంకరునితో మాహిష్మతీనగరమున సిద్ధాంతచర్చ గావించి పరాభూతుడై సురేశ్వరుడై యుండుననుట సమ్మతమగును. విశ్వరూపుడే సురేశ్వరుడను విషయము మరల స్థలాంతరమున గాంచెదముగాక.

మాధవీయము ననుసరించి చూచినచో, నట్లు స్వగృహమున కేతెంచిన యతీశ్వరుడైన శంకరుని మండన పండితుడు సగౌరవముగ నాహ్వానింపడు. నాడు తనయింట పితృకార్య మగుటచే తన్నిమగ్నుడైయుండు మండను నెదుట శంకర సంయమీంద్రుడు గోచరింప, వైదిక కర్మవిశ్వాసముగల మండనుఁడు కర్మత్యాగియైన శంకరుజూచి, ఉగ్రుడై అగౌరవించెను. అచ్చట వారిరువురికి జరిగిన సంభాషణము ఔచిత్యము నుండి తొలగిపండితచర్చ యనిపించుకొనకుండుటచింతనీయము.

వారిరువు లట్లు కలహపడుచుండ నటనున్న బ్రాహ్మణులు వారి సమాధానపరచిరి. అంత శంకరుడు కర్మ బ్రహ్మవాదములను మండనుని ఆహ్వానింప నందులకు నతడును సమ్మతించెను.

కాని యిరువురు వాదులాడుకొనువేళ వారి జయాప జయముల దీర్మానింప సమర్థులగు మధ్యవర్తి యొకడుండ వలెను. అందులకు నిరువురును సంప్రతించుకొని మండనుని సతీరత్న మగు ఉభయభారతినే అధ్యక్షస్థానమునకు నాహ్వానించిరి. ఆ దేశాధిపతియే మధ్యవర్తి స్థానమున నుండి యుండునని కృష్ణస్వామి అయ్యరు భావించుచు కాని, ఆ స్థానము నలంకరింప సర్వశాస్త్ర విద్యాపారంగతులకే సాధ్యము గాని దేశాధిపతులకు అసాధ్యము. అందుచే నెల్లవిధముల నర్హతగల నా సరస్వతీ రూపిణియగు ఉభయభారతినే వారిరువురు ఎంచుకొని యుందురు. మరల నిచట ఒక విచిత్రము. భర్తృవిద్యావైభవమును భార్య పరీక్షించుట! అటులే ఒక సన్న్యాసియొక్క ప్రజ్ఞాకౌశలమును ఒక స్త్రీ పరీక్షించుట! ఇది ఒక అపూర్వ సంఘటనము. శాస్త్రాధ్యయన బాహ్య లని నేడు అనబడు స్త్రీలోకమునకే యీ ఘట్టము కనువిప్పు. భర్తృ పరాజయానంతరము తాగూడ నోడి, శంకరు ఆహ్వానముపై దాగూడ సన్న్యసించి, శృంగేరి జేరి, అసాధారణ విద్యాపాటవ ముతో సహా సాధనానుభవాదుల నార్జించి, పరిసరముల బునీత మొనర్చి, నెల్లరచే ముఖ్యముగా శంకరునిచేగూడ బూజింప బడుట గమనార్హము. ముఖ్యముగ ఆమెతో బూర్వపరిచయము లేక నామె ప్రజ్ఞావిభూతుల దెలియని శంకరుడు ఆమెయొక్క అధ్య క్షత నెట్లు సమ్మతించెను? మీదుమిక్కిలి ఆమె తనకు ప్రత్యక్ష

యైన మండన పండితుని భార్యగదా! కాని కుమారిలుని నుండియు, మరి యితరులనుండియు శంకరుడు ఇతఃపూర్వమే యీ పండిత దంపతుల ప్రశస్తి వినియుండును. ఆమెయొక్క నిష్పాక్షిక స్వభావము సుగుణసంపదల నాకర్ణించి, విశ్వసించి యుండుటచేతనే శంకరుడు అంగీకరించెనని దోచును.

అంత నామె మధ్యవర్తిత్వమున శంకర మండన సంవాదము సాగెను. ఆమెకు గృహకృత్యములకు మధ్యవర్తిత్వమునకును కాలవ్యవధి చాలక, అనగా వారి వాద ప్రతివాద సమయముల సంపూర్తిగ నట కూర్చుండజాలక, వారి కంఠముల రెండు పుష్పమాలల వైచి, ఓడినవారి హారము వాడునని చెప్పి తన గృహకార్యనిర్వాహణమున నుండెడిదట. కాని అది అసమంజసమే. మధ్యవర్తి నాద్యంతము నక్కడనే యుండి, వారి వివాద విధానమును, బూర్వపక్ష సమాధానముల నాలయుచు, నవసరము ననుసరించి సవరించుచుండు కర్తవ్యముగూడ అధ్యక్షునికి ముఖ్యము. ఆమె ఆ విధముగనే తన బాధ్యతను నిర్వర్తించియుండును. కాని ఆమెయు, గర్మమార్గావలంబినియై ఆదర్శగృహస్థుడైన మండన పండితుని సహధర్మచారిణియగుటచే నామెయు గార్హస్థ్య ధర్మముల నాదర్శప్రాయముగ నిర్వర్తింపవలయుగదా యను తలంపున నామె వాదకాలమున నట లేనటుల చరిత్రకారులు ఉత్తర కాలమున జిత్రించిరి. అచట నా అభౌతిక శక్తినిగల్పించి మాలల జిత్రింప నవసరము కానరాదు. అంతియగాక భర్తృ పరాజయానంతరము ఆమె దూర్వాస శాపగ్రస్థయగు సరస్వతి యగుటచే, దన నిజత్వమును స్మరించి వెంటనే దివి కరుగ

సంసిద్ధము కాగ, శంకరు డామెను ప్రార్థించి, తమతో శృంగేరికి గొంపోయి, అట ఆమె కొరకు ఆలయమును నిర్మించినట్లు నుండుటచే పుష్పమాలాసద్ధతివలన నామె విద్యాతిశయము బహిర్గతము కాకుండెడిది. అందుచే నా విదుషీమణి యథావిధిగా వారి సంవాదకాలమున నుచితాసనోపవిష్టయై సంవాదమును శాస్త్రీయముగ నిర్వర్తించి యుండవలెను. నందుచేతనే శంకరునకు ఆరాధ్యదేవతగ పూజపొందియుండు ననియు దీర్మానము.

బ్రహ్మకర్మ లుభయములు చర్చించుకొనుచు జిజ్ఞాసువుల కానందము గలుగ వరుసగా నేడుదినములు వాద ప్రతివాదముల సాగించిరి. అందు బూర్వోక్త మీమాంసాశాస్త్రములే గాక వ్యాకరణ న్యాయాదులును ప్రతిధ్వనించెను. అఖండ విద్వాంసులు ఒకచో జేరి ప్రసంగించుకొనుకాలముననే సర్వశాస్త్రములు నృత్యము గావించుగదా యిక, జగత్ప్రసిద్ధ ప్రజ్ఞానిధు లిరువురు ప్రత్యర్థి పరాజయాపేక్షతో గావించు ప్రసంగములలో వేద వేదాంగములా, వ్యాకరణ న్యాయములా, పురాణేతిహాసములా ధర్మశాస్త్రములా పరిహాసములా ఒకటేల సర్వవిధ ప్రసంగము లందు దాండవించి యుండుననుటకు సందియములేదు. అంత నేడవనాటికి మండనుడు శంకరు విద్యాపాటవమునకు, వాద ప్రౌఢిమమునకు బూర్వపక్ష సిద్ధాంతముల తాడనములకు ఉక్కిరి బిక్కిరి అయినవాడై ఓటమికి సమ్మతించెను. అంతటితో అద్వైతవాద జయభేరి ప్రథమతః శంకరుకాలమున నా మాహిష్మతినగరమున దేశమెల్లెడల బ్రతిధ్వనింప ఆకాశము పిక్కటిల్ల మ్రోగెను.

అంత నుభయభారతి యోచించి, వాదన రంగమునకు బూర్వము ప్రతిజ్ఞానుసారము మండనుడు శంకరశిష్యుడై తురీయాశ్రమమును స్వీకరింపవలయును గాన, నిక దనకు లోకమున కర్తవ్యము అభావము గాన నటనుండి వెడలిపో దీర్మానించుకొనెను. కాని శివంకరుడైన శంకరు డామెమీదగల గౌరవాతిశయముల స్మరించి, ఆమెను వారించి, తన శిష్యగణ ములతో సహా తన వెంటనుండ సమ్మతింపజేసి శృంగేరి మఠ స్థాపనానంతర మామె నటనుంచెను. అట నామెయు నధిక తపోగరిమచే నెల్లర భక్తిప్రపత్తుల కాకరమై, అచిరకాలమున సర్వజిజ్ఞాసువుల కారాధ్యయై, సహసహస్రాబ్ద్యానంతరము ప్రత్యేకాలయమున బూజింపబడు అర్హతను సంపాదించినదని తెలియుచున్నది.

ఈ యుదంతమునకు భిన్నముగ చరిత్రకారులు గాథను ఒకించుక బెంచి శంకరునకు ఔన్నత్యమును జేకూర్ప యత్నిం చినట్లు కానుపించును. భర్తృ పరాభూతత్వమును దీర్మా నించిన అధ్యక్షురాలగు ఉభయభారతి ఆ అధ్యక్షస్థానమును వీడి, పూర్వముండిన నిష్పాక్షికత్వమును వదలి, భర్తృ పక్షము వహించి, అంతవరకు మండనుని అర్ధస్వరూపమునే శంకరు డోడించినట్లును, మండనుని అర్ధాంగినిగూడ జయిం చిన గాని అతని జయశ్రీ సమగ్రము గాదనియు బ్రక టించెను. అందులకు మండనుడుగూడ బలపరచెను. కాన శంకరుడుగూడ నియ్యకొనెను. అట్లుగాక ఆమెతో గూడ

వాదించి జయింప శంకరుడే ఆమెను వాదమున కాహ్వానించె నని కొందరు వ్రాసిరి. అదియును గాక ఆమె సరస్వతీ స్వరూపమగుటచే శాపవిమోచనమున మరల బ్రహ్మలోకమున కరుగ సంకల్పింప శంకరు డామెను మంత్రబద్ధము గావింప, నామె వెనుదిరిగి, మండన పక్షము వహించి, శంకరునితో వాదింప బూనెననియు కొందరి రచనము. ఎట్టులైనను శంకరునితో నామె వాదమునకు నుద్యుక్తురాలయ్యెను. అట్లు ప్రారంభింపబడిన శంకరభారతుల సంవాదము పూర్వ వాగ్వివాదములకు మించినదై దిక్కులు మారుమ్రోగ ఊర్ధ్వలోకముల దేవతాగణమే శ్రోతలై ఆనందించుచున్నట్టుల ఎడతెగని విధానమున పదునేడుదినములు సాగెను. ఆధ్యాత్మిక విద్యాస్వరూపుడై చిద్రూపుడైన అపరశంకరునకును, సర్వవిద్యాపాదపమైన అపరశారదకును జరుగుచున్న ఆ సంవాదము నాలకింప సహస్రకర్ణములైన జాలునా? దేవతలైన వారి భావప్రవాహముల గ్రహించి అనుసరింపగలరా? చివరకు సవర సరస్వతి అపరశివుని వాదాఘాతములకు భరింపజాలక ఓటమి నంగీకరించి పూర్వోక్త చందము శంకరాదుల ననుసరించి శృంగేరికి జేరెను అని గురువంశకావ్యము తెలుపుచున్నది.

---

## అమరుకకాయ ప్రవేశము

కాని యీగాథ యింక గొంచెము పెంపు జేయబడినది. ఓటమికి జేరువయగుచున్న ఆ భారతి సామాన్యవాదవిధాన

మును ద్యజించి, పెద్రదోవ ద్రొక్కి, అస్ఖలిత బ్రహ్మచారియై శైశవముననే యత్యాశ్రమస్వీకారము గావించి, ప్రపంచము నేమాత్రమెఱుంగని ఆ బాలసన్న్యాసిని ఔచితిని గూడ బాటింపక గామశాస్త్రరహస్యముల బ్రశ్నించెను. అందులకు జకితుడై శంకరుడు తద్విద్యాప్రవేశము తనకు బూర్తిగా నభావముగుటచే జేయునదిలేక నొకమాసము గడువుసర్థించి, మాహిష్మతినివదలి కామశాస్త్రగ్రహణాన్వేషణమున బయలు దేరెను.

మరల నిట నొక అసందర్భము గోచరము. మండన శంకరులు కర్మ బ్రహ్మముల ప్రాధాన్యవిషయమునై వాదులాడు కొనుచు భారతిని మధ్యవర్తిగ నుంచియుండిరి. అందు శంకరుడు సర్వజ్ఞుడనని చెప్పుకొని ఏవిషయమునైన దననోడింప మండనుని సవాలు జేసియుండలేదు. అందుచే నింతవరకు జరిగిన వాదవిషయమునకు విరుద్ధముగ నెవరోగాక నింతవరకు మధ్యవర్తిగ బ్రవర్తించియున్న భారతియే నియమములను బాటింపక, నసభ్యముగ గామశాస్త్రవిషయ ప్రశ్నము గావించుట విపరీతముగనున్నది. అందును ఆమె పూర్వ కర్మకాండను భర్తతోసహా తు చ తప్పకుండ అనుసరించుచున్న పతివ్రతాశిరోమణియైయుండి తన ధర్మపాలనమును ద్యజించి, అసందర్భముగ భర్తయెదుటనే పరపురుషునితో, నందును ఒక సన్న్యాసితో నిట్లు కామశాస్త్రప్రసంగము జేయుట మిగుల ఆశ్చర్యకరము. అంతియగాక ఆమె సరస్వతియుగూడ! ఇంత వైపరీత్యము యీసందర్భమున గోచరించును. ఇటుల అసందర్భోచిత ప్రశ్నముల గావించిన భారతిపై మరల శంకరునకు అపారగౌరవ మెట్లుద్భవించి శృంగేరి కాహ్వానించెనో!

మండన భారతులచెంత కాలవ్యవధిగోరిన శంకరుడు, కామశాస్త్రాధ్యయనమున కుచితమగు అవకాశమునకై అన్వేషించుచు జనుచుండ నొకచో నర్మదానదీ తీరమున నొక కళేబరము జుట్టు గొందరేడ్చుచు, నా శవసంస్కారమును గావింప వేచియుండుట శంకరుడు గాంచి, వెంటనే యొక అపూర్వ యోచన భావవీథి దోప, బ్రక్కనున్న శిష్యుల సంబోధించి, తా నాశరీరమును బ్రవేశించి, తనకు గోరఁబడిన విద్యను నేర్చి యేతెంచెదననియు, నంత దనుక దన స్థూలశరీరమును ఒక వృక్షకోటరమున సంరక్షించుచుండుడని యాజ్ఞాపించి, తన అద్భుత యోగశక్తిచే నా మృతకళేబరమున బ్రవేశించెను. యథార్థమైన శంకరుదేహము చైతన్యము దప్పి భూమి కొరగగ శిష్యులు పదిలబరచిరి. వెంటనే ఆ మృతశరీరము చైతన్యవంతమై నిద్రనుండి మేల్కాంచినరీతి లేచుటయు, నా బంధుమిత్రాదు లమందానందమున నా మృత్యుంజయుని వెంటగొని వారి నిజనగరమునకు గొంపోయిరి. ఆతడు అమరుకుడను ఒక రాజు. అమరుక ప్రభు శరీరమునగల శంకరుడు, రాజభవనమున బూర్వరాజువలెనే నా యంతఃపురస్త్రీలతో వ్యవహరించుచు, దనకు పూర్వశరీరమున లోపించిన శాస్త్రరహస్యముల గ్రహించు కొనుచునుండెను. అచట వాత్స్యాయనున కామసూత్రమును గూడ అధ్యయనము గావించి అమరుక శతకమును నొక కామకలాతత్త్వమును విరచించి, శంకరుడా నర్మదాతీర అమృతపురమున (ఆనందగిరి) జిజ్ఞాసువై యుండ, నా అంతఃపురాంగనలు పూర్వరాజతత్త్వమునకును యీతనికిని గల తారతమ్యముల గ్రహించి, పూర్వ అమరుక మృత

కళేబరమున నొక మహాత్ముఁడు ప్రవేశించెనని విశ్వసించి, ఆ ప్రాంతముల గుప్తముగనున్న కళేబరముల దహింప సేవకుల బనిచిరి. అట్లు గావించినచో నా మహాత్ముఁడు అమరుక శరీరమును బరిత్యజింపక నందేహముండుననియు, గాన అమరుకుని దామము బొందియున్నట్లగునని వారి అభిప్రాయము. కాని అంత వరకు బరిసరములలో మునిగి పూర్వస్థితిని మఱచియున్న శంకరుఁడు, రాణీబృందము తనకు దెలియకుండనట్లు దేహ దహన కార్యమునకు ఆజ్ఞలనొసంగి యున్నను, చతురుడైన శంకరుఁడు ప్రమాదమును గ్రహించి, అమరుక శరీరమును వీడి తన పూర్వ శరీరమున్నగల స్థలమునకు విహంగమార్గమున నేతెంచెను. కాని యీలోపల కాల మధిగమించుటయు గురువింకను రాకుండుటయు గాంచి, అంతవరకు నిరీక్షించి యున్న శిష్యబృందము గుర్వన్వేషణమున వెడలియుండుటచే, నెట్టకేలకు రాజసేన కోటమున యీ శరీరమును గాంచి, దహించుటకు బ్రారంభించిరి. శంకరు డరుదెంచు వేళకు శరీరము కొంచెము కాలుటగాంచి శంకరు డాతురతతో నందు బ్రవేశించి, నృశింహస్తోత్రాదుల గావింప, నాశక్తిచే నగ్నిజ్వాలలు అంతరించెను. ఇంతలో శిష్యులునుజేర శంకరుఁడు శిష్య సమేతుడై మరల మాహిష్మతీనగరమునకు ఉభయభారతితో జర్చకై వెడలిపోయెను.

ఈగాథను యింక గొంచెము చరిత్రకారులు బెంచిరి. శంకరు డా యంగనామణుల సాంగత్యమున రాజభోగ లాల సత్వమున దన ఆగమన కారణమునుగూడ విస్మరించి అమృత నగరముననే యుండెను. సంకల్పించిన మాసముగడచిపోవుట

గాంచి, శిష్యులు ఆతురతజెంది విచారించుట గాంచి, బుద్ధి కుశలుడైన పద్మపాదుడు కొందరితో గురున్వేషణమునకై వెడలెను. అనేక రాష్ట్రములు వారు గ్రుమ్మరినట్లు మాధవుడు రచించెను గాని ఆనందగిరి అమరుకస్థానము నర్మదాతీరముననే అనియు, పద్మపాదాదులు వెంటనే నా అమృతనగరమున కలిగిరనియు దెలిపెను. అట్టి అమరుకుని శరీరమున మహాత్ము డెవరో ప్రవేశించెనను జనవాక్యమును విని, శంకరుడచ్చటనే యున్నటుల గ్రహించి, అమరుక రాజు సందర్శనమును గోరి దర్శించి, వేదాంతజ్ఞాన ప్రబోధక శ్లోకముల నసాధారణలీల గానమొనరింప, నా అమరుక శరీరస్థుడైన శంకరుడు పూర్వ స్మృతి గలిగి గాయకుల బనిచి. వెంటనే పరకీయ దేహమును త్యజించి నిజశరీరమునకై యన్వేషించి, ప్రవేశించినట్లు గ్రంథ కారులు రచించిరి.

ఈ చిత్రణము చాల శోచనీయము. రచయితలు శంకరుని కౌన్నత్యమును గణించి బెట్టు యోచించిరే గాని, దానిమూలమున నాయకేశ్వరుని కీర్తికొక ప్రబలాఘాతమును గల్పించిరని తెలుసుకొనలేక పోయిరని తోచును. Quite apart from the miraculous elements in this story, it offends us by the introduction of an unnecessary debate with the unforeseen consequence of Sankara's having to undergo experiences which he had deliberately renounced; this offends the moral susceptibility of many.109 ఈ కల్పనమునగల సిద్ధుల

109. Prof. S. S. Suryanarayana Sastri: Sankaracharya, p 20.

విషయ మటులుండ, హృదయపూర్వకముగ బరిత్యజింపబడిన విషయ సుఖముల శంకరుచే ననుభవింపజేయు పరిస్థితుల గల్పించిన యీ అనవసర వివాద ప్రకరణము మనకు మనో క్షోభము గలుగజేయును. ఈ సంఘటనము అనేకుల నైతిక విశ్వాసముల భంగపరచును అని సూర్యనారాయణశాస్త్రి వచించుచు సామాన్య ప్రజానీకమునుయొక్క ప్రశంసలకై యీ చిత్రణము జేయబడినచో, was Bharati, the incarnation of Saraswati, also to be included among these?[109] సరస్వతీ అవతారమైన భారతిని గూడ నందు జేర్పవలయునా అని అతడు ప్రశ్నించెను. అట్లు గొందరి తత్త్వవేత్తల సంతృప్తి పరుప నది కల్పింపబడినచో, What of the rest who are offended at the incapacity, or else of the lapse, of their idol?[109] తమ ఆదర్శమూర్తి అయిన శంకరుని అసమర్థతయో లేక లోపమో అగు దీనిగాంచిన నితరుల జితవృత్తుల గతి ఏమి కావలయుననియు నతడు బాధజెందెను. The whole story of the transference of Sankara's soul into Amaruka's body has to be rejected as being undemonstrable, the more because the motive assigned for this adventure is after all very silly and inconsistent with the learning and subsequent conduct of Bharati.[110] అమరుక శరీరమునకు

---

109. Prof. S. S. Suryanarayana Sastri: Sankaracharya, p 20.
110. C.N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 37.

శంకరుని పరకాయ ప్రవేశ కథనము అసాధ్యముగుటచే త్యాజ్యము. మీదుమిక్కిలి భారతికిగల విద్యాకౌశము, తర్వాత ఆమెయొక్క ప్రవర్తనమునకు అది అసందర్భముగనుండి, దానికై వచింపబడిన యుద్దేశ్యములు మిగుల నవివేకముగ నుండుటచే వర్జనీయమని కృష్ణస్వామిఅయ్యరు వక్కాణించెను. అట్టి సిద్ధులు యోగశాస్త్రమురీతి సుసాధ్యములేయగును. గాని యీ సందర్భమున నయుక్తికమును అసందర్భము నని అభిప్రాయము.

గురువంశ కావ్యమున నైగాథ చాలనూర్పులతో వర్ణింపబడినది. కుమారిల జర్శించిన శంకరునకు నా పండిత వరేణ్యుడు మగధదేశమునగల తన శిష్యవర్యుడైన విశ్వరూపాచార్య ఉభయభారతుల గూర్చి 'శిష్యో మమాస్తి మగధేషు స విశ్వరూపా భూమా ప్రసిద్ధసుగుణో ఖిలశాస్త్ర వేత్తా। తస్యాంగనా వసతి చోభయభారతీతి ప్రౌఢా కళాసు సకలాసు సరస్వతీ ప్రాక్॥' (౫.౬౫) భూమండలమున బ్రసిద్ధుడై సుగుణవంతుడై సకలశాస్త్ర వేత్తయగు విశ్వరూపుడు నా శిష్యుడు మగధలో గలడు. సకల కళలలో బ్రౌఢయై పూర్వము సరస్వతియైన ఉభయభారతి అని అతని పత్నియు గలదు అని వచించి, ఆయువతీలలామమును జయించినచో విశ్వరూపుడు నీ భాష్యములకు వార్తికాదుల రచించునని ఆదేశించెను. అంత శంకరుడు శిష్య సమేతుడై అరుదెంచుచుండ, విద్వాంసుడైన మండన మిశ్రుడు శంకరు జూచి ఆతిథ్యమొసంగి, బోధింప బ్రార్థింప శంకరు డాతని నోదార్చి, ఆశీర్వదించి, బోధించి మగధదేశమునకు జేరెను. అట విశ్వరూపుని

గృహమునకు జేరగ నాదంపతులీ యతిరాజును సత్కరించి ఆతిథ్య మిడి భిక్షావందనాదులగూడ గావించిరి. అంత శంకరు సంకల్పము నెఱింగి, విశ్వరూపుడు శాస్త్రచర్చకు శంకరునితో దలపడి, సరస్వత్యవతారమైన ఉభయభారతినే సాక్షిగనుంచి (౨.౫౩) సప్తదినములు చర్చసాగించి యోడుటయు, అంత భారతి, శంకర విశ్వరూపుల నాదినము భిక్షావందనమున నాహ్వానించి, విశ్వరూపుడు శంకరు శిష్యుడై యత్యాశ్రమ గ్రహణమున కియ్యకొనిన అనంతరమున దూర్వాస శాప విముక్తి నొంది 'అంతర్దధే' (2 54) అంతర్హిత మయ్యెను. విశ్వరూపుడు శంకరు ననుసరించి సన్న్యసించి సురేశ్వరాచార్య పట్టమునొంది కాలాంతరమున శృంగేరీపీఠము నలంకరించెను.

కాని యీ గ్రంథము అమరుక గాథను భారతీ సందర్భమున నన్వయింపక, కాశ్మీరమున సర్వజ్ఞ పీఠమును అధిష్ఠింప దక్షిణద్వారమును శంకరుడు జేరగా నాకాశవాణి అతని సంబోధించి, సర్వ శాస్త్ర ప్రవీణుగ నతని బ్రశంసించి వాత్స్యాయన శాస్త్రమున ప్రశ్నింప, (౬. 27) శంకరుడు వ్యవధిగోరి అమరుక కాయప్రవేశము గావించి, (౬. 28,) అర్హమైన అనుభూతుల సంపాదించి, ఆ శరీర త్యాగమున నిజ శరీరమున జొచ్చి నా వాణిని సమాధానముల దృప్తిపరచి, సామాన్య పాండిత్యమునకు దుర్లభమైన ఆ సర్వజ్ఞ పీఠమును శంకరు డధిష్ఠించి అలంకరించినట్లు గురువంశ కావ్యరచనము. ఇచటనైన సర్వజ్ఞత్వమునకు కామకళా శాస్త్రము నంతర్గతమా అను సంశయము దోచును. అదియు నితరులుగాక నిట కూడ వాణియే శంకరు బ్రశ్నించుట అసందర్భము. కాన యీ

అమరుక కాయప్రవేశన గాథయే కల్పిత మనునమ్మకము దోచును.

పూర్వోక్త చందము శంకరుడు అమరుక శరీరమును బాసి, స్వశరీర గతుడై శిష్య సమేతముగ భారతీ మండనుల జెంత కరుదెంచెను. భారతియు శంకరు సమాధానములగాంచి సంతోషించి, తన యోటమినిగూడ ప్రకటించెను. అవును వీరిరువురి సంవాదకాలమున వేరొకడు అధ్యక్షు లున్నట్లు గ్రంథములు వాకొనలేదు గదా! అట్లు శంకరుడు విద్వాంసుడుగ అనగ కేవలము వైదికవిద్యా పారంగతుడుగ జెల్వొందుట యేగాక, భారతీ సంవాద మూలముగ సర్వజ్ఞుడని జేర్వడసెను. ఆతని ఘనతను ప్రసాదించుటకే సరస్వతి భారతీ రూపమున నీ గాథను నడిపెనని కొందరు తలంచెదరు. అది సమంజసము కానేరదని పూర్వమే చూచియుంటిమి.

పరాభూతుడైన మండనునకు శంకర భగవత్పాదుడు ఆత్మబోధ గావించి, తత్వమసీత్యాది మహావాక్యముల నుపదేశించి, తురీయాశ్రమమునొసంగి, క్రీ.పూ. 491వ సంవత్సరమున సురేశ్వరాచార్యుడను నామము నొసంగెను. ఇంతటితో ఉత్తర భారతమున శంకరునకు ఎదురులేని చాటమై, ఎందేగినను పండిత పామరులేగాక రాజాధి రాజులే రాజలాంఛనముల స్వాగతమొసంగి, సద్గురోత్తంసునిగ స్వీకరించుచు, నంత వరకు ఆ యా దేశములగల సర్వేతర మతముల నిరాకరించుచు శంకర ప్రోక్తవైదిక అద్వైత సిద్ధాంతము నవలంబింప దొడంగిరి. అప్పటికి శంకరునకు అప్రతిహతమగు కీర్తి చంద్రికలు ఆవరించెను. అప్పుడు భారతియు శంకరు గోర్కెపై నతని

ననుసరించుచు, సన్న్యాసినివోలె కాలము పూర్ణవైరాగ్యమున గడుపుచు, శృంగేరి మఠస్థాపన పర్యంతము శంకరునితో బర్యటించుచు అంత తీవ్రతర సాధనాపటిమచే ననుభూతుల నార్జించి, సర్వారాధ్యయై యొప్పి కాలాంతరమున శృంగేరిలో నొక ఆలయమున బూజింపబడుచుండెనని చరిత్ర తెలుపు చున్నది.

---

## దేశపర్యటనము

అంత శంకర యతిసార్వభౌముడు శిష్యగణములు వెంటరా, నతి జేగీయమానముగ దేశము నలుదిక్కుల అద్వైత మతస్థాపనార్థము బర్యటింప బ్రారంభించెను. సర్వ రాష్ట్రముల దేశపాలకులు శంకరుని మిగుల గౌరవమున నాహ్వా నించుచు అద్వైత ప్రచారమున కుపయుక్తమగుచుండిరి. మాహిష్మతినుండి శంకరుడు మహారాష్ట్రముద్వార దక్షిణ దేశమునకు బయనమయ్యెను. మహారాష్ట్రమున మల్లరులనియు గాపాలికులనియు భైరవారాధకులగు తాంత్రికులు పెక్కురు గలరు. వారి మతసిద్ధాంతమును, అనుష్ఠాన విధానమును ఖండించుచు తదనుచరులపూర్చి శిష్యులనుగ అనుగ్రహించుచు శంకరుడు దిగ్విజయయాత్ర గావించుచుండెను. శంకర వాద విధానములో నొక సామరస్యము ఇమిడియుండునట్లు ఆనందగిరి వచించెను. ఒక స్థానమునకు జేరగనే శంకరుడా దేశమునగల పండిత సమావేశమునకు ఆహ్వానించి, వారి మతవాదమును

తత్సాధనా పద్ధతిని శ్రద్ధగా నాకర్ణించును. అంత సాకల్యముగ నామతవాదమును జర్చించి, ప్రథమతః తన కంగీకార విషయముల బ్రకటించి, అంత తన కంగీకృతముగాని విషయముల జర్చించి, తన సిద్ధాంతముల సమర్థించి, పరములందుగల దోషముల జూపుటచే బ్రత్యర్థులు సులభముగా నతని భావములకు లొంగి, అనుచరులగుట ముఖ్య విశేషము. అట్లు ప్రయాణించు చుండగా మహారాష్ట్రమున నొకచో నొక కాపాలికుడు శంకరుని వేరువిధముగా దుదముట్టింప సమకట్టెను. Man's unhappiness comes of his greatness. తన ప్రతిష్ఠవలననే మానవునకుదుఃఖము వాటిల్లును అని Carlyle కార్లైల్ అను సామెత రూఢి వాక్యముగదా! శంకరు కీర్తి ప్రతిష్ఠ లెందరికి అసూయా కారణములయి యుండెనో! ఈ కాపాలికుడు తెగించుటచే నతని పేరు బహిర్గతమయ్యెను గాని యింకెందరుండిరో! నాడేల? నేటికిని శంకరుని దూషించు వారెందరు లేరు? అటులే యీ కాపాలికుడు ఎవరును లేని కాలముననో, అందరు నిద్రించు కాలముననో శంకరుడుండు ప్రదేశమున కరిగి, శంకరు శిరమును ఛేదింప యత్నించెను. కాని అతనికిమించిన శక్తిగల పద్మపాదుడది గాంచి వెంట నాతని చేతనున్న కరవాలమును దాలాగికొని అతని ఖండించెను. ఈ గాథను వేరురీతిగా వ్రాయుదురు. ఆ కాపాలికుడు, విద్యావంతుని రక్త సిక్తమైన శిరమును గాళి కర్పించినచో తనకు శ్రేయస్సు గలుగునని నమ్మి, ప్రత్యేకముగ శంకరు దర్శించి, విన్నవించి, శిరముఖండింపబడినను ఆత్మ అచ్ఛేద్యముగదా అనియు శంకరునికే బోధించి శంకరు శిరము నర్థించెను. అందులకు అద్వైతిఅయిన శంకరుడు సమ్మ

తించి తా ధ్యానము నందుండుకాలమున, శిష్యాదులు లేని సమయమును జూచి రమ్మని కాపాలికు నాహ్వానించెను. అత డా రీతి నేతెంచినను,దురదృష్ట మాతని ఆవరించి, పద్మపాదుని లేపి, సంహరింప బోయిన కాపాలికుడే సంహరింపబడునట్లు గావించెను. ఈ సంఘటనము శ్రీశైలమున జరిగెనని కొందరి భావము.

---

## శిష్యగణము

అటనుండి గోకర్ణక్షేత్రమును దర్శించి, శ్రీవల్లి అను ప్రదేశమునకు శంకరు డేతెంచెను. అచట కేవల మూఢుని వలె జూపడు ఒక శిష్యుడు శంకరు జేరెను. అచ్చటకాక శంకరుడు ప్రయాగ క్షేత్రమున నుండుకాలమున ప్రభాకరుడను నొక ద్విజుడు, శంకరు వద్దకు దన మూఢపుత్రుని గొని వచ్చెను అని కొందరి రచనము. ఆ బాలుని గాంచి శంకరుడు అతని గ్రహించి, కొన్ని ప్రశ్నముల నడుగ వెంటనే నామూఢబాలుడు పృథ్వీధరుడనువాడు తన నిజతత్త్వమును దెలుపుచు నద్వైత ప్రసంగము గావించెను. అందరు ఆశ్చర్యచకితులైరి. అట నా బాలుడు శంకరు శిష్యునిగనే యుండిపోయెను. అప్పుడు అతడు వాకొనిన వాక్యములే శ్లోకరూపమున 'హస్తామలకం' అన బడి శంకరుని చేత వ్యాఖ్యను బొందినవని ప్రతీతి. అతని ప్రథ మమున ఉద్ధంకుడనియు నందురు. కాని శంకరు నాశ్రయించి సన్న్యసించిహస్తామలకాచార్యుడని యోగపట్టమును బొందెను.

ఈతని తండ్రి ప్రభాకరుడే, ప్రఖ్యాత మీమాంసాచార్యుడైన ప్రభాకరమిశ్ర అని వాకొనబడినదికాని కాలభేదము గోచరించు టచే నది సముచితము గానేరదు.

అటులే శంకరుడు కాశీక్షేత్రమున నుండు కాలమున మణికర్ణికా ఘట్టమున విడిది జేసి యుండ, నాక్షేత్రవాసియగు విశ్వనాథాధ్వరి పుత్రుడైన కలానాధుడను బ్రాహ్మణుడు శంకరు దర్శించి, మనోహరముగ తోటకవృత్తముల గానము జేసి, గురు శుశ్రూష గావించుటచే సంతసించి, అనుగ్రహించి శంకరుడు అతనికి సన్న్యాసము నొసంగి తోటకాచార్యుడనియు నామ పట్టము నొసంగెను. అతనికి పూర్వాశ్రమమున ఆనంద గిరి అనియు గిరి అనియు నామములు గలవు. ఈ గిరినామక శిష్యుడు శంకరుజేసిన పిమ్మట ప్రతిదిన భాష్యపాఠమునకు, అశ్రద్ధగ నాలస్యముగ నరుదెంచుచుండినను కరుణాళువు అయిన శంకరుడు, ఆ శిష్యుడు వచ్చువరకు వేచియుండి భాష్యవివరణము గావించుచుండుట నితరశిష్యులకు బాధా కరముగనుండి, ఆ మందబుద్ధికై వేచియుండుట వ్యర్థమని వాదించిరి. అందులకు శంకరుడు మనసా చింతించి, అతని కృపాదృష్టుల నాశీర్వదించుటచే వెంటనే నతడు పూర్వపాఠ విషయముల జక్కని తోటకవృత్తముల గానము జేయ నందరు విస్మయానంద పులకితులైరి. నాటనుండి అతడు తోట కాచార్యు డనబడెననియు బ్రతీతి. పైవిధానమున బద్మపాద, సురేశ్వర, హస్తామలక తోటకాచార్యులనెడు నల్వురు ముఖ్య శిష్యులు శంకరున కేర్పడిరి. వీరే కాలాంతరమున శంకర స్థాపిత మఠ చతుష్టయమున కధ్యక్షులైరి.

పిమ్మట శంకరుడు దక్షిణాభిముఖుడై పయనించి తుంగభద్రా నదీతీరమున బ్రవేశించి, అచ్చటి ప్రకృతి సౌందర్యమును అనుకూలతను దిలకించి ఆనందముప్పొంగ నట నొక మఠమును స్థాపించి అందు శారదను ప్రతిష్ఠించెను. నాడుగల నాదేశపతి వీరసేనుడు యీ నిర్మాణమున కెక్కువ దోడ్పడెనని ఆనందగిరి వచనము. ఆమఠమున కధిపతిగ తన శిష్యులలో నఖండ విద్వద్వర్యుడైన సురేశ్వరుని నియోగించెను.

నాటికి దా రచించిన భాష్యాదిక గ్రంథములు సర్వజన సుబోధకములు కాకున్నవని శంకరుడు గ్రహించియే యుండనోపు. ఆ గ్రంథములకు గొన్ని వివరణము లవసరములని అతనికి దోచెను. అందుచే శిష్యుల నొకదినము శంకరుడు చేరబిలచి, సంకల్పమును వెలిబుచ్చి, తన గ్రంథములలో మణివలె నతి ప్రధానమైన బ్రహ్మసూత్ర భాష్యమునకు వార్తిక వ్రాయుటకు మిగుల విద్యానైపుణ్యము లవసరముగాన సమర్థుడైన సురేశ్వరునికి ఆ కార్యమును నియోగించి, యితరులకు యితరముల నొప్పగించెను. కాని శిష్యులలో గలవరము దానితో బ్రారంభమయ్యెను. నల్వురిలో బ్రాధాన్యమునకై పెనగులాటలు మొలకెత్తెను. సురేశ్వరుడు సహజముగ మీమాంసికుడనియును, కాలవశతః శంకరునకోడి న్యాయబద్ధుడై మాత్రము శంకరానుచరుడుగ నుండెనుగాని మనసా గానేరడనియు, నందుచే నితడే భాష్యమునకు వ్యాఖ్యవ్రాయుచో నద్వైతమును ఖండించి, కర్మవాదమును సమర్థించుననియు, గాన నా ప్రమాదమును వారింప నతని కా కార్యనియోగము పాడిగాదని యితర శిష్యులు పద్మపాదుని నాయకత్వమున శంకరు

నితో విన్నవించిరి. అందులకు శంకరుడును విషమావస్థలో బడి, సురేశ్వర వ్యతిరేకవాదము బలీయముగనుండుటచే దన ప్రథమ సంకల్పమును మాని, భాష్య వివరణమును శిష్యోత్త ముఖ్యుడైన పద్మపాదునకు ఒప్పజెప్పి, సురేశ్వరునికి, బృహదారణ్యకాదికములనకు వార్త్తికలను వ్రాసి, ప్రత్యేకముగ నొక అద్వైత గ్రంథమును రచింప నాజ్ఞనిడ, నతడును మిగుల సమర్థముగ వానిరచించి, ప్రత్యేకముగ సుప్రసిద్ధమగు 'నైష్కర్మ్య సిద్ధి' అను అద్వైత గ్రంథమును నిర్మించి గురుకృపా పాత్రుడయ్యెను. అట్లుకాక సురేశ్వరుడే భాష్యమునకు వ్యాఖ్య రచించియుండినచో నెట్టి యుద్గ్రంథముగ నది విరాజిల్లి యుండెడిదో! అసూయాగ్రస్తులు తా గావించు సాహిత్య ఘాతనమును గుర్తింపరుగదా !

పద్మపాదుడును బూర్వము కాశీక్షేత్రమున ప్రాభాకర మీమాంసావాదమును బఠించినవా డగుటచే నా గ్రంథమున నా ప్రాభాకరీయమును అనేక పర్యాయములు ఖండించుచు, భాష్య వివరణమును గావించెను. అంతతో దృప్తిగాంచక, దన గ్రంథమును వెంటగొని, స్వస్థానమగు చిదంబరమును అటనుండి రామేశ్వరమును దర్శించి రా గురు అనుజ్ఞనుగైకొని వెడలెను. చిదంబరమున దన పినతండ్రి యింటనుండి తన గ్రంథమును అచట ప్రదర్శించి వివరింప, నా యాప్తబంధువు ప్రాభాకర సిద్ధాంతావలంబకుడగుటచే జాల గోపము జెందెను. రామేశ్వర యాత్రకై వెడలుచుండు పద్మపాదు డా గ్రంథమును అతనికి ఒప్పగించి, యాత్రానంతరము నా గ్రంథమును గైకొని పోవ దలంచి వెడలగా, గొంతకాలమునకు ప్రాభాకర

వాద ఖండన వాక్యపూరితమగు నా గ్రంథమును ధ్వంసము జేసి, తన యక్కసును దీర్చుకొన నెంచి, ఆ గ్రంథమును పిన తండ్రి దహింపజేసెను. పద్మపాదుడు యాత్రముగించుకొని అరుదేర కాలవశమున నకస్మాత్తుగ అగ్నిమూలమున నీగ్రంథము ఎటుల దహింపబడిపోయినదో, తానెట్లు దాని రక్షింపజాలక పోయెనో, సర్వవివరముల పద్మపాదుని ముందుంచి అతని పినతండ్రి, ఆప్తబంధువు ముందుగ విచారించెను. ఇదియు నసూయాఫలితమేగదా! భేదములున్నచో విద్యాప్రౌఢత్వమున సాధింపనగునుగాని యీ విధానము అతిహేయముగదా! కాని అవివేకు లింతకంటె నేమి సేయుగలరు? పద్మపాదుడంత చింతించి, గురుపాదుని కడకేగి వృత్తాంతమును దెలుప, శంకరుడును విచారించి, పూర్వమా గ్రంథమును పద్మపాదుడు దనకు వినిపించి యుండుటచే విషయమును గ్రహించి, గ్రంథమును స్మరించి, పద్మపాదునకు దాని పునః బహిర్గతము గావించెను. పూర్తిగ్రంథములో నైదుపాదములవరకే శంకరుడు చెప్పగల్గుటచే నది 'పంచపాదికా వివరణము' అనబడినది. కాని అదియు బ్రస్తుతమున బూర్తిగ లేక, బ్రహ్మసూత్రములలో మొదటిసూత్ర చతుష్టయమునకే పద్మపాదుని వివరణము మిగిలియున్నది. ఇందు శంకరు అధ్యాసభాష్యము అతివిపులముగ నుండి, యీ గ్రంథము యింక ననేక వృత్తుల టీకల బొంది ప్రఖ్యాతమైయున్నది. కాని ఇదియైనను శంకర సూత్ర భాష్యమున కంతటికి వివరణముగ సమగ్రముగ నుండి యున్నచో శంకరుభావములే మనకు సంపూర్ణముగ వివరణములతో లభించియుండెడివి. ఇదియే శంకరభాష్యమునకు

ప్రథమ వివరణగ్రంథము, మఱియు శంకరుని సాక్షాత్తుశిష్యునిచే రచితము. అదియు సంపూర్ణముగ జిజ్ఞాసువులకు లభింపకుండుట దురదృష్టమే.

---

## మాతృవియోగము

శంకరుడు శృంగేరిలోనుండు యీకాలమున దన తల్లి ఆర్యాంబ యవసానస్థితిలో గలదని గ్రహించెను. చిత్సుఖుని బృహచ్ఛంకర విజయములో శంకరు మాతృవియోగము, శంకరుడు గోవిందునివద్ద తురీయాశ్రమమునుగొని, బదరి కైలాసాదుల దిరిగి, మరల బదరికాశ్రమమును జేరియుండగా జరిగినట్లు గలదు. ఆకథనము ననుసరించి, అగ్నిశర్మ అను బంధువొకడు శంకరు జేరి మాతృసందేశమును దెలుప, చిత్సుఖాచార్యునితో గాలటిని శంకరుడు జేరెను. మాధవు ననుసరించి శృంగేరిస్థాపనానంతరమే మాతృవియోగము జరుగును. అటుల దల్లిసాన్నిధ్యమును జేరిన శంకరుడు మాతృసేవ జేయుచు నుండ, నిత్యము నదీస్నానము గావించు నాదేవి అశక్తతచే నటకు బోజాలకుండుటయు, నదీస్నానమామెకు ప్రధానమగుటచే శంకరుడు సంకల్పించి తన తపోశక్తిచే నానదిని తమ గృహమునకు ముందు వచ్చునట్లు జేసెను. నాటి నుండి అది అంబానది అనబడుచున్నది. అవసానదశనున్న తల్లి, తత్త్వోపదేశమునకై బుత్రునిగోర నతడు 'తత్త్వబోధ' అను గ్రంథము రచించి బోధింప నుద్యమింప నామె గ్రహింప

జాలక సులభవిషయముల గోర, సంత శంకరుడు శ్రీకృష్ణ పరమైన శ్లోకముల లిఖించి వివరించెను. అట్లు భగవద్ధ్యాన పారీణయై ఆ సుతున కుచితమైన ఆ మాతృదేవి యొకదిన మున దనశరీరమును జాలించెను. వెంటనే శంకరుడు పూర్వా శ్రమబంధుకోటికి దెలియబరచి దహనసంస్కారాదికమునకై ఆహ్వానింప వారు శంకరు బహిష్కరించిరి. శంకరుడు సన్న్యసియైయుండి కర్మత్యాగియైయుండియు మాతృసంస్కా రములను జేయ నుద్యుక్తుడగుట వారికి సమ్మతము కాలేదు. కాని తల్లికి దా సన్న్యసింపకపూర్వము తానొసంగిన వాగ్దానము భంగమగుటకు శంకరునకు సమ్మతముకాలేదు. అందుచే వారందరు పట్టుదలతో శంకరు బహిష్కరించి దూరులైరి. అంత నసహాయుడగు శంకరుడు failed to become a prophet in his own land. [111] స్వస్థానమున జగద్గురు వనిపించుకొన జాలనివాడై, తల్లిని స్మశానమునకు ఒక్కడే గొనిపోవ నసమర్థు డగుటచే నా స్వగృహ ఆవరణమున నొకమూల మాతృదేహ మునకు దహనాదిసంస్కారముల గావించి, ఉత్తరక్రియల యథావిధి నొనరించెను. మాధవుగాథ ననుసరించిచూడ శంకరు వెంట నొక శిష్యుడుగూడ లేడు. బృహచ్ఛంకరవిజయము ప్రకారము చిత్సుఖాచార్యు డుండెగదా! ఈ సమయమున నత డేమయ్యెనో! మాతృకళేబరమును దహనస్థానమునకు గూడ జేరవేయజాలక శంకరుడు, ఆ శరీరమును ముక్కలుగ గోసి, అటకు జేర్చి, సమిధలుగూడ లేకుండుటచే అరటిఆకులతో

111. C.N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 46.

అగ్నిసంస్కారము గావించినట్లు తెలియుచున్నది. అందుచే గినిసి తన బంధువర్గము నతడు శపించుటచే నిటీవలకాలము వరకు నాదేశమున శవముల దమ ప్రాంగణములలో దహించు టయు, నాకళేబరమునకు గత్తితో నక్కడక్కడ గాయముల గలుగజేయుటయు గలదట.111 కాని శంకరు డజ్ఞానులపై నాగ్రహించి శపించెననుటయు ననౌచిత్యమే. నాటిరాజును బ్రబోధించి అట్లు శాసనము జేయించెననియు చరిత్ర. అప్పటికే జగత్ప్రసిద్ధినొందియున్న జగద్గురువు తనదేశమున నిట్లు అగౌర వమును బొందుట విచిత్రమే. ఒక్కశిష్యుడైన వెంటలేక యీ జగద్గురు వెట్లు కేరళమునకేగెనో! శిష్యులైనను వెంట రాక నెందులకూరకుండిరో! శంకరు ప్రఖ్యాతి ఆకాలమునకు గేరళము జేరియుండదా? ఇట్టులెన్నియో సమస్యలీగాథయం దిమిడియున్నవి. వాని గొంతవరకు సమన్వయింప మాధ వుడు, ఎవరిని వెంటగొనక శంకరు డొకడే ఆతురతతో వెడలె నని వచించెను. కాని ఆనందగిరి చిత్సుఖాచార్యులు ఇరువురును, మాతృవియోగమును మండను జయించుటకు బూర్వమే తెలిపి యున్నారు. అదియే సత్యమైయుండును. ఎట్లైనను, శంకరుడు సన్న్యాసియైనను దన మాతృదేవిపై నతనికిగల అపార ప్రేమాతి శయము దీన దెల్లమగును. ఎంత ప్రతిఘటనము లేర్పడినను, దేశమే ఎదురు తిరిగినను, శాస్త్రము నిషేధించినను, ఆప్తులు బహిష్కరించినను, తల్లిపైగల ప్రేమకు నివియన్నియు తృణ ప్రాయములై ఆకాలమున నతనికి గోచరించినవని చెప్పనొప్పును.

---

111. C.N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 46.

ఈ విషయము ననుసరించియే శంకరుడెంతటి స్వతంత్ర భావములు గలవాడో, అచంచలమగు మనోబలసంపన్నుడో, ఎంతటి పట్టుదల గలవాడో వ్యక్తమగుచున్నది. అందుచేతనే అత్యల్పకాలమున సాధారణమానవప్రజ్ఞకు అందరాని విద్యావైదుష్యము నార్జించి, పండితచక్రవర్తుల లొంగదీసి, రాజాధిరాజుల పాదాక్రాంత మొనరించి, సర్వశాస్త్రాతీతమై అనంతమై యొప్పు అఖండాద్వైత వాదమును స్థాపించి, తానుగూడ సామాన్యమానవ ప్రజ్ఞాతీతుడై, అతిదూరుడై, దుర్ఘట సమస్యయై, అతీతుడై సర్వప్రపంచమానవకోటి కలంకారమై వెలుగొందుట యందు ఆశ్చర్యమేమి? ఆకాలమున మాత్రముగాక, యీ కాలముల, యికముందును అతని గ్రహింపగలవా డేడి? అతని దొక అద్భుత మూర్తితత్త్వము. అది అమానుషము దివ్యము.

---

## మతస్థాపనము

అట్లు సన్న్యాసిఅయ్యును మాతృఋణమును దీర్చి శంకరుడు శృంగేరిని జేరెను. అప్పటికి బద్మపాదుడును రామేశ్వర యాత్రముగించి శృంగేరి కరుదెంచెను. అంత మరల శంకరుడు దేశపర్యటనమునకై బయలుదేరి తూర్పుతీర దేశముల బ్రవేశించెను. అందు గాంచీనగరము ఆకాలమున శాక్తులచే నిండియుండె నట! అందుచే నట గొంతకాలము వసించి, ఆయా పరమతముల ఖండించి, ఆయా సిద్ధాంతుల నోడించి, శిష్యులనుగ గావించి, నాటికి అత్యుగ్రమైయున్న కామాక్షీ

దేవికి ముందుభాగమున శ్రీచక్ర స్థాపనముచే సౌమ్యత్వ మును గలుగజేసి, ఆమె అనుగ్రహమునకై తపము నాచరించి, ఆదేవదేవీకృపాసిద్ధిని బొంది, అమందానంద హృదయ పరీతుడై మరల నటనుండి పయనించెను. ఇటులే జంబుకేశ్వరమునగల అఖిలాండేశ్వరీ యుగ్రతకు రత్నఖచిత శ్రీచక్రకమలముల ద్వార సౌమ్యతను గలుగజేసి ఆమె అనుగ్రహమునుగూడ శంకరుడు చూరగొనెను. మధుర మీనాక్షిని గొంతకాల ముపాసించియు నామె కృపకు నతడు పాత్రుడయ్యెను. ఈ కాల మున దక్షిణదేశాధిపతుల యండ సంపాదించి, పరమతముల నడంచి, తన సిద్ధాంతమును శంకరుడు సుస్థిరమొనరించి శృంగేరి పీఠమును శక్తివంతముగ గావించెను.

క్రీ. పూర్వము 494 వ సంవత్సరమున శంకరుడు కాలటిలో మాతృదేవియొక్క అంత్యసంస్కారముల బూర్తి గావించి యున్నకాలమున నర్మదాతీర మందలి మాంధాతద్వీప మునగల అమరేశ్వరములో గోవిందులు వ్యాధిగ్రస్తులైయుండె ననివిని, వెంటనే అందేగి గురుపాదుల దర్శించి, సేవించుచుండ, గొన్నిదినములకు గోవిందుడు ఆ సంవత్సరమున కార్తిక శుద్ధ పౌర్ణమినాడు బ్రహ్మైక్యము బొందెను అని బృహచ్ఛంకర విజయమునుండి దెలియుచున్నది.

తూర్పుతీరమునగల ప్రసిద్ధక్షేత్రరాజమైన జగన్నాథ మును జేరి, అందును కొంతకాలముండి ఒక మఠము నందు గూడ స్థాపించి దానికిగోవర్ధనమునా బేరిడెను. సేతువునుండి ప్రారంభింపబడిన యీ ప్రాగ్దేశయాత్రలో ద్రవిడ పాండ్య చోళ ఆంధ్ర రాజ్యములగల క్షేత్రముల, విద్యాస్థానముల దర్శించుచు,

బూరోక్తరీతి రామేశ్వర, మధుర, శ్రీరంగము, కాంచి వేంకటాచల జగన్నాథాదిక్షేత్రవాసము గావించి, ఆ యా దేవతానుగ్రహముగాంచి, శంకరుడు విదర్భరాష్ట్రమును ప్రవేశించెను. అటనుండి కర్ణాటకమున కేతెంచి, అటగల కాపాలిక నాయకుడైన క్రకచాదుల జయించి, గోకర్ణమును దర్శించి, సౌరాష్ట్రమును శంకరుడు చేరెను. సౌరాష్ట్రాధిపతియైన సుధన్వుడు పూర్వము జైన బౌద్ధమతముల ననుసరించువాడై యుండినను, కుమారిలుని సాంగత్య బలమున వైదికమతమునకు మరలెనని పూర్వము చూచియుంటిమి. అట నా సుధన్వు నద్వైతమునకు ద్రిప్పి అతని ప్రోద్బలమున ద్వారకానగరమున నొక మఠమును స్థాపించి, దానికి శారదాపీఠము నా శంకరుడు నామకరణము జేసెను. సుధన్వుడు శంకరునకు ప్రబలమైన యండయై, శంకరు పర్యటనముల దాగూడ వెంట నరుగుచు అద్వైతసిద్ధాంత ప్రచారమున మిక్కిలితోడ్పడి శంకరాభిమానమును జూరగొనెను. అందుచేతనే ఎందరో రాజులు శంకరునకు సహాయపడియున్నను, అతని నామమును మాత్రమే గ్రంథముల నాదర్శ ప్రభువుగ నుదాహరించుచు ఆచార్యుడు, అతని అమరుని చేసియుండుట గమనార్హము, అతని అదృష్టము.

అటనుండి శంకరుడు ఉజ్జయినీ ప్రాంతముల బర్యటించి, గంగాతీరమును జేరి, అటగల భట్ట భాస్కరాదుల జయించి, కాశ్మీరమునగల సర్వజ్ఞ పీఠవృత్తాంతము నాలకించి, దాని నధిష్ఠించు తాత్పర్యమున నట కేగెను. అందొక దేవాలయము గలదు. ఆ యాలయమునకు నలుదిక్కుల నాలుగుద్వారము

లుండ ఒక్క దక్షిణద్వారము మూయబడియుండును. సర్వజ్ఞుడైన పండితుడే దాని దెరచి, ఆలయమున బ్రవేశించి అందుండు సింహాసనము నధిష్ఠింపసాధ్యము. శంకరు డట జేరిన వెంటనే, ఆలయమును బరివేష్టించి సర్వజ్ఞపీఠమును గాపాడుచుండిన పండితవర్యులు శంకరువిద్యాపాటవము ననేకరీతుల ప్రశ్నావళిచే బరీక్షించి, వల్లెయని ఆలయమును బ్రవేశింప పీఠము నలంకరింప నతని నంగీకరించిరి. కాని దక్షిణద్వారమును జేరిన వెంటనే సరస్వతీదేవి సాక్షాత్కరించి సర్వజ్ఞత్వమే గాక బ్రహ్మచర్యముగూడ నవసరమగుట, తన పూర్వకర్మల నాలోచించి, పీఠము నధిరోహింప హెచ్చరించెనట. అమరుకగాథలో విషయముల ననుభవించినది యీ శంకరశరీరము గాదనియు, అది అమరుకదేహమేయనియు శంకరుడు సమ ర్థించుకొనగా వాణి సమ్మతించి పీఠము నలంకరింప నానతిచ్చెను. కాని పూర్వకర్మల సమర్థించుటకే యిట సరస్వతీ సాక్షాత్కార ప్రసంగము జేయబడినది. తన విద్యావిభూతులచే సర్వజ్ఞుడని పరివేష్టిత పండితులకు నచ్చజేసి శంకరుడు సర్వజ్ఞపీఠము నలంకరించెను. ఈ సర్వజ్ఞపీఠము కాంచీపురముననే గలదనియు, నందు శంకరు డధిష్ఠించెననియు ఆనందగిర్యాదులు వాకొనిరి. కాని అందుల కనుగుణ ప్రమాణములు గోచరము కావు. అంతియగాక కాశ్మీరమునకు రాజధానియగు శ్రీనగరమున నేటికి నొక ప్రాచీన దేవాలయము శంకరాచార్యునికై నిర్మింపబడియున్నది. అది 100 అడుగుల ఎత్తుగల చిరుకొండపై గలదు. శంకరుడు కాశ్మీరమున కేతెంచి, సర్వజ్ఞాది పీఠముల నధిష్ఠించి, అందు నొక ఆధ్యాత్మిక చేతనత్వమును గలుగ

జేయుటచే క్రీ. పూ. 368-306 సంవత్సరమున గోపాదిత్యు డను రాజు దాని నిర్మించినట్లును,112 అంత శిథిలమగుటచే Zain-ul-Abdin జైన్ ఉల్ అబ్దిన్ అను మహమ్మదీయ రాజు దాని బునరుద్ధరించెననియు నా ఆలయమున శాసన ములు గలవు.113

అంత పూర్వ మనేకపర్యాయములు దా జనియుండి, ఆ ప్రశాంత పవిత్రవాతావరణమున భాష్యాదుల రచించుట, బోధించుట, తపమాచరించుట, మొదలగు మార్గముల శంకరు డనుసరించియున్న నా ఆధ్యాత్మిక సమృద్ధమగు బదరికాశ్రమ మునకు శంకరుడు ఏగెను. అచ్చటగల పావన అలకనంద భాగీరథీ దరిని, శిథిలమైయున్న శ్రీమన్నారాయణ దేవాలయ మును బునరుద్ధరించి, అటులే కేదారేశ్వరమునగల శివాలయ మునుగూడ ఉద్ధరించి, బదరిలో జ్యోతిర్మఠము నా పీఠమును ఉత్తరదేశవాసులకొరకై నెలకొల్పెను. బదరి ఆలయముల ఇంతకు బూర్వమే, అగ్నిశర్మద్వార తల్లిపంపిన ధనముతో జీర్ణోద్ధరణము శంకరుడు గావించినట్లు బృహచ్ఛంకరవిజయ రచనము. కాని అచ్చట అట్టి నిర్మాణము ధనాంగసౌష్ఠవ ముండిన గాని సాధ్యముకాదు. కాని సర్వవిధప్రఖ్యాతి నార్జించి రాజుల యందబూర్తిగ గల్గిన యిప్పటి శంకరునకే యదిసాధ్య మగుటచే పూర్వగాథ విశ్వసనీయముకాదు.

శంకరు డింకను కొంచెము కొరవయుండుటచే నాకార్య సాఫల్యముకొరకు కామరూపదేశము నా బరగు నేటి అస్సాము

112. Dr. P. Gwashalal: A Short History of Kashmir.
113. The Hindu: 17th July 1949.

రాష్ట్రమున కేగుదెంచెను. అదియు బూర్తి శాక్తేయమున మునిగియున్న ప్రాంతము. అందు నాయకుడు అభినవగుప్త నాబడు అసాధారణప్రజ్ఞుడు. శంకరురాక గాంచి, యతని జీకొని, ఆసర్వజ్ఞు ముందు నిలువజాలక పరాభూతుడయ్యెను. అందుచే ఆచారము ననుసరించి, మండనాది అనేక పరసిద్ధాంతుల వోలె నితడును శంకరు ననుసరించి సన్న్యసింపక బోయినను, అద్వైతసిద్ధాంతమునైన నవలంబించి యుండవలసినది. కాని అతడు తనశక్తుల నిట్లు సద్వినియోగముగా నెరవేర్చుకొనజాలడయ్యెను. అతని ప్రజ్ఞావిశేషముకూడ అప్పటికే పరిపుష్టమైయున్న అద్వైతస్రవంతిలో లీనమయియున్నచో నెంత గొప్ప ప్రవాహమైయుండెడిదో! అట్టి అదృష్టము అతనికి లేకపోవుటచే శంకరు దుష్టమార్గమున బాధనొందించు దురదృష్టమున నతడు జారిపోయెను. అందుచేత పరాజయ బాధ కోర్వలేని ఆ అభినవగుప్తుడు, శంకరుపై నొకదుష్టప్రయోగము గావింప దత్ఫలితముగ జగద్గురువు వ్యాధిగ్రస్తు డయ్యెను. తీవ్రమైన మూలవ్యాధియు దత్ఫలితముగ రక్తస్రావము శంకరునకు ఆపాదించెను. వైద్య చికిత్స ప్రయోజకరము గాకుంట గ్రహించి, పద్మపాదుడు జరిగినవిషయము నవగాహన మొనరించి, అభినవగుప్తుపై దిరిగి ప్రయోగము గావించెననియు, నందుచే శంకరున కారోగ్యము సిద్ధించి, ఆవ్యాధి అభినవునికి వ్యాపించెనట.

కామరూపమునుండి మరల శంకరయతి నేపాళాదుల బర్యటించి, అందు బరిపాలించుచున్న వృషదేవవర్మ అతిథి సత్కారముల స్వీకరించి, అట స్వమతసంస్థాపనము గావించి,

దిరిగి బదరికాశ్రమమును జేరెను. శంకరాగమ నానంతరము తనకు గలిగిన పుత్రునకు వృషదేవవర్మ శంకరవర్మ యనియు నామకరణ మొసంగియుండుట నిందు గమనార్హము. శంకరు డాస్థానమునకు క్రీ. పూ. 488–487 సంవత్సరముల జనుదెంచి నట్లు నేపాళచరిత్ర తెలుపుచున్నది. శంకర దేశపర్యటన విశేషములును, గ్రంథరచనానుక్రమణికయు వివిధరీతుల విజయకర్తలు రచించియుండుటచే కాలక్రమము ననుసరించి వచించుట కష్టసాధ్యము. అందుచే శంకరుడు తన జీవితకాల మైన ముప్పదిరెండు వర్షములలో వచించిన ఘనకార్య ముల మొత్తముగమాత్రమే గ్రహింపనగును గాని కాల క్రమము ననుసరించి దుర్లభము.

---

## బ్రహ్మైక్యము

అటుల బదరి కాశ్రమమునుజేరిన శంకరునకు యింకను కామరూపదేశమున నాపాదించిన రుగ్మత నివారణముగాక నాతని బాధించుచునే యుండెను. కొంతకాల మచట వాస ముండి, శిష్యుల భాష్యాదుల బోధించి, తనచే స్థాపితమైన పీఠములకు సురేశ్వరుని శృంగేరికిని, హస్తామలకుని ద్వారక కును, పద్మపాదుని జగన్నాథమునకును, తోటకుని బదరి కాశ్రమమునకు నియోగించి, తన్నిర్వహణమునకై వలసిన నిబంధనావళి విరచించి, కేదారమున విశ్రాంతిగొన నేగి, అట శిష్యుల శీతబాధనివారణార్థ ముష్ణోదకగుండమును నిర్మించి,

తన ముప్పదిరెండవయేట, కలియుగ 2625 వ సంవత్సరమునకు సరియగు క్రీ. పూ. 477 రక్తాక్షినామ వత్సర వైశాఖశుద ఏకాదశిదినంబున బ్రహ్మైక్యము నొందెను. ఇది మూధవీయ శంకరవిజయ విధానము. కాని 'గురువంశకావ్యము' శంకరుడు బదరికాశ్రమముననే యుండ, దత్తాత్రేయు డానందించి శంకరు కడ కేతెంచి, ఆహ్వానించి తనగుహకు గొంపోయెనని (3.70) మాత్రము తెలుపుచు నిర్యాణమును బ్రస్తావింపలేదు.

కాని చిత్సుఖాచార్యుని బృహచ్ఛంకర విజయము, ఆనందగిరి కృత శంకరవిజయము, ఈ విధానమును గాక, శంకరుడు దేశపర్యటనము గావించి, కాంచీక్షేత్రమున కరుగు దెంచెననియు నటనే సిద్ధిపొందె ననియు దెలుపుచున్నవి. కాంచీపురమును జేరి, అట కామాక్షి ప్రతిష్ఠగావించి, ఆ నగర మున పండిత ప్రకాండులు వెంటనుండ, వేదఘోష మిన్ను నంటుచుండ, శ్రీ రాజరాజేశ్వరీ సన్నిధానమున శంకరుడు సర్వజ్ఞ పీఠము నధిరోహించెను. అదియే కామకోటి పీఠముగ తర్వాత వ్యవహార్యము. దాని కధిపతిగ సర్వజ్ఞాత్ముని నియో గించి, శంకరుడు పూర్వోక్తకాలమున కామాక్షిదేవి ఆలయం బున బ్రహ్మనిష్ఠబూని బ్రహ్మైక్యము నొందెను అని బృహచ్ఛంకరవిజయము. అచట శంకరుడు శరీరము జాలించి నట్లు ప్రమాణముగ నట కామాక్షి ఆలయమునగల శిలా విగ్రహమును గొందరు జూపించెదరుగాని అది బలీయకారణము గాదు.[114] కాలాంతరమున గామకోటి పీఠాధిపతులు దాని

114. శ్రీ శ్రేష్ఠలూరి కృష్ణస్వామయ్య: జగద్గురు శ్రీ శంకరాచార్య చరిత్రము, పు.34.

ప్రతిష్ఠించియుండవచ్చును. భాష్యాచార్యులు కూడ; We think Conjeevaram was the most probable place of his Nirvana.[115] శంకరనిర్యాణమునకు కంచియే యుచితమైనదని దోచునని వ్రాయుచు, అచట విగ్రహము, లోకవాడుక మొదలగు విషయముల ననుసరించి స్థిరపరుపనగునని పేర్కొనెను. కాని ఆలయప్రాంగణమున శంకర కళేబరమును సమాధిజేసి, దానిపై విగ్రహమును ప్రతిష్ఠించిరి అని అనుట యుచితము కాదేమో!

ఇటుల శంకరనిర్యాణ స్థానముగ బదరికాశ్రమము కేదారము, కాంచీపురములు వాదులాడు కొనుచున్నవి. వానిలో నేది యథార్థమో సప్రమాణముగ దీర్మానించి,అందు జగద్గురువై, ప్రజ్ఞాశక్తియై, జగదుద్ధరణము గావించిన ఆ అద్భుత పవిత్రమూర్తి కుచితస్థూలస్మారక చిహ్నము నొకదాని నిర్మింప, ఏ మధ్య ద్వారకాపీఠాధిపతి పండితులకు శ్రీముఖము బంపుటెంతయో యుచితము అత్యవసరముగనున్నది. అద్దానికై ఎల్లరు యత్నించి తీర్మానించి, సముచితకార్యము నిర్వహించెదరుగాక అని ఆశించుదము. అటులే ఉత్తరప్రదేశ ముఖ్యమంత్రులు డాక్టరు సంపూర్ణానందుల కృషియు నీ సందర్భమున మననీయము.

ఈ విధముగ The greatest expositor of the Upanishads.[116] ఉపనిషత్తుల కున్నతోత్తమ వ్యాఖ్యాత

---

115. Pandit N. Bhashyacharya: The Age of Sankaracharya, p 47.

116. Dr. Archibald Edward Gough: The Philosophy of the Upanishads.

యని చేర్గాంచి, అనాదికాలగత అవిద్యాప్రాబల్యమున అజ్ఞానమమకారాద ఆవరణవిక్షేప విభ్రాంతిని బొందియున్న అసంఖ్యాక మానవకోటికి నిజతత్త్వపరిశీలనమున, సర్వపరిమిత సంకుచితత్వాదికములకతీతమైన అఖండానంత బ్రహ్మరూపము తానే అను పరమార్థగ్రహణమున స్థూలత్వపశుత్వాది లక్షణములను, అగోచరత్వాది సర్వవిలక్షణ సంస్థితినొందింప జనించి, శ్రమించి తపించి, సంకల్పసిద్ధిం గాంచిన శ్రీ జగద్గురు శంకరభగవత్పాదాచార్య సన్మూర్తియై సుదాహరింపబడినరీతి సంకుచిత స్థూలదేహమును త్యజించినను అనంత ముముక్షుహృదయముల వికసింపజేసి, ప్రకాశింపజేసి ప్రకాశించుచునే యుండును. అందుచేత ఆతనిమూర్తి నాటికి నేటికి నవయౌవనమై కుశలమై, తేజోపూర్ణమై శుద్ధమై, జరామరణదూరమై, అమృతమై, వెలుగొందుచునేయున్నది. అట్టి పరమపావనమూర్తికి, సర్వబంధ విచ్ఛేదకోపాయప్రదాతకు, త్రాతకు నమ్ర నమోవాకంబులు. సాష్టాంగ దండప్రణామంబులు, సర్వార్పణంబు. హరిః ఓం తత్ సత్.

సర్వతంత్ర స్వతంత్రాయ సదాత్మాద్వైత వేదినే ।
శ్రీమతే శంకరార్యాయ వేదాంత గురవే నమః ॥

(మాధవ)

# శ్రీ శంకర ప్రసాదము

## సన్న్యాస సంప్రదాయము

నారాయణం పద్మభవం వసిష్ఠ
శక్తిం చ తత్పుత్ర పరాశరం చ।
వ్యాసం శుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్ర మథాస్య శిష్యం ॥

శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యం।
తం తోటకం వార్తికకార మన్యా నస్మద్గురూన్ సంతత మానతోస్మి ॥

అని సంప్రదాయ విధాయక నమస్కార విధానము. అద్వైత విద్యామూలము శ్రీమన్నారాయణునితో నెలకొని, పద్మభవుడైన చతుర్ముఖబ్రహ్మద్వార మొలకరించి, వసిష్ఠ శక్తి పరాశరులచే బోషింపబడినదై, వ్యాస శుకులచే నభివృద్ధినొందింపబడి, గౌడపాద గోవిందుల కృషి ఫలితముగ బుష్పించి, శ్రీశంకరుల మాహాత్మ్యమున విరివిగ ఫలించి, యంత పద్మపాద హస్తామలక తోటక సురేశ్వరులచే నద్వైత కల్పతరువు సర్వమానవులకు శరణ్యమై విరాజిల్లుచున్నది. అనగ ననంతకాలమునుండి యిది పరంపరాగతావచ్చిన్న ప్రవాహరూపమున బ్రపంచమున బ్రవేశించి మునంచి తరింపజేయు చున్నదని విదితము. కాని 'సత్యయుగ సంబంధ్యాచార్యత్రయం బ్రహ్మా విష్ణు రుద్రా శ్చేతి। త్రేతా

యుగసంబంధ్యాచార్యత్రయం వసిష్ఠ శక్తి పరాశర శ్చైతి। ద్వాపర సంబంధ్యాచార్యౌ ద్వౌ వ్యాస శుక దేవౌ. కలియుగ సంబంధ్యాచార్యత్రయం గౌడ గోవింద శంకరాచార్యా శ్చైతి' సత్యయుగ సంబంధమున మూర్తిత్రయము మహాచార్యత్రయము గను, త్రేతాయుగమున వసిష్ఠ శక్తి పరాశరత్రయమును, ద్వాపరమున వ్యాస శుకాచార్యద్వయమును, కలిలో గౌడ, గోవింద, శంకరాచార్యత్రయమును నాచార్యులుగ బొంది, యీ అద్వైతబోధ పరంపరాగతముగ నేతెంచుచున్నదని వైకుంఠపురి వాక్యము. 'కృతే విశ్వ గురుర్బ్రహ్మా త్రేతాయా మృషి సత్తమః। ద్వాపరే వ్యాస ఏవ స్యాత్కలావత్ర భవా మ్యహం।' (మఠామ్నాయః-48) కృతయుగమున చతుర్ముఖుడు విశ్వగురువగు చుండ, త్రేతలో వసిష్ఠాది ఋషులు జగద్గురువులు. ద్వాపరమున వ్యాసుడగుచుండ నీకలిలో నేనే జగద్గురువునని వచించు శంకర మహానుశాసన వాక్యమున కనుగుణముగ నున్నది. అందుచే నీ పరంపరలో నాచార్యులందరును వచింపబడక నందు ప్రఖ్యాతుల నామములే వచింపబడుట స్పష్టము. లేకున్న ఎన్ని శ్లోకములలో నెంతకాలము పరంపరను పఠింపవలసి యుండునో! అందుచే యీ పరంపరను ఇంకను స్పష్టము గావించి, 'నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యమాం। అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం॥' అని నిత్య గురు నమస్కారపాఠము వినవచ్చుచున్నది. కాన పరంపరలో గల గురువుల కాలములు వరుసగా గైకొని ఒకానొక గురు కాలమును నిర్ణయించుట మిగుల దోషభూయిష్ఠము. ఒక్కొక్కరికి అనేక వత్సరములేగాక శతాబ్దములుగూడ

కాలవ్యత్యాసము గలదని పై శ్లోకతాత్పర్య నిర్ణయమునను దెలియుచున్నది. ప్రస్తుతకాలమున మాత్రము గోవింద శంకరులకు గల సంబంధము గాఢ గోవిందుల కభావమనియే గ్రాహ్యము.

పై విధాన గురుపరంపరప్రోక్తమైన యద్వైతామృత ధారను గోవిందునుండి శంకరు డందుకొని, జీవితమున గాంచిన విధమున ననమానలీల దేశవ్యాప్తి మొనరించి, సమకాలిక అన్యమతావలంబకుల జయించి, నాడు స్వసిద్ధాంత సంస్థాపనము గావించినను, అది చిరకాలగామిగనుండ జాలదని దూరదృష్టిగల నా యాచార్యవర్యుడు, ఆ యుత్కృష్ట మతము దేశవ్యాప్తముగ నల్లియుండి, యెల్లకాలముల బ్రజోపయుక్తమై యలరార గాంక్షించి, మఠస్థాపనమున కుద్యమించెను. ఆ మఠములైనను సన్న్యాసులు నివసింపయోగ్యమై తపోనుష్ఠాన సాధనలమున్ని, ప్రపంచమును మరచుసమాధుల గల్పించు ఆశ్రమస్థానములు మాత్రముగాక 'ధర్మమాలంబ్య రాజానః ప్రజాభ్యః కరభాగినః। కృతాధికారా ఆచార్యా ధర్మతత్తద్వదేవ హి॥' (మహా. 18) రాజ్యాధికారమును బొందిన ప్రభువులు ప్రజలనుండి కప్పముల గ్రహించునట్లు ధర్మాధికారమును బొందిన ఆచార్యులు ధర్మమును రక్షించుచు బన్నును గ్రహించెదరుగాక అని మహానుశాసనము వాక్రుచ్చు చందము, నీ మఠాధిపతులు అధర్మప్రవర్తకుల దండించుటకును, 'తానాచార్యోపదేశాంశ్చ దండాంశ్చ పరిపాలయేత్। తస్మాద్రాజా చాచార్యశ్చ ద్వావనింద్యాభివందితౌ॥' (మహా. 23) కనుక ఆచార్యోపదేశ దండములు పరిపాలింపబడవలెను.

రాజు ఆచార్యుడును వందనీయులు అను శంకర ప్రోక్తముకేతి రాజుతో సమానగౌరవ ప్రతిపత్తులు కలుగునట్లు శంకరుడు ఆమఠముల నెలకొల్పెను. అందుచేత అవి సామాన్యవిధముగ మఠములనబడక పీఠములుగ వ్యవహారము. 'ధర్మో మూలం మనుష్యాణాం' (19) మనుష్యులకు ధర్మమే ప్రధానమనియు, నది 'విశిష్టశిష్టాచారోఽపి మూలాదేవ ప్రసిద్ధ్యతి' (22) విశిష్టమగు శిష్టాచారముగూడ మూలభూతమగు వేదమూలననే ప్రసిద్ధమగుటచే ధర్మమునకు వేదమే మూలమని బోధించుచు, 'కుర్వంతు ఏవ సతత మటనం ధరణీతలే' (2) సర్వదా ధర్మప్రచారముజేయుచు దేశమున బర్యటించుచుండవలయునని ఆ పీఠాధిపతుల శంకరుడు శాసించెను. అందుచే 'మఠే తు నియతో వాసో ఆచార్యస్య న యుజ్యతే' (3) నిరంతరము మఠములో కూరుచుండుట ఆచార్యునకు దగదు అనియు నతడు హెచ్చరించెను. ఇంకను 'వర్ణాశ్రమసదాచారా అస్మాభిర్యే ప్రసాధితాః। రక్షణీయాస్తు ఏవైతే స్వేస్వే భాగే యథావిధిః' (4) మేము సాధించిన సదాచార వర్ణాశ్రమ ధర్మములు ఈ పీఠాధిపతులు తమతమ భాగమునకు నిర్ణీతమైన రాజ్యములో జక్కగ రక్షింపబడునట్లు చూచెదరుగాక అనియు వారిపై అపార భారమును బాధ్యతను శంకరుడుంచెను. 'యతో వినష్టిర్మహతీ ధర్మస్యాత్ర ప్రజాయతే' (5) ప్రస్తుతము ధర్మము మిగుల నశించియున్నదని శంకరు హృదయము అత్యంత బాధనొంది, ధర్మోద్ధరణమునకై 'మాంద్యం సంత్యాజ్యమేవాత్ర దాక్ష్యమేవ సమాశ్రయేత్' (5) మీరు సోమరితనమును వీడి సామర్థ్యమును బ్రదర్శింతురు గాక

అనియు హెచ్చరించెను. రాజులతో సమాన ప్రతిపత్తిగలిగి దేశమున ధర్మరక్షణమును, అధర్మశిక్షణమును గావించుచు, ప్రజలనుండి పన్నులనుగూడ వసూలు గావించుచుండుటచే నీ పీఠాధిపతులు భోగలాలసత్వమున కర్తవ్య విస్మరణము గావించెదరేమో అని యూహించి, 'కేవలం ధర్మరక్షార్థశ్చ విభవో బాహ్యచేతసాం। విహితాశ్చోపకారాయ పద్మపత్ర నయం వ్రజేత్॥' (15) సాధువుల ఐశ్వర్యము ధర్మరక్షణము నిమిత్తమే యగును. కనుక దామరాకులోని నీరమువలె నిర్లిప్తులై యుండవలయుననియు శంకరుడు మహానుశాసనమున పీఠాధిపతుల విధ్యుక్త ధర్మముల వచించి, అలసత్వము నుండి హెచ్చరించి శాసించెను.

దేశదేశముల దన జీవిత కాలమంతయు బర్యటించి, పరిస్థితుల నవగత మొనరించుకొని, విచారించి, పూర్వోక్తరీతి ధర్మమును సుస్థిర మొనరించు కాంక్షచేత నీ పీఠముల నెల కొల్పి యుండుటచే నాపీఠాధిపతుల గూడ నట్లు గట్టిగ హెచ్చరించియుండెను. ఈ పీఠములు ఒక్కచోనున్నచో దేశ వ్యాప్త ప్రచారము సన్నగిల్లుననుట గ్రహించి, దేశమున నలు దిక్కుల నీ పీఠములస్థాపించుట గమనార్హము. 'పశ్చిమా మ్నాయః శారదామఠ ఉచ్యతే' (1) 'ద్వారకాఖ్యం' (2) పశ్చిమమున శారదామఠము నాబడు దానిని ద్వారవతిలోను, 'పూర్వామ్నాయో ద్వితీయః స్యాద్గోవర్ధన మఠః స్మృతః'(4) 'జగన్నాథః' (5) తూర్పుదిశలో గోవర్ధనపీఠము అనబడునది జగన్నాథమున, 'తృతీయ స్తూత్తరామ్నాయో జ్యోతిష్మాన్ హి మఠోభవేత్' (7) 'బదరికాశ్రమః' (8) తృతీయము జ్యోతి

ర్మఠమునాబరగుచు బదరికాశ్రమమునను, 'చతుర్థో దక్షిణా మ్నాయః శృంగేరీతి మఠో భవేత్' (10) నాలుగవది దక్షిణ మునగల శృంగేరీమఠము అను రీతి నాలుగుమఠములు దేశ మునకు నాల్గుదిక్కులల శంకరునిచే స్థాపింపడెనని (శ్రీ) శంకర విజయమహార్ణిక.

అందు ద్వారవతీ మఠము కీటవార సంప్రదాయము. అనగా కీటకాదులనుగూడ హింసింపకుండుట నిట ముఖ్యము. ఈ మఠసంప్రదాయమున బ్రహ్మచర్య దీక్షగొన్న నైష్ఠిక బ్రహ్మచారి 'స్వరూపు'డనబరగుచు, సన్న్యసించునాడు తీర్థ ఆశ్రమ, పదద్వయములో నొక్కదాని గ్రహించి, తన తురీ యాశ్రమ నామపట్టమునకు జివర నుంచుకొనును. సింధు సౌవీర సౌరాష్ట్రి మహారాష్ట్రములును వీని మధ్యగల దేశములును ఈ మఠపాలనమున నుండును. ఇచట 'తత్త్వమసి' మహా వాక్యము సన్న్యాసులకుపదేశింపబడుచు సామవేదము అధ్య యనముగ నుండును.

జగన్నాథపీఠమునకు భోగవార సంప్రదాయమని నామము. భోగముల త్యజించు వారనిభావము. ఇట బ్రహ్మ చారి 'ప్రకాశక' డనబడి సన్న్యాసమున వన, అరణ్యాద్వయ మున నొక పట్టమును స్వీకరించును. ఋగ్వేదము ప్రధానమై 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యమును బొందును. అంగ వంగ కళింగ మగధ ఉత్కల బర్బరదేశములు యీ మఠా ధీనములు.

బదరికాశ్రమమునగల జ్యోతిర్మఠము విషయములనుండి దొలగు వారగుటచే ఆనందవార సంప్రదాయ మనబడుచు,

బ్రహ్మచర్యదీక్షాకాలమున 'ఆనంద'యనియు, ఆశ్రమస్వీకరణ కాలమున గిరి, పర్వత, సాగర, ములను పట్టములలో నొక దాని గైకొని, 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యమును స్వీకరించి, అథర్వణవేదమును గలిగియుండును. కురు కాశ్మీర కాంభోజ పాంచాలమొదలగు విభాగములు యీ మఠపాలన మునసుండును.

శృంగేరి పీఠము భూరివార సంప్రదాయమని కాంచ నాదుల వ్యవహరించుటచే నాబడి, బ్రహ్మచర్యమున 'చైతన్య' అనియు, సన్న్యాసమున సరస్వతి, భారతి, పురి యను వానిలో నొక పట్టమును బొంది, యజుర్వేదమును, 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యమును బొందియుండును. ఈ మఠపాలనమున ఆంధ్ర ద్రావిడ కర్ణాటక కేరళదేశము లుండును.

మరియు, శారదామఠాచార్యుడు ఆశ్రమ నామ పట్టముగను,గోవర్ధనమున అరణ్యానామకుడుగను, జోతిర్మఠమున ఆచార్యుడు పర్వతాఖ్యుడుగను, శృంగేరి పీఠాధ్యక్షుడు భారతీ పట్టధరుడుగను ఉండవలయుననియు శాసనము. కాని యీ నియమము ఆచరణములో శృంగేరిపీఠమున విఫలమైన దని మఠపరంపరల గాంచిన గోచరించును. ఈ నియమము ప్రథమముననే యున్నచో, క్రీ. త. 155 వ సంవత్సరమునగల జ్ఞానోత్తమాచార్యుని వరకు ఆచార్యపట్టము, అంత జ్ఞానగిరికి గిరిపట్టము, క్రీ.త. 1097 లో పట్టమునొందిన ఈశ్వరతీర్థనుండి క్రీ.త. 1380 వరకు తీర్థ యను పట్టము, అంత క్రీ.త. 1371 లో విద్యారణ్యునితో అరణ్య నామము ఎట్లు గలిగియున్నవో దుర్గ్రాహ్యము. అట క్రీ.త. 1368 లో చంద్రశేఖరభారతితో

కూడ భారతీ సంప్రదాయము శృంగేరికి లభించియున్నది. అంతేకు బూర్వము శృంగేరికి నియమించిన సరస్వతి, పురి పట్టము గలవారైననుగాక అన్నిపీఠ సంబంధనామములతో గలిగి యుండుట గమనార్హము.

సూక్ష్మముగ యోచించుచో 'తీర్థాశ్రమ వనారణ్య గిరిపర్వత సాగరాః సరస్వతీ భారతీ చ పురి నామాని వై దశ॥' యనబడు దశనామ సంప్రదాయము శంకర స్థాపితము కాదేమో అను అనుమానము తోచును. శంకర రచితము నాబడు మఠామ్నాయ మహానుశాసనములను గ్రంథముల వీని వివరములు గోచరము. ఆ గ్రంథ ద్వయముల నాకర్త సంప్రదాయములను, తదితర వివరముల నొసంగి యుండుటయే గాక మహానుశాసనమున, పీఠాధిపతుల నెక్కువగ హెచ్చరించుచు బూర్వము వచింపబడినట్లు సోమరితనము అధికమగుట, పర్యటన గావింపక భోగలాలసమున మఠమునందే యుండుట, అవస్థులు పీఠము నలంకరించుట, మొదలగు హేయలక్షణములు యీ పీఠముల బ్రవేశించినయంత నియమములు లేని వీనినొక క్రమమున నుంచ నీ శాసనములు గావింపబడియుండు నని దోచును. అంతియగాక నీరచన కాలమునను పీఠాధిపతులలో నసూయాదికము ప్రబలి ఒకరి నొకరు ద్వేషించుకొనుచు నుండుటచే 'పరస్పర విభాగే తు ప్రవేశో న కదాచన' (6) వారి వారికి నిర్ణీతములైన బ్రదేశములలోనికి మరొకరు ప్రవేశింప రాదనియు, అట్లు గానిచో 'మర్యాదాయా వినాశేన లుప్యేరన్ నియమాః శుభాః। కలహాంకార సంపత్తిరతస్తాం పరివర్జయేత్॥' (7) నియమము మీరి ప్రవర్తించినచో

శుభదాయక నియమములు లోపించి కలహాహంకారములు జనించును. కాన నియమము నుల్లంఘింపరాదు అనియును శాసింపబడినది. మరియు నొకే పీఠమున నాధిపత్యమునకై పెక్కురు పోరాడుకొనుచుండుటచే, 'ఏక ఏవ అభిషేచ్యః స్యాదంతే లక్షణ సమ్మతః । తత్స్థానే క్రమేణైవ న బహూ ర్యుజ్యతే క్వచిత్ ॥' (13) ఒక్కొక్క పీఠమునకు ఆయా యాచార్యుల శంత్యదశయందు, ఒక్కొక్కనికే పట్టము గట్టవలయునే గాని, ఒకే మఠమునకు పెక్కురు ఆచార్యు లుండరాదు అనియు గట్టి నియమము గావింపబడియున్నది. ఆరంభదశలో నున్న పీఠములలో నిట్టివి ఆ కాలమున ప్రవేశించియుండ నవకాశములేదు. ఈ గ్రంథముల శంకరుడు రచించియుండలేదనుటకు జివరిశ్లోకము ముఖ్యప్రమాణము. అందు కృతయుగమున చతుర్ముఖుడు జగద్గురు వనియు, త్రేతా ద్వాపరముల వసిష్ఠ వ్యాసాదులనియు, గలిలో జగద్గురువు తానే యనియు శంకరుడు తానే చెప్పుకొని యుండుట సముచితముగ గానరాదు. అందుచే శంకరరచితములని యనబడు కొన్ని యితర కృతములవలె నిదియు గాలాంతర ప్రక్షిప్తమై యుండవచ్చును. ఆ కారణమున దీక్షాశ్రమాది దశనామ విధానముగూడ శంకర కాలానంతర జన్యమే యని దోచుచున్నది. ఈ దశనామములే గాక శంకర పూర్వానంతర కాలముల యతి యోగి ముని ఆచార్య పదములే బహుళముగ నుపయోగములో నున్నట్లు వ్యక్తము. అటులే కాలక్రమపరిణామమున గాంచీనగర స్థిత కామకోటి అధ్వర్యమునను యితరముగను అగోచరలీల ఇంద్ర సరస్వతీశబ్దముగూడ ప్రచారములోనికి వచ్చి సన్న్యాసుల

రో పట్టము నలంకరించియున్నది. అదేవిధముగ బదరికాశ్రమ బ్రహ్మచారుల కుపయోగించు ఆనంద పట్టము గాక ఆనందసరస్వతి, ఆనందతీర్థ, ఆనందభారతి మొదలగు స్థానముల నొక దశనామమును గలిగియు, అమలానంద మొదలగు నామముల నిది ప్రత్యేకత సంపాదించి దశనామాపేక్షయే లేక జెల్లొందు చున్నది. ఆనంద పట్టమునకు శ్రీ రామకృష్ణ సన్న్యాససంప్రదాయ ఆవిర్భావమును శక్తిబలిష్ఠమై, సన్న్యాసికి ఆనందశబ్దము అనివార్యమని ప్రజానీకమున దోచునట్లొనరించినది. శ్రీ రామకృష్ణ సంప్రదాయము పురీసంప్రదాయమైనను అనిర్వచనీయలీల ఆనందపురి అయి, ప్రథమమునందే పురీ శబ్దము త్యజింపబడి ఆనందశబ్దమే ప్రధానముగనుండుట గమనార్హము. ఈ విధముగ శంకరానంతరమున యీ దశనామములు జనించి, పరిణమించి, ప్రస్తుతము ద్వాదశనామములు వ్యవహారములో గలవు.

ఈ విధముగ శంకరునిచే స్థాపింపబడిన పీఠచతుష్టయము అసమానలీల నభివృద్ధిగాంచుటకును, అందు ప్రథమతః శంకరునిచే నియోగింపబడిన నల్గురు ఆచార్యులే కారణ మనజెల్లును. శంకరుని యనంతరము సమర్థముగ వ్యవహరింపకుండినచో శంకరకృషియంతయు నిష్ఫలమై పోయియుండెడిది. అందుచేతనే ఆ ఆచార్యచతుష్టయమును పరంపరా శ్లోకముల శంకరనామానంతరము జేర్చి నమస్కరించుచున్నాము. వారి కార్యదీక్ష అమోఘమని వేరుగ జెప్పనవసరము లేదు. అందుచేతనే యీ నాలుగుమఠములకు క్రమక్రమముగా ననేక ఉపపీఠములేర్పడి, అద్వైతసిద్ధాంత ప్రచారమున దేశమున ధర్మపాలనము అద్భుత

చందము నిర్వర్తించి, అసంఖ్యాకమైన పండితులను, గ్రంథ కర్తలను, సిద్ధులను, దేశమునకు యీ సంప్రదాయము ప్రసాదించి, మోక్షోపాయసోపానములజిత్రించి ఆదర్శమును జూపియున్నది. అట్లు దక్షిణాదిన శృంగేరిమఠమున కుప పీఠములుగ (1) విరూ పాక్ష (2) పుష్పగిరి (3) కామకోటి (4) కూడలిగి (5) సంకే శ్వర (6) శ్రీశైల (7) ఆ మణి మఠములు ఏర్పడి దేశమున కుపయుక్తమైయున్నవి. అటులే మిగిలిన గోవర్ధన శారదా జ్యోతి ర్మఠములకును బెక్కు ఉపపీఠములు ఏర్పడియున్నవి. ఇంత విస్తారముగ, దేశవ్యాప్తముగ, బహుముఖ అభివృద్ధిగలిగి యీ మఠములు విజృంభించుట నాయా యాచార్యుల సర్వతో ముఖ సమర్థతయు బ్రజాదరణమును కారణములు.

ప్రథమతః యీపీఠముల నేర్పాటు గావించిన శంక రుడు దూరమాలోచించి, తన శిష్యులలో ముఖ్యులును సమ ర్థులు అయిన నలుగురిని, మఠామ్నాయము ననుసరించి చూడ ద్వారకయందు నెలకొన్న శారదాపీఠమునకు విశ్వరూపా చార్యుని, జగన్నాథమునగల గోవర్ధనమునకు బద్మపాదా చార్యుని, బదరికారణ్యముననున్న జ్యోతిర్మఠమునకు దోటకా చార్యుని, తుంగభద్రాతీరమున స్థాపితమైన శృంగేరి పీఠమునకు పృథ్వీధరాచార్యుని ఏర్పాటు గావించెను. కాని గురువంశ కావ్యము ప్రకారము హస్తామలకుడు ద్వారకాపీఠమునకును, తోటకుడు బదరీపీఠమునకును, పద్మపాదుడు జగన్నాథ పీఠమునకును, సురేశ్వరుడు శృంగేరికిని నియోగింపబడినట్లు (3. 60. 62) తెలుపుచున్నది. బృహచ్ఛంకర విజయము నను సరించి, పద్మపాదుని ద్వారకామఠమునకును, భోగవర్ధనము

గోవర్ధనమునియు నామఠమునకు హస్తామలకుని, శృంగేరికి సురేశ్వరుని బదరికాశ్రమమున దోటకుని నియోగించినట్లు తెలియుచున్నది.

ఈ ప్రథమాచార్యుల నియామకవిషయ మెట్లున్నను, యీ మఠచతుష్టయస్థాపనానంతరము, శంకరుడు బదరి కేదారాదుల బర్యటించి, కాంచీపురమున కేతెంచి, రాజరాజేశ్వరీ సన్నిధానమున సర్వజ్ఞపీఠము నధిష్ఠించి, కామకోటి మఠమును స్థాపించినట్లు బృహచ్ఛంకరవిజయము, అనంతానందగిరికృత శంకరవిజయము, స్కాందపురాణాంతర్గత శివరహస్యము, పతంజలి చరిత్రము, శంకరాభ్యుదయము, వ్యాసాచలకవి శంకరవిజయము, కామకోటిమఠమునగల గురురత్నమాలికా మొదలగు గ్రంథములు తెలుపుచున్నట్లు ఒకవాదము గలదు. కాని ఆయాగ్రంథములు, శంకర జీవితమును దెల్పుచు, కాంచీ నగరమునగల కామాక్షినిగూర్చి తపమాచరించి, శంకరుడు సిద్ధిని పొందెను అను అన్వయముగల వాక్యముల 'సిద్ధి' అను పదమును నిర్యాణముగ నర్థమును ప్రదర్శించినట్లు అర్థాంతరమును గ్రహించుటచే నింత కలవర మేర్పడినదని తోచును. అట్లు స్థాపించిన మఠమునకు దన యవసానకాలమున దామ్రపర్ణినదీతీర వాసియై, కొంతకాలముగ దనయొద్దగల బాల బ్రహ్మచారికి సన్న్యాసము నొసంగి సర్వజ్ఞాత్మ చరణేంద్రసరస్వతి యను నామము నుంచి, ఆ కామకోటి పీఠమున కధిపతిగ జేసి అతను పిన్నవయస్కుడగుటచే సురేశ్వరుని సంరక్షణకర్తగ నియోగించెనని ప్రతీతి. 'చరణేంద్రసరస్వతి' వాడుకలోనికి రాక, కేవలము 'సర్వజ్ఞాత్మముని' అని యతడు వ్యవహరింప

బడుటయేగాక, దన గ్రంథములగూడ మునియే వ్రాసికొని యుండుటయు, తన గురునామమును స్మరించుచు 'దేవేశ్వర పూజ్యపాద' అని తెలుపుటచే శంకరశిష్యుడు గాడని తెలియుచున్నది. అట్లుగాక తన సంరక్షణకర్తయైన సురేశ్వరుని దేవేశ్వరుడని అన్వయనామమున బలికియుండునా యనిన, ముఖ్యముగ అవతారపురుషుడైన శంకరభగవత్పాదునివద్ద శుశ్రూష జేసి, సన్న్యసించి, అన్యుని గురువుగ జెప్పుకొనుట విచిత్రము. అట్లైనను సురేశ్వర శబ్దమును దేవేశ్వర అని మార్చి వ్రాయవలసిన అవసరము గోచరింపదు. అంతేయగాక నతని గురుపరంపరను జెప్పికొనుచు, దేవేశ్వర పూజ్యపాద దేవానందపాద, శ్రేష్ఠానందపాద యనుచు నుండుటచే నతడు సంపూర్ణముగ నన్య సంప్రదాయస్థుడనియే దోచును. మరియు దన 'సంక్షిప్త శారీరక' రచన కాలమును దెల్పుచు, కేరళప్రభువగు మనుకులాదిత్యుని కాలమును సూచించియుండుటయు, నా రాజు క్రీ. శ. 978 లో నుండెనుగాన, సర్వజ్ఞాత్మముని కామకోటి పీఠమునకు బ్రథమాచార్యుడనుట సందేహాస్పదమనివాదము.

మీదుమిక్కిలి పెద్దపీఠముల దేశమున దిక్చతుష్టయమున స్థాపించి, వానికుచిత రాజాశ్రయముల నేర్పరచి, వానికి దశ నామముల, నాలుగు మహావాక్యముల, వివిధ రాష్ట్రముల బనిచియిడి, మరల శృంగేరి యాజమాన్యమునగల కాంచీనగరమున వేరుగ నొక పీఠమును శంకరుడెట్లు నెలకొలుపునో దుర్గ్రాహ్యము. శృంగేరి పీఠమునకు మఠామ్నాయము ననుసరించి రామేశ్వరము క్షేత్రముగను, గామాక్షినే దేవతగను

నేర్పాటు గావించినటులుండ మరల గామాక్షీ సన్నిధాన మున నింకొక పీఠమేల? ఈ మఠమునకు మహావాక్య మేమి? సంప్రదాయ మేది! అనగ నితర పీఠములకుగల సాంప్రదాయిక వివరములు దీనికెట్లు ఏర్పడెను అను పలువిధ సంశయములు బొడగట్టును. వీరుపయోగించు ఇంద్ర సరస్వతి యోగపట్ట గాథయు సంశయాస్పదమే. కాంచీనగరమున శంకరుడు సురే శ్వరునితోనుండ, నీ ముఖ్యశిష్యునికి తీరనివ్యాధి సంప్రాప్తింప, శంకరుడు చింతించి, అశ్వినీదేవతల బ్రార్థించి వారి వైద్య మున నివారించెను. అందులకు దేవతల వైద్యులు మానవుల కొరకరిగినందున ఇంద్రుడు కినిసి, వానిపై వజ్రాయుధమును బ్రయోగింప శంకరుశక్తిచే నవి నిర్వీర్యమయ్యెను. అంత సురేంద్రుడు తన పొరబాటు నెరింగి, శంకరు శరణుజొచ్చి, తన ఇంద్రబిరుదమును శంకరున కర్పించెను. అటులే సర్వజ్ఞపీఠము నధిరోహించునాడు, సరస్వతిని శంకరుడోడించుటచే నా సర స్వతియు నిందులో గలిసి ఇంద్రసరస్వతి శబ్దముగ మారినట్లు కాంచీమఠ సంప్రదాయము. ఈ గాథ శంకరవిజయములలో నెందును గానరాదు. అంతియగాక యీ మఠమునకు జెందని సన్న్యాసులకు గొందరికి యీ పట్టము పూర్వమే గోచర మనియు గొందరి అభిప్రాయము.117

మరియు మఠామ్నాయములలో నీ మఠప్రస్థావన లేకుండుటయేగాక, పద్మపాదాది ముఖ్యశిష్యగణములలో సర్వ జ్ఞాత్ముని నామముగూడ గానరాదు. అటులే బ్రహ్మవిచారణ మునకై ఏర్పడియున్న చాతుర్మాస్యదీక్షాప్రారంభమున వ్యాస

117. MSS. of S. M.

పూర్ణిమ అనియు, గురుపూర్ణిమ అనియు ప్రశస్తమైన ఆషాఢ శుద్ధ పౌర్ణమినాడు పూర్వబ్రహ్మవిద్యాచార్యుల నర్చించుట సంప్రదాయము. అందు నెలకొల్పబడు షట్పంచకములలో ప్రథమము వసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ కృష్ణు లన బడు కృష్ణపంచకము; సనక సనందన సనత్సుజాత సనాతన సనత్కుమారులను సనకాది పంచకము ద్వితీయము; వ్యాస సుమంత జైమిని వైశంపాయన పైలాది వ్యాసపంచకము తృతీయము; శంకర పద్మపాద హస్తామలక తోటక సురేశ్వరాది శంకరపంచకము చతుర్థము; ద్రవిడ గౌడ గోవింద సర్వజ్ఞ ప్రకాశాత్ములు నా ద్రవిడాచార్య పంచకము పంచమము; గురు పరమగురు పరమేష్ఠిగురు పరాపరగురు పరాత్పర గురుగణ ము లు గురుపంచకమును షష్ఠముగ గామకోటి సంప్రదాయమువా రనుసరించెదరు. అందు శంకరపంచకమున సర్వజ్ఞునికి స్థానము గలుగలేదు. అందుచే నీ కామకోటి మఠము కాలాంతర స్థాపితమై, క్రమముగ నందలి ప్రజ్ఞాశీలురైన అధ్యక్షులచే జెంపొంది, ముఖ్యస్థానము నలంకరించి, శృంగేరినుండి చీలి, ప్రత్యేకముగ వ్యవహరించుచున్నదని అధికసంఖ్యాకులైన పండితాభిప్రాయము.118

మఠామ్నాయమును సూక్ష్మముగ గమనించినచో ప్రథమమున భాష్య వార్తిక రచన నియోగసమయమున ప్రారంభించిన పరస్పరాసూయాభావములు శంకరు నిర్యాణ కాలమునకు విజృంభించి యుండునని దోచును. అనగ మఠా

118. C.N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 50.

మ్నాయమును శంకరుడే రచించెననుటయే వాస్తవమైనచో నిట్టి అపోహకలుగును. అందుచేత ఆ పీఠాధిపతులకు నెట్టి సంబంధమును లేక, ఆయవిభాగము నొసంగునట్లు, పిత్రార్జితమును బంచి యిచ్చునట్లు శంకరుడు గావించెనని యనవలెను. ఒక మూలకేంద్రమును నెలకొల్పి, తదధీనముగ మొత్తము సంస్థ యేర్పడియుండినచో పరస్పర సహకారమున క్రైస్తవ సంస్థవలెను, నేటి రామకృష్ణ సంస్థవలెను బహుళవిధ పరిణామమును నొంది అధికతరోపయుక్తమై యుండెడి దని పించును. కాని మన కీనాటికి గోచరింపని అసాధారణ కారణములచే శంకరుకాలముననే యీ సంస్థ నాలుగు ముక్కలై పోవుట విచారకరము. అది ముఖ్యముగ నాటి శిష్యుల లోపమనియే చెప్పనగును.

మండనమిశ్రుడు సురేశ్వరుడు గాదనియు, విశ్వరూపుడు వీరిద్దరికి అన్యుడనియు నను విషయము పూర్వము జూచి యున్నారము. ఈ మూడునామముల నా కాలముననే, దర్శ్వాతను పర్యాయ పదములుగ గ్రంథకారు లుపయోగించి యుండుట స్పష్టము. ఆశ్రమ స్వీకరణానంతర నామములకు బూర్వనామములకు విభేదము నెంచక గ్రంథకారులు బూర్వ ముపయోగించియుండుటచేత యిన్ని సంశయములు గోచరము 'పంచపాదిక కర్తారం పద్మపాదం సనందనం । వార్తికాది గ్రంథకారం విశ్వరూపం సురేశ్వరం॥ పృథ్వీధరాఖ్యం శ్రీమద్హస్తామలక యోగినం । తోటకం చానందగిరిం ప్రణమామి జగద్గురుం ॥' అను జగన్నాథ గోవర్ధనపీఠ గురు నమస్కార పాఠమును గాంచిన యీవిషయము విస్పష్టము. దీనిలో

ఆయా యాచార్యుల అపర నామములగూడ గ్రోడీకరించి యుండుట గమనీయము. అందుచే సురేశ్వరుడు విశ్వరూపుడు గను, పద్మపాదుడు పద్మనాభ సనందనుడుగను, హస్తామల కుడు పృథ్వీధరుడుగను, తోటకుడు గిరి ఆనందగిరి గను వ్యవహార ముండుటచే వారిలో నివ్యత్యాసము నాపాదింప జూచుట సమీచీనముగాదు.

ఈ విధముగ అతీతముగ దూరదృష్టిగలిగి, స్వీయబోధి తాద్వైతార్థసుధ తనతోడనే యింకిపోనీయక, నాటి సుధ న్వాది రాజశేఖరుల లోంచి, పీఠముల కవసర సంభారముల జేర్చి, తన కాలముననే వానికొక సంపూర్ణత్వము నొసంగి, అవిచ్ఛిన్నలీల దేశవ్యాప్తముగ నా ఉపదేశ పీయూషము వ్యాపించు నవకాశమును శంకరు డానాడే ఏర్పాటు గావించెను, తన యనంతర జిజ్ఞాసువులకు కేవలము అప్రత్యక్షమును పరోక్షమును అగు జ్ఞానమును మాత్రము గ్రంథముల ద్వార ప్రసరింపజేసి, దానితో దృప్తిగాంచక నట్లు అపరోక్షా నుభూతి కుపయుక్తమగు ఆదర్శ ఆచార్యమూర్తులను గూడ బరంపరగ బ్రజానీకమునకు శంకరు డొసంగుట ఒక ప్రసా దము మహాప్రసాదము. కాని అవి ప్రస్తుతకాలమున శక్తి క్షీణించి, ప్రజానీకమునకు సద్వినియోగము కాకుండుటయేగాక జాలవరకు నిరుపయోగముగ నుండుటచే నాయా పీఠాధిపతులు కొంచెము ఆత్మపరిశీలనము గావించుకొని, యింకను పీఠముల యెడ ఆదరాభిమానముల ప్రేమ ప్రపత్తులను గల్గియున్న అసంఖ్యాక ముముక్షువుల కృషితో నాపీఠముల శక్తివంత ముగ నొనర్చి, అధర్మ శిక్షణమునకు గాకున్నను, ధర్మప్రబోధ

మున కైనను సద్వినియోగము నొంద యత్నించెదరు గాక అని ఆశించుచున్నాము.

---

## సారస్వతము

What shall we say then, of the Master Sankara? Is he not the Gaurdian of the sacred waters, who, by his commentaries, has hemmed out, against all impurities or Time's Jealousy, first the mountain tarns of the *Upanishads*, then the serene forest lake of the *Bhagavatgita*, and the last deep reservoir of the *Sutras*; adding, from the generous riches of his wisdom, lovely fountains and lakelets of his own *the Crest jewel?*[119] ఇక శంకరాచార్యుని గూర్చి మన మేమి వచింపవలెను? పరమపావనోదకములై, పర్వత నిర్ఝర స్రవంతు లగు నుపనిషత్తులకు, మిగుల ప్రశాంతారణ్య సరోవరమైన భగవద్గీతకు, జివరకు నగాధకాసారమైన సూత్రములకు తన భాష్యముల చేతను; తన కరుణామయ ప్రజ్ఞాసంపదనుండి వివేకచూడామణి, ఆత్మానాత్మ వివేకము మొదలగు సుందర స్రవంతులు సరస్సులచేతను, గాలమత్సరము నాబడు మలినమునుండి రక్షించిన ధర్మపాలకుడు అతడు గాదా? అను

119. Dr. Charles Jonston : Sankaracharya of S.S. S. Sastry,

చార్లెస్ జాన్‌స్టన్ వాక్యమురీతి సుప్రసిద్ధ వేదాంతార్థరస సంరక్షకుడై, భారతీయ తత్త్వశాస్త్ర నిర్మాతలలో పతి ప్రధాన స్థానము నలంకరింప, దా నయ్యాధ్యాత్మికానందమున మునిగియుండు సామాన్య అనుభవజ్ఞునివలె నుండ దృష్టి గాంచక, నాత్మానంద విభూతుల నసాధారణ ప్రజ్ఞతో శ్రుతి యుక్తి అనుభవబద్ధ మొనరించి, శ్రుత్యాధారమునకై ఉపనిషత్తుల భాష్యములను, యుక్తిప్రాధాన్యముగ బ్రహ్మ సూత్ర భాష్యమును, అనుభవపురస్సరంబుగ భగవద్గీతా శాస్త్ర భాష్యమును, సర్వోపయుక్తముగ విరచించి యుండు టచే జి. తిబాట్ వాక్యమురీతి undoubtedly occupies high rank.[120] అత్యున్నత స్థానమును నిస్సందేహముగ శంకరు డధిష్ఠించెను.

Bewitching and marvellous and simple. It is at once the language of the child and the philosopher in one.[121] శంకరు శైలి సమ్మోహనమై అద్భుతమై స్పష్టమై యుండి శిశువుభాషయును దత్త్వజ్ఞుని భాషయు నేకమై యుండు నట్లుండుటచే నతని రచనము లత్యంతప్రశస్తిని గడించి యున్నవి. శైలియే యొకని చిత్తసంస్థితిని బ్రతిబింబించుచో నది శంకరులో బ్రస్ఫుటము. అత్యున్నతభావముల నతిసులభ భాషలో నతడు ఇముడ జేయగలడు. Viewed from any standpoint, it is truly a privilege to read a bit of him or hear

120. Dr. George Thibaut : The Vedanta Sutras—Sankara Bhashya, p xv.

121. C.N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p 56.

some of his slokas sung to you.[121] ఏ దృష్టితో జూచి నను అతని రచనము నొకించుక బఠించుట గాని, నతని శ్లోక ముల వినుటగాని, యథార్థముగ నొక అదృష్టము అని కృష్ణ స్వామి అయ్యరు వాకొనును. అతని రచనములు కేవలము యుక్తియుక్తములుగాక but rather that of a scientific treatise.[122] శాస్త్రీయ రచనములనియు, అతని వాక్య ములు దీర్ఘములై నిగూఢములనియు, కాని his exposition is clear and transparent అతని వివరణము స్పష్టము విశదము అని మాక్డోనెల్ ప్రశంసించెను. ఇంత ఎందులకు, In clearness of vision, singleness of purpose, clarity and depth of the style of expositon (భాష్యం ప్రసన్న గంభీరం) few, if any, can rival Sankara, while none has excelled him.[123] విస్పష్టదృక్పథమున, ఏకీకృతసంకల్ప మున, శైలిలోగల అగాధత్వము స్పష్టత్వమున, శంకరునితో నొందరు పోటీబడగనును గాని ఎవరును అతిశయింపలేరు. ఈ రచనా పద్ధతి కనుకూలముగ was the romantic charm of the youthful ascetic, who renounced before he had lived, and had completed his life's work before many others are ready to begin theirs. [123] ఇతరులు తమజీవితముల ప్రారంభింపని లేతప్రాయముననే సర్వ సంగత్యాగ మొనర్చి, తన జీవితకార్యమును ముగించిన ఆ

121. C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas p 56.

122. Dr. A. A. Macdonell: India's Past.

123. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 70.

లేయావన సన్న్యాసియొక్క అద్భుతాకర్షణమున గలదని సూర్యనారాయణశాస్త్రి చక్కగ వ్రాసియున్నాడు.

భాష్య ప్రకరణ స్తోత్రము లనురీతి త్రివిధములుగ విభజింప నర్హములగు శంకరాచార్యుని రచనములు, ఏయే కాలముల వేనివేని వ్రాసినదియు గాలక్రమణిక ప్రకారము నిర్ణయించుట దుర్లభము. ఈవిషయమున గ్రంథవిషయము ననుసరించి అనేకతెరంగుల బండితులు ఊహాగాన మొనరించియున్నారు. సులభముగనున్న విష్ణు సహస్రనామ భాష్యము ప్రథమమనియు, గీతాభాష్యము చరమమనియు గొందరి ఉద్దేశ్యము. విషయ సౌలభ్యముననుసరించి అట్లూహించుట పాడి కాదు. స్తోత్రములతో బ్రారంభించి క్రమముగ భాష్యరచనము నకు శంకరుడు జేరెననుట ఉచితము.

---

## భాష్య గ్రంథములు

'ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరః। ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ॥' (ముక్తికోపనిషత్తు) అను ప్రఖ్యాత దశోపనిషత్తులకును, (11) నృసింహతాపిన్యుపనిషత్తు (12) శ్వేతాశ్వతరోపనిషత్తు (13) సనత్సుజాతీయము (14) అధ్యాత్మపటలము (15) హస్తామలకీయము (16) విష్ణుసహస్రనామము (17) లలితా త్రిశతి(18) బ్రహ్మసూత్రశారీరకము (19) భగవద్గీతాదులైన పందొమ్మిది గ్రంథములకు శంకరుడు భాష్యముల నిర్మించెను.

ఇందులో (1) రూఢిగా శంకరరచనలు (2) సంశయాస్పదములు (3) అన్యములు అనురీతి ఎస్. కె. (Belvalkar) బెల్వాల్కర్ పండితుడు విభజించెను. బ్రహ్మసూత్ర గీతా దశోపనిషద్భాష్యములు శంకరునివే అని రూఢిగా నతడు తీర్మానించెను.124 కాని ఉపనిషద్భాష్యవిషయమున నొకించుక సందేహముగలదు. శంకరుడు (108) ఉపనిషత్తులకు భాష్యరచనను గావించి యుండలేదు. వానిలో గొన్నింటిని బ్రత్యేకించి దశోపనిషత్తులకు వ్యాఖ్యల నిర్మించి యుండును. శ్వేతాశ్వతర నృసింహతాపినులకు శంకరానంతర రచయిత వ్యాఖ్యల బొందుపరచి యుండునని అతని నమ్మకము. అయితే మాండూక్యకారికా భాష్యముగూడ శంకరకృతము కాదని అతని యూహ. ఇతర భాష్యములకును ఈ వ్యాఖ్యకు రచనా పద్ధతిలో దారతమ్యము గోచరము అని అతని తలంపు. కాని గ్రంథ రచనములో ముందు వెనుకల ననుసరించి భాషా భావముల నొకించుక వ్యత్యాసముండుట సహజమే. అందుచే మాండూక్యకారికా భాష్యము భాష్యరచనములలో నన్నింటికి బ్రథమము మరియు వాడుకగలిగి యుండుటచే నందలి శైలిలో విస్పష్టత లోపించి యుండవచ్చును. ప్రఖ్యాత దశోపనిషత్తుల స్వీకరించి, అందు అతిముఖ్యమైన మాండూక్యమును, అందు జీవగర్రయైన కారికలను శంకరుడు గ్రహింపలేదనుట సముచిత నిర్ణయము గాదు. అద్వైతమున సుప్రసిద్ధపూర్వాచార్యుల భావసంపదను శంకరుడుపయోగించుకొనియే యున్నాడు. శంకరకృత భాష్యములు గావని 31 గ్రంథముల బెల్వాల్కర్ ఎంచి త్రోసి

124. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 24

పుచ్చియున్నాడు. అందు శంకర నిర్మితము లనబరగుచున్న సాంఖ్య యోగసంబంధములను, వాత్స్యాయనుని కామ శాస్త్రసంబంధమైన అమరుక శతకమును, సంపూర్తిగ శంకరున కన్వయింపజాలమని అతని వాదము.

'సూత్రార్థో వర్ణ్యతే యేన పదైః సూత్రాను సారిభిః। స్వపదాని చ వర్ణ్యతే భాష్యం భాష్యవిదో విదుః॥' స్వీయ వాక్యముల సూత్రాభిప్రాయముల ననుసరించి, సూత్రార్థమును వర్ణించునది భాష్యముగ భాష్యజ్ఞుల నిర్వచనము. ఈ నిర్వచనము ననుసరించి గ్రంథార్థమును స్వవచనములతో వర్ణించుచు, అందనుకూల స్వీయభావముల నుటంకించుటయే భాష్యముగ దెలియుచున్నది. కాని తనకు స్వతంత్రముగ ప్రత్యేకభావములు అనుభూతియునుండి, వాని నిరూపణముకొరకు శ్రుత్యుక్తుల నుపయోగించుటయు భాష్యముల గోచరము. కేవల పూర్వ భావానువాద రచనము కర్తయొక్క స్వతంత్ర వ్యక్తిత్వమును నిరూపింపదు. కాన భాష్యరచనముగా వించిన శంకరునికి తత్వజ్ఞ లోకమున స్థాన మెద్ది యను ప్రశ్న గోచరము. Philosopher's greatness lies in two things-originality of subject matter and the critical method of presentation.[125] విషయ స్వాపేక్షిత్వమునను, యాక్తికరచనావిధానమునను తత్త్వవేత్తయొక్క గొప్పదనమిమిడియుండు నను నటుల, శంకరుడు కొన్ని స్వతంత్రభావముల గలిగియుండి, వాని శాస్త్రాదుల గూడ గాంచి, యుపొంగి, గురుసాన్నిధ్యమున దపోకృపిమూల

125 Mahanamavrata Brahmachari : Kalyana Kalpataru, 1936, p 543

ముగ వాని స్థిరముగావించి, తదనుగుణముగ బోధించి, రచించి యుండుటచే నతడు ప్రపంచమునగల తత్త్వవేత్తలలో నగ్ర గణ్యుడనుట అత్యంత సముచితనిర్ణయము. విరివిగ శ్రుతి ప్రమాణ ముల శంకరుడు చూపించుట, తన భావములకు జేయూత నొసంగిన పూర్వగ్రంథ ఆచార్యులకు దనకృతజ్ఞత జూపించుట కొరకే యని వాకొనును, Sankara...in reverting constantly to them to show that which he taught was really their own purport. 126 శ్రుతితాత్పర్యమునే తా బోధించుచున్న విషయ నిదర్శనమునకై శంకరుడు పకటితిగ శ్రుతి ప్రమాణముల జూపించియున్నాడని దేశాయి తెలిపియున్నాడు. అనేక జన్మప్రసిద్ధమైన సంస్కారజన్ముడు కావుననే గదా అచిర కాలమున వేదవేదాంగశాస్త్రాధ్యయనమును ముగించి, తన సంస్కారముల కనుగుణమైన అద్వైతమును వానినుండి సేకరించి, గోవింద సన్నిధానమున దాని బోషించి, అంత విజృంభింప జేయ గలెను! కావున అద్వైతవాదము వైదికమై ఉపనిష ద్ప్రబోధితమై యొప్పినను, దాని జగతి బ్రసరింపజేసిన శంకరు వ్యక్తిత్వము ఆయాశాస్త్రముల గప్పివుచ్చి, తానే తత్కర్త యనునట్లు విపర్యయజ్ఞానమును అజాగ్రత్ ప్రజ్ఞులలో గలుగ జేయుచున్నది.

ఆచార్య పాల్ దేవసేన్ అనుకీతి నుపనిషత్తులలో వివిధ రీతులగల విషయమును a consistent philosophical system.127 ఒక సుస్థిర తత్త్వసిద్ధాంతమును నిర్మించుట

126. Dr. Drupad S. Desai: Prabuddha Bharata, 1935 p. 479
127. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p2

సులభకార్యము కానేరదు. అయినను the Himalayas of the Soul.[128] జీవునకు హిమాలయము లనియు, the Eternities.[129] నిత్యములనియు పేర్వడసియున్న భారతీయాధ్యాత్మిక తత్త్వసారము లైన ఉపనిషత్తుల బ్రధానములుగ గైకొని, వాని కనుగుణ సమన్వయముల గావించి, యొక విశిష్ట సిద్ధాంతమును శంకరుడు రూపొందించె ననుట కెట్టి సంశయమును లేదు. ఈ విషయమును గైకొని గౌడపాదుడు అద్వైత సిద్ధాంత గ్రంథముల పచరించియుండినను, శంకరుడే తన సర్వ కాలసర్వావస్థ సర్వశక్తుల సిద్ధాంతనిర్మాణమున కుపయోగించి, పూర్వవిషయముల ననుసంధించి యొక అద్భుతసిద్ధాంత నిర్మాణము గావించెను. అందుచేతనే We must admit without hesitation that Sankara's doctrine faithfully represents the prevailing teachings of the Upanishads.[130] శంకరవాదము వ్యాపకమైన ఉపనిషద్బోధల సంపూర్తిగ ననుసరించియే యున్నదని నిస్సందేహముగ మనముసమ్మతింప వలయునని ప్రఖ్యాత వేదాంతి తిబాట్ పండితుడు వక్కాణించెను. శంకరవాదము మిగుల మృదుత్వముకలిగి, వివిధసిద్ధాంతముల సమన్వయము జేయగలిగి, Its fundamental doctrines are manifestly in greater harmony with the essential teachings of the Upanishads than those other systems.[130] ఇతర సిద్ధాంతములకంటె నుపనిషత్తుల ముఖ్య సూత్రములకు దీని మూలసిద్ధాంతములు అధికతరముగననుగుణ

---

128. Dr. J. Mascaro : Prabuddha Bharata, 1955, p 408.
129. Dr. Thoreau: Prabuddha Bharata, 1955 p408
130. Dr. George Thibaut

ముగనున్నవి అనియు నతని నిశ్చితాభిప్రాయము. శంకర వాద చాతుర్యమద్భుతమని వాకొని he does more justice to the Upanishads.[131] ఉపనిషత్తులకు శంకరుడు అధిక ముగ న్యాయమొనర్చెనని ఎ. బి. కీత్తు పండితుడును నిశ్చయించెను. అందుచే శంకరుని ఉపనిషద్భాష్యసంపుటి ఉపనిషద్భావముల దన ప్రజ్ఞావిశేషముచే విస్పష్టలీల నేకముఖము గావించి, యొక నిర్దుష్ట సిద్ధాంతరూపమున వ్యక్తము గావించె ననియు పై యభిప్రాయముల విదితమగుచున్నది.

శంకరుడు ప్రత్యేక ప్రత్యేకముగ నుపనిషత్తుల బరిశీలించి, అక్కడక్కడనే సిద్ధాంత సమన్వయముగావించి, అందు బరసిద్ధాంతాన్వయావకాశము నొసంగు మంత్రార్థముల నద్వైత పరముగ నేకస్వనమొనరించి యున్నటుల, బూర్వము బాదరాయణవ్యాసుడును ఉపనిషద్వాక్యైకత్వ ప్రతిపాదనార్థము బ్రహ్మసూత్ర రచనము గావించియుండెను. ఇరువురి గమ్యమొక్కటియే యగుచున్నది. శంకర భావధారకు బాదరాయణ తాత్పర్యము విరుద్ధమై యుండినచో శంకరు డాగ్రంథ ప్రశంసయే గావించియుండెడివాడు కాదేమో! అయినను నా వ్యాసప్రోక్త గ్రంథము సర్వసామాన్య గద్య పద్యాత్మకకృతము గాక, 'లఘూని సూచితార్థాని స్వల్పాక్షర పదాని చ। సర్వతః సారభూతాని సూత్రాణ్యాహు ర్మనీషిణః॥' (భామతి 1.1.1) స్వల్పములై అర్థస్ఫూర్తితములై స్వల్పాక్షరపదములు గలిగి, సారభూతములై యుండు సూత్రరూపమున రచింపబడియుండుటచే, నవి సామాన్య ప్రజ్ఞాతీతములై యొప్పియుండెను. ఈ

131. Dr. A. B. Keith : A History of Sanskrit Literature, p 477

రచనా విధానము ప్రపంచమున ఒక్క భారతదేశముననే జనించి, ప్రావీణ్యతను సంపాదించుకొనెనని ఎం. వింటర్నిట్జ్ ప్రశంసించియున్నాడు.[132] కాని సూత్రముల బూర్వాపరముల నన్వయించుట గష్టసాధ్యమైయున్నను, వ్యాసప్రయత్నము నాటి తాత్త్వికలోకమును ఆనందపరచి యుండుటయు సర్వసిద్ధాంతముల కది బాసటగ నున్నట్లు వివిధాన్వయముల కవకాశ మొసంగుచుండుటచే నతి ప్రధానమై, every new sect in India starts with a fresh commentary on the Vyasa Sutras according to its light.[133] భారతదేశమున ప్రతి నూతన మతశాఖయు దమ సిద్ధాంతానుగుణ్యముగ వ్యాససూత్రములకు నొక క్రొత్త వ్యాఖ్యానమును బ్రారంభించుచుండును. కావున శంకరాచార్య కాలమునకు 'తత్త్వచంద్రికా' కర్త ఉమామహేశ్వర వాక్యము ననుసరించి, 99 వ్యాఖ్యానముల నీ వ్యాససూత్ర గ్రంథము బొందియుండెను. వానిలో ముఖ్యములైనవి, ఉపవర్ష, బోధాయన భర్తృప్రపంచ, ద్రవిడాచార్య, తంక, గుహదేవ, కపర్ది, భరుచి మొదలగు వారివి ప్రశస్తములై భాష్యకారుల దృష్టికి దోచినవి. వానిలో అధికములు, భాస్కరాభిప్రాయము ననుసరించి, 'సూత్రాభిప్రాయ సంవృత్య స్వాభిప్రాయ ప్రకాశనాత్। వ్యాఖ్యాతం యైరిదం శాస్త్రం వ్యాఖ్యేయం తన్నివృత్తయే।' సూత్రాభిప్రాయముల నడంచి, స్వీయ భావముల బ్రకాశింప

132. Dr. M. Winternitz: A History of Indian Literature, Vol 1.

133. Swami Vivekananda: The Complete Works, Vol 3 p 327

జేయుచు, ననేక వ్యాఖ్యానములు రచితములయి యుండుటచే, వాని నివర్తించుటకు యీ శాస్త్రము పునః వ్యాఖ్యేయముగ శంకరుడు దలంచి, అనగ శ్రుతివిరుద్ధ భావప్రదర్శనము యీ వివిధ వ్యాఖ్యానముల శ్రుత్యనుగుణసూత్రముల కన్వయించుచు రచించుచున్నవిగదా అని చింతించి, విరుద్ధార్థ కల్పనమునుండి సూత్రముల నుద్ధరించు తాత్పర్య నిష్ఠలో 'భాష్యం ప్రసన్న గంభీరం' (భామతి) అని వాచస్పతి మిశ్రు డనుకీర్తి సూత్ర భాష్యమును శంకరుడు నిర్మించెను. ఈ విధముగ శంకరాచార్య సూత్రభాష్యావిర్భావ ఫలితముగ నాపూర్వ వ్యాఖ్యానములన్నియు నప్రధానములై కాలక్రమమున విరూపమునొంది నశించియుండుటచే, ప్రస్తుతమునకు, సర్వ సూత్రభాష్యగ్రంథములకే అతిప్రాచీనమై, నివేదితసోదరి వచన సరణి Masterpiece of Sankaracharya's life.[134] శంకరాచార్య జీవితమున నది శిరోభూషణమై, రామతీర్థుని వాక్యములలో the oldest and the best [135] సర్వోత్తమమై ప్రాచీనము శ్రేష్ఠమునై, his expositions agree in all essentials with the meaning of the Brahma Sutras.[136] సర్వముఖ్యవిషయములలో బ్రహ్మసూత్రార్థముల కనుగుణమైన వివరణమనియు, నితర వ్యాఖ్యానముల బరిశీలించి చూచినచో శంకరభాష్యమే the only true representa-

---

134. Sister Nivedita: Sankaracharya of S. S. S. Sastry, p75
135. Swami Rama Tirtha: The Complete Works, Vol 8, p 137.
136. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature p 385.

tive of the Sankara's views.137 సూత్రకార తాత్పర్యములకు సరియైన ప్రతిబింబములనియు, సర్వముఖ ప్రశస్తిని గాంచియున్నది. అంతియగాక, In the first place, the Sankara Bhashya represents the socalled orthodox side of Brahminical theology, which strictly upholds the Brahman or the highest Self of the Upanishads.138 ప్రథమతః శంకరభాష్యము ఉపనిషత్తులలో బ్రహ్మము అనియు పరమాత్మ అనియు వాకొనబడు తత్త్వమును ఖండితముగ సమర్థించు సనాతనవైదిక మతమును ప్రవచించును. అతని తాత్త్విక సిద్ధాంతము the most important one, which has arisen on the Indian soil.138 భారతావని దలెత్తిన సిద్ధాంతములలో నది ముఖ్యమైనది. దానిలో ప్రకటితమైయున్న boldness, depth, subtilty of speculation.138 ధైర్యము అగాధత్వము, సూక్ష్మత్వము, ఆలోచనాపటిమములు అసాధారణములని శంకర రామానుజ భాష్యముల నాంగ్లమునకు అనువదించిన ప్రఖ్యాత సంస్కృత విద్వాంసుడు తిబాట్ పండితుడు వక్కాణించెను. శంకరు మేధాసంపత్తిని అనుభవింప దలంచుచో సూత్రభాష్యోపోద్ఘాతమైన అగాధ అధ్యాస భాష్యమును జూడవలయునని సి. మహాదేవయ్య వచనము.139 కావున శంకర సూత్రభాష్యములో శంకరు మేధాశక్తి వ్యాససూత్రముల గాక అద్భుత

137. Swami Rama Tirtha : The Complete Works, Vol 8 p 135.
138. Dr. George Thibaut : The Vedanta Sutras, Sankara Bhashya, p xiv.
139. C. Mahadevaiah : Vedanta Kesari. 1935

భూషణతుల్యమై ఆచార్య ఎర్నెస్ట్ పి. హార్విట్జ్ వచించుకీతి నా అపూర్వభాష్యము పూర్వభాష్యముల మరుగుపరచి, has excercised the finest Hindu minds and continues to hold them spell-bound. సూక్ష్మ హిందూ చిత్తముల కదలించి, నేటికిని వానిని జకితుల గావించుచున్నది. నేడు శంకరానంతర భాష్యములన్నియు కేవలము శంకర భాష్య ప్రతిబింబములై, అచ్చటచ్చట దమ సిద్ధాంతముల బ్రతిపాదించుచు, దదనుగుణముగ శంకరు ఖండించుచున్నను, వానికి ప్రత్యేక వ్యక్తిత్వము అగోచరము. భాష్యరచనావిధానమున శంకరుడే, తర్వాత వారికి బ్రమాణముగ నయ్యెననుటలో ఆశ్చర్య మావంతయులేదు.

కాని శంకరుడు ఉపనిషత్తుల వ్యాఖ్యానించు నప్పుడు వాని సక్రమరీతి వివరించియున్నను, బాదరాయణసూత్రముల మాత్రము వానికనుగుణవిధాన భాష్యము రచించియుండ లేదని దాసుగుప్త వ్రాయుచు బాదరాయణుడు అద్వైతి కాక సగుణ బ్రహ్మవాది యనియు,[141] నైనను శంకరభాష్యము, attained wonderful celebrity, both on account of the subtle and deep ideas it contains, and also on account of the association of the illustrious personality of Sankara.[142] అందుగల అతిసూక్ష్మ గాఢ భావజాల

---

140. Prof. Earnest P. Horrivitz: Buddhists in Disguise V. K. 1932

141. Prof. Surendranath Das Gupta: A History of Indian Philosophy Vol 1 p 422.

142. Prof. Surendranath Das Gupta: A Histfry of Indian Philosophy, Vol 1 p 429

ప్రభావము చేతను, శంకర ప్రఖ్యాతవ్యక్తిత్వసంబంధము చేతను, అద్భుత ప్రశస్తి నార్జించినదని దాసుగుప్త అభిప్రాయము. గ్రంథ గత భావములు సర్వదా ప్రధానము లగుచుండ వ్యక్తి ప్రభావము తాత్కాలికముగనే యుండును. అందుచే శంకర వ్యక్త్యాకర్షణ మహిమలు భాష్యమున ప్రభావమును జూపించుచున్నను, అందు గర్భితమైన అత్యాకర్షణీయ భావప్రాబల్యములే పాఠ కుల ముగ్ధుల గావించి, ప్రపన్నుల గావించుచున్న దనుట యుక్తము. అంతియగాక వ్యాసుడు ఉపనిషత్తుల భావవైరుధ్య మును దొలగింప, సూత్రరచనము గావింప, దానికి భాష్యము రచించిన శంకరభావములు ఉపనిషత్ప్రమాణములై యుండి బాదరాయణ విరుద్ధములుగ నెట్లుండగలవు? అందుచే శంకరుడు ఉపనిషదాధారములైన సూత్రగ్రంథమును, ఉపనిషద్భాష్య సూత్రభాష్యగ్రంథములద్వార రక్షించి, దాని నిర్మలస్థానము నలంకరింప జేసెనని చాల సమంజసముగ నుండును. కావున వివే కానందుడు The great glory of Bhagavan Bhashyakara, Sankaracharya is, that it was his genius that gave the most wonderful expression to the ideas of Vyasa.[143] వ్యాస భావజాలములకు అత్యద్భుతరూపము నొసంగు అసామాన్య ప్రజ్ఞాశక్తి భాష్యకారుడైన శంకరా చార్యుల గొప్పమహిమ అని వచించి యున్నాడు.

ఈవిధముగ శ్రుతి యుక్తుల ననుసంధించి, ఉపనిషత్ సూత్రములకు భాష్యముల విరచించి, అనుభవభాష్య రచన

143. Swami Vivekananda : The Complete Works, Vol. 4 p 288.

మునకై The most beautiful perhaps the only true philosophical song existing in any known tongue ఏభాషలోనైనను, అతిసుందరమై బహుశః యథార్థతాత్త్వికగీతమని William Von Huarboldt విలియం వాన్ హార్బోల్డ్ మొదలగు పండితులచే సంస్తుతులనందుకొనిన, శ్రీకృష్ణ పరమాత్మ ప్రబోధిత భగవద్గీతా శాస్త్రమును శంకరుడు స్వీకరించెను. గీతాశాస్త్రమును is rightly regarded as one of the greatest master piece of Hindu Vedanta.[144] హిందూవేదాంతమున సర్వోత్తమ శిరోభూషణమని దాసుగుప్త కొనియాడును. ఇందు శ్రీకృష్ణుడు స్వానుభవయుక్తముగ బ్రహ్మను సిద్ధికుపాయాంతరముల బ్రతిపాదించి, తత్ఫలితములగు స్థితప్రజ్ఞత్వాది సిద్ధలక్షణముల బోధించి, 'అంత 'అహం బ్రహ్మాస్మి' అను చరమవృత్తి సూచికముగనున్న అద్వైతానుభూతికి బ్రథమమైన 'సగుణబ్రహ్మైవాహం' అనురీతి దన విరాట్స్వరూపమునుగూడ వ్యక్తము గావించుటచే, శ్రుతి ప్రతిపాదితమై సూత్రనిర్ధారితమైన సంస్థితిని ననుభూతి దర్శించుటకు గీతాశాస్త్రము శంకరునకు ఉచితగ్రంథముగ దోచి, అతఃపూర్వము అది ప్రధానముగాక, ప్రఖ్యాతి నొందక, నెట్టి భాష్యముల గల్గియున్నటుల ఆధారములు లేకయున్నను, శంకరుడు దానిజేబట్టి భాష్యము రచించుటతో, దానిని పూర్వగ్రంథముల గంటె నత్యంత ప్రాముఖ్యము ఆశ్రయించి, నాటనుండి అనేక భాష్య, వ్యాఖ్య, వివరణానువాదాది రూపముగ బ్రపంచ

---

144. Prof, Surendranath Das Gupta : A History of Indian Philosophy, Vol 1 p 8.

వ్యాప్తి నొంది, నెల్ల దేశముల, నెల్లచోట్ల, నెల్లర హస్తముల నలంకరించి, సర్వోత్కృష్టగ్రంథరాజమై వెలయుచున్నది. అది శంకర హస్తస్పర్శా ఫలితమేమో !

ఈవిధముగ బ్రహ్మవిద్యా శిఖరమునకు గొంపోవ ప్రస్థానములనబడు ఉపనిషత్సూత్ర గీతాభాష్యముల మూడింటిని జిత్రించి, శంకరుడు తన సిద్ధాంతమునకు ఒక అద్భుత రూపమును గల్పించి, యిక స్వతంత్ర గ్రంథరచనమునకై బూనుకొనెను.

---

## ప్రకరణ గ్రంథములు

'శాస్త్రైకదేశవిషయం శాస్త్రకార్యాంతరే స్థితం। ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదం మనీషిణః ॥' శాస్త్రప్రబోధిత విషయమునే గలిగి, శాస్త్రమునకు బ్రత్యేకముగ నిర్మితమైన గ్రంథములు ప్రకరణము లనబడు ననురీతి పూర్వస్వరచిత భాష్యగ్రంథములలో బ్రతిపాదితమై స్థిరమైయున్న, అద్వైతవాదమునే యింకను సులభతరమొనర్చి, సర్వజనవిజ్ఞేయముగ నొనర్ప శంకరుడు తలంచి, యీ ప్రకరణగ్రంథ రచనమునకు బూనెను. అంతియగాక భాష్యగ్రంథముల దన చిత్తతాత్పర్య ప్రవచనమునకు ఆయా గ్రంథస్థభావములు నిరోధించుచు, నిరాటంక నిర్వచనమునకు నిరోధకములుగ గోచరించుటచే, బ్రత్యేక గ్రంథరచనము గూడ శంకరునకవసరమని దోచియుండును. శ్రుతిస్మృతి గీతాదుల గ్రంథకథనము ననుసరించు స్వీయసిద్ధాంతము

నన్వయించుచు, విహరించుచున్న శంకరు మేధాశక్తి ప్రకరణ గ్రంథముల అనవచ్ఛిన్నమై అమోఘమై, స్పష్టమై, అజేయమై, ప్రజ్వలించియుండుటయు గానవగును. కాన అద్వైతసిద్ధాంత జిజ్ఞాసువులకు భాష్యగ్రంథములకంటె బ్రకరణములే ప్రధానములై సులభగ్రాహ్యములై యొప్పు ననియు గ్రాహ్యము.

ఈప్రకరణముల జలువదిరొకటిగ బండితులు నిర్ణయించిరి. (1) ఉపదేశసాహస్రి (2) వివేకచూడమణి (3) ప్రపంచసార (4) మహావాక్యదర్పణ (5) అపరోక్షానుభూతి (6) శతశ్లోకి (7) ప్రబోధసుధాకర (8) వేదాంతసార (9) వేదాంతడిండిమ (10 సదాచార (11) వాక్యవృత్తి (12) ఆత్మబోధ (13) ఆత్మానాత్మవివేక (14) ఆత్మచింతన (15) హరిమీడేస్తుతి (16) విజ్ఞాననౌక (17) యోగతారావళి (18) స్వాత్మానందప్రకాశ (19) జీవన్ముక్తానందలహరి (20) శివానందలహరి (21) సౌందర్యలహరి (22) ప్రశ్నోత్తరరత్నమాల (23) పంచీకరణ (24) రాజయోగ (25) బ్రహ్మవిద్యావిలాస (26) దశశ్లోకి (27) అద్వైతానుభూతి (28) అనాత్మ శ్రీ విగర్హణ (29) స్వరూపానుసంధాన (30) ప్రౌఢానుభూతి (31) బ్రహ్మజ్ఞానావళీమాల (32) లఘువాక్యవృత్తి (33) నిర్వాణమంజరి (34) బ్రహ్మానుచింతనము (35) తత్త్వోపదేశ (36) మాయాపంచక (37) ఏకశ్లోకి (38) రామకర్ణామృత (39) గాయత్రీభాష్య (40) సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహ (41) దేవపూజావిధానము లనునవి ప్రకరణగ్రంథములు.

ప్రకరణ స్తోత్ర విభజనమును పండితులు వివిధరీతుల గావించియున్నారు. పై బట్టికలో గల ఆనందలహరి, శివా

నందలహరి, సౌందర్యలహరి, హరిమీడేస్తోత్రము మొదలగు వానిని గొందరు స్తోత్రగ్రంథముల జేర్చియున్నారు. ప్రకరణము లలో సుప్రఖ్యాతములు వివేకచూడామణి, ఉపదేశసాహస్రి, సర్వ సిద్ధాంత సార సంగ్రహము ప్రధానములు. ప్రకర ణములు బేల్వాల్కరు గణనమునకు 112 తేలుటయు నందు అపరోక్షానుభూతి, ఆత్మబోధ, ఉపదేశసాహస్రిలోని పద్య భాగముమాత్రము, పంచీకరణ ప్రక్రియ, శతశ్లోకి మొదలగు నెనిమిదింటిని మాత్రమే అతడు శంకరకృతములుగ గైకొని అన్యముల పరకీయములుగ నిర్ణయించెను.

---

## స్తోత్ర గ్రంథములు

స్తోత్రగ్రంథములలో ననేకములు సగుణబ్రహ్మోపాసనా యుక్తములై సాకారదైవ స్తోత్రములుగ నుండుటచే గొందరు శంకరకృతములుగావని ద్రోసిపుచ్చిరి. కాని ఆకారణముమాత్ర మున వాని నిరాసమొనర్చుట అయుక్తము. శంకరుడు సూత్ర భాష్య రచనమున అనేకసమయముల ఈశ్వరానుగ్రహమును గూర్చి నొక్కి వక్కాణించి, తద్వినా అపరోక్షానుభూతి దుర్లభము అని తెల్పియుండుటచే పైవాదము నిష్ఫలము. అందుచే వీని నన్నింటిని ద్రోసిపుచ్చుట యుచితము కాదు. స్తోత్ర గ్రంథములలో గొన్ని కవితాధోరణిలో ఛందస్సు ప్రధానముగను, చిత్ర ఛంధస్సులోను, అలంకారికముగను

రచితములైనవి శంకర కృతులు గావనియు గొందరిభావము. అటులే శాక్తతంత్రభావముల బ్రతిపాదించి వర్ణించు సౌందర్య లహరి ప్రపంచసారమువంటి గ్రంథముల శృంగారముగూడ గాన నగుటచే నవి శాంకరములుగావని గొందరి అభిప్రాయము. కాని Though there is a tradition that Siva was the family deity of Sankara, it is also held that he was by birth a Shakta.[145] శంకరుని కులదేవత శివుడని వాదుక యున్నను, జన్మతః శంకరుడు శాక్తేయుడనియు అభిప్రాయము గలదని రాధాకృష్ణ పండితుడు వాకొనునట్లు, వీనిలో దెలుప బడియున్న తాంత్రికభావము is clearly an aid to the realisation of the highest as taught in Advaita Vedanta.[146] అద్వైతవేదాంతమున బోధితమైన ఉత్కృష్టానుభూతికి సహకారములగుటస్పష్టము అనిసూర్యనారాయణశాస్త్రియు దెలుపు నట్లు శంకర కాలమున నెట్లు గలదో దుర్గాహ్యముగ నున్నను అనంతరము పీఠచరిత్రముల జూచుచో శాక్తేయమును అచట అవలంబించుచున్నట్లు విదితము. శంకరుడే స్వస్థాపిత పీఠముల నెల్లెడల శ్రీచక్రప్రతిష్ఠల గావించి, దేవీ పూజల బ్రధాన ముగ నుంచినట్లు దోచును. అటులే మధుర కంచీ జంబుకేశ్వర కాశ్మీరము మొదలుగా గల దేవీమూర్తుల నుపాసించి, తత్తన్మూర్తుల అనుగ్రహసిద్ధి గాంచినట్లు శంకర జీవితము దెలుపు చున్నది. కాన శంకరుడు యీా శాక్తేయ స్తోత్రముల రచించి

145. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2 p 448.

146. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 28.

యుండలేదనుటకు ప్రబలకారణము కానరాదు. కాని అతి శృంగార భావముల వర్ణనములుగల వానినిద్రోసి పుచ్చవగును. ఈ స్తోత్రగ్రంథములు బెల్వాల్కార్ లెక్కకు 214 శంకర కృత ములు గావని నిరాకరింపబడి, కొన్ని సంశయాత్మకములని యుంపబడి, 8 మాత్రము నిర్ధారితములుగ గైకొనబడి యున్నవి.[147]

పై ప్రకారముగ శంకర ప్రోక్తములని ప్రచారములో నున్న సుమారు 408 గ్రంథములలో 8 భాష్యములు, 8 ప్రక రణములు, 8 స్తోత్రములే నిశ్చయ శంకర కృతములనియు, మిగిలిన 384 సంశయాత్మకములు, నిరాకృతములనియు బెల్వా ల్కార్ పండితాభిప్రాయము. కాని యీ నిశ్చయము అంగీకార యోగ్యము కాదు. 384 లోని పెక్కు గ్రంథములు 24 తో చేర నర్హము లుండును. కాని ఇదమిత్థమని నిర్ణయింప నెవ రికి ప్రస్తుతమునకు సాధ్యము కాకుండుటచే అన్య ఆధారములు లభించి, నిర్ణయము జరుగు నంతవరకు వాడుకలోనున్న వానిని శంకర కృతములుగనే వ్యవహరించుట ఉచితము.

---

147. Prof. S. S. Suryanarayana Sastry : Sankaracharya, p 26.

# సన్న్యాసము

## ప్రాశస్త్యము

······Friend, that love is false
Which clings to love for selfish sweets of love;
But I, who love these more than the joys of mine–
Yea, more than joys of theirs – depart to save
Them and all flesh, if utmost love avail :

The Light of Asia, Book 4.

స్వార్థప్రేమ మాధుర్యములకొరకై ప్రేమానుబంధముగ నుండు ప్రేమతత్త్వము అయథార్థము; కాని నేను, నా సుఖములకంటె వారిని ప్రేమించి, అంతియగాక, వారిసుఖములపై వారికిగల ప్రేమకంటె నధికముగ వారిపై ప్రేమగలిగి అట్టి అత్యంతప్రేమ ప్రయోజనకరమగుచో వారిని, సర్వప్రాణుల రక్షింప ద్యజించి యేగుచున్నాను, అను నిస్స్వార్థ పదార్థశ్రేయస్కామమున The greatest renunciation సర్వోత్కృష్ట త్యాగమునా బేర్వడసిన బుద్ధభగవానుని త్యాగదీక్షయు; సర్వస్తరతు దుర్గాణి, సర్వో భద్రాణి పశ్యతు, సర్వస్తత్ బుద్ధిమాప్నోతి సర్వః సర్వత్ర నందతు' దుర్గమసాంసారిక ఘట్టముల నెల్లరు తరించెదరుగాక, సర్వప్రాణులు ఆనందసుఖమును గాంచెదరు గాక, నిఖిల ప్రజానీకము సమ్యక్ జ్ఞానము నొందెదరుగాక! సర్వము సర్వత్ర

ఆనందమునే పొందెదరుగాక! అను సర్వశ్రేయోభిలాషయు బ్రధానసూత్రములుగ వెలుగొందు,సర్వశ్రేయస్సునకు ముందు స్వార్థపరత్వము హేయముగ దోచుటచే 'బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి' (బృ. 3. 5. 1) బ్రహ్మవిదులు యీషణత్రయమును త్యజించి సన్న్యాసమును స్వీకరించెదరు అను పరమోత్కృష్టాదర్శమే సన్న్యాస సంప్రదాయమునగల ముఖ్యరహస్యము. అందుచే The renunciation is only a process of growth, preparing for the birth of a fuller life.[148] సమగ్ర జీవితావతరణమునకు సంసిద్ధమొందించు బరిణామక్రమమే సన్న్యాస తాత్పర్యము అని రామతీర్థ వచనము. అటులే మహాభారతము గూడ 'త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్ । గ్రామం జనపద స్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్ ॥' (ఆది. 115. 36) కులముకొరకు స్వార్థమును, గ్రామముకొరకు గులమును, దేశముకొరకు గ్రామమును, ఆత్మానుభూతికొరకు బ్రపంచమును, త్యజింప నాదేశించుచున్నది. అంతియునుగాక There can be no great and complete culture without some element of asceticism in it; for asceticism means the self-denial and self-conquest by which man represses his lower impulses and rises to greater heights of his nature.[149] లేశమాత్రముగనైన

148. Swami Rama Tirtha : Swami Rama; His Life and Legacy. p xxiii.

149. A Arabinda Ghosh : The Foundation of Indian Culture, p 85

త్యాగలక్షణ ముండినగాని సమగ్రమైన ఉన్నతసంస్కృతి ఏర్పడ జాలదు. త్యాగ మనగ నిస్స్వార్థము; తన స్వభావమునగల హేయవృత్తి నిరోధమున నున్నతస్థాయికి దన స్వభావమును నభివృద్ధినొందించుటయే యగుచున్నదని అరవింద యోగీంద్రుని వచనము. అట్లు యోచించి చూచుచో నీ ప్రపంచమున త్యాగములేని ఘట్టముగాని, నిమిసము గాని లేదు. అందుచే నీ ప్రపంచమున ద్యాగము జేయనివాడుగూడ గానరాడు. కాని దాని నొకక్రమముగ నొనరించి, స్వార్థమునకై గాక పరార్థ మునకును, ఆత్మార్థమునకును త్యాగము సర్వశ్రేష్ఠమగుటచే దాని ఉన్నతాదర్శమును ప్రబోధించుచు తదావశ్యకత నుద్బోధించుచు నీ త్యాగధనమును ప్రజానీకముపై వెదజల్లి యున్నవి మతములు. అందు ముఖ్యముగ వైదికమతము జీవిత విధానమును సంస్కరించి, జన్మించినది కుక్షింభరత్వమునకు భోగలాలసత్వమునకుగాక, వాని కంతర్గతమై అతీతమైయున్న ఆనంద స్వరూపమైన ఆత్మానంద విభూతి నార్జించుటకే అను రహస్యమును దన యనుచరులకు ఉపదేశించి, తల్లక్ష్యసిద్ధికై ప్రథమమునుండి అనగ పిండోత్పత్తి సమయమునుండి మరణ పర్యంత మానవ జీవితమును, ఐహికముగ గాక పరార్థముగ గూపొందించి, దాని జతుర్విధముల జిత్రించి, అందు ప్రథ మము బ్రహ్మచర్యముగను, ద్వితీయము గార్హస్థ్యముగను, తృతీయము వానప్రస్థముగను, చతుర్థము సన్న్యాసముగను విభాగించి, అందు ప్రథమ స్థితులతో బైవానిని లక్ష్యము నందుంచుకొని జీవిత నౌకను నడుపుకొనుచు, పర్యావ సానమున సన్న్యాసము నందుకొన వలయునని బోధించి

యున్నది. వాని నాశ్రమములు అనియు పేరొ్కనియున్నది. ఆవిధానము అత్యాదర్శయుతమై పవిత్రమై ఆత్మోద్ధారక ముగ నుండుటయేగాక దేశైకక్షేమంకర పద్ధతియై యుండు టయు సర్వాంగీకారమైయుండుట స్పష్టమే. అట్లుకాక Those who tell us that asceticism is superfluous. donot understand the high destiny of man,[150] సన్న్యాస సము ననవసరము అనువారికి మానవుని ఉన్నతగమ్యము దెలియదని రాధాకృష్ణ పండితుడుగూడ వాదించియున్నారు. ప్రపంచమున నే దేశమున గనరాని యీ అపూర్వ సన్న్యాస విధానమును, ఒక్క భారతియే రూపొందించియున్నదని భార తీయ సన్న్యాస సంప్రదాయ విధానములగూర్చి అసాధారణ మైన గవేషణము నొసర్చిన G. S Ghurye జి. యస్. ఘుర్యే Asceticism and monastic organisation, are two unique contributions which Indian civilization has made to the common stock of culture.[151] సన్న్యాస సము సంప్రదాయములు, సామాన్య సంస్కృతికి భారతీయ విజ్ఞానము ఒసంగియున్న అపూర్వ ప్రదానములని తెలిపి యున్నారు. అందుచే భారతి నిస్సందేహముగ the mother of asceticism. సన్న్యాసమునకు దల్లియనియు నలుడు సంస్తు తించెను. ఈసన్న్యాస అమృతధారను చిన్ననాడే శ్రీరామకృష్ణ పరమచరణ సన్నిధినందుకొని, వేదాంతసింహమై, యతిసార్వ భౌముని చందము ప్రపంచము నంతటిని పర్యటించి,

150. Dr.S. Radhakrishnan: Eastern Religions and Western Thought, p 114.

151. Prof. G. S. Ghurye : Indian Sadhus, p 1.

అసంఖ్యాక ముముక్షులోకమునకు తారణోపాయమును బ్రసాదించి యున్న వివేకానందయతి,

Wake up the note : the song that had its birth
Far off, where worldly taint could never reach :
In mountain caves, and glades of forest deep,
Whose calm no sigh for lust or wealth or fame
Could ever dare to break; where rolled the stream
Of knowledge, truth, and bliss that follows both.
Sing high that note, Sannyasin bold ! say —
Om Tat Sat, Om ! [152]

ఎత్తిపాడుము కంఠము నెత్తిపాడు
యతివరా ! ధీర ! ఓం తత్స దనుచు పాడు
పుట్టె నీ గీత మతిదూర భూమి యందు
విషయవాసన కందని విషయమందు
కామ ధన కీర్తి కాంక్షల గల తగోవని
శాంతిమయ కందరారణ్య చయమునందు
చారుతర సచ్చిదానంద పూరమందు
ఎత్తిపాడుము కంఠము నెత్తిపాడు
యతివరా ! ధీర ! ఓంతత్స దనుచు పాడు.

(శ్రీ ఆడిపూడి సోమనాథరావు)

అని అమరగాన మొనరించి జిజ్ఞాసువుల కుద్బోధ గావించి యున్నాడు. పూర్వమేగాక నాధునిక కాలమునగూడ నట్టి అమర మూర్తుల రూపొందించి, జగతి కలంకారములుగ, సర్వమానవ

152. Swami Vivekananda : The Complete Works, Vol 4 p 327.

కోటికతులాదర్శములుగ, అభ్యుదయ మార్గమున పరమాద్భుత తారక నౌకలుగ, భారతీయ సంస్కృతి అట్టి యతిరాజేంద్రుల బ్రసాదించి యుండు యాథార్థ్యమును ఎవడును విస్మరింపరానిది. సర్వదా సర్వథా సర్వత్ర ఆమూర్తులు వంద్యులు పూజ్యపాదులు.

---

## నిర్వచనము

'సతి +న్యాసః' ఆత్మయందు ఆరోపిత ప్రపంచమును లయింపజేయుట సన్న్యాసమనియు, 'సాధనత్వేన దృష్టానాం సర్వేషా మపి కర్మణాం । విధినా యః పరిత్యాగః స సంన్యాసః సతాం మతః॥' ( స. వే. సి. సా. 151) సాధనము ద్వార సర్వదృశ్యములయొక్క కర్మలయొక్క విధిపూర్వక పరిత్యాగము సన్న్యాసమని విజ్ఞుల మతము. The word sannyasa is derived from the the root 'as' to throw, preceded by the prepositions 'sam' and 'ne' by adding the suffix '*ghan*' in the sense of an abstract noun. It, therefore, means resignation, renunciation or abandoning.[153] త్రోయుట అను 'అస్' ధాతువు ముందు 'సం' 'ని' అను ఉపసర్గల జేర్చి 'ఘన్' అను అంత్య ప్రత్యయమును జేర్పగ 'సన్న్యాస' అను సర్వనామము ఏర్పడును. అందుచే నాపదము పరిత్యాగము అను అర్థమును తెలుపును. అనగ నది ప్రపంచ

---

153. Prof. Hardatta Sharma, History of Brahminical Asceticism, p 21.

మున లయింపజేసి బాధించు విషయప్రవృత్తిగాక విషయాతీత స్థితియని గ్రాహ్యము.

---

## ఆవశ్యకత

అందుచేత 'బ్రహ్మవిద్బ్రహ్మ భవతి పరివ్రాజేన నేతరః' 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అనుస్థితి పరివ్రాట్ అగు సన్న్యాసికే సాధ్యముగాని యితరులకు అసాధ్యమని అత్రిమహర్షి వచనము. అటులే ముండకశ్రుతిగూడ 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః సన్న్యాస యోగాద్యతయః శుద్ధసత్త్వాః తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః పరిముచ్యంతి సర్వే ।' (3. 2. 6) సునిశ్చితార్థులైన వేదాంత విజ్ఞాన జిజ్ఞాసువులు శుద్ధసత్త్వమును సన్న్యాసయోగముచే బొందినవారై బ్రహ్మలోకమును బొందుదురు. శరీరపతనకాలమున బ్రహ్మాభిన్నమైన వారి ఆత్మ సర్వమున లయించును అని సన్న్యాసావశ్యకతను దాని మాహాత్మ్యమును బోధించుచున్నది. కేవలము పారమార్థిక విషయ సంస్థితి ఫలముమాత్రము గాక 'తపసా చీయతే బ్రహ్మ తతోఽన్న మభిజాయతే' (ముం. 1. 1. 8) తపముచే జగత్కారణ బ్రహ్మము విస్తరించి, అన్నమును సృజించెను అని తెలిపి, అందుచే సర్వసాధనలకు మూలము తపస్సున కాధారమగు విషయ పరిత్యాగ పూర్వక సన్న్యాసమే కర్తవ్యముగ నాదేశించుచున్నది. ఆత్మానుభూతి అనునది బ్రహ్మచర్యాది నియమపాలనముతోఁగూడిన సన్న్యాసమునమాత్రమే అగునని

ప్రశ్నోపనిషత్తున గల పిప్పలాద సత్యకామ సంవాదమున స్పష్ట మగుచున్నది. అదేవిధముగ బూర్వము పండితులు 'యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా యా విత్తైషణా సా లోకైషణా । ఉభే హ్యేతే ఏషణే ఏవ భవతః' (బృ. 5.1) ఏది పుత్రైషణయో అది ధనేషణయగుచున్నది. ఏది ధనేషణమో అదియే లోకేషణము. అన్నియు నేషణములే గదా అని చింతించి, సర్వత్యాగమొనరించినట్లు బృహదారణ్యక శ్రుతియు దెలుపుచున్నది.

---

## ఫలము

అందుచే నతి ప్రాచీన కాలమునుండి 'బ్రహ్మసంస్థోఽమృతత్వ మేతి' (ఛాం. 2. 23. 1) బ్రహ్మ సంస్థితి బొందిన వాడు అమృతత్త్వమును బొందుననియు, 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకేఽమృతత్వ మానశుః' (కైవల్య 1. 3) కర్మచే గాక, సంతానముచే గాక, ధనము చేతను గూడ గాక కేవలము త్యాగముచేతనే అమృతత్వ సిద్ధి అనియు, 'త్యాగ ఏవ హి సర్వేషాం మోక్షసాధన ముత్తమం' మోక్ష సాధనములలో త్యాగమే సర్వోత్తమ మనియు శ్రుతులు బోధించుచున్నవి. మరియు 'అథ పరివ్రాడ్...... బ్రహ్మభూయాయ భవతి' (జాబాల. 5) అంత సన్న్యాసి బ్రహ్మమును బొందును. 'సన్న్యాసా ద్బ్రహ్మణః స్థానం'

సన్న్యాసమువలన బ్రహ్మస్థానము గలుగును అని శ్రుతులు సర్వవిధములు సన్న్యాసమూలమున మాత్రమే బ్రహ్మానుభూతి యని యుద్ఘోషించుచుండ, సన్న్యాసముచే సర్వదోష పరిహార మగునని 'సన్న్యాసోఽథ ద్విజన్మనాం' అని యాజ్ఞవల్క్యుడు వచింప, కంఠగతమున బ్రాణములుండు అవసానకాలమునసైనను సన్న్యసించినచో నూఱుయజ్ఞములు జేసినవానికంటె నుత్తమఫలితమును మానవుడు పొందు ననియు, 'సన్న్యస్తం తు ద్విజం దృష్ట్వా స్థానాచ్చలతి భాస్కరః। ఏష.....పరంబ్రహ్మాధి గచ్ఛతి॥' సన్న్యసించిన ద్విజుని జూచి భాస్కరుడుగూడ చలించును. అట్టి అసన్న్యాసి పరంబ్రహ్మమును బొందును అని విష్ణుపురాణవచనము. 'సద్యః సన్న్యసనాదేవ నరకాత్తారయే త్పితౄన్' సన్న్యసించుట వలననే పితృదేవతలను నరకమునుండి వెంటనే తరింపజేయునని దక్షస్మృతి సన్న్యాసమువలన పితృలోక తారణమునుగూడ వచింప, నాలుగువేదముల జదివినను, శతక్రతుకర్తయై యున్నను, వారికంటె యతి నుపృగింజ సర్వత ప్రమాణముగ నధికుడని జాబాలము స్తుతించియున్నది. ఆతురసన్న్యాసముచే నైనను 'పునర్జన్మ న విద్యతే' అని కపిలమహర్షి సూక్తి. సన్న్యాసమున సర్వదోషవర్జితముగాగ, 'సూర్య ఖద్యోతయో ర్యద్వ న్మేరు సర్షపయో రివ। అంతరం హి మహద్దృష్టం తథా భిక్షు గృహస్థయోః॥' సూర్యునకు మెరుగుడు పురుగునకును, మేరు పర్వతము ఆవగింజకునుగల తారతమ్యమువలె సన్న్యాస గృహస్థులకు వ్యత్యాసముగలదు అని అంగీరసమహర్షి వచనము. 'తస్య తేజోమయా లోకా భవంతి బ్రహ్మవేదినః' బ్రహ్మ

విమల తేజముచే లోకములన్నియు గాంతివంతము లగును అని మనువాక్యము.

అటులే శంకరుడును, 'సంన్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి' (స.వే.సి.సా.148) సన్న్యాసముచేత మాత్రమే సిద్ధిని బొందును. 'విగత దోషైరేవ పండితై ర్వేదాంతార్థ తత్పరైః సంన్యాసిభిః అయమాత్మా ద్రష్టు శక్యః......'(మాం. భా 2. ౩౫) దోషవర్జితులును, పండితులును వేదాంతార్థ తత్పరు లునుఅయిన సన్న్యాసులచే నాత్మదర్శనము సాధ్యము.'మోక్షైక సక్త్యా విషయేషు రాగం నిర్మూల్య సంన్యస్య చ సర్వకర్మ' (వి.చూ. 184 ) మోక్షైకాసక్తితో విషయాను రాగమును సర్వకర్మలను సన్న్యసింపవలెను అను మొదలగు ననేక అమృత వచనముల నుటించి వివరించి శాసించి యున్నాడు.

అందుచే షికాగోనగర సర్వమత సమ్మేళన మహా సభలో వివేకానందునిచే the most ancient order of monks in the world.[154] ప్రపంచములో నతిప్రాచీన సన్న్యాస సంప్రదాయము హైందవసంస్కృతిలో నాదియందే ఆవిర్భవించి వివేకానందుని వాక్యములలో నిర్మాణాత్మక శక్తియై Thus the whole object of their system is by constant struggle to become perfect, to become divine, to reach God and see God...... భారతీయ వైదికమత విధాన మంతయు బరిపూర్ణత్వము నొందుటకును, దేవత్వము నార్జించు టకును, భగవంతుని బొంది దర్శించుటకు నై యున్నది. గాని

154. Swami Vivekananda : The Complete Works, Vol 1 p 1.

తద్విరుద్ధ ఆత్మహత్యా తుల్యముగాదని సువిస్పష్టముగ దెలియు చున్నది.

---

## సన్న్యాస కాలము

సన్న్యాసకాలమును గూర్చి అనేక అపోహాలు గలవు. శాస్త్రము ఉత్తమ మధ్యమ మందాధికార విభేదమున సందర్భము ననుసరించి వివిధ రీతుల నుపదేశించుటచే నా వివిధ శ్రుతులు వివిధముగ నన్వయింపబడుట బహుళ సంశయములకు గారణమగుచున్నది. కాని వైవిధ్యాన అధికారి నిర్ణయము గావించినచో సన్న్యాసకాలముగూడ సులభగతి నిర్ధారింపబడును. అంతియగాక నుపనిషత్తులగల యీ శ్రుతివిభిన్నత్వము నాధారముగ గొని స్మృతికర్తలు కర్మజ్ఞానవిభాగమున నొక్కొక దానికి బ్రాధాన్యత నొసంగుచు, బలువిధముల నన్వయించిరి. మరియు,నుత్తమాధికారులు అల్పసంఖ్యాకులుగనుండ,మధ్యమ మందాధికారు లధికముగ సామాన్యముగ నుండుటచేతను, శాస్త్రము ముఖ్యముగ, దర్వాతివారికే విధినిషేధ పూర్వక శాసన మూలమున ప్రయుక్తమగుటచే, వారి కనుబంధించు వాక్యములు షడ్లింగములోని అభ్యాసమునకై చర్వితచర్వణముగ జెప్పవలసిన అవసర ముండుటచే, నా వాక్యములు మిక్కుటముగ శ్రుతిస్మృతుల గాననగును. సంఖ్య ననుసరించి శ్రేష్ఠత్వ కర్తృత్వముల నిర్ణయించుట రాజకీయములలోనే అయుక్తమగుచుండ నిక బారమార్థిక విషయముల నుచిత

మెన్నడును గానేరదు. అందుచే శ్రుతితాత్పర్యముల నన్వయించు నపుడు, వాక్యసంఖ్య ప్రధానముగాక, భావమే ముఖ్యమని విశ్వసించి భావ పరిశోధనమునందే లక్ష్యముంచ వలయును.

'ఖలు వేదార్థం యో విద్వాన్ సోపనయనా దూర్ధ్వం స తాని ప్రాగ్వా త్యజేత్' (5. 1) ఎవడు వేదార్థ పరిజ్ఞానమును గలిగియుండునో వాడు ఉపనయనసంస్కారానంతరము కామక్రోధాదుల వర్జింపవలెను. ఆ సంస్కారము లేకున్నను సన్న్యసింపవలెను అని ఆరుణేయ్యుపనిషత్తు ఉత్తమాధికారి నిర్ణయముగావించి, అట్టివాడు ప్రపంచమున బ్రవేశింపక పూర్వము సన్న్యసింప నాదేశించియున్నది. జాబాలోపనిషత్తు సన్న్యాసకాలమును జర్చించి, 'బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహీ ద్వనీభూత్వా ప్రవ్రజేత్' (4) బ్రహ్మచర్యమును సక్రమముగ బూర్తిగావించి, గార్హస్థ్యము నాశ్రయింపవలెను. అంత వానప్రస్థమును స్వీకరింపవలెను. అంతట సన్న్యసింపవలెను అను సాధారణప్రజ్ఞులకై ఆశ్రమ చతుష్టయ క్రమమును బోధించి, అట్లుకానిచో సమర్థత ననుసరించి, 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్' (4) బ్రహ్మచర్యమునుండియే సన్న్యసింపవలెను. అట్టి శక్తి లేనిచో 'గృహాద్వా వనాద్వా' (4) గృహస్థాశ్రమ నిర్వహణానంతరమో, వానప్రస్థానంతరము గాని సన్న్యసింపనగును అని యుపదేశించుచున్నది. అట్టి నియమమున్నను లేకున్నను 'పునరవ్రతీ వావ్రతీ వా స్నాతకో వాఽస్నాతకో వో త్సన్నాగ్నిరనగ్నికో వా' (4) స్నాతకుడైనను కాకున్నను, అగ్నికార్యమును బూర్తిగావించిన

వాడైనను కాకున్నను అని సర్వనియమములను త్రోసిపుచ్చి 'యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్' (4) ఎప్పుడు విరాగము గలుగునో అప్పుడే సన్న్యసింపనగునని జాబాలశ్రుతి మత్తొక్క వక్కాణించియున్నది. అటులే స్మృతులుగూడ 'సన్న్యసేద్ బ్రహ్మచర్యేణ సన్న్యసేద్వా గృహాదపి। వనాద్వా సన్న్యసేద్విద్వాన్ ఆతురో వాథ దుఃఖితః।' బ్రహ్మచర్యమునుండిగాని, గృహవనములనుండిగాని, విద్వాంసుడు సన్న్యసింపవలెను. ఆతురుడైనను దుఃఖితుడైనను సన్న్యసింపనగుననియు 'యదా మనసి సంజాతం వైతృష్ణ్యం సర్వవస్తుషు। తదా సంన్యాస మిచ్ఛంతి పతితః స్యాద్విపర్యయాత్।' (నారదపరివ్రాజక. 3.12) సర్వవస్తువులపై నెప్పుడు మనసా వైరాగ్య ముద్భవించునో అప్పుడు సన్న్యాసమును గోరుదురు. కానిచో పతితుడగును అనియు ఆంగిరసుడు పూర్వశ్రుతివాక్యమునే అనువదించెను. 'ప్రవ్రజేద్ బ్రహ్మచర్యాత్తు యదిచ్ఛేత్పరమాం గతిం। జాతపుత్రో గృహస్థో వా విదితాత్మా జితేంద్రియః।' పరమ గతిని గోరువాడు బ్రహ్మచర్యమునుండియే పరివ్రాజకుడు కావలయును. విదితాత్ముడై జితేంద్రియుడైనవాడు పుత్రవంతుడైన గృహస్థుడైనను సన్న్యసింపవలెను అని యమస్మృతియు నటులే యుపదేశించుచున్నది. అనగ 'అధ్యయన నియోగ నివృత్త్యుత్తరకాలం యస్య పురుషస్య యస్యామవస్థాయాం వైరాగ్యం జాయతే తస్య తత ఏవ సన్న్యాసేఽధికార ఇతి' బ్రహ్మచర్యాశ్రమానంతరము ఏపురుషునకు వైరాగ్యముత్పన్నమగునో అతనికి సన్న్యసించుట కధికారము అనియు, 'బ్రహ్మచర్యాద్గృహాద్వాపి వనాద్వా సన్న్యసేత్ బుధః' అని కాత్యా

యనుడు, 'బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోథ వా పునః। విరక్తః సర్వకామేభ్యః పారివ్రాజ్యం సమాశ్రయేత్॥' బ్రహ్మచారి గాని గృహస్థుడుగాని వానప్రస్థుడుగాని సర్వకామములందు విరక్తుడైన వాడు సన్న్యాసమును స్వీకరింపనగును అని వ్యాసుడు నొక్కి వక్కాణించియున్నారు. 'యదా మనసి వైరాగ్యం జాయతే సర్వవస్తుషు। తదైవ సన్న్యసే ద్విద్వాన్ అన్యథా పతితోఽభవేత్॥' ఎప్పుడు వైరాగ్యము సర్వవస్తువులందును గలుగునో అపుడే సన్న్యసింపవలయును. లేకున్న పతితత్వము గలుగునని సౌరపురాణము హెచ్చరించుచున్నది. అనగా జిజ్ఞాసువు ఏ ఆశ్రమమునందున్నను, ముఖ్యముగ మనసా వైరాగ్యముజనింపగ సన్న్యసించుట కధికారి అని నిర్ణయము. అందుచేత 'అంధః పంగు ర్దరిద్రో వా విరక్తః సంన్యసే ద్విజః। సర్వేషా మేవ వైరాగ్యం సంన్యాసే తు విధీయతే॥' అంధుడు అంగవిహీనుడు దరిద్రుడైనను ద్విజుడైనవాడువిరక్తియున్నచో సన్న్యసింపవచ్చును. కాని అందరికి వైరాగ్యము సన్న్యాసమున విధింపబడియున్నది అని అంగీరసుడు గట్టిగా వచించియున్నాడు.

అందుచే సన్న్యాసస్వీకారమునకు వైరాగ్యమే ప్రధానము గాని కాలనియమము గాని, ఆశ్రమనియమముగాని, శాస్త్రముచే జేయబడలేదని గ్రాహ్యము. అట్లుగాక అట్టి వచనములెందైన గోచరించుచో నవి మందాధికారులకుగా వచింపబడినవనియు దాత్పర్యము.

---

## అధికారము

అట్లగుచో సన్న్యాసము సర్వవర్ణములకు నియోగింపబడియున్నదా అను సంశయము గోచరము. ఆశ్రమములనుండి సన్న్యసించునధికారమును బూర్వము జర్చించు శ్రుతివాక్యముల జూచియున్నాము. వర్ణములనుండి ఎట్లుచితము అను విషయము గూడ విచారణీయమే. పూర్వగ్రంథమున ఆశ్రమవ్యవస్థయే సూచింపబడుచు, దాని బరిత్యజించుటకు వైరాగ్యమే ముఖ్యాధికారముగ దెలుపబడియున్నది. కాని వర్ణము దేహవైకల్యము వృత్తుల ననుసరించియు గొందరు నిషేధింపబడియున్నారు. 'కహూఢపతితోపత్యం కునఖీ శ్యావదంతకః। క్షయక్షీణోంగవికలో న తు సంన్యాస మర్హతి' (కఠ) పతితుడు, [illegible], నల్లనిదంతములవాడు, క్షయగలవాడు, అంగవికలుడు, సన్న్యాసమున కర్హులుగారు. అటులే మహాపాతకముల నాచరించినవారు గూడ సన్న్యాసమున కనర్హులని ఆ యుపనిషత్తే తెలుపుచున్నది. 'అథ షండః పతితోఽంగవికలస్త్రైణో బధిరోర్భకో మూకః పాషండశ్చక్రీ లింగీ వైఖానసహరద్విజౌ। భృతకాధ్యాపక శ్శిపివిష్టోఽనగ్నికో వైరాగ్యవంతోఽప్యేతే న సన్న్యాసార్హా స్సన్న్యస్తా యద్యపి మహావాక్యోపదేశో నాధికారిణః'(3.1) షండుడు, భ్రష్టుడు, అంగవిహీనుడు, స్త్రీలక్షణములుగలవాడు, బధిరుడు, బలహీనుడు, మూగవాడు, పాషండుడు, వంచకుడు, సన్న్యాసవేషధారి, విష్ణ్వార్చకుడు, శైవార్చకుడు, కూలివాడు, ఉపాధ్యాయుడు, బట్టతలవాడు, కుష్టురోగి, అగ్నిహోత్రరహితుడు, విరక్తిలేని

వాడు, సన్న్యాసార్హులుకారు. మహావాక్యోపదేశమునకు అనర్హులు అని నారదపరివ్రాజకోపనిషత్తు వివరించి విర్చి తెలిపియున్నది. అటులే యమనియమాదులు శౌచాదులు శమదమాదులు లేనివారును అధికారి కాడని 'సత్యశౌచ పరిభ్రష్టం సన్న్యాసం నైవకారయేత్' (సన్న్యాస. 2.5) అను రీతి నుపనిషత్తులు బహుళీతుల నుద్ఘోషించుచున్నవి.

సన్న్యాసము నుద్బోధించు మంత్రములలో ద్విజ. బ్రాహ్మణ, ఉపనయన, అధ్యయన మొదలుగాగల పదము లుండుటచే బ్రాహ్మణులకే సన్న్యాసాధికారమని గొందరును, ద్విజ ఉపనయనాదిశబ్దములు అగ్రవర్ణములగు బ్రహ్మ క్షత్ర వైశ్యుల కన్వయించుటచే వారే అధికారులుగాని యితరులుగారని గొందరును దలంచెదరు. కాని ఉపనిషత్తుల బ్రస్ఫుటక్రియ నిది వ్యక్తము గ లేదనగును. 'స్నాతకో వాఽస్నాతకో వా' అనియు, అగ్నిహోత్రియు, కాకున్నను అను శబ్దప్రయోగముచే నుపనయనాది సంస్కారములు లేనివారైనను అవసర వైరాగ్యముండినచో సన్న్యాసార్హులే యని శాస్త్రము విశదపరచి యున్నది. అందుచే అగ్నికార్యాది కర్మాధికారులే దీని కధికారులని చెల్పుట కవకాశములేదని దోచును. అందుచేతనే నాల్గవ వర్ణజులైన సన్న్యాసులుగూడ, అందును బ్రఖ్యాతులైన వారు ప్రాచీనకాలమునుండి అచట నచట గోచరించుచున్నారు. According to the traditional history of the akhadas, Sudras might have been ordained since even before Sankaracharya's time[155] అఖాడ అను పీఠముల సాంప్ర

155. Prof G. S. Ghurye : Indian Sadhus, p 160.

దాయికచారిత్రముల ననుసరించి చూడగ, శంకరాచార్యుని కాలమునకు బూర్వమే శూద్రులకు సన్న్యాస మొసంగబడుచున్నదని తెలియుచు, The reformist tendency in the ordination of the females and Sudras in the order of Saiva asceticism is thus ancient[155] స్త్రీ శూద్రులకు సన్న్యాస మొసంగు సంస్కారణ విధానము అందులో ప్రాచీనమే యని జి. యస్. ఘుర్యే తెలియజేయుచున్నాడు. కాలాంతరమున రామానందాది సన్న్యాసులు బహుళముగ శూద్రులకు సన్న్యాసాశ్రమము నొసంగుచుండిరి.

---

## స్త్రీ-సన్న్యాసాధికారము

శూద్రులకు ఉపనయనాది సంస్కారములేమి అనుట యొక కారణముగ చూపినను స్త్రీలనుకూడ కొందరు ఆశ్రమ స్వీకారమునకు నిషేధించెదరు. స్త్రీలకు ఉపనయనాది సంస్కారము పూర్వముండుటచేతనే గురుకులవాసము గావించి, వేదాధ్యయన నిష్ణాతులై, పండితసభల సంవాదముల నెరపి యుండిరి. 'పురా కల్పే కుమారీణాం మౌంజీ బంధనమిష్యతే| అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా|' (యమస్మృతి) పూర్వము బాలికలు ఉపనయనము నొంది, వేదములను బోధించుటయందును, సావిత్రీమంత్రమును జపించుటయందును

155. Prof. G. S. Ghurye: Indian Sadhus, p 160.

అధికారిణులై యుండిరి అనియమస్మృతియు, 'యత్తుహారీతేనోక్తం ద్వివిధాః స్త్రియో బ్రహ్మవాదిన్యః సద్యోవధ్వశ్చ తత్ర బ్రహ్మవాదినీనాం ఉపనయనమగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహే చ భిక్షాచర్యేతి' బ్రహ్మవాదినులని, సద్యోవధువులని స్త్రీలు ద్వివిధముగ హారీతుని వాక్యము. అందు బ్రహ్మవాదినులు ఉపనయనము, అగ్నికార్యము, వేదాధ్యయనము స్వగృహమున భిక్షాచర్యము గలిగియుండిరని హారీత ధర్మసూత్రములు తెలుపుచున్నవి. అందుచేతనే ఆర్. ఆర్. దివాకర్ It is now usually admitted that the Upanayana ceremony is Vedic and was common to boys and girls[156] ఉపనయనము వైదికమై బాలబాలికలకు సామాన్యముగ నుండెడిదని ప్రస్తుత మంగీకారమేఅని తెలిపియున్నాడు. అటులే Indeed it was enjoined that a girl should receive Upanayana before she studied the scriptures[157] శాస్త్రాధ్యయనపూర్వము బాలికలుగూడ ఉపనయనమునొందియుండవలెనను నియమముగ దని సి. సి. బిశ్వాస్ గూడ వచించియున్నాడు. అందుచేత 'బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిం' (11.5.18) బ్రహ్మచర్యాశ్రమముచే కన్య యువకుడైన భర్తను బొందుచున్నదను అథర్వణవేదవాక్యముగూడ కన్యలకు బ్రహ్మచర్యాశ్రమమును దెలుపుచు, 'బృహద్దేవత' ననుసరించి నైష్ఠికులై తురీయాశ్రమమును స్వీకరించుచో బ్రహ్మవాదినులనియు, లేక గార్హస్థ్యమును స్వీకరించుచో సద్యోవధువులనియు

156. Dr. R. R. Diwakar : Prabuddha Bharata, 1954, p 169.
157. C. C. Biswas : Prabuddha Bharata, 1954, p 180.

నాబడుచు నుండిరి. 158 ఆవిధముగ వేదముల స్త్రీలకు ఉపనయనము, వేదాధ్యయన యుక్త బ్రహ్మచర్యాశ్రమము, అంతట వారియిష్టానుసారముగ బ్రహ్మవాదిని స్థితియగు సన్న్యాసము గలవని యిందలి తాత్పర్యము.

మహాభారతమున 'భిక్షుకేత్యనేన స్త్రీణామపి ప్రాగ్వివాహాద్వా వైధవ్యాదూర్ధ్వం సన్న్యాసేఽధికారోఽస్తీతి దర్శితం తేన భిక్షాచర్యం మోక్షశాస్త్రశ్రవణ మేకాంతే ఆత్మధ్యానం చ తాభిరపి కర్తవ్యం త్రిదండాదికం చ ధార్యం' (శాంతిపర్వము) వివాహపూర్వముగాని వైధవ్యప్రాప్త్యనంతరముగాని స్త్రీకి సన్న్యాసాధికారము చూడబడుచున్నది. దానిచే భిక్షాచర్యము, వేదాంతశ్రవణము, ఏకాంతవాసమున ఆత్మధ్యానములుగూడ వారికి కర్తవ్యములుగా గలవు. త్రిదండధారణమున సన్న్యసించుటయు గలదు అనియు దెల్పుచు, నందు బ్రఖ్యాతమైన భిక్షుణి సులభనుగూర్చిగూడ వచించియున్నది. 'సులభా నామ భిక్షుకీ' సులభ యను సన్న్యాసిని అని వచించుచు, 'అటంత్యా' పారివ్రాజకత్వమును సూచించుచు, 'తత్ర తత్ర శ్రుతో మోక్షో కథ్యమాన స్త్రిదండిభిః' అనుచు ఆమెకు త్రిదండధారణముగూడ గలదని విశదపరచియున్నది. ఈ విషయమును బ్రస్తావించి, ఆమెను జూచి జనకుడు బ్రాహ్మణ బ్రహ్మవాదిని అని తలంచి, సన్మానించి, గౌరవించి, తర్వాత ఆమె క్షత్రియస్త్రీ అని ఆమెవలన గ్రహించును. అందుచే నాకాలమున బ్రాహ్మణ క్షత్రియవర్ణములకు జెందిన బ్రహ్మవాదినులు గలరని స్పష్టము. అటులే As late as the

158. Dr. R. R. Diwakar : Prabuddha Bharata, 1954, p 170.

days of the Mahabharata, an ashrama near Kuru-skhetra is maintained where a Brahmin maiden was crowned with ascetic success and, ultimately acquiring yogic powers, she became a Tapas-Siddha. 158 మహాభారతకాలమునకూడ కురుక్షేత్రసమీపమున నొక ఆశ్రమములో నొక బ్రాహ్మణకన్య యోగశక్తుల నార్జించి తపస్సిద్ధి చెందినట్లును గలదు.

ఆవిధముగ వేదమున, వేదేతర గ్రంథములగల బ్రహ్మచారిణి, బ్రహ్మవాదిని, తాపసి, సిద్ధా, అను అనేకపదములు clearly show that women were admitted equally with men to the path of spiritual Sadhana and Vedic Studies. 158 పురుషులతో బాటు స్త్రీలుకూడ సరిసమానముగ ఆధ్యాత్మికసాధన వేదాధ్యయనమునకు గైకొనబడుచుండినటుల విస్పష్టపరచుచున్నవని దివాకర్ తీర్మానము. The intellectual eminence of women was proved by her capacity for debates and discussions in the royal courts and in Samitis and Sabhas. 159 రాజాస్థానములందును సమితులు పండితులు సభలందును ప్రసంగించుట చర్చించుటకు ఆమెయొక్క శక్తిసామర్థ్యములే స్త్రీల మేధాసంపత్త్యమును నిరూపించియున్నవి. అటులే A homage to her spiritual acheivements was paid by the compilers of the Vedas who carefully conserved so many Vedic hymns composed by women sages,

158. Dr. R. R. Diwakar: Prabuddha Bharata, 1954, p 170.

known as Brahmavadinis, so welknown in the later Vedic literature of the Aranyakas and the Upanishads.[159] ఆరణ్యక ఉపనిషద్రూప వైదిక వాఙ్మయమున బ్రహ్మవాదినులని ప్రఖ్యాతినొందియున్న స్త్రీఋషులచే నిర్మింపబడియున్న అనేక వైదిక మంత్రములు వేదసంకలన కర్తలచే బదిలపరుపబడుటగూడ స్త్రీ యొక్క ఆధ్యాత్మికౌన్నత్యమునకొక విచిత్ర గౌరవమే యగుచున్నదనియును కాళిదాసు వక్కాణించెను. వేదోపనిషత్కాల స్త్రీలు పురుషులతో సహా సమాన ప్రతిపత్తినిగల్గిన ఫలితమే కాక సమాన గౌరవమర్యాదల బొందుచుండిరనియు, నంతియగాక, వారికి వేదమొసంగిన గౌరవము ఆ నారీమణులు వెలువరించిన వైదికమంత్రముల గ్రహించుటయందే వ్యక్తమనియు కాళిదాస నాగ్ పండితుని తాత్పర్యము. అందుచే స్త్రీకి వేదాధ్యయనాదికమునకు నర్హతలేదనుట చరిత్రను విస్మరించుటయే యగునని బోసు మహాశయుని తాత్పర్యము.[160]

ఆనాటి బ్రహ్మవాదినులు గడించిన విద్యావైదుష్యము, వాదప్రతివాదపటిమ, రచనాకౌశల్యములు విస్మయానందముల గలుగజేయును. అందు ముఖ్యముగ 'గోధా ఘోషా విశ్వవారా పాలోపనిషత్। బ్రహ్మజాయా జుహూర్నామా గస్త్యస్య స్వసాదితిః॥ ఇంద్రాణీ చేంద్రమాతా చ సరమా రోమ శోర్వశీ లోపాముద్రా చ నద్యశ్చ యామీ నారీ చ శాశ్వతీ॥ శ్రీర్లాక్షా సర్వరాజ్ఞీ వాక్ శ్రద్ధా మేధా చ దక్షిణా।

159. Dr. Kalidas Nag : Prabuddha, Bharata, 1954, p 184.
160. A. C. Bose : Prabuddha Bharata, 1954, p 161.

రాత్రిః సూర్యా చ సావిత్రీ బ్రహ్మవాదిన్య ఈరితాః' (బృహద్దేవత. 1.82.87) గోధా, ఘోషా, విశ్వవారా, అపాల, ఉపనిషత్, బ్రహ్మపత్నీ, అగస్త్యసోదరి, జుహూ, ఇంద్రాణి, ఇంద్రమాత, సరమా, రోమశ, ఊర్వశీ, లోపాముద్ర, నద్య, యామీ, నారీ, శాశ్వతీ, లాక్షా, సర్వరాజ్ఞీ, వాక్, శ్రద్ధా, మేధా, దక్షిణా, రాత్రిః సూర్యా, సావిత్రి మొదలైన వారందరు బ్రహ్మవాదినులని అనబడుదురు. అందు గోధా తపస్వినియై ఋగ్వేదమున మంత్రములకు (ఋ. 10. 134.7) కర్త్రిగా స్తుతింపబడియున్నది. క్షత్రియకుమారి అయిన ఘోషా బ్రహ్మచర్యమున గాలము గడుపుచు, తనకుగల కుష్ఠరోగ నివారణము కొన్ని మంత్రములచే గావించుకొన నామంత్ర ములు ఋక్కులైయున్నవి. (ఋ. 10. 39. 40, 1. 117. 7) అత్రివంశమునకు జెందిన విశ్వవారయు, యజ్ఞముల జేయుచు జేయించుచుఅరుఋక్కులకుకర్త్రిగాప్రఖ్యాతము(ఋ.5.28 3). ఈమె చాల అసాధారణప్రజ్ఞ గలదనియు దెలియుచున్నది. అత్రిమహర్షికుమార్తె అయిన అపాల అను బ్రహ్మవాదిని వివాహితయయ్యును బొల్లియుండుటచే భర్త త్యజింప నా యవకాశమునుగైకొని, జనకుని ఆశ్రయించి, తపోనిమగ్న యయి ఇంద్రుని స్తుతించి ఆవ్యాధినివారణము నొందుటచే నా మంత్రములు వేదము నెక్కెను (ఋ. 5.28.3.8.80.7) ఆమె యజ్ఞనిర్వహణమున ప్రముఖపాత్ర నిర్వహించెడిది. సోమయజ్ఞము నాచరించి స్త్రీల యజ్ఞాధికారమును ఆమె స్థాపించెను. అగస్త్యుని సోదరి జుహూ అను బ్రహ్మవాదిని భర్త అయిన బృహస్పతిచే త్యజింపబడి తన తపోబలమున

మరల భర్తను జేరెను. ఆమెయు సదా నాజీవితమునే సాగించి బ్రహ్మవాదినిగా బరిగణింపబడెను. ఆమె ప్రార్థనములు ఋక్కులై విరాజిల్లెను. (ఋ. 10.11.6) ఇంద్రునితల్లి అయిన అదితియు, ఇంద్రుని భార్యయు బ్రహ్మవాదినులుగ (ఋ. 10 49.153,10.145.2) తెలుపుచున్నవి. రోమశ గూడ (ఋ. 1. 126.7) ఋక్కునకు కర్త్రిగా ప్రతీతి. లోపాముద్రయొక్క స్తుతులు ఋగ్వేదమున బ్రఖ్యాతములు. అంగిరమహర్షి కుమార్తె శాశ్వతియు బ్రఖ్యాత మంత్రకర్త్రి (ఋ. 8.1.34). సర్పరాజ్ఞి అగ్నిసూక్తమును రచించెను. (ఋ. 10.189) ఆమె యజ్ఞ యాగాదుల కధ్యక్షత వహించెడిది. అంభృణమహర్షి కుమార్తె వాక్ మిగుల ప్రసిద్ధ బ్రహ్మవాదిని. ఆమె ఋగ్వేదమున జీవ బ్రహ్మైక్యవాదమునకు బునాదిగ మంత్రముల నిర్మించెను. ఆమె సూక్తులలో దేవీసూక్తము ప్రధానము. (10.125.1,4) ఆమె కేవలము సరస్వతీస్వరూపమగుటచే వాగ్దేవి అని అన్వర్థ నామమున బ్రఖ్యాతము. ఋ. 10.151.1 మంత్రమును శ్రద్ధాళువై విరచించుటచే నొక బ్రహ్మవాదిని శ్రద్ధా అని పేరొందెను. ఈమె సుప్రసిద్ధసన్న్యాసిని. యజ్ఞముల నాచరించి యితరులు జేయుటకు దోడ్పడుచు నుండెడిది. రాత్రి సూక్తమును రచించిన బ్రహ్మవాదిని రాత్రియనియు నాబడెను. సూర్య అను నామె (ఋ. 10.85)ఋక్కునకు కర్త్రి. సుకన్య వృద్ధుని వివాహమాడి బ్రహ్మవాదినియై విరాజిల్లినది. శచీ పౌలోమియు (ఋ. 10.159) ప్రఖ్యాత బ్రహ్మవాదిని. అటులే బృహదారణ్యకమున బ్రశస్తులైన మైత్రేయి కాత్యాయనులు, గార్గియు విదితమే. యాజ్ఞవల్క్యుని ఆశ్రమ వాసినులుగ జేసిన

కాత్యాయనీమైత్రేయులుయాజ్ఞవల్క్యుని భార్యలుగాగాక, అతని ఆశ్రమ నిర్వహణ కార్యకర్తలై కాత్యాయిని ఆశ్రమవ్యవహర్తగను మైత్రేయి శిష్యుల విద్యావిషయ నిర్వాహకురాలుగనుండి యాజ్ఞవల్క్యునికార్యభారమునుతగ్గించు శిష్యశ్రేష్ఠలనివ్యక్తము. గార్గి బ్రహ్మవాదినియై పండిత సదస్సులలో నెట్టి కీర్తి నార్జించినదియు నెల్ల నెఱింగినదియే. ఆమె బ్రహ్మచారిణియుగూడ. అట్లే వడవా ప్రాతిథేయయు బ్రహ్మవాదిని. స్వయంప్రభ నాబడు శాండిల్యుని పుత్రియు సన్యాసినియై గొప్పతపస్వినియై చెలరేఁగి యున్నది. దేవళ మహర్షి పుత్రిక సువర్చల శ్వేతకేతుని బరిణయమాడియు బ్రహ్మవాదినిగ బ్రఖ్యాతినొందెను.

ఈ విధముగ శంకరపూర్వము శాస్త్రముల ననేక బ్రహ్మవాదినులు స్పష్టముగ గోచరము. అచ్చటచ్చట వారి భర్తల నామములు వచింపబడినను, జయా భర్తలు సన్న్యసించుటచే గాని మరణించుటచేగాని యీ నారీలోకమునకు సన్న్యాసమునకు మహాదవకాశ మేర్పడి, భర్తలకు మించిన పేరును సంపాదించి, వేదభాగకర్తలుగ రూపొంది, వీరిద్వార భర్తల నామములు ప్రపంచమున దెలియబడునట్లు పరిణమించియున్నారు. అందు వీరి గృహస్థులుగ గాని వానప్రస్థులుగగాని పరిగణింప వలనుపడదు.

అందుచే స్త్రీలకు బురుషులతో సర్వాధికారములు గలవని శాస్త్రాచారముల ననుసరించి తెలియుచున్నది. పతంజలి (2. 1. 70) శ్రమణా, పరివ్రాజికా, తాపసీ, కుమారాశ్రమణా అను పదములు స్త్రీ సన్న్యాసుల కుపయోగించుట గమనార్హము. శంకరానంతరముగూడ స్త్రీలు యథాపూర్వముగ

విద్యాధ్యయనతపోగరిమల నార్జించి,సన్న్యసించి,భారతీయవిజ్ఞాన గగనమున జ్వాజ్వల్యమాన తారలవలె ప్రకాశించుచునే యున్నారు. అట్టివారి విషయము ముందు చూచెదము. అందుచే జ్ఞానస్వరూపిణియైన వేదశాస్త్రములు 'అభేదదర్శనం జ్ఞానం' (మైత్రేయ్యుపనిషత్. 2. 2) అను రీతి పాఠీక దృష్టి నవలంబింపక, 'వర్ణాశ్రమాచారయుతా విమూఢాః కర్మానుసారేణ ఫలం లభంతే। వర్ణాది ధర్మం హి పరిత్యజంతః స్వానంద తృప్తాః పురుషా భవంతి॥' (మైత్రేయ. 1.13) వర్ణాశ్రమాచారయుతులైన మూఢులు కర్మానుసార ఫలితమును బొందుదురు. వర్ణాదుల ద్యజించినవారు తృప్తులై బ్రహ్మమును బొందుచున్నారు అనురీతి దమజ్ఞానాస్వాదనమునకు నెల్లర నాహ్వానించియున్నదనియే దీని తాత్పర్యము.

---

## విభాగములు-నియమములు

పై విషయముల ననుసరించియే సన్న్యాసియొక్క నియమాచారములును గలుగును. ఇందుకు అధికార వివాదమున వలె శ్రుతివాక్యములకును, స్మృతిపురాణాది వాక్యములకును దారతమ్యము గోచరము. 'శ్రుతి స్మృతి విరోధే తు శ్రుతిరేవ గరీయసీ' (జాబాల) అనురీతి శ్రుతియే ప్రమాణము గాని తద్విరుద్ధ స్మృతులు ఆచరణయోగ్యములు గానేరవు. సన్న్యాస నియమములు సన్న్యాసియొక్క వైరాగ్యతీవ్రత ననుసరించి అనగ ఆత్మానుభూతి ననుసరించి నియమితములు.

అందుచే నొకనికి నియమమైయున్నది మరియొక స్థానమున నున్నవానికి ననావశ్యకమై యొప్పారును. పూర్వము సన్న్యాసకాల మీమాంసలో నుత్తమునకు నాశ్రమసోపాన ముల నన్నింటి నధిరోహించి తరింప నవసర మెట్లు లేదో అటులే సన్న్యాస నియమపాలనముగూడ నుండునని శ్రుతి తాత్పర్యము. అందులే ప్రతిసన్న్యాసియు ముందు చెప్పఁబడు కుటీచకాది క్రమమున నవధూతస్థితి కెగప్రాక నవసరము లేదు. దాని నిర్ణయించుటకైనను జరులకు సాధ్యపడని అగోచర సంస్థితి యది. అందుచే సాధకుడు సన్న్యాస కాలము ననే తదనుగుణ సన్న్యాసస్వీకరణము గావించి, పరనియ మముల బాలింప బాధపడక, స్వస్థితి కనుగుణనియమ పాల నను గావించుటయే ముఖ్యధర్మముగనున్నచో నచిరకాల మున నున్నతస్థానమును అతడు బొంద శక్తుడగును. అట్లుగాక లోకేషణాబద్ధుడై స్వస్థానమును దప్పి, పరభయమున వ్యవహ రించుచో అభివృద్ధి లేకుండుట యటులుండ పతనమునకు బాలు బడును. మరియు, తా సన్న్యసించుకాలమున నేస్థితినుండి గ్రహిం చినది సక్రమాత్మపరీక్షతో దెలిసికొని, తనస్థితికి పైనగల నితరసన్న్యాస సంస్థితుల లక్షణముల తా నెరింగి,దినదినము నెంత వరకు పైలక్షణముల దాబొందుచున్నదియు నవగాహనము గావించుకొనుచు, నిత్య ఆధ్యాత్మిక తృష్ణాయుక్తుడై యున్నచో నెట్టిప్రమాదములు లేక నున్నిత మార్గగాముడగును. కావున సన్న్యాసము నర్థించువాడు పూర్వాపరముల నిట్లుగ్రహింప వలయునని హెచ్చరిక. అందుచే సన్న్యాస సోపానములను శాస్త్రానుసారము చూచెదముగాక.

సన్న్యాసోపనిషత్తులు ముఖ్యముగా 17గలవు. అవి ఏక కంఠముగ సన్న్యాస వివరముల నన్నింటి నొసంగును. అవి సన్న్యాసమును 'కుటిచకో బహూదకో హంసః పరమహంస ఇత్యేతే పరివ్రాజకా శ్చతుర్విధా భవంతి' (శాట్యాయని. 11) అని నాల్గువిధములుగా విభజించినవి. చతుర్థమైన పరమహంస స్థితిని నింక విభజ్య మొనరించి, షడ్విధముగ నారద పరివ్రాజకాది యుపనిషత్తులు గావించి, 'సన్న్యాసః షడ్విధో భవతి కుటీచక బహూదకో హంస పరమహంసః తురీయాతీతో వధూత శ్చేతి' (5) అని నిర్ణయించినవి. అందు కుటీచకుడు శిఖాయజ్ఞోపవీత దండ కమండలు ధరుడై కౌపీన కంథాదుల గలిగి, మాతృ పితృ గుర్వారాధన పరుడై, ఒక్కచోటనే భుజించుచు, త్రిపుండ్రధారియై యుండును. బహూదకుడు కుటీచకునివలె బూర్వ లక్షణములగలిగి ఏకాన్నభోక్తగాక మాధుకరభోక్తయయి యుండును. దేశముల బర్యటించుచు గురుసేవ జేయుచు నుండును. హంస నామక సన్న్యాసి జటధారియై త్రిపుండ్రధారియై మాధుకరాశనశీలుడై, కౌపీనధారియై గ్రామమున నొకదినము, నగరమున నైదుదినములు, క్షేత్రమున సప్త దినముల మాత్రము వసించుచు దేశాటన పరుడై యుండును. పరమహంస సన్న్యాసి శిఖాయజ్ఞోపవీతాది రహితుడై, అయిదు గృహముల మధూకర గ్రహణముగలిగి కరపాత్రియై ఒక కౌపీనము, శాటితో సర్వత్యాగియై యుండును, ఇతనికి వైణవదండ ముండును, వృక్షమూల శూన్యాగార స్మశాన వాసియై దిగంబరుడుగనూడనై ధర్మాధర్మాదిక కాంక్షలేక ద్వైతవర్జితుడై యుండును. ఇతడు 'సర్వవర్ణేషుభిక్షాచరణం

కృత్వా' (భిక్షుక ) చాతుర్వర్ణములనుండి భిక్షాస్వీకరణ ముల గావించుచు, ఆత్మనిష్ఠాపరుడై యుండును. తురీయాతీతుడు శాస్త్రాపేక్షలేక నోటితోనే భుజించును. దిగంబరియై చరించుచుండును. అవధూత నాబడు ఆరవసిద్ధుడు పూర్వనియమము లన్నియు లేక, అజగరునివలె సర్వవర్ణముల నుండి ఆహారమును గైకొనుచు సర్వాతీతుడై విరాజిల్లును.

ఇందు 'పరమ హంసాది త్రయాణాం న కటిసూత్రం కౌపీనం న వస్త్రం న కమండలు ర్నదండః స్సార్వవర్ణైకభైక్షా టన పరత్వం జాతరూప ధరత్వం విధిః' (నారదపరివ్రాజక. 5) పరమహంస, తురీయాతీత అవధూతలు మొలత్రాడు, కౌపీనము, వస్త్రము కమండలము దండములు లేక సర్వవర్ణముల నుండి భిక్షగైకొనుచు, దిగంబరత్వమున గూడ నుందురు. వారికి ధ్యానించుటకును, వచించుటకు, శ్రవణము చేయుట కును ఏదియు నుండదు. దేవపూజ తీర్థయాత్ర ఉత్సవాదులకు దూరులు. వీరికి సర్వద్వంద్వములు అభావములు. 'సర్వవిద్యా పాండిత్య ప్రపంచం భస్మీకృత్య... స్వపూర్వాపన్నాశ్రమా చార విద్యాధర్మ ప్రాభవ మనుస్మరన్ త్యక్త వర్ణాశ్రమా చారః ... సర్వదానున్మత్తో బాలోన్మత్త పిచాచవత్ ఏకాకీ సంచరన్' (తురీయాతీతావధూతోపనిషత్తు) సర్వవిద్యా పాండిత్యముల విడిచి, స్వపూర్వ వర్ణాశ్రమాచారముల వర్జించి, బాలోన్మత్త పిశాచమువలె ఏకాకిగ సంచరించుదురు. 'స్వరూపానుసంధాన వ్యతిరిక్త సర్వేతర శాస్త్ర'ముల వర్జించి, 'మంత్ర తంత్ర వ్యాపార'ములు లేక 'న ప్రణామ కీర్తనపరః'

నమస్కరించుట సంకీర్తనము గావించుటలు లేక నుండును. 'కర్మాచార విద్యాదూరః। స పరివ్రాణ్ణామ సంకీర్తనపరః' (సన్న్యాస. 2. 49) కర్మాచార విద్యాదుల వీడును. నామ సంకీర్తన పరివ్రాజకునికి ముఖ్యము. ఇట్లు ఆ యా స్థితులనున్న సన్న్యాసులగూర్చి ఉపనిషత్తులు వివరించియున్నవి. ఆ ఉపనిషద్వాక్యములు ఆ సన్న్యాసుల నా నియమబద్ధుల గావించుటకై ఏర్పడక వారి స్థితులమాత్రమే తెలియజేయుచు, వానికై కృషిసల్పు జిజ్ఞాసువుల కుదోబ్ధ కారణముగ శాస్త్రము ప్రవర్తించునని గ్రాహ్యము,

మరల 'వైరాగ్యసన్న్యాసీ జ్ఞానసన్న్యాసీ జ్ఞానవైరాగ్యసన్న్యాసీ కర్మసన్న్యాసీతి చాతుర్విధ్యముపాగతః' (సన్న్యాస. 2. 13) అనుటచే సన్న్యాసులు నాలుగువిధములు. పూర్వపుణ్యపరిపాకమున వైరాగ్య ముదయించి సన్న్యసించువాడు వైరాగ్యసన్న్యాసి. శాస్త్రాధ్యయనముచే పుణ్యపాపలోకానుభవముల నెరింగి, దేహశాస్త్ర లోకవాసనల ద్యజించి, సాధన చతుష్టయసంపన్నుడై సన్న్యసించినవాడు జ్ఞానసన్న్యాసి. క్రముగ నన్నింటిని అభ్యసించి, అనుభవించి, జ్ఞానవైరాగ్యములు గలిగి సన్న్యసించువాడు జ్ఞానవైరాగ్య సన్న్యాసి. క్రమముగ బ్రహ్మచర్యాదిఆశ్రమముల దాటి, వానప్రస్థమునుండి సన్న్యసించువాడు కర్మసన్న్యాసి. ఇతనికి వైరాగ్యము న్యూనము.

అటులే విద్వత్ వివిదిష మర్కట ఆతురములనియు సన్న్యాసము విభజ్యము. జన్మాంతరకృత పుణ్యకర్మచే జ్ఞాన వైరాగ్యోదయముగలిగి, బ్రహ్మచర్యమునుండియే సంసారమును

వర్జించి, పూర్ణహృదయుడై దిరుగుచుండును. వివిధిషసన్న్యాసి వైరాగ్యాదికలోపముచే గురువునాశ్రయించి, సన్న్యసించి, దండకమండలాదుల గ్రహించి సాధనలమునుంగుచు నుండును. మర్కటసన్న్యాసి యీతిబాధలచే సన్న్యసించి కాలక్షేపము గావించుచు, సాధనాపాటవమున నభివృద్ధి గాంచుచు నుండును. ఆతురుడు అవసానకాలమున సన్న్యసించును.

అందుచే సన్న్యాసి నియమముల నిదమిత్థమని నిర్ణయించుట శాసించుట శ్రుతిశాస్త్రమునకే సాధ్యముకానిచో నిక స్మృత్యాదులుగాని, యితరముగాని ఏమి చేయగలవు ? అట్టి సంపూర్ణవిరాగిగా నున్నవానిని 'న సురాం పిబేత్' 'న పరదారాం గచ్ఛేత్' అని శాసించుట అసందర్భము. అతనికి అవి అవసరములు కానేకావు. సాధకునకుమాత్రమే అట్టి విధినిషేధములు కర్తవ్యములు. 'అహం బ్రహ్మేతి నిశ్చిత్య అహం భావం పరిత్యజ' (6. 104) అహంబ్రహ్మ భావమును నిశ్చయించి అహం మమ భావముల ద్యజింపుమని తేజోబిందు వుపదేశించినట్లు అహంభావ వర్జితునకుగాక దాని సాధింపచూచు వానికై కొన్ని నియమములు గలవు. 'వేదశాస్త్రాణి చాన్యాని పదపాంశుమివ త్యజేత్' (బ్రహ్మవిద్య, 30) పాదధూళివలె వేదాదిశాస్త్రముల ద్రోసివేయుము అను స్థితికిగాక గొందరికి 'సర్వేషు వేదేషు ఉపనిషదమావర్తయేత్' (ఆరుణేయ. 2) సర్వవేదములనను ఉపనిషత్తుల బఠింపుము అనుట అవసరము అగును. 'ఔషధ వదశన మాచరేత్' (ఆరుణేయ. 2) ఔషధమును సేవించునట్లు దేహరక్షణార్థము భుజింపుము, 'వర్ణాశ్రమాచారయుతావిమూఢా...వర్ణాదిధర్మంహిపరిత్యజంతః'

(మైత్రేయ. 1.13) వర్ణాశ్రమధర్మముల గలవాడు మూఢుడు, కాన వాని బరిత్యజించి, అనగ 'దేహజాత్యాది సంబంధాన్ త్యజేత్' (బ్రహ్మవిద్య. 29) దేహసంబంధములైన వర్ణాదికము దక్షజించి, 'ప్రాణసంధారణార్థం' భుజించుచు, వర్ణాశ్రమ వివర్జితుడై 'సర్వవర్ణే ష్వాజగరవృత్త్యాహార పరుడై, (నారద పరివ్రాజక. 5) యుండువానికి, బూర్వదశలలో గుటీచక బహూదక త్వస్థితులలో భిక్షానియమము తేర్పడుట సహజమే. అయాచితమైన ఆహారమును, ఆరోగ్యభంగము కానట్టి వానిని స్వీకరింపవలెను. అటులే సన్న్యాసోపనిషత్తు 'చతుర్వర్ణేషు భిక్షాచర్యం చరేత్' (1) నాలుగు వర్ణములలో భిక్షను గైకొన వలెను అని బోధించుచున్నది. ఈ యుపనిషత్తు యింకను విశాలభావమును జూపించుచు, 'చరే న్మాధూకరం భైక్షం యతిర్ మ్లేచ్ఛకులాదపి।' (2. 71) మ్లేచ్ఛాదికులములనుండి యైనను మాధూకర భిక్షాదుల యతి స్వీకరింపవలెను అనియు విశదపరచి యున్నది. పరమహంసపరివ్రాజకముగూడ 'శరీరసంధారణార్థం చతుర్షు వర్ణేష్వభిశ స్త పతితవర్జితేషు' అనియు బోధించుచున్నది. ఆవిధముగ సన్న్యాసి 'అతివర్ణాశ్రమియై' (పరబ్రహ్మ) 'లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనం। శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు' (3) లోక దేహశాస్త్రముల ననుసరించు నియమవిధుల ద్యజించి అవి అధ్యాసయగుటచే నా యధ్యాసను నశింపజేయుము అని సన్న్యాసికి అధ్యాత్మోపనిషత్తు ఆదేశించుచున్నది.

ఇక ముండన జటాదిక నియమములు, దండధారణాది నిబంధనములు, అధ్యయనాదిక అభ్యాసమును, లోకమున

వ్యవహరించు విభాగములలో గల నియమములన్నియు కుటీచ కాది ప్రాథమిక స్థితినున్నవానికేగాని పరమహంసస్థితునికి గానేరవు. అన్వయానన్వయరీతుల ఆత్మపరీక్షచే నవసికివాడుగా నిర్ణయించుకొనగలడు గాని యితర అపేక్షగాని శాసనము గాని యిందు గానరాదు. అటులే ఉన్నచో నతడు సన్న్యాసియే గాడని నిర్ణయము. అతనికి వైరాగ్యమే ప్రధానముగాని అన్యమేమియు గానేరదు. ఆ వైరాగ్య అభివృద్ధికై యుపయుక్త నియమముల శాస్త్రమునుండియు, గురువునుండియు స్వాత్మ ప్రబోధమునుండియు గ్రహించి, పాటించి, ఉత్తీర్ణతబొందుటయే అతని గమ్యముగాని వైరాగ్యేతరకర్మప్రవృత్తులు, లౌకిక వ్యవహారములు, అవిసీతికార్యములు మొదలగు సాంఘిక ప్రవృత్తులతో నతని కెట్టి సంబంధమును లేదు ఉండదు. వాని కతీతుడతడు. వాని నాస్థితినుండియే గ్రహింపవలెను గాని, లౌకికదృష్టి గాంచుట దోషభూయిష్టము, అసంగతము, అనుచితము.

ఈ భావమునే శంకరుడు గూడ 'జాత్యాదీన్ సంపరి త్యజ్య' (ఉ. సా. 2. 15-8) 'హిత్వా జాత్యాది సంబంధాన్' (ఉ.సా. 2. 17. 76) 'త్యక్త్వా జాతికులాశ్రమేష్వభిమతం' (వి.చూ.378) 'త్యజాభిమానం కులగోత్ర నామ రూపాశ్రమేషు' (వి.చూ. 298) 'అయమేవ యతేర్ధర్మః కర్తవ్యో మోక్ష కాంక్షిణః। నైవ స్నానం నాపి జపో న పూజాపి న కీర్తనం' (మ. వా. ద. 226) నన్వయించుచు తెలిపియున్నాడు. 'యతీనాం ప్రశమో ధర్మః' యతులకు శాంతమే ధర్మము.

## సన్న్యాస ప్రారంభము

సన్న్యాస సంప్రదాయము జైన బౌద్ధ సన్న్యాసోద్భవ ఫలితమున బరిణమించినదని కొందరు భావించెదరు గాని ప్రాక్వ గ్రంథ మట్టి అపోహల నివారించును. సన్న్యాస విధానము వేద నిమిత్త ప్రబోధితమేగాని కాలాంతర జన్యమున్కాదు. ఋగ్వేద మున ముని యతి పదములు తరచుగ గానబడును. అందు ముని పదము ముఖ్యముగా సన్న్యాసుల కన్వయించును, వారే 'వాతరశన కేశులు' (ఋ. 10. 136. 2) గా పేర్కొన బడి మాసిన పసుపువస్త్రధారు లనియు దెలియుచున్నది. అనగ వీరు దీర్ఘ కుంతలముల గలిగి యుండువారు. These attributes of long hair and yellow soiled garments are typical of ascetics in the full-fledged system of asceticism.[161] దీర్ఘజట మాసిన పసుపు వస్త్రములు నాటి సన్న్యాస పద్ధతిని గల సన్న్యాసుల సూచించునని ఘుర్యే తెలుపుచున్నాడు. తైత్తిరీయారణ్యకమునగల 'వాత రశనా హ వా ఋషయః శ్రమణా ఊర్ధ్వమంథినో బభూవుః' (2.7) అను చోట్ల వాతరశనులు ఋషులనియు, వారే శ్రమ ణులు ఊర్ధ్వరేతస్కులనియు దెలియబడును. So, here we find that the Sramanas were naked and chaste.[162] కాన శ్రమణులు దిగంబరులై బ్రహ్మచారులుగా దెలియ బడునని హారదత్తశర్మ వచనము. తైత్తిరీయారణ్యకములో,

---

161. Prof G. S. Ghurye: Indian Sadhus, p 12.
162. Prof. Hardatta Sharma: History of Brahminical Asceticism, p 19.

ప్రజాపతి తప మాచరించి, తనశరీరమును చలింపజేయ, 'తస్యయన్ మాంసం ఆసీత్ తతోఽరుణాః కేతవో వాతరశనా ఋషయ ఉదతిష్ఠన్' అతని మాంసమునుండి అరుణ, కేతు, వాతరశనులను త్రివిధఋషు లుద్భవించిరి. అతని గోళ్లు వైఖానసులుగను, కేశములు వాలఖిల్యులుగను రూపొందిరి అను చోట వాతరశనులు ఋషులని స్పష్టము ఇట్లు The naked sages, who sometimes clothed themselves in yellow or dirty garments, are to be met with in the Rig-Veda also. దిగంబరులు, పీతవస్త్రధారులు, మలిన వస్త్రధారులైన సన్న్యాసులు ఋగ్వేదమునగూడ గానబడు దురు అని హారదత్తశర్మ, ఘుర్యే పండితులును వక్కాణించి యున్నారు. అంత కాలాంతరమున వారు సన్న్యాసులని పరి వ్రాజకులనియు బిలువబడిరి అనియు ఘుర్యేవాదము. ఉపని షత్తుల జూచినచో, 'శ్వేతకేతు ఋభు నిదాఘ జడభరత ర్షభ దూర్వాస సంవర్తక సనత్సుజాత వైదేహ వటసిద్ధ శుక వామదేవ దత్తాత్రేయ రైవతక గోరక్షావధూత' (నారద పరివ్రాజక) 'అథ పరమహంసో నామ సంవర్తక అరుణి శ్వేత కేతు జడభరత దత్తాత్రేయ శుక వామదేవ హారీతక' (భిక్షుక, యాజ్ఞవల్క్య) 'కుటీచకో నామ గౌతమ భరద్వాజ యాజ్ఞ వల్క్య వశిష్ఠ ప్రభృతయః' (భిక్షుక) మొదలగు సన్న్యాసుల నామములు స్పష్టము. అటులే సనకసనందనాది పంచకము, కపిల దేవశాదులును ప్రసిద్ధులే.

---

## సంప్రదాయములు-దత్తాత్రేయ

వీరిలో దత్తాత్రేయుని పేర నొక సంప్రదాయ ముద్భవించి నేటిదనుక వ్యవహారమున నున్నది. పై సన్న్యాసుల గాథలు పురాణములలోగూడ వర్ణితమై దత్తాత్రేయుడు కాలక్రమమున విష్ణ్వవతారముగ ప్రఖ్యాతినొంది, భాగవత, మహాభారత, బ్రహ్మాండ, మార్కండేయాది పురాణములలో స్తుతింపబడెను. దత్తాత్రేయోపనిషత్తులో నితను అత్రి అనసూయల కుమారుడుగ చిత్రింపబడి, మహాయోగిగను, అవధూతగను దెలుపబడి, అతడు సచ్చిదానందరూపుడై, బాలునివలె, ఉన్మత్తునివలె, పిశాచమువలె, పరమహంస చందము బ్రవర్తించు చుండెననియు దెలియును. హైహయ కార్తవీర్యార్జునుని పౌరోహితుడీ పరమహంస దత్తాత్రేయుడు అగునో కాదో తెలుపనశక్యముగాని, యితడు తన్మయుడై, స్త్రీ పరివేష్టితుడై శాక్తేయ లక్షణములగలవాడై యుండునట్లు పురాణగాథ అని ఘుర్యే కథనము.[163] అయినను అతడు అవధూతగనే ప్రఖ్యాతము. గిర్నార్ పర్వతమున నితని పాదముద్రలు గలవనియు తెలియుచున్నది. నాగసాంప్రదాయిక సన్న్యాసులు గొందరు యితని ఆరాధ్యదేవతగ నారాధించెదరు. అటులే శంకర దశనామముల వారుగూడ గొందరు యితని బూజించెదరు. శైవసంబంధముగల జోగులుగూడ నుత్తరహిందూస్థానమున నితని నర్చించెదరు. మహారాష్ట్రములో ప్రస్తుతము ఎక్కువగనున్న దత్త ఆరాధనము 'మహానుభావ' సంప్ర

---

163. Prof. G. S. Ghurye: Indian Sadhus, p 39.

దాయము, తర్వాత నభివృద్ధిగాంచినట్లు ఘుర్యే నమ్మకము. ఈ సంప్రదాయము క్రీ. శ. 1268 వ సంవత్సరమున చక్రధరునిచే ప్రారంభింపబడినది. ముఖ్యముగ మహారాష్ట్రమున అవధూత జ్ఞానసాగరేంద్ర సరస్వతి అను అవధూత జ్ఞానసాగరునిచే దత్తావధూతకు ప్రాధాన్య మొసంగబడి, అతనినుండియే మహారాష్ట్రమున చైతన్యపట్టముతో సన్న్యాస సంప్రదాయ మొండు నెలకొనబడెను.[164] అతడు 15వ శతాబ్దివాడు. క్రీ. శ. 1678–1781 వ సంవత్సరము జనించిన నృసింహాసరస్వతి అను పరమహంససన్న్యాసి మహారాష్ట్రమున దత్తారాధనమును ఎక్కువ గావించి, దత్తునివలె బాలతుల్యముగ యుండినట్లు ప్రతీతి. అట్లు శంకరపూర్వ సన్న్యాసమున, ఉపనిషత్పురాణముల తర్వాత, దత్తాత్రేయునికిగల ప్రసిద్ధి ఎవరికిని లేదు. అతని జీవితవిశేషములు చాలవరకు తెలియబడకున్నను, అతడు మతముల, సంప్రదాయముల స్థాపింపకున్నను, మిగుల ప్రఖ్యాతి నార్జించి, కాలాంతరమున ననేక సంప్రదాయముల కారాధ్య దేవతయై పరిఢవిల్లుట చాల అద్భుతము, అసాధారణము.

---

## వర్ధమాన మహావీర

దత్తునివలెగాక విస్తార యశమును సంపాదించి, ప్రత్యేక సంప్రదాయమును గూడ స్థాపించిన మహావీర వర్ధమానుడు సుప్రసిద్ధుడే. ఒక కాలములో భారతదేశము నంతటిని జైనమతమే

164. Prof. G. S. Ghurye: Indian Sadhus, p 24.

ఆక్రమించియున్నదా అనునట్లు వ్యాప్తి జెందించిన మహానుభావు డితడు. Rishabha seems to have started the school of thought, ascetic and lay, which in the hands of Mahavira culminated in what is known as Jainism.[165] జైనమతమని మహావీరుని హస్తములచే రూపొందిన యీ సన్న్యాస, గృహస్థ సంప్రదాయము ప్రాచీనఋషియైన ఋషభునిచే ప్రారంభింపబడినట్లు గలదు. ఇతడు బ్రహ్మచర్యము ననేసన్న్యసించెను. ఋషభుని పిమ్మట 24వ తీర్థంకరుడుగ నాతడు క్రీ. పూ. 599 లో నవతరించినట్లు చరిత్ర. ఇతడు పార్శ్వనాథునికి జెందిన నిర్గ్రంథసంప్రదాయమునకు జెందినవాడు. వర్ధమానుడు మౌనియై దేశమున విరివిగ బర్యటించి, తీవ్రసాధనల మునుంగుచు, సన్న్యసించిన పదివత్సరములకు అజీవక శాఖకు తీర్థంకరుడై రూపొందెను. కేవల జ్ఞానసంపన్నుడై, సామాన్యమైన సంస్కృతభాషలోగాక ప్రాకృతభాషలో ననుచరుల బ్రబోధించుచు, ప్రశస్తి వార్జించి, సుమారు 500 మంది శిష్యులతో బరివృతుడై పర్యటించుచుండువాడు. అతడు తన తపోబలమున ననేకసిద్ధుల గూడ సంపాదించెను. అతడు వేదముల నిరసింపక నందుగల ననేకసమస్యల దీర్మానించెను. అతని కాలములో పదునొకండుమంది ముఖ్యశిష్యుల నేరి తనకు గల 4400 అనుచరులకు వారి నాయకులనుగా నొనరించెను. వైశాలిలో గల క్షత్రియగ్రామమున జనించినను, దేశమునంతయు దిరిగి, సన్న్యాసుల ననేకుల జేర్చి, దేశవ్యాప్తముగ జైనమతసిద్ధాంతముల వెదజల్లి, క్రీ. పూ. 527 వ సంవత్సరము,

165. Prof. G. S. Ghurye: Indian Sadhus, p 2.

72 వ సంవత్సరప్రాయమున శిష్యులకు బోధించుచు, మహా నిర్వాణమును బొందెను. మహావీరునకు నాటికి 14000 పురుషులు, 36000 స్త్రీలు శిష్యులుగా జేరియుండిరి. వీరందరు సన్న్యాసమును గ్రహించినవారు. గృహస్థులు అయిదులక్షలకుమించి యుండువారు. అంత నీ జైనమతము చాల నాకర్షవంతమై దేశమును పూర్తిగ వ్యాపించినట్లు నేడును చిహ్నములు గానుపించును. అందుచే మహావీరసంప్రదాయ సన్న్యాసముగూడ శంకరపూర్వసన్న్యాసములలో ప్రముఖమైనదని విదితము. నేటికిని దాని యనుచరులు ఉత్తరదేశమున గోచరము. ఋషభదేవునితో బ్రారంభించిన యీ జైనసన్న్యాసమువలన సన్న్యాసవిధానము ప్రాచీనమని సుస్పష్టము.

---

## గౌతమ బుద్ధ

అటులే ప్రపంచవ్యాప్తమైయున్న బౌద్ధసంప్రదాయము గూడ నతిప్రాచీనము. అతని తేజోమూర్తి అద్భుతమై నాటి నుండి నేటిదనుక జిజ్ఞాసులోకము ను త్తేజమొనరించుచు ఆధ్యాత్మిక వికాసమును బ్రసాదించుచున్నది. ఇతని జీవితవిశేషములు ఉపదేశములు సర్వాకర్షణీయములై, ఆశ్చర్యానందదాయకములైయుండుటచే ఇతనిగూర్చి దెలియని వారుండరు. సౌరభమున నతనిసంప్రదాయసిద్ధాంతములకు పూర్తిగ ఒక ఖండమే నియోగింపబడియున్నది గాన నందు వివరముల జూచెదముగాక ! అతని కాలము నంతటిని ధర్మప్రబోధమునకే విని

యోగించి, రాజాధిరాజుల దన ప్రశాంతపాదారవింద జనిత శీతకరణముల నాకర్షించి, తన అహింసాసిద్ధాంతమును సర్వావలంబనీయముగా నొనర్చిన దిట్ట గౌతమబుద్ధుడు. తన కరుణా దృష్టుల గష్టజీవులగాంచి, వాని రక్షింప సర్వత్యాగమొనరింప సంసిద్ధుడైన అసమాన త్యాగమూర్తి. అందుచే దన సన్న్యాస సంప్రదాయమున సర్వవర్ణములకు అవకాశమొసంగి, మహావీరునివలె స్త్రీలకుగూడ సమానస్థాన మొసంగియున్న విశాల హృదయుడు బుద్ధుడు.

మహావీర గౌతములకు సన్న్యాస నియమావళి అధికముగ వేదాంతమతమునుండియే గ్రహింపబడియున్నను, వానిలో దశనామాదివిభేదములుగాని మరి యితర విభేదములుగాని లేక సన్న్యాసమును విశాలమొనరించి, పూర్వము దూరముగనున్న దానిని అందరి కందుబాటుగ నుండునట్లు గావించిరి. అందుచే నిందు వర్ణధర్మములు దూరముగావింపబడి, ఉపనయనాదికము నొక అర్హతయను నిబంధనము దొలగింపబడెను. ఈ సన్న్యాసిద్వయముయొక్క కృషిత్యాగముల చేతనే సన్న్యాసము బహుళవ్యాప్తినొందె,పూర్వ మల్పసంఖ్యాకులుగనున్న సన్న్యాసగణము సహస్రములదాటి లక్షల నందుకొనుట గమనార్హము. సంసారమునగల అల్పత్వ క్షణికత్వ దుఃఖత్వముల బ్రస్ఫుటక్రియ జిజ్ఞాసువుల ముందుంచుటలో వీరిరువురు అసాధారణ ఆదర్శత్యాగధనులై సాధనసంపన్నులై, ఆత్మానుభూతి గలిగినవారై యుండుటచే వారిమతములు అంతగ బహుళవ్యాప్తి జెందినవి. అది భరత ఖండముయొక్క అదృష్టము. ఏ జీవితము నవలంబించినను మానవునకు త్యాగము ప్రధానమగుటచే నీయిరు

వురు మహాపురుషులు సన్న్యాసముయొక్క మాహాత్మ్యప్రవ్రత్తి తను ప్రజానీకమునకు విదితపరచి బహుసంఖ్యాకుల నందు ప్రవేశింపజేయగల్గుట వారి అసమాన ఆదర్శ త్యాగ మహిమయే యని వేరుగ దెలుప నవసరములేదు.

---

## శంకరాచార్య

వారివెంటనే అరుదెంచిన శంకర భగవత్పాదుని ఋషియముల బూర్వమే చాలవరకు జూచియున్నాము[an ascetic star of the first magnitude.[166]] ఉన్నత శ్రేణికి జెందిన నొకసన్న్యాసనక్షత్రముగ శంకరుని ఘుర్యే వర్ణించియున్నాడు. పూర్వసన్న్యాసములు బహుళ వ్యాప్తముగ నున్నను, అందు గల లోపముల నవరించి, సంస్కరింప నాత డుద్యుక్తుడై సన్న్యాసమునకు గౌరవప్రతిష్ఠల నార్జించిపెట్టెను. జైనబౌద్ధముల సన్న్యాసము సామాన్యమై పాత్రాపాత్ర పరీక్షల ననుసరింపక స్వీకరింపబడుటచే నది సమర్థుల గప్పిపుచ్చినదేమో అని దోచును. కాని శంకరుడు, వేదాధ్యయనపరులైన అగ్రవర్ణజనకే సన్న్యాసమర్హ్యమని నిర్దేశించుటచే నొక గొప్పమార్పు అందు ప్రవేశించెను. సమగ్ర శాస్త్రాధ్యయన పరులకే అందు అవకాశ మేర్పడినట్లు అయ్యెను. ఉపనిషదాదుల గానబడని సన్న్యాస సంఘముల, బౌద్ధజైనముల ననుసరించి శంకరుడును, నాలుగు పీఠములను, దశనామములను నిర్మించెను. పూర్వోక్తచందము

166. Prof. G. S. Ghurye : Indian Sadhus, p 52.

దశనామ ఆవిర్భావ విధానము అవ్యక్తముగ అస్పష్టముగ నున్నను, అత్యంత శక్తిసంపన్నుడై, అద్భుత మేధాయుక్తుడై సుమారు 16 వ సంవత్సర కాలములో సుద్గ్రంథ రచనము, బహుళప్రచారము, దేశవ్యాప్త పర్యటనము, అసంఖ్యాక శిష్యగ్రహణము మొదలగు మహాత్కార్యముల నొనరించి, సన్న్యాస సంప్రదాయమునకే గాక, భారతీయ తాత్త్విక దృష్టిలో, నంమను హైందవ సంస్కృతీ రూపమునే మహత్తర పరిణామము నొందించి, వినూత్న దృక్పథము గలిగించిన శంకరుని మూర్తి నెవరు వర్ణింపగలరు! అది ఒక శక్తి స్వరూపము, దివ్యము. కాని అంతవరకు వేదములనుండి అనుస్యూతముగ అరుదెంచుచు, జైన బౌద్ధములలో విశ్వరూపము దాల్చెనో అనునట్లు విజృంభించిన భిక్షుకి బ్రహ్మవాదినుల ప్రవాహము నతడు తుదముట్టింప నెంచెను. అందుచే ఉభయ భారతిని ఆరాధ్యదేవతగ గౌరవించినట్లు చరిత్ర దెలుపుచున్నను, ఆమెకు శంకరుడు సన్న్యాసమున కవకాశ మొసంగ లేదు. అతనిలోని పురుషత్వము ముందు కేతెంచి, స్త్రీ పరాధీనత్వమును మనువులోలె పునఃప్రతిష్ఠ గావింప దలంచి యుండును. కాని భారతదేశమునగల అసంఖ్యాక శంకరేతర సంప్రదాయముల నది విస్తారవ్యాప్తిగలిగియుండి, స్త్రీలోకమున శంకరానంతరము గూడ ననేక సన్న్యాసినులుదయించినట్లు చరిత్ర తెలుపుచున్నది. అయినను శంకరు ప్రఖ్యాతి తన వ్యక్తిత్వమునకేగాక సన్న్యాసమునకు, భారతీయ సంస్కృతికే ఒక మహాదలంకారము. ఆ మూర్తి చిరస్మరణీయుడు అమరుడు వందనీయుడు.

## శంకరానంతరము

శంకర పూర్వ సన్న్యాసరీతులలో జైన బౌద్ధములు కాక మిగిలిన వన్నియు చరిత్రాకథనమున దూరములై అంద నివై యుండుటచే వివరములు మనకు రాలేదు. వాని పరిశీలించి శ్రుతి స్మృతి పురాణేతిహాసముల, నితర గ్రంథముల బహుళముగ గవేషణము నొనరించినగాని విషయ సేకరణము సాధ్యము గాదు. అది ప్రత్యేక కృషి సాధ్యము. అట్లు గావించుచో ననేక వినూత్న విషయములు గోచరించును. కాని శంకరానంతర సన్న్యాసలోక పరిచయము చరిత్రాత్మకమగుటచే బ్రస్ఫుటము బహుళము. ఒక్కొక సంప్రదాయ కథనమే యొక్కొక గ్రంథముగ రూపొందును. కాన ఇందు అతిసూక్ష్మ విధానముగ గొన్నింటిని మాత్రము చూచెదముగాక !

పూర్వము ప్రస్తావింపబడిన దత్త సంప్రదాయమువలె గాపాలిక పాశుపతములు అతిప్రాచీనములు. వారితో శంకరునికి గలిగిన వాద ప్రతివాదములు శంకరవిజయాది గ్రంథముల వ్యక్తము. వీరిని గూర్చి మైత్రేయ, అథర్వశిరోపనిషత్తులలో గూడ సూచనలు గలవు. వీరు కాలక్రమమున బహుళవ్యాప్తి నార్జించి, దేశము నెల్లెడల ప్రసరించి, అసంఖ్యాక అనుచరుల గలిగి యుండిరి. మహారాష్ట్రమున మహావ్రతులనియు దెలియ బడుచున్నారు. దక్షిణమున కంచీ ప్రాంతముల గూడ బ్రసిద్ధముగ వీరు గలరు. వీరు ముఖ్యముగ శివారాధనపరులై, శివాలయముల నాశ్రయించియు, దదనుగుణ మఠముల నిర్మించియు నుండిరి. వీరు త్రిశూలముల ధరించి యుందురు. కపాలధారియైన

శివశక్తుల నారాధించుచు, కపాలముల పాత్రలుగ నుప యోగించుటచే వీరికానామము కలిగెను. శాక్తేయ సాధనా విధానములగూడ వీరు అనుసరించెదరు. స్మశానవాటికల నివసించు అఘోరసంప్రదాయముగూడ దీని శాఖయే యగును. భైరవ భైరవి ఆరాధనము వీరికి ముఖ్యము. తంత్రశాస్త్రము ప్రధానము. రక్తమాంసముల దమ ఆరాధ్యదేవతకు నివే దించుట మద్యమాంసాదుల నుపయోగించుట మొదలగు ఆచారముల వలన వీరు భయంకరముగ బ్రజానీకమున దోచి, తమ అనుచరకోటిలోగాక నితర స్థానముల బ్రశస్తి వీరు నార్జింపజాలక పోయిరి.

శంకరానంతరమున శంకర సన్న్యాససిద్ధాంతముల నెదు ర్కొని, దాని ప్రాభవము సడలింప యత్నించిన వైష్ణవ సంప్ర దాయములుగొన్ని గలవు. అందు రామానుజీయము మాధ్వము ప్రధానములు. వీని సిద్ధాంత సంప్రదాయనియమములు సౌరభ మున దృతీయమైన వైష్ణవఖండభాగముల వివరముగ గానబడును గాన నిట క్లుప్తముగ చూచెదముగాక. పూర్వసిద్ధవైష్ణవము నుద్ధ రించి, పదునొకండవ శతాబ్దమునకు జెందిన రామానుజా చార్యుడు దీని స్థాపించెను. భాగవత, వాసుదేవ మతము లనియు దీనికి నామాంతరములు పూర్వముండెను. సిద్ధాంత మునకై శంకరువలె రామానుజుడును ప్రస్థానత్రయములకు భాష్యముల విరచించెను. త్రిదండి సన్న్యాససంప్రదాయము నితడు నెలకొల్పెను. విష్ణువే వీరి అధిష్ఠానదైవము. అది కాల క్రమమున దక్షిణమున మధ్వాచార్యునిచేతను, ఉత్తరమున నింబార్క, వల్లభ, కృష్ణచైతన్య మొదలగు ప్రజ్ఞావంతులైన

భక్తాగ్రగణ్యులచే విరివిగ వ్యాప్తినొందుచు, రూపాంతరముల బొందుచు, భరతఖండము నంతటిని ఆక్రమించి యున్నది. పూర్వ సంప్రదాయములగల త్యాగవిద్యలకంటె నిందు సంకీర్తన ప్రపత్తులకు ప్రాధాన్య మొసంగబడియుండుటచే సర్వాధికారులకు సులభసాధ్యముగనుండుట దీనిబహుళవ్యాప్తికిగారణము. రామానుజ, మధ్వ సంప్రదాయములు, బ్రాహ్మణజన్ములకే మిగుల యుపయుక్తమై అందలి సన్న్యాసమునకు అవకాశములుండు వీనినుండి జనించిన అనేక సంప్రదాయములు స్త్రీశూద్రాదులకుగూడ, పంచములకుగూడసన్న్యాసమునొసంగి దేశమున వ్యాపించియున్నవి. ఉత్తరహిందూస్థానమున రామానందసంప్రదాయము ముఖ్యము. ఈ సాంప్రదాయిక సన్న్యాసులు యజ్ఞోపవీతములగలిగి, బైరాగులనియు సాధువులనియు ప్రఖ్యాతము. ఈ సాంప్రదాయిక మతములు ఉత్తరదేశమున విస్తారముగగలవు. రామానందుడు క్రీ. త. 1300 సంవత్సరమున జనించెను.

అటులే గోరక్షనాథుడను సన్న్యాసి కాణపంథా అను యోగసంప్రదాయమును నెలకొల్పెను. ఇతడు భారతదేశమునే గాక యితరదేశములగూడ బర్యటించి, మక్కాకుగూడ వెడలియుండెను. ఇతనిదృష్టి మహామ్మదీయులనుగూడ నాకర్షించి, శిష్యులనుగా జేర్చుకొనెను. అందుచే హిందూ మహమ్మదీయ సమన్వయమునకు యతని కృషి మార్గగామి అయినది.

నాగ సంప్రదాయ ముత్తరదేశమున చాల ప్రముఖము. వారు శైవ వైష్ణవ పరముగ ద్వివిధము. విద్యావ్యాసంగములకు కాంక్షగొనని జిజ్ఞాసువులు యీ సంప్రదాయముల

జేయుదురని వాడుక. శైవవరులు దేహమున భస్మమును ధరించి, మిక్కుటముగ రుద్రాక్షధారణము గావించెదరు. వైష్ణవులు తులసిమాలల ధరించి, ఊర్ధ్వ త్రిపుండ్ర ధారణ మున నుందురు. ఇరువురు, జటల కిరీటమువలె శిరస్సుపై జుట్టి యుంచెదరు. కౌపీనమును గాత్రముంచెదరు. శైవ నాగులు త్రిశూలములను ధరింప, వైష్ణవులు దీర్ఘములైన పటు గారుల నుంచుకొనెదరు. వీరిలో గొందరు దిగంబరులుగగూడ నుందురు. ఎక్కడ నున్నను వీరికి 'ధుని' అను అగ్ని యుండి వెలుగుచు నుండవలెను. ఆ భస్మమునే దేహమున ధరించెదరు. మహమ్మదీయులచే హింసింపబడుచున్న సన్న్యాసుల రక్షిం చుటకు మధుసూదన సరస్వతియే యీ నాగసంప్రదాయ మును నిర్మించి, వారిని యోధులుగ గావించెనని అందురు. కాని అంతః పూర్వమే యీ సంప్రదాయములుండినట్లు తెలియు చున్నది. శైవ నాగులు ముఖ్యముగ గిరి పురి పట్టముల బొంది యుందురు. వీరికి పీఠములవలె అఖాడా అను కేంద్రస్థానము లుండును. అట్లు ఆరు ప్రఖ్యాత 'అఖాడా' లు వారికి కలవు. వానిలో ప్రాచీనమను అర్థముతో 'జూనా' అఖాడా ముఖ్యము. దానికి బూర్వనామము 'భైరవ' అఖాడా. దత్తుడేయిచట అధిష్ఠాన దైవము. దీనికి సంబంధించినదే 'ఆవాహన' అఖాడా. ఇప్పుడు దీని అధీన అఖాడాలు ప్రయాగ హరిద్వారము మొదలగు స్థానముల గలవు. అట్టిదే 'నిరంజనీ' అఖాడా. అట్లే 'మహా నిర్వాణ' అఖాడా. ఈ అఖాడా సన్న్యాసులు ఔరంగజేబు సైన్యములతో బోరాడి గెలుపొందినట్లు తెలియుచున్నది. ఈ సంస్థకు గపిలాచార్యుడు ఇష్టదేవత. 'అతల' అఖాడా మరి

యొకటి. దీనికి గణపతి ఆరాధ్యదేవత. ఈ అఖాడాలలో దశ నామము లన్నియు గలవు. ఈ పీఠాధిపతులు మండలేశ్వరులు అనబడుదురు.

గోరక్షనాథునివలె, హిందూ మహమ్మదీయ సమైక్యత్వమై కొన్ని సంప్రదాయము లేర్పడియున్నవి. వానిలో ఉదాసి నిర్మల సంప్రదాయములు రెండుముఖ్యములు. ఉదాసి సంప్రదాయకులు శివ, విష్ణు, సూర్య, గణపతి, శక్తులను పంచాయతనముగ గ్రహించియు, ఖొరాను విషయములగూడ గ్రహించి సమన్వయింప యత్నించిరి. వీరు గురునానక్ అనుచరులు, నిర్మల సంప్రదాయకులు, వర్ణత్రయమును చేర్చుకొనుచు, ఖొరాను పురాణముల నైక్యతను బోధించుచు, రామరహీము లొక్కటియే అని తెలుపుదురు. ఉదాసీలు శ్రౌతు లనబడుదురు. అనగా శైవసన్న్యాసులకు స్మృతులు ప్రధానమగుచుండ వీరికి శ్రుతులే ముఖ్యము. స్మార్త సన్న్యాసులకే సన్న్యాసనామముగాని శ్రౌతులకు ఉదాసీనామము ప్రధానమనియు వీరి వాదము. వీరికి వేదాంతమే ప్రమాణము. దశనామ సన్న్యాసులవలెనే కాషాయ కమండలధారణము గావించెదరు. దండము మాత్రముండదు. ఉదాసీ సంప్రదాయము నానక్ పుత్రుడైన శ్రీచంద్రుడు నెలకొల్పెనని యందురు. కాని అతడు దాని పునరుద్ధరించి నట్లు చరిత్ర. వీరి సంప్రదాయము సనకునితో ప్రారంభించి, అందు డెబ్బదిమూడవ గురువైన శ్రీచంద్రునితో విస్తరించినట్లు సంప్రదాయము. ఈ సంప్రదాయమున శైవులు నాగులని, వైష్ణవులు దాసులని, పరమహంసలు ఆనందులని యందురు. వీరు హిందూధర్మము

లనే అనుసరించెదరు. సింధు పంజాబులలో వీరు విస్తారముగ నుండిరి. ఉజ్జయినీ నగరమున వీరి పరమహంస అస్థానము గలదు. కాశీ బృందావనములలో గూడ వీరి మఠములు గలవు. నిర్మల సంప్రదాయమును గురుగోవిందుడు స్థాపించెను. వీరి నామాంతమున సింగ్ అని పట్టుముందురు.

ఉత్తరప్రదేశమున కబీర్ పరమహంసలగు మరియొక సంప్రదాయముగలదు. హంసకబీరులనియు వీరికి నామాంతరము. వీరును కాషాయధారులే. వీరు పంచములగూడ సన్న్యాసమునకు గైకొందురు. వీరికి జ్ఞానమార్గమే ప్రధానము. యోగమును కొంచె మనుసరించెదరు. వీరు నిత్యసమాధిలోనుండ సాధన గావించెదరు. హంసకబీరులతో సంబంధములేని కబీర్ పంథా సంప్రదాయము ప్రసిద్ధముగ గలదు. కబీరు శిష్యుడైన భోగదాసు కబీరువచనముల జేరదీసి ప్రచారము జేసెను. వీరికి సాధన ప్రధానముగనుండి, దానిని 'శ్రౌతశబ్దయోగ' మందురు. దీనినే చాలవరకు రాధాస్వామి సంప్రదాయమువారు అనుసరించెదరు. కబీర్ పంథా సన్న్యాసులు శుక్లవస్త్రములనే ధరించెదరు, తిలకమునుంచెదరు. తులసిమాలను కంఠమున ధరించెదరు. దాస అనియు భగత అనియు శబ్దములు వీరి నామాంతరమున సన్న్యాసుల కుండును. వీరు విగ్రహారాధనము చేయక, మందిరముల నొక చౌకముగనుండు వేదికపై పుష్పముల నుంచెదరు.

వైష్ణవమున దాదుపంథా చాలముఖ్యము కబీర్ పంథాను అనుసరించియే యిది యుండెను. దీని పరబ్రహ్మ సంప్రదాయ మందురు. వీరు జయపూర్ ప్రాంతముల ప్రబలము. దాదు

క్రీ. త. 1544 లో జనించి, 1603 లో సిద్ధిపొందెను. హిందూ మహామ్మదీయ సఖ్యతయే అతనిగమ్యము. శిష్యుడు కాకపోయి నను కబీరుని యితడు స్తుతించును. ఈ సంప్రదాయమువారికి విగ్రహారాధనము, తపస్సులు, తీర్థయాత్రలు కూడదు. ఇతని రచనలు 'అంగబంధు' లనబడును. వీరిమఠముల దాదు ద్వారములని యందురు. వేదాంతము వీరి దృక్పథము. భక్తి కర్మములుగాక సహజస్థితియే వీరి సాధనావిధానము. రాముని స్మరించుచు నీ రాముడు పరబ్రహ్మము అనియందురు. వీరిలో గృహస్థులు వస్త్రధారులనియు, యోధులు నాగులనియు, సాధకులు విరక్తులనియు విభజ్యము. విరక్తులు కాషాయమును ధరించి సొరకాయ బుర్రల పాత్రలుగ నుపయోగించెదరు. వీరికి దాసు శరణ శబ్దములు నామముల కుండును. కొందరు నల్ల వస్త్రములగూడ ధరించెదరు. వీరికి తిలకము, మాల, మొదలగు బాహ్యచిహ్నము లెవ్వియునుండవు. ఇతనికిగల 152 మంది శిష్యులలో 52 మంది పీఠముల స్థాపించిరి. వీనికి 'తంబ' అనగ 'స్థంభము' లందురు. ఈసంప్రదాయమువారు వేదాంతమున బ్రవీణులు. పంజాబుదేశమున క్రీ. త. 1792లో జనించి, 'విచారసాగర' 'వృత్తిప్రభాక'రాది ఉద్గ్రంథముల రచించి, ప్రఖ్యాతి నార్జించిన సాధు నిశ్చలదాసు యీ సంప్ర దాయమునకు జెందినవాడు. 'విచారసాగరము' అనేక పీఠ ములలో నిత్యపాఠ్యగ్రంథముగ విరాజిల్లియున్నది. వీరిలో నాగవిభాగమువారు యుద్ధకుశలులుగా గీర్తినార్జించిరి.

ఈ విధముగ శంకరానంతర కాలమున దేశవ్యాప్త ముగ బ్రబలిన సన్న్యాససంప్రదాయములు అసంఖ్యాకములు.

వాని చరిత్రాకథనము చాలవిస్తారము కష్టసాధ్యము. మిగుల ప్రఖ్యాతములై దేశవ్యాప్త విఖ్యాత్మ సంస్కారకుల నుద్భోధించినవి పెక్కు యింకను గలవు. కాని వాని నన్నింటిని నామమాత్రముగనైన జేర్కొనుట ప్రత్యేకగ్రంథపరిమాణమును మించును. అట్టిచో వాని వివరములు ప్రముఖవ్యక్తుల వివరములనుల్లేఖించుట ప్రస్తుతము కానగమ్యమునకప్రస్తుతము.

## దయానంద

అయినను పందొమ్మిదవ శతాబ్దమున మొలకెత్తిన రెండు సంప్రదాయముల సూచింపక యీ భాగమును ముగింప న్యాయముగాదు. అవియే దయానందుని ఆర్య సమాజము, రామకృష్ణుని పరమహంస సంప్రదాయము. ఈ యుభయము అత్యాధునిక పాశ్చాత్యవిజ్ఞాన వ్యామోహితుల గూడ సంస్కరించి, ఆర్షధర్మమునకు మరల్చిన ఉత్కృష్ట శక్తులు. దయానందుడు సరస్వతి దశనామ సన్న్యాసి. ఇతడు సౌరాష్ట్రమున క్రీ. శ. 1824 వ సంవత్సరమున జనించెను. మూలశంకరుడని ప్రథమ నామము. ఇతడు హిందూధర్మోద్ధారకుడు. వివాహప్రయత్నమునుండి తప్పించుకొని, గృహము బాసి, దేశాటనము గావించి బ్రహ్మానందు నాశ్రయించి, విద్యనార్జించి, నర్మదా తీరవాసియైన పరమానంద సరస్వతినుండి ఆశ్రమస్వీకారము గావించెను. సంస్కృతభాషా ప్రావీణ్యము అసాధారణముగ

సంపాదించి, ఆ భాషాసంప్రదాయములచే సహస్రాధిక సభల ముగ్ధుల గావించి, తన అనుచరులుగ గావించుకొనుటలో దురంధరుడు దయానందుడు. దళినాపుసంప్రదాయమునకు జెందినను అటగల విగ్రహారాధనాది విషయములు నచ్చక, 1877 లో ఆర్యసమాజమును అతడు స్థాపించెను. అతని గ్రంథము 'సత్యార్థప్రకాశిక'. ఈ గ్రంథమున సర్వవిషయముల నితడు కూలంకషముగ జర్చించెను. ఇతనికి వేదములే ప్రమాణములు. వేదములకు సవివరభాష్యమును రచించెను. చాతుర్వర్ణములకు ఉపనయన సంస్కారమును, సన్న్యాసమును యితడు ఒసంగెను. ఆర్యసమాజముచే స్థాపింపబడిన 'గురుకుల' విద్యాస్థానములు చాల ప్రశస్తి నార్జించి శిక్షణమున గీర్తి గాంచినవి. అనుచరులలో శ్రద్ధానందుడు చాల ప్రధానుడు. ఇతడు శుద్ధిసంఘమును నెలకొల్పి మహామ్మదీయుల హిందూ మతమునకు జేర్చుకొన బ్రారంభించి, పూర్వములేని క్రొత్త విధానమును ఆర్యధర్మమున నేర్పరచెను.

---

## రామకృష్ణ

ఉపనిషత్తుల దెలియబడుటకైన జాలని అల్పసంఖ్యాకులై రాజాధిరాజులు కేలోడ్చి నమస్కరించినను తలయెత్తని సన్న్యాసులు, పురాణేతిహాసకాలమున నధిక సంఖ్యాకులై రాజాస్థానములగూడ ప్రవేశించి, సముచిత గౌరవమర్యాదల జారగొనుచు, వారి కాధ్యాత్మికవిద్య నుపదేశించి శిష్య

లనుగా గావించుకొనుచు, దమ ప్రాబల్యమును సంఘముపై నిశమడింపజేసికొని; మహావీర బుద్ధ కాలముల నింకను విజృంభించి, రాజుల దమబానిసలుగ గావించుకొని, దేశవ్యాప్తముగ సన్న్యాసుల జేర్చుకొని, వ్యాపింపజేసి, దేశమెల్లెడల ఆదర్శసన్న్యాసమూర్తుల సృజించి, ప్రజానీకమునకు బ్రసంగముల ద్వార ఆధ్యాత్మ విద్యావిభూతిని సన్నిహితము జేసి, అర్థధర్మాచరణమునకై రాజశాసనముల ద్వారమున గూడ ధర్మ ప్రబోధముల బ్రచారము సాగించి, శంకరాచార్యుని ధీకుశలతను అప్యాయతతో నాస్వాదించి విద్యావైదుష్య ప్రభావముచే దేశమున బ్రామాణిక గ్రంథముల నెలకొల్పి, సర్వవ్యాప్త గౌరవ ప్రపత్తుల నార్జించి, రామకృష్ణ వివేకానంద సముద్యమముద్వార దేశపరిధుల దాటి, పూర్వ సంకుచితత్వముల ద్రుంచి, మహాసముద్రముల లంఘించి, ఖండ ఖండాంతరముల జొచ్చి, సంస్కృత ప్రాకృత భాషావధుల, హైందవ హైందవేతర వ్యత్యాసముల, ప్రాచీనాధునికాచార తారతమ్యముల భేదించి, సర్వతోముఖ సర్వావలంబనీయ సన్న్యాసాదర్శముగ బరిణమించుట గమనార్హము. ప్రత్యక్షముగ నీ సంప్రదాయమును రామకృష్ణుడు నెలకొల్పకపోయినను, అతడే భావాదర్శముల వివేకానందునకు బ్రసాదించి, యీ సంప్రదాయమునకు మూలకారణమై, ఆరాధ్య దేవతయై విలసిల్లెను. అయినను దాని చిత్రించి, నియమించి విజృంభింపజేసిన వివేకానందుని సర్వశక్తిత్వము అసమానము. యువకసన్న్యాసచక్రవర్తియైన శంకరుడు పూర్వము భరత ఖండమునగల భారతీయ సంప్రదాయములతోడ మాత్రమే పోరాడి, తన విధానమును

స్థాపింప, నీ యువక యతి సార్వభౌముడు దేశావధులదాటి, అన్యమత సంప్రదాయ సంస్కారములుగల పాశ్చాత్యఖండ ముల వేదాంత కేసరివలె గర్జించి, వేదాంత విద్యాప్రబోధ గావించి, పండితుల లోంచి, మఠముల స్థాపించి, అపరశంకరుని వోలె అచిరకాలమున బ్రపంచవ్యాప్తకీర్తి నార్జించి, నలువది వత్సరములు రాకపూర్వమే సిద్ధిబొందెను. చాతుర్వర్ణ్యముల వారికే గాక మతేతరులకుగూడ, స్త్రీలకుగూడ నీతడు సన్న్యాసము నొసంగుట గమనార్హము.

అంతియగాక, సన్న్యాసి 'ఆత్మనో మోక్షార్థం' అను లక్ష్యమున కుచితముగ 'జగద్ధితాయచ' అను పరమలక్ష్య మునుగూడ జేర్చుకొనవలయునని ప్రబోధించి, జ్ఞానముతో బాటు వైదికకర్మమునుగాక, నిష్కామకర్మమునుగాక, సేవా కర్మమును సముచ్చయపరచి, ఆ ప్రజాసేవాపరతి సన్న్యా సాశ్రమ స్థాపనముతో బాటు ఆదర్శ విద్యాలయ స్థానములను నెలకొల్పి, ఆత్మమననముల కుపయుక్తముగనుండి, అతిప్రధాన ముగ నుంపవలసిన కాయసంక్షేమమునకై వైద్యాలయముల గూడ స్థాపించెను. అంతియగాక దేశమున నెట్టి యుపద్రవ మేర్పడినను, అందు దుఃఖితులగు ప్రజాసేవకై యీ సంప్ర దాయ సన్న్యాసులు, బ్రహ్మచారులు ముందడుగు వేయుచు ప్రజా గౌరవాదరణములనేగాక, ప్రభుత్వ సహకారమును గూడ దమ నిస్స్వార్థ సేవాపరత్వమున నార్జించియున్నారు. ఒక్క భారతదేశముననే గాక, యావత్ప్రపంచమున నది వ్యాపించి, సర్వదేశముల నత్యధిక గౌరవము నార్జించి, సన్న్యాసులన వీరే అను నూతనాదర్శమును నెలకొల్పినది.

ఇట్టి అసాధారణకార్య నిర్వహణమునకు సామాన్య ప్రజ్ఞా శీలురు జాలరు గాన, నీ సంప్రదాయము 'పండిత' మతముగ బేర్వడసి, సంస్కృతాంగ్ల విద్యానిధులకు స్థానముగ చిర కీర్తి నార్జించినది. యావత్ప్రపంచమున భారతీయ సన్న్యాస ఔన్నత్యమును బ్రకటించి, సర్వత్ర జోహారులందుకొను చున్నదీ సంప్రదాయము. ఈవిషయము సౌరభమున నారవది యైన సమన్వయఖండమున బహుళముగ గాంచెదముగాక. ఇతర సంప్రదాయముల సన్న్యాసుల సంఖ్య తగ్గిపోవుచున్నను, రామకృష్ణ సంప్రదాయమున నధికులగుచు నింకను జాల కున్నారు. అందుచే నీ సంప్రదాయము దేశమును, సంస్కృతీ మూలముల నెంతగ గదలించినదియు దానికి బ్రపంచమునగల ప్రస్తుత వ్యాప్తిప్రఖ్యాతులే నిదర్శనము.

---

## ప్రస్తుత కర్తవ్యము

ఇట్లు Sadhuism began as individual asceticism and has developed into a religio-social institution.[167] సన్న్యాసము వ్యక్తిగతముగ బ్రారంభించి, క్రమముగ మత సాంఘిక సంస్థగ బరిణమించుట గాంచియున్నాము. సన్న్యాసుల నియమరూప త్యాగమంతయు సుసంఘటితమై వారి అద్భుతశక్తులు వివిధరీతుల బ్రపంచవిషయముల విస్తరించి, అశక్యముగాక వారి ఏకాగ్రసాధనా పటిమచే అత్యద్భుత శక్తి

167. Prof. G. S. Ghurye : Indian Sadhus, p 250.

వంతములై, అసాధారణ శక్త్యుత్తేజమున ఆధ్యాత్మిక ధార్మిక రూపాంతరములనొంది, ప్రపంచమున బ్రవేశించి, ఆదర్శ వంతమైన మానవాభ్యుదయ కారణ సంస్కృతీ ప్రభావమునకు అజేయమగు శక్తిని బ్రసాదించుటయు మనము గాంచియున్నా రము. అంతియగాక నీత్యాగధనుల సాధనాఫలిత భావపరం పరయే ప్రపంచ సంస్కృతీ రూపమును దాల్చి, గార్హస్థ్య ధర్మ మును రూపొందించిన దనుట అతిశయోక్తి గానేరదు. బాల్యమునాదిగ ఆత్మోద్ధరణ వ్యాజమున జేతికి నోటికి అందు చున్న సర్వవిషయములు ద్యజించి, ఉగ్రారణ్యముల అన్నాహార నిద్రాదుల విస్మరించి, అవ్యయానంద లేశమును జూరగొని ఆనందించి, దానిని బ్రజానీకమున కందించు నిష్కామ నిస్స్వార్థ ప్రేమతో లోకమున దుమికి సున్మత్తునివలె దేశముల బర్య టించి, యింటింట దిరిగి, తన ఆనందానుభూతిని శాస్త్ర యుక్తులతో జోడించి ప్రబోధించి, సంఘము నుద్ధరించిన సన్న్యాసలోకము నెంతని కొనియాడ గలము! వారి అవ్యాజ మైన కృషిఫలితముగనే సంఘమున ధార్మికతత్త్వ ముద్భ వించుట సత్యము. వారి మూర్తులే ధార్మిక జీవన విధాన ప్రబోధకములు. ఘుర్యే వాక్యములలో But it is not known to the world at large that long before Mahavira and Buddha, there were Indians who were not only ascetics themselves but also ready to convince others that renunciation and withdrawal from the world was the only right conduct of life, who have been long enshrined in Indian tradition as spiritual personalities and benefactors of the hu-

man race[168] ఆధ్యాత్మిక తత్త్వస్వరూపులై మానవోద్ధార కులై భారతీయ సంప్రదాయములచిరకాలము అధిష్ఠించి, తాము సన్న్యాసులైప్రపంచమునుండి వైదొలగి, త్యజించుటయేయథార్థ మునను త్తమమార్గముగ నితరులకు సమ్మతముగ బోధింపగలిగిన సన్న్యాసులు భారత దేశమున మహావీర బుద్ధులకు పూర్వమే అతి ప్రాచీనకాలమునుండి గలరని ప్రపంచమునకు దెలియదు. అందుచేతనే 'కాషాయ దండమాత్రేణ యతి పూజ్యో న సంశయః' కాషాయదండముల మాత్రము జూచి యతి పూజింపబడవలెను, సంశయమువలదు అను శాస్త్ర వచన చందము ప్రపంచమున నీ సేవారతులు, త్యాగధనులు, ఆదర్శ మూర్తులు, సన్న్యాసులు ఆరాధ్యదేవతలై వెలుగొందుట విస్పష్టము. కేవలము నిరక్షరాస్య ప్రజానీకమునసేగాక పూర్వమునుండియు పండితబృందమునను, మరియు వివేకానంద త్యాగఫలితముగ నాధునిక విజ్ఞాన ప్రపంచమున అత్యధిక పూజ్యభావమును స్థాపించుకొనియున్న దీ సన్న్యాసవిధానము ఆవిధముగ Indian Sadhuism is thus seen to be a process of long evolution. It has shown great vitality and readiness to adopt itself to changing circumstances without foregoing its fundamental principles[169] భారతీయ సన్న్యాసము ఒక దీర్ఘ పరిణామవిధానము. పరిసర పరిస్థితుల ననుసరించి మార్పుచెందుటకు సుసిద్ధమై యున్నను, ముఖ్యసూత్రముల

168. Prof. G. S. Ghurye : Indian Sadhus, p 4.
169. Prof, G. S. Ghurye : Indian Sadhus, p 265.

విస్మరింపక అద్భుత శక్తియుక్తముగ ప్రకాశించుచున్నది. పూర్వము సంఘీభావము సహకారవిధానములు లేని సన్న్యాస సంఘములు గూడ ఘుర్యేవాక్యములలో his example has re-awakened Indian Sadhus to the need of wider organisation and propagations. [169] వివేకానందుని ఆదర్శము అధికతర నిర్మాణాత్మకదృష్టి ప్రచారపద్ధతుల ఆవశ్యకతను భారతీయ సాధులోకమునకు జూపించి వెలుగుబాట యగుటచే సాధుగణము ప్రస్తుతకాలమున బూర్వముకంటె అధికతర గౌరవనీయులై యున్నారని గ్రహించుట ముఖ్యము.

కాని ప్రస్తుతప్రపంచము విశాలదృష్టి కోరవబడుటచే క్రమముగ సాధులోకమును శాసనముల బంధించి, నిరోధింప, నెవరికిని సాధ్యముగాని రాజకీయవిప్లవకారులు చోరులు మొదలగు వేషధారులు యీ వేషములధరించి సంఘవిద్రోహ కార్యముల గావించుచుండుట గారణముగ నీ పవిత్ర సంప్రదాయమును ముఖ్యముగ పోలీసుశాఖోద్యోగులు మిగుల బాధించుచుండుటయు, హింసించి సాధువ్యతిరేక ప్రకటనలు ప్రచారములు సాగించుచుండుటచేతను, ప్రస్తుతరాజకీయ నాయకులలో నధికసంఖ్యాకులు నాస్తికులై, వేదాంతసంస్కృతీ రహితులై, పూర్వసన్న్యాసులనుండి తాము గ్రహించియున్న అమూల్య విజ్ఞానసంపదను విస్మరించి, సన్న్యాస వ్యతిరేకతను జూపించుటచేత సాధుజనము పూర్వమువలె ధైర్యముగ ధర్మోద్ధరణకార్యముల బూన సంసిద్ధమగుటలేదు. అందుచేత ప్రస్తుతము దేశమున నైతికపతనము వర్పడి, ప్రభుత్వమునకుగూడ

169. Prof. G. S. Ghurye : Indian Sadhus, p 265.

నలవికాని పరిస్థితులేర్పడినవి. సన్న్యాసుల బూర్వప్రభుత్వముల వలె బ్రభుత్వము వినియోగించుకొననేరక పోవుటయే కారణమని వేరుగ జెప్పవలసిన అవసరములేదు. అట్టి చక్కకం బూనుకొనలేక నీమధ్య లోకసభలో సాధుసంస్కరణ శాసనమొకటి బ్రతిపాదనమై సభలో నెల్లరు వ్యతిరేకులగుటచే ఉపసంహరింపబడియున్నది. రాజకీయములతో సంబంధములేని విధముగ, ప్రభుత్వాధినేతల అనుపు అజ్ఞలకు స్వాతంత్ర్యముగ సమర్థులగు సన్న్యాసుల, ప్రభుత్వము ధార్మిక ప్రబోధము, దేవాదాయ ధర్మాదాయ సంస్థల నిర్వాహణము, గురుకులాశ్రమ విద్యా విధానము, మొదలగు కార్యముల వినియోగించుకొనుచున్నచో క్రమముగసంఘమున ధార్మికప్రవృత్తులధికమయి, వేషధారిసాధువుల సంఖ్య క్షీణించి పోవును. ప్రజానీకమును గ్రమబద్ధమొనరింపగల శాసనములే యిట్టి వేషధారుల కుపయుక్తమగుచునే యున్నవి. కాని యథార్థ సాధువు నెరింగి, వాని కుపయుక్తపరిస్థితుల గల్పించి, వాని దేశముపయోగించుకొను విధానమే ప్రస్తుత మాలోచనీయాంశము. దానికై ప్రభుత్వము సన్న్యాసులుకలిసి ఆలోచించుకొని నిర్ణయించుకొందురుగాక. ఈసందర్భమున లోకసభలో కేంద్ర మంత్రి B. N. Datar బి. ఎన్. దాతార్ వాక్యములు విచారణీయములు. I urge upon the House to remember the manifold services rendered to the mankind by the sadhus and sannyasis from time immemorial...... What are the qualifications of district magistrates

to go into the credentials of sannyasins? [170] అనాది కాలమునుండి సాధు సన్న్యాసులు మానవకోటికి గావించిన అసంఖ్యాక సేవల స్మరింపవలయునని లోకసభకు హెచ్చరించుచున్నాను. సన్న్యాసిఅర్హతల విచారింప మండల న్యాయాధ్యక్షుల అర్హత లేవియో.

No selfish aim, no tie, no bond,
To me do each and all respond,
Impersonal Lord of foe and friend,
To me doth every object bend.

Swami Rama Tirtha.[171]

స్వార్థ మనలేదు, బంధపాశములు లేవు,
అనుసరించెదరెల్ల వారట్టి నన్ను,
శత్రు మిత్రుల నిర్గుణ చక్రవర్తి
నైన నాముందు దలయొగ్గు నఖిలజగతి.

(శ్రీ అనుభవానందస్వామి)

---

170. B. N. Datar: Indian Express, 25—8—1957.
171. Swami Rama Tirtha: The Complete Works.

ఓం

# శ్రీ శంకరాద్వైత సిద్ధాంతము

## ఉపోద్ఘాతము

---

## ప్రాశస్త్యము

వేదాంత సిద్ధాంత నిరుక్తిరేషా
బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ ।
అఖండ రూపస్థితిరేవ మోక్షో
బ్రహ్మాద్వితీయం శ్రుతయః ప్రమాణం ॥

వివేక చూడామణి. 479

జీవుడును సకలజగత్తునుగూడ బ్రహ్మమే యని వేదాంత సిద్ధాంత నిర్వచనము. మోక్షము అఖండరూపస్థితి మాత్రమే. బ్రహ్మము అద్వితీయము. వీనికి శ్రుతియే పరమ ప్రమాణము అనుటయే శంకర సిద్ధాంత ముఖ్యతాత్పర్యము. చక్కగా శంకరుడు పై శ్లోకమున నొక్కమాటలో జెప్పివేసినటుల పర్యవసానమును దేల్చి తెలిపియున్నాడు. అటులే 'శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః । బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః ॥' కోటిగ్రంథ సముచ్చయముచే

దెలుప బడిన తాత్పర్యమును అర్ధశ్లోకమున వచించెద. బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య, జీవుడు అన్యముగాక బ్రహ్మమేయనియు శ్లోకరాజము బోధించుచున్నది. సూక్ష్మదృష్టి యోచించుచో 'వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవః స్వయం, బ్రహ్మైత జ్జగదాపరాణు సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః। బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సంత్యక్త బాహ్యాః స్ఫుటం, బ్రహ్మీభూయ వసంతి సంతత చిదానందాత్మనైవ ధ్రువం' (వి.చూ. 395) వివరించి ఎక్కువగ జెప్పదగిన దేదిగలదు. జీవుడు స్వయముగ బ్రహ్మమే యగును. అణుజగత్పర్యంతసకలము బ్రహ్మమే. ఆ బ్రహ్మము అద్వితీయమని శ్రుతి. బ్రహ్మమే నేనను గ్రహణమున నుత్తీర్ణ బుద్ధులై బాహ్యస్మృతిని త్యజించి, మహాత్ములు బ్రహ్మీభూతచిత్తులై చిదానందమగ్నత వసించుచున్నారు అనుటయే పరమార్థమై; 'వేదహృదయం పరమార్థ మద్వైతం చ' (స. సు. భా. 2. 20) అద్వైతమే వేదహృదయమును బరమార్థమును అగుటచే, 'అద్వైతం సుఖరూపం దుస్సహదుఃఖం సదాభవేత్ ద్వైతం' (స్వా.ని. 55) అద్వైతము సుఖస్వరూపమైయుండ, ద్వైతము సదా దుస్సహమైన దుఃఖరూపమగుటచే, 'ఆనందరూపమద్వైతం' (స్వా. ని. 56) ఆనంద రూపాద్వైతమునే 'కిం పారిమార్థికం స్యాత్ ? అద్వైతం' (ప్ర. ర. 60) పారమార్థిక మెద్ది? అద్వైతమే అనియు, 'సదిదయం పరమాద్వైతం స్వస్మాదన్యస్య వస్తునోఽభావాత్' (వి. చూ. 228) స్వాత్మేతరవస్తువుయొక్క అభావస్థితియే పరమాద్వైత మను దృఢ జ్ఞానమునకై, 'అద్వైతమేవ సత్యం తస్మిన్ ద్వైతం న సత్య

మిథ్యాస్తు। రజతమివ శుక్తికాయాం మృగతృష్ణాయా మివోదక స్ఫురణం॥' (న్యా. ని. 51) అద్వైతమే సత్యము. వాని యందు, శుక్తియందు రజతము. ఎండమావులో నుదకము స్ఫురించునట్లు, ద్వైతము అధ్యస్తమని యుక్త్యనుభవముల ద్వార గ్రహించి, 'అద్వయత్వమతః సిద్ధం ప్రమాణైరఖిలై రపి। నైవాత్ర సంశయః కార్యః బ్రాహ్మణైః బ్రహ్మవాదిభిః॥' (మ. వా. ద. 125) శ్రుత్యాది సర్వప్రమాణములచేత విచారించినను అద్వైతమే నిశ్చయమైనది. కావున నీ విషయమున నెట్టి సంశయము లేక బ్రహ్మ జిజ్ఞాసువులై యుండవలయునని నిశ్చయించుకొనుటయే ముముక్షువుల కర్తవ్యము. 'ఏతావానుపదేశః ఏత ద్వేదానుశాసనం, ఏషా పరమనిష్ఠా, ఏష పురుషార్థ కర్తవ్యతాంత ఇతి' (బృ. భా. 4.5.15) ఇదియే ఉపదేశము, యిదియే వేదతాత్పర్యము, యిదియే పరమ గమ్యము, యిదియే పరమపురుషార్థము, కర్తవ్యము అనియే శంకరాద్వైత సిద్ధాంత తాత్పర్యము. అందుచే 'యస్మాత్ప్రకార శతేనాపి నిరూప్యమాణే తత్త్వే నేతి నేత్యాత్మైవ నిష్ఠా, నాన్యా ఉపలభ్యతే తర్కేణ వా ఆగమేన వా। తస్మాదేవామృతత్వ సాధనం యదేతన్నేతి నేత్యాత్మపరిజ్ఞానం సర్వ సంన్యాసశ్చ ఇత్యేత మర్థముపసంజిహీర్షన్నాహ' (బృ. భా. 4.5.15) శతధా ఆత్మ ప్రతిపాదితమై యున్నను, 'నేతి నేతి' విధాన ఫలితముగ నిలచు ఆత్మయే పర్యవసానము. వేరేదియు తర్కముచే శ్రుతులచే గానబడదు. అందుచే 'నేతినేతి' విధాన జనితాత్మజ్ఞానము, సర్వసంగపరిత్యాగములే అమృతత్వసిద్ధి కుపాయములని శంకర నిశ్చయము.

అట్లగుటచేతనే The Vedanta of Sankara, in its different aspects, is an attempt to follow out the Upanishadic idea of the unity of all existence to its logical conclusion.[172] శంకరవేదాంతము సర్వ విషయముల నౌపనిషద సర్వైకత్వమును దార్కిక నిర్ణయమున నిశ్చయింప యత్నముగ నున్నదని సతీశచంద్ర ఛటర్జీ నిశ్చయించియున్నాడు. అసలు యథార్థమును యోచించుచో ననుభవరహితస్థితిలో నీ జ్ఞాతృజ్ఞేయ సంబంధ ద్వైతముగాని, అనుభవములో Subject and object coincide in the same,[173] కర్తృకర్మ లేకమై, absorption into our own Self.[173] స్వాత్మమగ్నత నొంది, comes to the great intelligence. 'అహం బ్రహ్మాస్మి.'[173] నేనే బ్రహ్మము నను సర్వోత్కృష్ట జ్ఞానము గలుగునని డాక్టరు పాల్ డేవసేన్ వక్కాణించియున్నాడు. అదియునుగాక సాధకుడేగాక సర్వప్రపంచము నేకత్వానుభవమునకే పర్వెత్తుచున్నదనియు, Every action of our lives, the most material, the grossest, as well as the finest, the highest, the most spiritual, is alike tending towards the one ideal, the finding of Unity.[174] లౌకికము, స్థూలము మరియు నతిసూక్ష్మము, సర్వోన్నతమును సంపూర్ణ పారమార్థికము లయిన సర్వప్రవృత్తులును ఏకత్వానుభూతికై

172. Prof. Satischandra Chatterjee: An Introduction to Indian Philosophy, p 469.

173. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p6.

174. Swami Vivekananda: The Complete Works, Vol 6, p 2.

అయాదర్శప్రాప్తికై యేగుచున్నవని వివేకానందుని ప్రపంచ తత్త్వవివరణము. అనగ మనకు దెలిసినను దెలియకున్నను సర్వప్రపంచము ఆ యద్వైతానుభూతినే కాంక్షించుచున్నది. కావున ఆపరమరహస్యము నెరింగి 'యదేవ విద్యయా శ్రద్ధయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి' (ఛాం. 1.1.10) యక్కృషిని తెలిసికొని శ్రద్ధగా నాచరించెదమో అది బలవత్తరమగునను శ్రుతిన్యాయము ననుసరించి, జిజ్ఞాసువు గ్రహించి యత్నించుచో నచిరకాలమున గమ్యమును జేరగలుగుచున్నాడు. ఇట్లుపదిష్టమైన శంకరాద్వైతసిద్ధాంతము శ్రుతిబద్ధమై, సూత్ర తాత్పర్యానుగుణమై, is one of the most valuable products of the genius of mankind in his researches of the eternal truth.[175] పరమార్థ సత్యాన్వేషణమున నొక అమూల్య మానవప్రజ్ఞాశక్తి ఫలితమని దేవసేన్ ఘంటాపథముగ వక్కాణించియున్నాడు. అద్వైతవాదము సాంఖ్యాది వాదములగల ప్రకృతిపురుష ద్వైతనివారణమునకై, సద్వైకత్వరూప అద్వైతసిద్ధాంత ప్రతిపాదనార్థమై, ప్రస్తుత భౌతిక విజ్ఞానశాస్త్రమువోలె ముందుకు సాగిపోయినదని వివేకానందుడు వచించెను.[176] ఈ శంకరాద్వైత వాదముగాక యితర ప్రాచీనసిద్ధాంతము లెవ్వియును ఆధునిక భారతీయచిత్తవృత్తులకు సమ్మతములు కావనియు సీతానాథతత్త్వభూషణుని వచనము. Sankara's system is unmatched for its metaphysical depth and logical power. Thought

---

175. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p 2.
176. Swami Vivekananda: The Complete Works, Vol 3 p 5.

follows thought naturally untill Advaitism is seen to complete and crown the edifice.[177] పారమార్థిక నిగూఢత్వమున దార్శనిక సామర్థ్యమున శంకరసిద్ధాంతము అసమానము. అద్వైతవాదము సంపూర్ణమై శిఖరము నధిరోహించు వరకు భావపరంపరలు స్వాభావికముగ నిందు పడగు లెత్తునని రాధాకృష్ణ పండితుడు సంస్తుతించెను. ఉపనిషత్తుల లోని పరస్పర వైరుధ్యమును క్రమమొనరించి, వానినుండి యొక సమగ్రసిద్ధాంతమును రూపొందించుట శంకరసిద్ధాంతమే చేయగల్గెను అని కల్నల్ జకోబ్ పండితుడు కొనియాడెను.[178] అందుచే శంకర అద్వైత సిద్ధాంతము సర్వేతర వాదములకంటె నత్యున్నత ప్రఖ్యాతి నార్జించి, తన విశాలబాహుయుగ్మమున సర్వేతర సిద్ధాంతములగూడ నన్వయించుకొని, అదృశ్యమనుష్ఠాన యోగ్యమార్గమై, యొప్పారియున్నదనుటకు బూహ్యోక్త చందమున నసంఖ్యాక ప్రాక్ప్రతీచీపండిత ప్రకాండుల ప్రస్తుతి కోటియే నిదర్శనము. ఈ విషయము అద్వైత సిద్ధాంత సమీక్షలో బూర్వము శంకర పూర్వాద్వైత భాగమున గాంచియున్నాము. అది సుప్రతిష్ఠితము సుస్థిరము అజేయము.

---

## మాయ - అర్థ భేదములు

అయినను సంపూర్ణ విరుద్ధపదముల 'నేతినేత్యాత్మ' 'నాన్యత్కించన మిషత్' 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ నేహ

177. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2 p 657.
178. Col. Jacob: MSS. of S. M.

'నానా స్తి కించన' (కఠ. 4. 11) మొదలగు శ్రుతుల నుపనిషత్తులు బ్రహ్మ నిర్వచనము గావించుటయు, నందు బ్రత్యక్షముగ అనుకూల పదములు గోచరింపకుండుటయు నట్టి బ్రహ్మేతరముగ స్థూల సూక్ష్మకారణ రూపముగ నీ జీవ జగత్తులు ముందు దోచుటయు, నట్టిచో నీజీవ జగత్ బ్రహ్మ సంబంధమెట్లు అను విచారణమున నొక అగాధ సమస్య ఏర్పడి, అసలు ముముక్షు తత్త్వజ్ఞులలో ననాదికాలముననే మీమాంస నుత్పన్నమై, ఈ జగత్తునకు కారణమెద్ది? మొదలగు ప్రశ్నలతోడనే గురుశిష్య సంవాదములు ప్రారంభింప బడుచు నావిషయములు చర్చింపబడుచు నుండెను. ఆ వివరముల జేర్చి ఒక సిద్ధాంతముగ నొనర్చి సర్వమును బ్రహ్మమున నన్వయించి పారమార్థికముగ బ్రహ్మ మద్వితీయమై జీవజగత్తులు అందు భ్రాంతి దృశ్యములై దోచుచున్నవని శంకరుడు వివరించెను. కాని మానవ మేధాశక్తికే 'యన్మనసా న మనుతే' (కేన. 1. 5) మనస్సుచే మంతవ్యముగాని బ్రహ్మమును యోచించి, 'యద్వాచా నభ్యుదితం' (కేన. 1. 4) వాక్కుచే వచింపబడని దానిని వచించుచు, అస్పర్శమైన దానిని, అవ్యపదేశ్యమైన దానిని అవ్యవహార్యమైన దానిని మానవభావములోనికి గొన యత్నించుచో, When words are used, even by Sankara, acute minds can always find a loophole for attack.[179] పదములు శంకరుచేనైన నుపయోగింపబడ, సూక్ష్మచిత్తుల కందు లోపములు సర్వదా గోచరించుచునే యుండును. బ్రహ్మేతర పదా

179. Douglas Grant Duff Ainslie : The Science of Religion of Swami Yogananda.

ర్థములేక 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' (ఛాం. 6. 2. 1) ప్రథమమున సత్ మాత్రమే యుండుటచే గారణాంతరముచే గాలాంతరమున నుద్భూతమయిన జీవ జగత్తులు బ్రహ్మేతరము నుండి ఆవిర్భవింప నవకాశము శూన్యము గాన వానికి నిమిత్త కారణమేగాక నుపాదానముగూడ బ్రహ్మమే అనియు, నది ప్రత్యక్షముగగాక నపరోక్షముగ నగుననియు, ననగా బ్రహ్మ మునకు గర్తృత్వము అభావము, అటులే వికారత్వము శూన్యము అనియు గాన బ్రహ్మభిన్నమైన మాయాశక్తి ద్వార సృష్టి యంతయు జరుగుచున్నదనియు శంకరు డన్వయించెను. ఇందు బూర్వ జీవజగత్తులకు బ్రహ్మము నకు గల సంబంధము గుదింపబడి, మాయా బ్రహ్మ సంబంధములోనికి మాత్రము పరిణమించి, సమస్త అటులే నిలచియున్నట్లు బాహ్యదృష్టికి దోచును. అచట బ్రహ్మము పరిణమించి జగత్తుగ మారుటలేదు. అటులే జగత్తు బ్రహ్మ రూపమునుగూడ గానేరదు. అయినచో వీని సంబంధమేమి? అదియే మాయాసంబంధము! సర్వేతర సిద్ధాంతములు నిర్వి కారమునకు వికారత్వమును, అఖండత్వమున ఖండత్వమును, అసంగత్వమునకు సంగత్వమును ఆపాదించి, బ్రహ్మపదార్థ నిర్వచనమున ననేక క్లిష్టత్వముల గల్పించియున్నవి గాని, The latter by his Maya Vada is able to preserve more completely than any other interpretation the changelessness and stainlessness of Brahman.[180] శంకరుడు తన మాయావాదముచేత బ్రహ్మముయొక్క నిర్వి

180. Sir John Woodroffe: Shakti and Shakta, p 27.

కారత్వమును, నిర్మలత్వమును నితరవాదములకంటె సమగ్రముగ గాపాడెనని జాన్ ప్యాడ్రాఫ్ కొనియాడియున్నారు. ముందు గ్రంథమున మనము గాంచబోవురీతి సందర్భానుసారముగ నున్న శంకరు మాయానిర్వచనములు అనుచరులతోగూడ విభిన్నత్వమును పరసిద్ధాంతులలో విమర్శావకాశమును గలుగజేసి యున్నవి. ప్రపంచము బ్రహ్మాభిన్నమై బ్రహ్మజనితముగాన బ్రహ్మమువలె సత్యమని కొందరును; జీవప్రకృతులు రెండును బ్రహ్మభిన్నసత్త లేనివనియు, నందుచే బ్రహ్మేతరస్థితివానికి అభావముకాగ, బ్రహ్మజ్ఞానప్రాప్తిచే నదృశ్యమగుచు, నిత్యసత్తాకము కావనియు, నందుచే నవి బ్రహ్మమురీతి త్రికాలాబాధ్యము గాక కద్యంత రహితములై దోచి, విచారణఫలితమున మధ్యశూన్యత్వముగూడ గలిగి, రజ్జువుపై దోచు సర్పచందము భ్రాంతిరూపమనియు గొందరివాదము. అదియునుగాక ప్రకృతి జీవులు వంధ్యాపుత్రుని చందము అసలు అభావములే యని గొందరును, ఈ అద్వైతమును వివరించుచు వారి వారి సిద్ధాంతముల బ్రబోధించియున్నారు. అందు ముఖ్యముగ బ్రథమ వాదము ఆరంభణ పరిణామవాదముల కన్వయింపనగునుగాన, శంకరాద్వైతవాదమున ద్వితీయతృతీయములే ప్రబలమై రుధ్యముల గలిగి, సిద్ధాంతుల రెండు పక్షముల గావించియున్నవి. అందు 'దృష్టదార్ష్టాంతతుల్యత్వం న తు సర్వాత్మనా క్వచిత్' (ఉ. సా. 2.18.86) లోకములో నుపమానోపమేయములకు గొన్ని ధర్మముల ననుసరించి సామ్య ముండునేకాని అఖిల ధర్మముల ననువర్తింపదు అని శంకరుడు స్పష్టపరచినట్లు శంకరుడు గ్రంథముల నుపయోగించిన వివిధ దృష్టాంతముల నే

విషయమున నా దృష్టాంతము గైకొనబడియున్నదో దాని గాక నాదృష్టాంతమును సంపూర్ణముగ నుపయోగించుటచే గొందరు దోషమార్గమును ద్రొక్క నవకాశమేర్పడినది. కాని సూక్ష్మదృష్టిజూచుచో శంకరు డేదృష్టాంతము నుపయోగించి నను అందుగల భ్రాంతిస్వరూప వివరణమున ననగ అధ్యస్త విషయ ప్రతిపాదనమున నూత్రమే వాని నన్వయించుకొనుచు, నేక తాత్పర్యమునసే ఉపయోగించి యుండుట ముందు మనము గాంచగలము. మాయ అనునది బ్రహ్మముయొక్క శక్తియై, నిత్యమై, బ్రహ్మాంతర్గమై, అవ్యాకృతస్థితి బ్రథమతః యుండి, కారణాంతరమున జీవ ప్రకృతులకు గారణమగుచున్న దని మాయా సత్యత్వ వాదుల అభిప్రాయము. అట్లు గాక మాయకు ఏ నాడును సత్యత్వము లేదనియు, అది భ్రాంతి దృశ్యమని మాయా అసత్యావాదుల తీర్మానము. ఈ రెండింటిని యిరుపక్షములు సమర్థించును. అందు నాధునికులు ప్రథమ పక్షమును, ద్వితీయమును సాంప్రదాయిక భావముల గల వారు సమర్థించెదరు.

---

## మాయ - సత్యత్వము

ఉపనిషత్తులు మాయావాదమును సమర్థింప నేర వనియు, Is there any thing in the early Upanishads to show that the authors believed in the objective

world being an illusion? Not at all దృశ్య ప్రపంచము భ్రాంతియని ప్రథమ ఉపనిషత్కర్తలు విశ్వసించినట్లు ప్రమాణము గలదా? లేనే లేదని hopkins హాప్కిన్స్ తెలిపియున్నాడనియు, శంకరుడైనను కార్య రూపమైన ప్రపంచమును భ్రాంతి తుల్యముగ వివరించుచున్నపుడు 'కారణ వ్యతిరేకేణ' అనియు 'బ్రహ్మవ్యతిరేకేణ' (బ్ర. సూ. భా. 2. 12. కి, గీ. భా 1. 6) అని ఉపయోగించి యుండుటచే No where does he say that our life is literally a dream and our knowledge a phantasm.[181] నని చెప్పుటను మన జీవితములు స్వప్నములనిగాని, భ్రాంతములనిగాని స్పష్టముగ దెలుపలేదనియు రాధాకృష్ణపండితుని వాదము. అందుచే Instead of regarding the world as something for the rise of which we cannot offer an adequate explanation, we, at the same time, following the lead of some later Advaitins, dismis it as a cosmic illusion, which has somehow arisen to afflict us, deluded mortals of an evil dream, thus the system becomes unsatisfactory. But such a veiw is hardly fair to Sankara.[182] సరియైన సమాధానమును మన మొసంగజాలని విధముగ అనిర్వచనీయముగ జనించిన దీ ప్రపంచమని భావింపక, గాలాంతర అద్వైతుల నాయకత్వము ననుసరించి, దుస్స్వప్నముచే

---

181. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 1, p198.
182. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol2, p657.

భ్రాంతమానవులైన మనల బాధింప నెట్టులో జనించిన భౌతిక భ్రాంతిగ. దానిని ద్రోసిపుచ్చుటచే నీ సిద్ధాంతము సంతృప్తి కరము గాజాలదు. ఈవాదము శంకరున కన్వయించుటయు నన్యాయము అనియు నాతనివాదము. Sankara's followers undo the master and bring his doctrine perilously near atheistic materialism$_{183}$ శంకరానుచరులు గురువు నధిగమించి, అతని సిద్ధాంతమును నాస్తిక ప్రకృతి వాదమునకు బ్రమాదకరముగ గొంపోయిరనియు నతడు వక్కాణించి యున్నాడు.

శంకరు భావములు సంపూర్తిగా బ్రహ్మ సూత్రార్థ మునకు అన్వయింప నవకాశములేదని తెలిపి, The full elaboration of the doctrine of Maya, or cosmic illusion is however, due to him$_{184}$ మాయా వాదము యొక్క సంపూర్ణ వివరణము శంకరునిదే అని మాక్డోనెల్ అభిప్రాయము. బాదరాయణుడు మాయా వాది కాదనియు, నతని పూర్తిభావముల దెలియ సూత్రములకు బూర్వముండు వ్యాఖ్యానములు ప్రస్తుతము లేక పోవుటచే నిర్ణయింపజాలకున్నామనియు కీత్తు పండితుడుగూడ తలంచెను.$_{185}$ ప్రామాణికమైన ఉపనిషత్తులలోను భగవద్గీత లోను మాయ అనగా నీశ్వరశక్తిగనే తెలుపబడియున్నదనియు, గాని దాని భ్రాంతిఅనియు, ప్రకృతి అనియు, నద్వైతసిద్ధాంతు

183. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 1, p720.
184. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature p 402.
185. Dr. A.B. Keith: A History of Sanskrit Literature, p 475.

అన్వయించిరని కోల్బ్రూక్ పాశ్చాత్యవిద్వాంసులలో ప్రథమతః గనుగొనినట్లును, శంకరుడు పూర్వాచార్యుల ననుసరింపక వారి ఖండించుటకే భాష్యములలో వారి ప్రస్తావించి, తాను స్వతంత్ర సిద్ధాంతమును రూపొందించెనని శ్రీనివాస అయ్యంగారు భాషించెను.[186] It does not say that this universe does not exist; it exists, but at the same time, it is not what we take it for.[187] ప్రపంచము లేదని అద్వైతము చెప్పుట లేదు. అది గలదు. కాని మనభావముల ననుసరించి మాత్రము లేదు అని వాకొని, Some other men, who, by mistake, carried Sankara's notion to an extreme, have adopted the sense...in which the universe is a phantasm just as the son of a barren woman or like the horns of a hare[188] కాని కొందరు శంకరు భావమును అతిగనొనర్చి, శశవిషాణమువలె, వంధ్యాపుత్రునివలె, జగము ఒక భ్రమ అను అభిప్రాయము ననుసరించిరి అని వివేకానందుడు వచించెను. ప్రపంచమునకు స్వతంత్ర ప్రతిపత్తి లేదనుట యథార్థమైయున్నను, జగత్తు మిథ్య, జగత్తు వ్యావహారికమై కొంత అస్తిత్వముగలిగి యుండును అను ద్వివిధ భావములలో I believe the latter to be more natural me-

---

186. P. T. Srinivasa Iyangar: The Outlines of Indian Philosophy, p 90.

187. Swami Vivekananda : The Complete Works, Vol 1 p 417.

188. Swami Vivekananda: The Complete Works, Vol 5, p 135

aning fully borne out by the texts[189] గ్రంథముల యుద్దేశ్యమును సంపూర్ణముగ దెలుపు రెండవ తాత్పర్యమే అధికతర స్వాభావికార్థముగ నావిశ్వాసమని చంద్రశేఖరయ్య అభిప్రాయము. శంకరుడు ప్రపంచమును కేవల భ్రాంతిగ గాని, చిత్తవిభ్రమమని గాని పరిగణింపలేదనియు, మానవ వ్యవహార కాలమున నానాత్వమును నిరాకరింపలేదనియు దెలిపి, పారమార్థికదృష్టికది అభావమని శంకరుని అభిప్రాయముగ వివరించి, వ్యావహారికముగ నది గలదను విషయము నైట్టి భౌతిక శాస్త్రానుగుణ్యముగ గలదని డాక్టర్ ఎస్. ఎన్. ఎల్. శ్రీవత్సవ వచించెను.[190] అనగ ప్రపంచము కేవలము మనో కల్పిత దృశ్యముగాక, సత్తామాత్రము గలది యని శంకర భావముగ వీరందరి అభిప్రాయము.

ఈ అభిప్రాయమును వివరించుచు, మాయ ప్రపంచబీజమనియు, నది నామరూపాత్మక మగుటకు బూర్వము అవికృత రూపమున నుండెననియు, ఈ అవ్యాకృతరూపమే మాయా నిర్వచన మనియు కోకిలేశ్వరశాస్త్రి వాదము. ఈ విషయమున నతడు శంకరగ్రంథావళిని జొచ్చి, పరిశీలించి, మాయ బ్రహ్మాశ్రయమున బరమేశ్వరాధీనమై ఈశ్వరశక్తియై యుండుననియు, నందుచే నది అసత్ కానేరదు గాన భావ రూపమై బ్రహ్మమువలె నదియు నిర్విశేషమయి బూర్వ ముండుటచే నాతనితో విలీనత్వము నొంది, తాదాత్మ్యమున

189. B. Chandrasekharaiah : The Meaning of Maya, V. K. 1927.

190. Dr. S. N. L. Shrivatsava : Prabuddha Bharata, 1957, p 189.

బ్రహ్మాభిన్నత్వమున నుండుననియు నతడు తలంచెను. Although inseparably blended, Brahma still remains untouched, unaffected by Maya.[191] తాదాత్మ్య భావముననున్నను మాయచే బ్రహ్మము అస్పృశ్యముగ నుండు ననియు, it is Brahman about to manifest itself.[191] అది కార్యోన్ముఖ బ్రహ్మము అనగ వ్యాచికీర్షితావస్థగల బ్రహ్మమని It is Brahman only looked upon as the material cause of the world.[191] సృష్టికి ఉపాదాన కారణముగ భావింపబడు బ్రహ్మమే అనియు నతని సిద్ధాంతము. It is not possible, therefore, to separate the nama-rupas from Brahma which is their sustaining ground, without which they cannot stand even for a minute. This is Sankara's Paramarthika view.[192] బ్రహ్మము నధిష్ఠానముగ గలిగి, దాని వీడి యొకక్షణమైనను నిలువజాలని నామరూపముల బ్రహ్మమునుండి భిన్నము జేయుటదుర్లభము. ఇదియే శంకర పారమార్థిక దృక్పథము. అందుచే To declare the world of namarupa as unreal is to make it separated from Brahma.[192] నామరూపప్రపంచమును అయథార్థమనుట దాని బ్రహ్మము నుండి వేరుపరుచుటయే యగును. అది దుర్లభము. అందుచే బ్రహ్మము కూటస్థనిత్యముగను, మాయ పరిణామ నిత్యము

191. Prof. Kokileswara Sastry: A Realistic Interpretation of Sankara Vedanta, p 34, 35, 36.

192. Prof. Kokileswara Sastry: A Realistic Interpretation of Sankara Vedanta, p 43.

గను శంకరుడు ప్రతిపాదించియున్నాడు. కాన Ultimately, this Prana (Maya) is, therefore, nothing but Brahma itself at the source and is nothing but Brahma in the end.[193] పర్యవసానమున నీ మాయ ప్రారంభాంతముల గూడ బ్రహ్మమే యని కోకిలేశ్వర పండితుని నిర్ణయము.

---

## మాయ – అసత్యత్వము

కోకిలేశ్వరశాస్త్రి భావముల సమీక్షించుచు, మాయ కేవలము భ్రాంతిగాక వ్యక్తావ్యక్తరూపమున బ్రహ్మాధీనత్వమున నిత్యపదార్థమే అను భావము, దాని బ్రహ్మేతరముగ భావించుటయే భ్రాంతి గాన, జ్ఞాని దాని బ్రహ్మాభిన్నత్వమున గాంచు నను అభిప్రాయము వ్యవహారమున నున్న వారి కుత్సాహము జనింప జేయునని సంతసమును బ్రకటించి, the traditional interpretation of it also has a substantial basis to stand upon[194] సాంప్రదాయిక అభిప్రాయమునకు గూడ ముఖ్యాధారములు గలవని వేదాంతకేసరి సంపాదకుడు తెలిపి యున్నాడు. అనుభవజ్ఞానమును సామాన్య తర్కమును అనగా యుక్తి నుపయోగించి యోచించుచో Human

---

193. Prof. Kokileswara Sastry : A Realistic Interpretation of Sankara Vedanta, p 49.

194. The Editor : Vedanta Kesari, A. R. I. Sankara Vedanta of Kokileswara Sastry.

world is true for a human measurement, but the human measurement may not be true. It changes in a dream or when a man is drunk.[195] మానవ పరిమాణమునకు మానవ ప్రపంచము యథార్థముగనే యుండును. కాని మానవ పరిమాణము సత్యము కాకపోవచ్చును. అది స్వప్నమునను త్రాగినవానికిని మారుచున్నది, అనగా The world has a relative existence; it is true for the time being, but disappears when true knowledge dawns. It is not real for all times, in other words, it is not real from the absolute standpoint.[196] వ్యావహారికముగ బ్రపంచము ప్రస్తుతమునకు సత్యమే కాని జ్ఞానోదయమున నది అదృశ్యమగుచున్నది. అది సర్వదా సత్యముగ లేదు. అనగా పారమార్థికముగ నది అయథార్థము అట్లగుటచే the universe is ultimately false though it has an apparent reality at present, depending upon one sort of consciousness, in the same way as the idea of silver superimposed on a shell.[197] శుక్తముపై నారోపింపబడిన రజతముచందము ఒక చిత్త ప్రవృత్తి ననుసరించి, ప్రస్తుతమునకు దానికి సత్యత్వము గలిగినట్లున్నను పర్యవసానమున జగత్తు మిథ్య అగుచున్నది. జగత్తుయొక్క మిథ్యాత్వ ప్రతిపాదనార్థము అనేక ఉత్తమ

---

195. Prof. Jagadish Sahai: Prabuddha Bharata, 1954, p332.
196. Swami Veereswarananda: Brahma Sutras, p 4.
197. Swami Vivekananda: The Complete Works, Vol 5 p 134.

దృష్టాంతములున్నను the best of them is perhaps when Sankara compares our life with a long dream.[198] స్వప్నముతో మన జీవితముల బోల్చిన శంకర దృష్టాంతము సర్వోత్తమము. స్వప్నములోనున్న వానికి అది స్వప్నముగ దోచక, సత్యముగనే దోచి, జాగ్రదవస్థకు వచ్చినతోడనే నది భ్రాంతిగ దృఢపడును. అందుచే The life a dream! this has been the thought of many a wise man from Pindar and Sophacles to Shakespere and Calderon de la Barca, but nobody has better explained this idea, than Shankara.[198] జీవిత మొక స్వప్నము! పిండార్, సోఫకల్స్‌నుండి షేక్స్పియర్, కాల్డరోన్ డీ లా బార్కా వరకుగల అనేకజ్ఞానులకు యీ భావముగలదు, కాని శంకరునకంటె నెవరును దీని జక్కగ వివరించి యుండ లేదని దేవసేనాచార్యుడు స్పష్టపరచెను. Does Sankara say anywhere that waking experiences are real from the standpoint of the Ultimate Truth?[199] పారమార్థిక దృష్ట్యా జాగ్రదనుభవములు యథార్థములని శంకరు డెందేని వచించెనా? అని నిఖిలానందుని సూటిప్రశ్న.

అందుచే ప్రస్తుత మనుభవనీయ స్థూల ప్రపంచము పారమార్థిక సత్యమున లేని దగుచున్నది. అట్లగుచో నిది ఎందుండి జనితము? నామరూపాత్మక సృష్టి మాయనుండి జన్యముగ ముందే అంగీకారము. అయిన నీమాయ ఎచ్చటిది?

198. Prof. Paul Deussen : The Philosophy of Vedanta, p 9.
199. Swami Nikhilananda : Mandukyopanishad, p xxxiii.

బ్రహ్మమునకు మాయకు గల సంబంధ మెట్టిది? అను అతి క్లిష్టసమస్య పుట్టుచుండును. బ్రహ్మేతరమున నేవస్తువు అభావము గాన నీమాయ బ్రహ్మ సంబంధమే అయి యుండవలెను. పూర్వ ప్రతిపాదితమువలె నది బ్రహ్మముయొక్క శక్తియా? బ్రహ్మము నిష్క్రియుడు గదా! అతడు సృజించుటకు అతని శక్తి సృజించుటకు తారతమ్య ముండునా? ఉండనేరదు గాన అతని నిష్క్రియత్వమునకు దోషము వాటిల్లును. కాన నది బ్రహ్మముపై నాధారపడుచు, బ్రహ్మ భిన్నముగాక, బ్రహ్మసాన్నిధ్య బలమున బ్రహ్మ తత్త్వమున కెట్టి లోపము గలుగకుండు విధాన సృజించుచున్న ఒక అనిర్వచనీయతత్త్వము. బ్రహ్మాభిన్నమును కాదు. అది బ్రహ్మభిన్నముకూడ కాదు. అఖండము ఖండమెట్లయినది అను ప్రశ్న అసంభవము, పరస్పర విరుద్ధము. ఆ ప్రశ్నమునకు సమాధానమే యున్నచో, బ్రహ్మము మన మనస్సునకు అధీనమైన ట్లగును. అంత బ్రహ్మము అవధిక మగుచున్నది. అందుచే బ్రహ్మము నెరుంగుట పరస్పర విరుద్ధము. కాన నీ ప్రశ్నకు సమాధాన మభావమని వివేకానందుడును తెలిపియున్నాడు.[200] ఈ ప్రశ్నము భరత వర్షమున గ్రీసుదేశమున తత్త్వవేత్తల నెదుర్కొన్నది. కాని వారి సమాధానములు అసమగ్రములు. ఆ ప్రశ్నయే అసందర్భము. The fact is that we are in ignorance, sin and misery and that we know the way out of them but the question of a cause for them is senseless[201] మనము

200. Swami Vivekananda : The Complete Works, Vol 2, p 90.
201. Prof. Paul Deussen : The Philosophy of Vedanta, p 14.

అజ్ఞాన దుఃఖ కల్మషములలో మునిగి యుండుట యథార్థము. వానినుండి విడివడు మార్గము మన కవగతముగాని, వాని కారణ మూరయు ప్రశ్న అసంగతమని దేవసేనాచార్యుని నిశ్చయము Maya or Ignorance is not a real entity. We can neither say that it exists nor that it does not exist. It is a mystery which is beyond our understan. ing; it is unspeakable అనిర్వచనీయ. 202 మాయ యథార్థ తత్త్వము గాదు. ఉన్నదని గాని లేదనిగాని నిర్ణ యింప నలవిగానిది. మన మనస్సున కతీతమైన నిగూఢ తంత్రము. అది అనిర్వచనీయము అని వీరేశ్వరానందునిదీర్మా నము. The question is meaningless in Sankara's metaphysics. 203 శంకర తత్త్వశాస్త్రమున నీ మాయా ప్రశ్నము అర్థరహిత మని రాధాకృష్ణ పండితుని వచనము. is a mystery; it is elusive and defies explanation; hence it is we call it illusory 204 అది నిగూఢము, అందనిది అనిర్వాచ్యము. అందుచే దాని మనము మాయఅను చున్నామని సూర్యనారాయణశాస్త్రి తెలుపును. అట్లు మాయ యథార్థము కాకుండుటచే, నది యథార్థమైన బ్రహ్మముతో నెట్టి సంబంధమును గలిగయుండనేరదు. సత్యా సత్యముల కెట్లు స్నేహమేర్పడును అని వీరేశ్వరానందుని ప్రశ్న. 205 ఆవిధముగ ప్రపంచ మిథ్యాత్వమును బ్రతిపాదించు శంకర

202. Swami Veereswarananda: Brahma Sutras, p 4,
203. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2, p576.
204. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 1
205. Swami Veereswarananda: Brahma Sutras, p 4.

సిద్ధాంతము మాయావాదమనియు, అనిర్వచనీయ వాదమనియు, వివర్తవాదమనియు పేర్కొనబడినున్నది. ఇతర సిద్ధాంతములు, పరిణామము సృష్టి మొదలగువాని విశ్వసింప, శంకరసిద్ధాంతమునకు మాత్రము does not find any reason for believing in the reality of the process of becoming.[206] పరిణామవిధానమును విశ్వసింప నవసరము గానుపింపలేదు. అందుచే Maya is only our explanation of creation given by those who hold creation to be a fact.[207] సృష్టి గలదను వారి సృష్టివివరణమే మాయ అని నిఖిలానందులు వాక్రానెను. అనగా శంకరులు శుద్ధాద్వైత పరముగా బ్రహ్మప్రతిపాదనము గావించి, సృష్టి నిరాస మొనరించి, సృష్టిని విశ్వసించు వారికొరకై మాయాప్రతిపాదనము గావించి, దానిచే సృష్టిక్రమమును వివరించెనని తాత్పర్యము. ఈ విధానమే అద్వైతశాస్త్రవిధానముగా శంకర పూర్వాద్వైత భాగమున మనము గాంచియున్నారము.

ఈ విషయమును విచారించి, L.D. Barnett ఎల్. డి. బార్నెట్ పండితుడు శంకరుని ఆచార్యబోధము సులభసంపాదితముగాదనియు, నాటినుండి నేటివరకు నతని అసాధారణ మహత్తరప్రభావము భారతీయ తత్త్వశాస్త్రముపై గలదని వాక్రాని And his system strongly enough, has been a balwork of positive religion. For it takes up two standpoints. One is that absolute reality,

206. Swami Nikhilananda : Mandukyopanishad, p xxx.
207. Swami Nikhilananda : Mandukyopanishad, p xxii.

where there exists nothing but the Universal Subject in which the self and Brahman are one; the other is that of a practical experience in which the emperic Soul is confronted by a world and and a God[208] అతని సిద్ధాంతము శక్తివంతమై అనుకూలమతమునకూడ నొక అద్భుత నిర్మాణము. ఎందుచేతనన నది ద్వివిధ దృక్పథముల స్వీకరించియున్నది. జీవబ్రహ్మము లేకమై నభిన్నముగ బ్రహ్మాభిన్న వస్తు వభావమైన పారమార్థిక సత్యము ఒకటి; వ్యావహారిక జీవుడు ప్రపంచ ఈశ్వరులచే నెదుర్కొనబడుచున్న స్థూలానుభవముగలది రెండవది అని తెలిపియున్నాడు. Philosophically, Sankara is remarkably ingenius in his key to the Upanishads, the finding of a higher and a lower knowledge, which similarly allows him, to conform to the whole apparatus of Hindu belief on the lower plane, while on the higher, he finds no true reality in anything. [209] తాత్వికముగ, ఉత్తమాధమ జానములనెడు నుపనిషత్ రహస్యముల శంకరుడు గాంచుట అద్భుత ప్రజ్ఞానిదర్శనము. దానిచే నటుల మందస్థితినున్న సర్వహైందవ యోచనావిధానమునకు నతడనుగుణమైయుండి, ఉత్తమస్థితిలో వీనికన్నింటి కెట్టి సత్యత్వమును నాతడు విశ్వసింపలేదని కీత్తు పండితుడుగూడ ప్రశంసించెను. అటులే సూర్యనారా

---

208. Dr. L. D. Barnett: The Heart of India, p 38.
209. Dr. A.B. Keith: A History of Sanskrit Literature, p 477.

యణ శాస్త్రి శంకరుని బ్రహ్మసూత్రములకు (1.1.3) సూత్ర భాష్యమును పరిశీలించి, అందు ద్వివిధ వ్యాఖ్యానములకు అవకాశ మేర్పడినదనియు నటులే శంకరుడు కొన్నిసూత్రములకు నిర్గుణపరముగను, గొన్నింటికి సగుణపరముగ వ్యాఖ్యానించియున్నాడనియు, నందుచే his view would appear to have been that the whole body of Vedanta doctrine was susceptible of this dual interpretation[210] వేదాంత సిద్ధాంతమునకే యీద్వివిధార్థ విధానము గలదని అతని భావముగ దోచుననీ, ఆయభిప్రాయమును నీసూత్రమున శంకరుడు వ్యక్తమొనరించెననియు వాకొనెను.

శంకర సిద్ధాంతమున బ్రత్యేక కృషిగావించిన దేవసేనాచార్యుని అభిప్రాయమున తత్త్వశాస్త్రమున కవసరమైన విధానముగ నుపనిషత్తులలోని పరస్పరవిరుద్ధవాక్యముల నవలోడన మొనరించి, క్రోడీకరించి, He constructs out of the materials of the Upanishads two systems;(called by him Nirguna Vidya, some times paramarthika avastha) containing the metaphysical truth for the few ones, rare in all times and countries, who are able to understand it; and another exoteric, Theological (Saguna Vidya, Vyavaharika avastha) for the general public, who want images, not abstract truth, worship, not meditation.[211] శంకరు డుపనిషద్వస్తువునుండి, అతనిచే

210. Prof. S. S. Suryanarayana Sastry: Sankaracharya, p 59.
211. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p 3.

వచింపబడిన నిర్గుణవిద్య అనగా పారమార్థికావస్థయను తాత్త్వికసత్యము, సర్వకాల సర్వదేశముల జూని గ్రహించు వారు కొలదిగమాత్ర ముండునటువంటిదాని నొకటిగను; ధ్యానముగాక నారాధనముగలిగి, సుసూక్ష్మ సత్త్వముగాక విగ్రహములగోరు సర్వసామాన్యులకొరకు సగుణవిద్య అనగా వ్యావహారికావస్థయను ఈశ్వరయుక్త స్థూలముగనుండు తత్త్వ ములుగల ద్వివిధమార్గముల రూపొందించెనని దేవసేనుని వచనము. What is the cause of this concealment of my godly nature? The upadhis, answers Shankara, and with this answer we pass from the esoteric to the exoteric psychology. [212] నాదైవత్వమున కాచ్ఛాదనమునకు గారణమెద్ది? ఉపాధులు అని శంకర ప్రత్యుత్తరము. ఈ సమాధానముతో మనము పారమార్థికమునుండి వ్యావహారికమున కరుదెంచెదము అని దేవసేనాభిప్రాయము.

ఈ పద్ధతిని శంకర సిద్ధాంత ముత్తమాధమాధికారుల కుపయుక్తమై ప్రాథమికుల ప్రథమమును స్వీకరించి, సృష్టి స్థితి లయముల విశ్వసించి, అందుగల సర్వానుభవముల సత్యముగా నమ్ముచు, అట్టి అనుభవ యోగ్యమైన సృష్టిని బరమేశ్వరుడను వాడొకడు కల్పించెనను తాత్పర్యమున నతని అనుగ్రహ ప్రాప్తికై అర్చించి, సంసారమునుండి తరింప యత్నించుట కవకాశ మీయబడి యున్నది. అందుచే Eswara in Sankaha's philosophy is not a self-evident axiom,

---

212. Prof. Paul Deussen: The Philosophy of Vedanta, p 3.

is not a logical truth, but an empirical postulate which is practically useful.[213] శంకర సిద్ధాంతమున నీశ్వరుడు స్వప్రామాణిక తత్త్వముగాక తర్కయుక్త సత్యమును గాక, కార్యసాధనోపయుక్తమైన వ్యావహారిక కల్పనము మాత్రమే అని రాధాకృష్ణ పండితుని అభిప్రాయము. అయితే వ్యావహారికమునందుండు జీవునకు వ్యావహారిక ఈశ్వరుడైతే యుక్తాయుక్తముగాన సృష్టివానిని కల్పించి, వానినుండి యుక్తిగతనొందు వానినే సాధనోపాయములుగ నెలకొల్పియుండుటచే The system of monism as propounded by Sankara is both philosophy and religion.[214] శంకరప్రోక్తమైన అద్వైతసిద్ధాంతము తత్త్వసిద్ధాంతము ఉపాసనా విధానమునై యున్నది. ఇతరసిద్ధాంతుల వలె కార్యరూప ప్రపంచ జీవులనుండి విచారణము ప్రారంభించక, శంకరుడు, కారణాత్మక ఉపనిషత్ప్రతిపాదిత బ్రహ్మము నుండి మాయాంతముపక్రమించి, కారణబ్రహ్మమైన నీశ్వరుని వివరించి, జీవజగత్తుల విశదపరచి యుండుటచే నిందు అసాధారణ తత్త్వదృష్టియు, సిద్ధాంతము ఆవిర్భవించి యున్నవి. అందులకు రాధాకృష్ణ పండితుడు In the method of procedure, Sankara shows great originality and freshness.[215] విచారణావిధానమున శంకరుడు గొప్పసహజప్రజ్ఞను వినూత్నత్వమును ప్రదర్శించెనని స్తుతించెను. ఒక మతావలంబకుడు

---

213. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2, p545.
214. The Editor: Vedanta Kesari, 1927.
215. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2, p534.

తాత్త్వికవిధానము నవలంబించి, నిష్పాక్షికబుద్ధి శాస్త్ర మీమాంస గావించుట దుర్లభమనియు, తత్త్వవిదుడు మాత్రమే అట్టి మార్గము ననుసరించి, పరమార్థముల గ్రహింప గలడనియు రాధాకృష్ణపండితుని తాత్పర్యము. శంకరుడా విధానమున కుపక్రమించుటచే అద్భుత తత్త్వశాస్త్రసిద్ధాంత మును, బరమేశ్వరాస్తిక్య భావముతో గూడిన ఉపాసనా విధానముల బ్రసాదించి యున్నాడు.

అందుచేత శంకరు డెచ్చోటను ఉపాసనాదుల ఖండింపక నవి వ్యావహారికముగ నవసరములని గ్రహించుటచే 'షణ్మతాచార్య' అను ప్రఖ్యాతి నార్జించియుండెను. తత్త్వ సిద్ధాంతముననే విభిన్నత్వముగాని, ఉపాసనలల్లో సామాన్యత్వమే గోచరముగాన శంకరుడు సర్వదేవతలను స్తుతించి యున్నాడు. In Sankara we find one of the greatest expounders of the comprehensive and tolerent character of the Hindu religion.[216] సర్వసమన్వయ రూప హిందూధర్మమునకు శంకరు డొక గొప్ప నిర్మాతగ మనము గాంచగలము. కావున నా విశాలహృదయమున ఈశ్వర శక్త్యాదులే గాక, బ్రహ్మ విష్ణు మహేశ్వరులేగాక, రామకృష్ణాది అవతార పురుషులకుగూడ ఆరాధ్యపీఠమున స్థానముగలిగి, ఆయామార్గుల నుపాసించు ముముక్షువులకును అవకాశ మేర్పడియుండుట గమనార్హము. అట్టి విశాలత్వము అసమానము, అద్వితీయము, అద్భుతము.

---

216. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol 2 p 652.

## ప్రచ్ఛన్న బౌద్ధమా?

అయినను శంకరు సమగ్రముగ గ్రహించజాలని గొందరు శంకరపూర్వమైన బౌద్ధవాద రహస్యములగూడ నవగాహనము గావించుకొననేరక, అనగ ఉభయవాదముల నేర్వక స్థూలదృష్టిజూచి, శంకరుడు బుద్ధునివోలె ఉపాస్య దేవతల ఖండించెనను దురభిప్రాయమున శంకరుని ప్రచ్ఛన్న బౌద్ధుడని నిందించిరి. అంతియగాక 'మాయావాదం అస చ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధం ఏవ చ' (1.14) అనుచు బద్మ పురాణమునకుగూడ బ్రక్షిప్తముగ నీపదము నెక్కించిరి. The passage of Padma Purana is an example of how bigotry and fanaticism can manufacture myths and fables in order to discredit the teacher of an opposite school of thought [217] పరసిద్ధాంతాచార్యుని నపఖ్యాతిపాలుజేయు మూఢత్వ పాషండత్వములు ఎట్టి కల్పిత ముల సృజించునో యీ పద్మపురాణవాక్యము ఉదాహరణము. Sankara thoroughly knew and fully utilized the scholastic philosophy of neo-Buddhism. Prominent Brahmin co-religionists mocked at his Crypto-Buddhism and nick-named him ప్రచ్ఛన్నబౌద్ధ [218] బౌద్ధతత్త్వశాస్త్రమును శంకరుడు క్షుణ్ణముగానెరింగి, యుప యోగించుకొని యుండుటచే దన మతములోని ప్రముఖ బ్రాహ్మ

---

217. The Editor: Vedanta Kesari, 1927.
218. Prof. Earnest P. Horriwitz: Buddhists in Disguise V. K. 1932.

ణులు అతని ప్రచ్ఛన్న బౌద్ధభావములకు బరిహాసించి, అతని ప్రచ్ఛన్న బౌద్ధుడని పరిహాస నామము నొసంగిరని హార్వెజ్ట్ వచించెను. శంకరుడే గాదు ఏయితరసిద్ధాంతియైన సమకాలీన భావముల నధ్యయనము గావించి, అందలి అనుకూల భావముల గ్రహించి, వ్యతిరేకముల ఖండించుట పరిపాటియే గదా! యథార్థమున By Buddha the moral side of philosophy was laid stress upon, and by Sankaracharya the intellectual side.[219] బుద్ధునిచేద త్త్వశాస్త్రమున ధార్మికపక్షము ప్రాధాన్యమునొంద, శంకరునిచే కేవలతాత్త్విక పక్షము గ్రహింపబడెను. అందుచే బుద్ధుడు నాస్తికుడని గాని, శంకరుడు నిరీశ్వరుడనిగాని దోష దృష్టి గ్రహించి, యీ మహాపురుషద్వయమును ఏకవాక్యమున నిందింప యత్నించుట ఆమహాత్ముల మూర్తితత్త్వముల గాని, వారి సిద్ధాంతముల గాని గ్రహింపలేదనియే తెలుపునుగాని వారికెట్టి అప్రతిష్ఠయు నొనగూడదని గ్రాహ్యము.

ఇట్లు శంకరు అద్వైత సిద్ధాంతము వివిధాభిప్రాయములకు లోనై యున్నను, దేశమునగల అద్వైతానుచరులు గాని, శంకర స్థాపిత సంస్థలలో గాని, యీ విభిన్న భావములు లేక, శంకర మేధోత్పన్న సగుణ నిర్గుణ సమన్వయ విధానమే ఆచరణ యోగ్యమై అనుష్ఠానమున నుండుట గాంచగలము. గమ్యమునకు నిర్గుణము, సాధనమునకు సగుణమే ప్రధానములై యొప్పారుట గమనార్హము. అనగా పాంచ భౌతిక శరీరధారియై, యీ పాంచ భౌతిక ప్రపంచమున స్థూల

219. Swami Vivekananda: The Complete Works, Vol 2 p139.

స్ఫూర్తితో నెంతకాలముండునో అంతవరకు జిజ్ఞాసువు అద్వైతాదర్శమును గలిగి, ద్వైతానుష్ఠానమున దాని గ్రహింప యత్నించుటయే ముఖ్యార్థముగ శంకర తాత్పర్యము. ఈ విధానమే శంకర రచనముల బ్రస్ఫుటక్రియ గోచరించు చుండుటచే వీని సమన్వయించుకొనక, భిన్న భావముల గలిగించుకొని, సిద్ధాంతాపార్థముల గల్పించి, తాత్త్విక సంక్షోభమునకు గారకులుగా బెక్కురగుట చింతనీయము. ఎంత ద్వైతము ననుసరించినను, అది వ్యావహారికముగ సత్యత్వము గలిగి, అద్వైత స్ఫూర్తిలో నది అదృశ్యమై సంపూర్ణముగ నభావమై, కేవల బ్రహ్మీభూతస్థితిలో పారమార్థిక సత్యమున ముముక్షువు విరాజిల్లుట విస్మరింపరాదు. అదియే పరమార్థము. వ్యావహారికాభావత్వముతో సహ తత్కారణమైన అవిద్యానామక మాయయు 'యా మా సా మాయా' ఏది లేదో అది మాయ అను వ్యుత్పత్తి కనుగుణ్యముగ నదృశ్యమై పోవును. అట్లు లేనిదానిని లేనట్లు గావించుటయే బాధాసామానాధికరణ్యమని శాస్త్రము. భ్రాంతిజనితమైన లేని సర్పమును నిరాసమొనరించుటచే, దాని కధిష్ఠానముగ దోచుచున్న రజ్జువు గోచరించు విధానమున, మాయా కల్పిత జీవ జగత్తులు వ్యావహారికములేగాని పారమార్థికములు గావు అను యాథార్థజ్ఞానమును శాస్త్రాప్తవాక్యములద్వార శ్రవణము గావించి, వాని తాత్పర్యమును మననముద్వారమున చిత్తమున బ్రవేశింపజేసి, నిదిధ్యాసనముద్వారమున బుద్ధిగుహలో స్థిరమొనర్చి, వ్యావహారికము నఖిలమును విస్మరించి, యింతవరకు దాని కధిష్ఠానమని తలంచుచున్న బ్రహ్మము తానే అని

గ్రహించి,సంపూర్ణానందైక స్థితిలో నుండయత్నించుటయే శంకర తాత్పర్యము. ఎంతవరకు సర్పదృష్టియుండునో, అంతవరకు రజ్జుస్ఫురణ మేర్పడజాలనట్లు, ఎంతవరకు నానాత్వస్ఫూర్తి యుండునో అంతవరకు ఏకమైన బ్రహ్మానుభూతి అసంభవమని శంకర ప్రబోధ. అవరకమైన సర్పము దొలగినగదా అధిష్ఠాన రజ్జు దర్శనము! ఇదియే పరమార్థము. సర్వమానవకర్తవ్యము. ఈ గమ్యమునకే తెలిసియు దెలియకయు సర్వ జీవకోటియు గమనము జేయుచున్నది. కాని ముఖ్యతాత్పర్య గ్రహణానంతర కృషి బలీయము గదా! అందులకు శంకర గ్రంథముల నవ లోడనము గావించి, శంకర ముఖతః పరమార్థ తత్త్వము నెరింగి తరించెదముగాక! అనగా గ్రహించి, సాధించి, తరించి, అట్టి సర్వప్రశాంత సుధను ఉపనిషత్సారమునుండి ఉద్ధరించి, ఆస్వాదించి, ముముక్షుకోటికి తన హృదయమునుండి వెల్లువవలె బ్రపంచమున దశదిశలకు బ్రవహింపచేసిన శంకరభగవత్పాదా చార్యవర్యునికి కృతజ్ఞతాంజలి సహస్రము సర్పించెదముగాక !

ఆకాశవన్నిర్మల నిర్వికల్ప
నిఃసీమ నిష్పందన నిర్వికారం।
అంతర్బహిః శూన్య మనన్య మద్వయం
స్వయం పరబ్రహ్మ కిమస్తి బోధ్యం॥
( వివేకచూడామణి. 394 )

ఆకాశమువలె నిర్మలము, సంకల్ప వికల్ప రహితము, అనంతము అక్రియము, నిర్వికారము బాహ్యాభ్యంతర శూన్యము, అద్వితీయమును అగు పరబ్రహ్మము నీవే. ఇంకను నీకు దెలియదగిన దేమి గలదు ?

ఓం

# శ్రీ శంకరాద్వైత సిద్ధాంతము

## అధ్యాస స్వరూపము

నత్వా విశుద్ధ విజ్ఞానం శంకరం కరుణానిధిం।
భాష్యం ప్రసన్నగంభీరం తత్ప్రణీతం విభజ్యతే॥
ఆచార్యకృతి నివేశనమప్యవధూతం వచోఽస్మదాదీనాం।
రథ్యోదకమివ గంగాప్రవాహపాతః పవిత్రయతి॥

వాచస్పతి—భామతి.

విశుద్ధ విజ్ఞానముగలిగి కరుణానిధియైన శంకరునకు నమస్కరించి, అతని కృతియైన ప్రసన్నగంభీరమగు భాష్యమును (ప్రస్తుతసందర్భమున కృతములను) మథించెదముగాక! గంగావాహినిలో బడిన మార్గస్థ మలినోదకము పవిత్రమైనటుల, ఆచార్యుని రచనములతో గలిసి మాయల్పవచనములు పవిత్రమయ్యెడిని. శంకర రచనములనుటతోడనే మహాసాగరము. భావగంభీరమునకు దోడుగ గ్రంథబాహుళ్యమునుగూడ గాంచనగును. అయినను శంకర స్వతంత్రాభిప్రాయ కథనము ప్రకరణములలోవలె భాష్యముల వ్యక్తమగుటకు అవకాశములు అరిది. భాష్యముల వ్యాఖ్యాత గ్రంథకర్త ననుసరింపవలయును గదా!

అందుచే మన శంకర సిద్ధాంతమీమాంసలో భాష్యగ్రంథ ప్రమాణములుగూడ విరివిగా జూపబడుచుండినను, ప్రకరణములపై మాత్రము ముఖ్యముగా దృష్టినుంపబడియుండును. అది సముచిత నిర్ణయమని విశ్వాసము. అందును శంకరాద్వైతసిద్ధాంతమునకు జీవగర్రగ బరిగణింపబడు మాయావాదమును, యుక్తియుక్తముగ శంకరుడు సూత్రభాష్యమున కుపోద్ఘాతరూపమునను్న అధ్యాస ప్రకరణములో జర్చించి, తుది నిర్ణయమొసంగి, దానినే తన సర్వేతర గ్రంథముల సందర్భానుసారముగ ననువదించి యుండుటచే నా అధ్యాస వివరణమునకే ప్రథమస్థాన మొసంగుటయు న్యాయము. అది శ్రుతుల జోలికి బోక, ఈశ్వరత్వ ప్రసంగము గైకొనక, సాధనానుభవాదుల స్పృశింపక, కేవలము లౌకికానుభవ యుక్తులనే పరిగ్రహించి, స్వసిద్ధాంత ప్రతిపాదనముతోడ బ్రతిష్ఠాపనముగూడ గావించి యున్నది. దాని గ్రహించి ధరించిననే గాని శంకరుడు సులభగ్రాహ్యము కాడు. కావున క్లుప్తసరణి వివరముగ అధ్యాస స్వరూప రహస్యము నవగత మొనరించుకొన యత్నించెదము గాక!

ప్రపంచానుభవమున 'నీవు' 'నేను' అను ప్రత్యయ ద్వయము కర్తకర్మలరూపమై చీకటి వెలుగులవలె పరస్పర విరుద్ధలక్షణములగలిగి గోచరము. విషయరూప 'త్వం' ప్రత్యయము తనగుణములతో విషయియైన 'అహం' ప్రత్యయముపై నధ్యసించుటయు, నటులే విషయి విషయముపై దన విశేషణములతో నధ్యసించుటయు మిథ్యయనబడును. అట్లు పరస్పర విరుద్ధమైన వస్తుత్వము గుణములు గల వీని అన్యోన్యాధ్యాస

ముచే 'నేనిది' అని 'ఇదినాది' అనియు సత్యానృతములకు సమ్మేళనమొనరించు లోకవ్యవహారము నైసర్గికముగ గలదు.

అయినచో నీ అధ్యాస యననేమి? 'స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః' స్మృతిరూపమై, అన్యదేశమున పూర్వకాలదృష్టమై, ప్రస్తుతము ఎదుట దోచునది అధ్యాసము. పరోక్షవస్తుగుణములు అన్యవస్తువుపై దోచుట అధ్యాసమని కొందరందురు. రెండువస్తువుల వ్యత్యాసము యొక్క అగ్రహణమే అధ్యాసయని యందురు కొందరు. విపరీత ధర్మ కల్పనమే అధ్యాస అని మరియు గొందరి అభిప్రాయము. కాని సర్వత్ర పరవస్తువుపై అన్యవస్తు గుణములు అధ్యసించుట సామాన్యాంశమే. శుక్తికము గాంచి రజతమని భ్రమించుట, ఒకే చంద్రుని యిరువురనుకొనుట లోకానుభవమే.

కాని అవిషయమైన ప్రత్యగాత్మపై బాహ్య విషయాధ్యాస ఎట్లు? కాని ప్రత్యగాత్మ అవిషయము పూర్తిగ కాదు. అది అనుభవ యోగ్యమే. అంతియగాక ప్రత్యక్ష విషయము పైన మాత్రమే అధ్యాసము జరుగ నిబంధనము కానరాదు. ఆకాశము అప్రత్యక్షమై యున్నను అజ్ఞానులు దానికి మలినత్వాది కల్పనము గావించుచున్నారు గదా! అందుచే ప్రత్యగాత్మపై ననాత్మాధ్యాస అయుక్తికము కాదు.

ఈ అధ్యాసను పండితులు అవిద్య అని యందురు. తద్విరుద్ధముగ వస్తు స్వరూపమును దెలుపు దాని నవిద్య యందురు. అందుచే నీ అన్యోన్యాధ్యాసలో అధ్యస్తము యొక్క గుణదోషములు అధిష్ఠానమునకు లేశమాత్రమైనను సంబంధింపవు. ఇట్టి అవిద్యారూప ఆత్మానాత్మల అన్యోన్యా

ధ్యాసముచే లోకమున సర్వప్రమాణ ప్రమేయ వ్యవహారము, లౌకిక ప్రవృత్తులు, శాస్త్రముల విధినిషేధములు, మోక్షములు ఏర్పడుచున్నవి. ప్రత్యక్షాది ప్రమాణములు, శాస్త్రవచనము లెట్లు అవిద్యారూపము లగును? దేహేంద్రియాదికముపై 'అహం మమాది' అభిమాన రహితునికి ప్రమాతృత్వము ప్రమాణ ప్రవృత్తులు కలుగవు. ఇంద్రియ ప్రవృత్తుల నియోగము లేక ప్రత్యక్షాది వ్యవహారము శూన్యము. అధిష్ఠాన నియామకము లేక వానికి వ్యాపారము లేదు. అనగా చేతనమైన ఆత్మాధ్యాసము లేక దేహేంద్రియ వ్యవహారము సున్న. ఇదంతయు లేక అసంగమైన ఆత్మ ప్రమాత కానేరదు. ప్రమాత లేకున్నచో ప్రమాణ ప్రవృత్తియే యుండదు. అందుచే ప్రత్యక్షాది ప్రమాణములు, శాస్త్రములు, అవిద్యారూపములే యగుచున్నవి.

మరియు పశువులు, తృణహస్తుని జూచి చేరవచ్చుట, దండహస్తుని గాంచి పారిపోవుటవలె పురుషులును ఖడ్గ హస్తు నవలోకించి భీతుడై పరావృత్తుట, తద్వ్యతిరేక దృశ్య మున ముందు కేగుట గాంచుచున్నాము. అందుచే ప్రమాణ ప్రమేయాది వ్యవహారము పశు పురుషులకు సామాన్యమే యగు చున్నది. ఇరువురికి అవివేకమున ప్రత్యక్షాది వ్యవహారము కలుగుట ప్రసిద్ధము. కాన విజ్ఞానులకు గూడ తత్కాలమునకు ప్రత్యక్షాది వ్యవహారము సమానమైయున్నదని నిశ్చయము. కాని శాస్త్రవ్యవహారమున ఆత్మ పరలోక సంబంధమును గ్రహించినగాని దానికి దా నర్హుడాయని దూరదృష్టిగలవాడు భావింపనేరడు. క్షుత్పిపాసాదికమున కతీతమును, బ్రహ్మ

క్షత్రియాదిక విభేద దూరము, అనాగమాపాయినము అని వేదాంత వేద్యమైన ఆత్మ అధికారాపేక్షికము గాదు. ఆత్మాను భూతి పూర్వము ప్రవర్తమానమైన శాస్త్రము అవిద్యా విషయమే అగును. వర్ణాశ్రమ వయోవస్థాది విశేషముల అధ్యాసము నాశ్రయించియే 'బ్రాహ్మణో యజేత' అను శాస్త్రవచనములు గలుగుచున్నవి.

అది కానిదానిని అదిగా భావించుటయే అధ్యాస అని గ్రహించి యున్నాము. అటులే దారాసుతాదుల మంచి చెడుగుల తనపై మోపికొని, తానే మంచియు చెడుగునై నట్లు భావింపబడుచున్నది. అదేవిధముగా శారీరక లక్షణముల దీనిపై నారోపించుకొని 'స్థూలోహం కృశోహం' అనియు, నేను వెళ్ళు చున్నాను నేను దుముకు చున్నాను మొదలగు వ్యవహారము జరుగుచున్నది. ఇంద్రియగుణముల నాపాదించుకొని నేను గ్రుడ్డి నేను చెవిటి నను వాడుక గలుగుచున్నది. అంతఃకరణ లక్షణములగూడ నట్లే అధ్యసింప జేసికొని, కామ సంక ల్పాదికమును గల్పించుకొనుటయు బరిపాటి. ఈవిధముగ సర్వసాక్షి అయిన ప్రత్యగాత్మపై అహం ప్రత్యయము నారోపించుటయు నటులే నా ప్రత్యగాత్మను నంతఃకరణముపై నధ్యసింప జేయుటయు, జరుగును.

ఈ రీతి కర్తృత్వ భోక్తృత్వ ప్రవర్తకమైన మిథ్యా భూతకల్పన స్వరూపమైన అనాద్యనంత స్వాభావిక అధ్యా సము సర్వలోక ప్రత్యక్షము. ఆ యనర్థహేతువైన మిథ్యా జ్ఞానముయొక్క నిరాసముకొరకు, ఆత్మైకత్వ విద్యా ప్రతి పత్తి కొరకు, సర్వవేదాంత గ్రంథములును అనువృత్తములు.

పై అధ్యాసతత్త్వ సమీక్షచే దాసు గాని దానిని దానని భావించి, సుఖదుఃఖముల ననుభవించుటయే భ్రాంతి అని, అదియే అధ్యాస, మాయ అని స్పష్టము. స్వతః తానాత్మయై అవిద్యాజనిత దేహేంద్రియాది అనాత్మ వస్తువుల నధ్యసింపజేసికొని, ప్రపంచవ్యవహారముల నన్యోన్యాధ్యాసముచే పెంపొందించుకొని, సంసారవిజృంభణమున నధికతర సుఖదుఃఖ ద్వంద్వమున జిక్కి, తత్ఫలిత పుణ్యపాపకర్మ నార్జించి, యథోచిత జన్మ పరంపరలో గొట్టుకొని పోవుచుండుటయే ప్రపంచవ్యవహారము. కాన వీని మూలసూత్రము నెరింగి, అహం మమాదుల ద్రోసి, దేహేంద్రియాదుల నరికట్టి, ప్రత్యగాత్మను బ్రత్యేకపరచి వీక్షించుచో నద్వయాత్మ స్వతఃసిద్ధ ప్రకాశానంద భూయిష్టమై స్వేతరముగాక దోచును. అంతవరకు భాసించుచున్న ఆత్మేతరము లదృశ్యమై, ఆత్మస్ఫూర్తిమాత్రము వ్యాప్తమై విరాజిల్లును. ఈ భావముల శంకరుడు తన గ్రంథముల నెట్లు వివరించునో చూచెదము గాక!

---

## నిర్గుణ బ్రహ్మము

దర్శనం శ్రవణం జ్ఞానం యత్ర నాన్యస్య విద్యతే। అఖండైకరసం శాంతం బ్రహ్మతత్సముపాస్మహే' (మహావాక్యదర్పణము.) ఎచట నన్యపదార్థముయొక్క దర్శన శ్రవణజ్ఞానము లభావములో అట్టి శాంతాఖండైకరసస్వరూపుడైన బ్రహ్మమును

సేవించెదను. ఇట్టి బ్రహ్మమును గ్రహింప బ్రజాపతి వద్ద కరుదెంచిన దేవరాజైన ఇంద్రునికిగూడ అలవికాక భ్రమించెను. ప్రజాపతిపుత్రుడును, మహాప్రజ్ఞాశీలుడునునైనను భ్రాంతినొందెను. కావున నట్టి దురవగమమైన దీనిని గ్రహింపనేరక సాంఖ్య వైశేషికాది సిద్ధాంతకర్తలుగూడ దిగ్భ్రమ నొందిరి. అట్లగుటచే 'కిమన్యే క్షుద్ర జంతవో వివేకహీనాః స్వభావత ఏవ బహిర్విషయాపహృత చేతసః?' (ఛాం. భా. 8.12.1) నిక వివేకవిహీన స్వభావులై బాహ్యవిషయ బద్ధులైన అల్పమానవుల విషయమును దెలుపవలెనా. అందుచే 'ఈదృశం తాదృశం నైత న్నపరోక్షం' (త. ఉ. 16) ఇట్టిది అట్టిది అనుటకు నలవికాక అపరోక్షమై, 'ఆకాశవ న్నిర్మల నిర్వికల్ప నిఃసీమ నిస్పందన నిర్వికారం అంతర్బహిః శూన్య మనన్య మద్వయం స్వయం పరంబ్రహ్మ' (వి. చూ. 394) మును గూర్చి 'కిమస్తి బోధ్యం' తెలియబడదగిన దేదిగలదు? కావున 'అప్రాప్యైవ నివర్తంతే వాచో ధీభిః సహైవ తు నిర్గుణత్వాత్క్రియాభావా ద్విశేషాణామభావతః' (ఉ.సా. 1.15.31) నిర్గుణమై క్రియారహితమై విశేషములులేని దీని గ్రహింపనేరక బుద్ధితోగూడ వాక్కు తిరోగమించుచున్నది.

అయినను దాని గ్రహింప నుద్యమించుచో 'కర్మసాధ్యం త్వనిత్యం హి బ్రహ్మనిత్యం సనాతనం' (స. వే.సి.సా. 163) కర్మ సాధ్యమైనది అనిత్యమగుటయు, బ్రహ్మము నిత్యమును సనాతన మగుటచే గర్మవిదూరమై 'నాసన్ నసన్ న సదసన్ న మహాన్ న చాణు నస్త్రీ పుమాన్ న చ నపుంసక మేవబీజం' (ధన్యాష్టకం.5) అసత్ గాక, సత్ గాక, సదసత్ గూడ గాక మహదణురూపములు

గాక, స్త్రీ పుంస్త్వనపుంసకములునుగాక నుండుచు, 'నచైకం తద న్యత్ ద్వితీయం కుతఃస్యాత్ న వా కేవలత్వం నచాఽకేవలత్వం న శూన్యం నచాఽశూన్యమద్వైతకత్వాత్ కథం సర్వవేదాంతసిద్ధం బ్రవీమి' (ద. శ్లో. 10) అఖిలవేదాంత సిద్ధమైన నీ బ్రహ్మము అద్వైతమై ఏకముకాన ద్వితీయత్వాదు లెటనుండి వచ్చును? కేవలముగాదు అనేకత్వమును గాదు. శూన్యాశూన్యములకు వ్యతిరేకము. దాని నే నేమి వచింపగలను? అది 'అవ్యాప దేశ్యం' (మ. వా. ద. 176) అగుటచే 'ఇదం తేనైవ యద్భాతి సర్వం తస్య నిషిధ్యతే। అవాచ్యతత్త్వమనిదం న వేద్యం స్వప్రకాశతః॥' (త. ఉ. 17) 'ఇది' యనబడుచున్నదంతయు బ్రహ్మము కాదు. అవాచ్యమై అనిదమై వేద్యము కానిది. 'నిర్గుణస్య గుణాధానమపి నైవోపపద్యతే' (స. వే. సి. సా. 160) నిర్గుణునకు గుణావధారణము అసంభవముగదా! కావున బ్రహ్మము తత్త్వతః నవాఙ్మానసగోచరమై, సర్వవిధావలంబనాదూరమై విరాజిల్లునని యీ వాక్యముల వలన స్పష్టము.

అట్లు అనిర్వాచ్యమైన బ్రహ్మమును భావించుటకుగూడ నసాధ్యమై యొప్పుటచే దాని నొకించుక గ్రాహ్యపడునట్లొ నరించుకొనుటకై నిసుమంత స్థూలదృష్టి నవలంబించి, మనకు ప్రస్తుత లోకమున ననుభవవేద్యమైయుండు విషయముల ప్రస్తావించి, అట్టివి బ్రహ్మమున గానరావు అను వ్యతిరేకవిధానమున బోధింప నవకాశముగలదు. దీనిచే బ్రహ్మవస్తుస్వరూప గ్రహణముగాక ప్రకృతేతరవస్తు సూచనముమాత్రము గోచరించును. ఎట్లు చూచినను బ్రహ్మము 'వికల్పశూన్యం నిరుపాధి నిర్మలం। నిరంతరానందఘనం నిరీహం నిరాస్పదం కేవల మేక మేవ॥'

(స. వే. సి. సా. 770) వికల్పాదిరహితమై, ఉపాధిశూన్యమై, మలవిరహితమును,నిరంతరమును,దుఃఖరహితమును,కొలఁతలు లేక నిరాస్పదమై పూర్తిగ నొక్కటియై యున్నది. అది యింకను, 'అన ణ్వస్థూల మహ్రస్వ మదీర్ఘ మజ మవ్యయం । అరూప గుణవర్ణాఖ్యం...' (ఆత్మబోధ. 60) అయి, 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథారసం నిత్య మగంధవచ్చ యత్ । అనాద్యనంతం మహతః పరం ధ్రువం...॥' (మ. వా. ద. 184) శబ్దస్పర్శాదిక గుణరహితమై, అనాద్యనంతమై, బుద్ధికతీతమై, స్థిరమై యున్నది. అది ఇంకను 'నో దేతి నాస్తమేత్యేషా న వృద్ధిం యాతి న క్షయం '(వాక్యసుధ 5) ఉదయాస్తమానములు వృద్ధిక్షయములు గూడ లేనిది. 'సదద్వితీయం విశుద్ధవిజ్ఞానఘనం నిరంజన' (వి. చూ. 239) మై 'నిరస్తమాయాకృతి సర్వభేదం, నిత్యం ధ్రువం నిష్కలమప్రమేయం। అరూప మవ్యక్త మనాఖ్యమవ్యయం...' (వి. చూ. 240) మాయచేగల్పింపబడిన సర్వభేద వివర్జితమై నిత్యమై, అచలమై, అవిభిద్యమై సర్వప్రమాణవిదూరమై, అరూప, అగోచర, అవ్యయమైయుండుటయే గాక నది అనాఖ్య మనియుగూడ దెలుపబడియున్నది. సర్వప్రమాణదూరముగాన దానికి నామకరణ మేమని గావించుట? అందుచే నది అనామక మనియే నిశ్చయము. అచట 'జ్ఞాతృజ్ఞేయజ్ఞానశూన్య' (వి. చూ. 241) ము చే నది 'అనంతం నిర్వికల్పకం' అనియు వచింపబడియున్నది. అట్లగుట నది గ్రహణయోగ్యముకాదు గాన హేయమును గాదు కావున ఉపాదేయమును కాదు. అందుచే ఒక్కమాటలో బూర్వోక్త

విధాన నా బ్రహ్మవాచకతత్త్వము 'మనోవాచామగోచరం' (వి. చూ. 242) అయియున్నది.

జగత్తు లక్షణములు దాని నెంతమాత్రము లేకుండుటచే 'జగద్విలక్షణం బ్రహ్మ' అనియు 'బ్రహ్మణోఽన్యన్న కించన' (63, బ్రహ్మమున నన్యత్వమిసుమంతయు శూన్యము. ఉన్నట్లు గోచరించు జగదాదికము 'మిథ్యా యథా మరు మరీచికా' ఎండమావువలె మిథ్య అనియు ఆత్మబోధ తెలుపుచున్నది. అయినను బ్రహ్మము జగల్లక్షణములైన 'జన్మవృద్ధి పరిణత్యపక్షయ వ్యాధినాశన విహీన' (వి.చూ. 259) మై, అవ్యయమై యుండుటచేతను, 'కార్యకారణ విలక్షణ' (వి. చూ. 261) ముగ నుండి, 'నిత్యమవ్యయ సుఖం' (వి. చూ. 262) 'కేవలానంద రూప' (వి చూ. 409) ముగ నున్నది. అందు ఎట్టి విభేదములు లేకుండుటచే 'అంతః పూర్ణం బహిః పూర్ణం' (ను. నా. ద. 172) అనురీతి సర్వాంతరమై వ్యాప్తమై యొప్పుచున్నది. సర్వసంపూర్ణమైన యాబ్రహ్మము నకు బంధకారణమైన 'నావృతి ర్బ్రహ్మణః కాచి దన్యా భావాదనావృతం' (వి. చూ. 571) ఆవరణము కొంచెమైన నుండజాలదు గాన నది అనావృతముగ నున్నది. అనావృతమై యుండు దానికి రూపాద్యభావమువలన 'ఏవం విజ్ఞాన కర్తృత్వం భూమ్నో నాస్తీతి గమ్యతే' (ఉ. సా. 2.9.9) ఆ భూమ పదవాచ్యమైన బ్రహ్మమునందు విజ్ఞానక్రియకు అవకాశము లేదు. అనగా నది సంపూర్తిగ నగ్రాహ్యము అని తాత్పర్యము. అందుచే 'కాల భేదం వస్తుభేదం దేశభేదం స్వభేదకం| కించి ద్భేదం న తస్యాస్తి కించిదాపి నవిద్యతే॥' (స. వే. సి. సా. 993)

భూత భవిష్యద్వర్తమానములను కాలభేదముగాని, స్వపరాది వస్తు తారతమ్యముగాని, స్వపర ఉచ్చనీచాది దేశభేదము గాని, సజాతీయ విజాతీయ స్వగతభేదములుగాని లేశమాత్రము నైన నచట లేవు. కాన నట్టి దాని గ్రహింప నేప్రమాణ ములు గోచరింప కున్నను, 'అపేక్ష్యతేఽఖిలైర్మానైః న యన్మాన మపేక్షతే। వేదవాక్యం ప్రమాణం తత్ బ్రహ్మాత్మావగతౌ మతం॥' (త.ఉ. 20) సకల ప్రమాణములు దేని నపేక్షించు చున్నవో, ఏది ఎట్టి ప్రమాణముల నపేక్షింపదో ఆ వేద వాక్యమే బ్రహ్మస్వరూపమగు ఆత్మావగతికి ప్రమాణము. అంతకు అన్యముగ మార్గ మగోచరము. అందుచే బ్రహ్మ విషయజ్ఞానమునకు వేదమే శరణ్యమగుచున్నది.

బ్రహ్మ నిర్వచనమున శంకరుడు ప్రకరణముల తాత్పర్యమునే భాష్యములకూడ ననువదించియున్నాడు. నామరూపాద్యుపాధిముక్తమై సర్వభ్రాంతి వివర్జితమైన ఆత్మ ప్రసంగమున 'పరమార్థతోఽనుపాధికృతం చ తత్త్వమేక మేవాద్వితీయ ముపాదేయం సర్వతార్కిక బుద్ధ్యనవగమ్యం హ్యాజమభయం శివ మిష్యతే। న తత్ర కర్తృత్వం భోక్తృత్వం వా క్రియాకారక ఫలం వా స్యాదద్వైతత్వా త్సర్వభావానాం' (ప్ర. భా. 6.3) పారమార్థికముగ నది అనుపాధికమై, త్రివిధ భేదవర్జితమై, బుద్ధికతీతమై, శుద్ధమై అభయమై మంగళకరమై యున్నది. అందు కర్తృత్వ భోక్తృత్వములును, కర్త కర్మ ఫలములును లేవు. అచట సర్వము అద్వైతస్థితి నుండును. 'యదా పునః స్వరూపమేవ నిర్దిదిక్షితం భవతి నిరస్త సర్వో పాధి విశేషం, తదా న శక్యతే కేనచిదపి ప్రకారేణ

నిర్దేష్టుం। తదా అయమేవాభ్యుపాయో యదుతప్రాప్త నిర్దేశ ప్రతిషేధద్వారేణ 'నేతి నేతి' ఇతి నిర్దేశః ఇదంచ నకారద్వయం వీప్సా వ్యాప్త్యర్థం । యద్యత్ప్రాప్తం తత్తన్నిషిధ్యతే' (బృ. భా. 2. 3. 9) అయినను సర్వోపాధి విశేష శూన్యమై యున్న దాని స్వరూప వర్ణనము గావింప యత్నించుచో నది సంపూర్ణముగ నశక్యము. సకల సాధ్య నిర్దేశముల బ్రతిషేధించి దానిని 'నేతి నేతి' అని మాత్రము నిర్వచింపగలము. ఇందలి 'న' కారద్వయము మనకు దోచు సర్వ నిర్దేశ్యావకాశములను నిషేధించుచున్నది. 'తస్మాత్పరతో ఽక్షరాత్పరో నిరుపాధికః పురుషః' (ముం. భా. 2. 1. 2) నామరూపాది వికార కారణమైన అవ్యాకృతనామక అక్షరముకంటె నిరుపాధికమైన పురుషుడు పరుడు. అటులే విజ్ఞానమయాత్మ బ్రహ్మముతో లయించుటను బోధించి, అట 'బ్రహ్మణ్యాకాశకల్పే ఽజే ఽజరే ఽమృతే ఽభయే ఽపూర్వే ఽనపరేఽనంతరే ఽబాహ్యే ఽద్వయే శివే శాంతే సర్వే ఏకీభవంతి' (ముం. భా. 3. 2. 7) శ్రేష్ఠమును, అవ్యయానంత వ్యాప్తమును, అజ అవ్యయామృతమై, అభయమై ముందు వెనకలు అంతర్బాహ్యములు లేక అద్వితీయమై నిరవధికమై శివ శాంతమైన బ్రహ్మమున సర్వము లయించుననీ భాష్యము బ్రహ్మ లక్షణముల నోకించుచుక నుపదేశించియున్నది. 'నేతి నేతి' శబ్దములను వ్యాఖ్యానించుచు నీ రెండుపదములును, మూర్తామూర్తములను, భూతవాసనాన్వయ నిషేధమును కాక నూహింపబడు సకలమును నిషేధింప, ననగా 'ప్రపంచమేవ బ్రహ్మణి కల్పితం ప్రతిషేధతి। పరిశినష్టి బ్రహ్మేతి నిర్ణయః' (బ్ర.సూ.

భా. 3.2.22) బ్రహ్మమునందు కల్పితమైన ప్రపంచము నిషేధిత మగుచుండ మిగులునది బ్రహ్మము. అందు పూర్వోక్త బ్రహ్మ నిర్వచనములన్నియు గోచరమగుచున్నవి. 'సమం బ్రహ్మైకం చ' (గీ. భా. 5.19) బ్రహ్మము ఏకైక రసమును ఏకమునై సదసద్విలక్షణమై, 'అతీంద్రియత్వే నోభయబుద్ధ్యనుగత ప్రత్యయావిషయత్వాత్' (గీ భా. 13.12) ఇంద్రియాతీతమై బుద్ధ్యనుగత సదసద్భావ విలక్షణమై 'అద్వయత్వా దవిషయత్వా దాత్మత్వాచ్చ న కేనచి చ్ఛబ్దేనోచ్యత ఇతి యుక్తం' (గీ.భా 13.12) ఏకమై అద్వయమై అవిషయమైయుండుటచే దానిని శబ్దముచేతను చెప్పజాల మనుట యుక్తము, అను అనేక భాష్యవాక్యముల శంకరులు నిర్గుణబ్రహ్మముయొక్క అప్రమేయత్వ, అవాఙ్మానసగోచరత్వాది ఉపనిషద్భావముల సువిస్పష్టవచనముల సందర్భోచితముగ వివరించియున్నారు. అందుచే శంకరు తాత్పర్యమున బ్రహ్మము సర్వాతీతమై, సర్వనిష్టమై యుండుట గాంచ దగును. పరంపరాగత బ్రహ్మనిర్వచనమును సంపూర్ణముగ విస్పష్టముగ నత డనువదించియున్నారు.

---

## మాయ

'అస్యానర్థహేతోః ప్రహాణాయ ఆత్మైకత్వ విద్యాప్రతిపత్తయే సర్వే వేదాంతా ఆరభ్యంతే' (బ్ర. సూ. భా. అధ్యాస) అనర్థహేతువగు నీ అధ్యాస నివారణమున ప్రయోజనమైన

ఆత్మైకత్వ విద్యాప్రాప్తికొరకు ఎల్లవేదాంతములు ప్రవృత్తము లగుచున్నవి. అట్లనర్థకారణముగ నైన వచింపబడిన అధ్యాస రూప మాయాతత్త్వముయొక్క లక్షణము గ్రహించిన గదా దాని ద్రోసిపుచ్చి స్వీయాత్మానుభూతి జూరగొను నవకాశము! కాని యీ మాయ 'అఘటితఘటనా పటీయసీ' (మా.పం. 2) అఘటనములను ఘటితములుగ జేయుటలో సామర్థ్యముగలిగి; 'యథా ప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి। ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖం॥' (వి. చూ. 325) జలముపై నావరించియుండు నాచు దొలగింప జేసినను క్షణ కాలమైనను దొలగియుండక క్రమ్ముకొనట్లు, స్వాత్మస్థితినుండి పరాఙ్ముఖుడైన పండితునైనను మాయ ఆవరించుచునే యుండు నను శంకరోక్తి ననుసరించి అతిబలీయమై యున్నది. అందుచేతనే 'అహో అతిగంభీరా దురవగాహ్యా విచిత్రా చేయం మాయాయదయం సర్వో జంతుః పరమార్థతఃపరమార్థసతత్త్వో ప్యేవం బోధ్యమానో౽హం పరమాత్మేతి న గృహ్ణాతి... నూనం పరస్యైవ మాయయా మోముహ్యమానః సర్వో లోకో బంభ్రమంతి' (క. భా. 3.12) ఆహా! ఈమాయ అతిగంభీరము దురవగాహనము విచిత్రముగ నున్నదిగదా! ఈసర్వమానవులు సత్యముగ పరమాత్మ స్వరూపులైయుండియు, నెంత బోధించి నను 'అహం పరమాత్మ' అను విషయమును గ్రహింప కుండిరి గదా! పరమాత్మయొక్క మాయచే లోకములు పునః పునః విమోహితములగుచున్నవి అని వివరింపబడియున్నది. ఇక నీదురవఘట్టితమగు నీమాయాగ్రహణ నిరసన మార్గమెద్ది?

---

# నిర్వచనము

ఇది 'మాయా బ్రహ్మాప్యగతాऽవిద్యా జీవాశ్రయా ప్రోక్తా' (ప్ర. సు. 105) బ్రహ్మాశ్రయమున మాయ యనియు జీవునితో మేళవించి అవిద్యగ వచింపబడెను. మరియు 'ఇయం సమష్టి రుత్కృష్టా సత్త్వాంశోత్కర్షతః పురా మాయేతి కథ్యతే తజ్జ్ఞైః శుద్ధసత్త్వైకలక్షణా' (స వే. సి. సా. 209) సమష్టిరూపమై సత్త్వాంశ ప్రధానమై యుత్కృష్టమైన దానిని పూర్వము విబుధులు శుద్ధసత్త్వలక్షణముగల దగుటచే మాయ అని వచించిరి. దానినే 'ప్రధానం ప్రకృతిః మాయా' (వి. స. భా. 16) 'అనాది రవిద్యా మాయా' (స. సు. భా. 2. 20) అనాదియైనది అవిద్యాత్మక మాయ యనియు పేరు. అనగా మాయను అవిద్య అనియు నందురు. కాని వీనిగల అవాంతరభేదముల గ్రంథాంతరమున గాంచగలము. అవిద్య యనగా 'యదాత్మనోऽస్ఫూర్తిః' (ప్ర. ర. మా. 56) ఆత్మయొక్క అస్ఫూర్తిని కలుగ జేయునది అగుటచే అవిద్య జీవసంబంధము అని తెలియును. ఈ అవిద్యాబలము చేతనే 'పరాత్మత్వం చ తథాऽన్యత్వమోఽపి సన్ విపర్యయేణాభిమత స్త్వవిద్యయా' (కూ.పా. 2. 10. 8) పరాత్మతత్త్వమునై అద్వితీయుడనైన నేను తద్విరుద్ధముగా నవిద్యచే దోచుచుందునను నట్లు జీవకారణమైయున్నది. దీనినే 'అజ్ఞానం భ్రమ ఇత్యాహు ర్విజ్ఞానం పరమం పదం। అజ్ఞానం చాన్యథాజ్ఞానం మాయామేతాం వదంతి తే॥' (సదాచార. 40) అజ్ఞానము భ్రమయనుచు-

విజ్ఞానమే పరమపదము. అజ్ఞానమన జ్ఞానాభావముకాక, అన్యథా జ్ఞానమగు భ్రమయే యగుచున్నది. అదియే మాయ యనియు నాబడును. అనగా అజ్ఞాన అన్యథాజ్ఞానములును మాయా రూపములే యగుచున్నవి. వీనినే ఆవరణ విక్షేపములుగ ముందు గ్రంథమున జూడగలము. అజ్ఞానముచే నధిష్ఠానమును మరుగుపరచి, అన్యథాజ్ఞానముచే నన్యవస్తు జ్ఞానమునుగలుగ జేయు 'అధ్యాస మూల మజ్ఞాన మాహురావృతి లక్షణాం' (స. వే. సి. సా. 509) ఆవృతిలక్షణమైన అజ్ఞానమే అధ్యాసకు కారణమగుచున్నది. నిరుపమ నిత్య నిరంశకమగు నుండెడి నను బ్రహ్మమునందు జగదీశ జీవ విభేద కల్పనము గావించు నీ మాయ అఘటిత ఘటనాపటీయసి కదా! అఖండమైన బ్రహ్మమునందు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది కల్పనము గావించి, బుధులనైనను భ్రమింపజేయు నీ మాయ నేమని వర్ణింపనగును! లేని జాతి వర్ణాది విభేదములను దోపింపజేసి, విద్యాహంకారముల లేవదీసి, విప్రులనుగూడ భ్రమసాగరమున ముంచుచున్న యీ మాయ అఘటనాఘటన సామర్థ్యముల గలదిగదా! (మా. పం.)

ఇంతగా వర్ణితమైయున్న మాయ 'సా చ మాయా న విద్యతే। మాయేత్యవిద్యమానస్యాఖ్యా' (మాం. భా. 4.58) మాయ అసలు లేనిదే. యథార్థమున లేని దానికి మాయ అని అవిద్యయని మాత్రమునామ మొసంగబడినది. ఇందు 'అవ్యాకృతస్య దేశకాల విశేషాభావాత్' (మాం. భా. 1. 2) దేశకాలాది విభేదములు బొత్తుగ నుండజాలవు. కర్తృత్వ భోక్తృత్వ ప్రవర్తకమైన యీ అధ్యాస మిథ్యా

రూపమై, అనాది అనంత నైసర్గికమై, సర్వలోక ప్రత్యక్ష ముగనే యొప్పారుచున్నది. (బ్ర. సూ. భా. అధ్యాస)

కాని దీని స్వరూపము మాత్రము అగోచరము. 'సదసన్న విరుద్ధత్వాదతోఽనిర్వాచ్యమేవ తత్' (త. ఉ. 53) సదసత్తులకు విరుద్ధమగుటచే నది అనిర్వాచ్యము. అనగా 'అజ్ఞానం ప్రకృతిః శక్తిరవిద్యేతి నిగద్యతే । తదేతన్న సన్న భవతి నాసద్వా శుక్తిరౌప్యవత్ ।' (స. వే. సి. సా. 305) మాయయే అజ్ఞాన, ప్రకృతి, శక్తి అవిద్య అని పిలువబడును. అది సత్తని గాని, అసత్తనిగాని చెప్ప నలవిగాక శుక్తిమీద భాసించు రజతమువలె నుండును. 'సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో । భిన్నా ప్యభిన్నా ప్యుభయాత్మికా నో । సాంగాప్యనంగా ప్యుభయాత్మికా నో । మహాద్భుతానిర్వచనీయ రూపా' (వి. చూ. 111) సత్ అసత్ ఉభయాత్మక సదసత్ గగాని, భిన్న అభిన్న భిన్నాభిన్నముగ గాని, సాంగ అసంగసాంగాసంగముగగాని లేక మహాద్భుత అనిర్వచనీయ మైనదనియు బ్రహ్మైకాది యనుభవమున కూడ 'తస్య తాదాత్మ్య లక్షణ సంబంధోపపత్తేః' (బ్ర.సూ.భా. 2. 2. 38) మాయా బ్రహ్మ సంబంధము అనిర్వాచ్య తాదాత్మ్య సంబంధముగా నుండుటచే, 'కా చాఽనిర్వచనీయా మాయా' (ప్ర. ర. మా. 58) అనిర్వచనీయము మాయ యగుచున్నది. 'అత ఏత దనిర్వాచ్య మిత్యేవ కవయో విదుః' (స. వే. సి. సా. 307) విజ్ఞులు దాని అనిర్వాచ్యముగా గ్రహించుచున్నారు. అందుచే నీమాయ 'మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహపర్యంతం, అసదిద మనాత్మకం త్వం విద్ధి మరు

మరీచికా కల్పం' (వి. చూ. 125) మహత్తునుండి దేహ పర్యంతము గల మాయాపరికల్పిత సకల ప్రపంచమును మాయ యనియు, అసత్తనియు, అనాత్మక మనియు గ్రహింపుము. ఎండమావులం దుదకమభావమైయున్నను అగుపడునట్లు బ్రహ్మమునందు మాయచే నీ సర్వము గోచరము. కాన 'జ్ఞేయో జ్ఞాతా న భవతి యుక్తీనాం శతకోటిభిః' (మ. వా. ద. 77) జ్ఞాతా జ్ఞేయ జ్ఞానములు శతకోటి యుక్తులచేనైన నున్నవని తీర్మానింప నశక్యము. 'వ్యాప్య వ్యాపకతామిథ్య' (అ. అ. 46) యే యగుచున్నది. అప్పుడు 'నా జ్ఞానం నచ బుద్ధిశ్చ నజగన్న చసాక్షితా' (స్వా. ప్ర. 4) అజ్ఞానము బుద్ధి, జగత్, సాక్షిత్వములు లేనిదే అగును.

పై జర్చ ననుసరించి చూచుచో మాయ పారమార్థిక దృష్టి అసలు లేనిదిగనే తీర్మానము. అనగా శంకర మీమాంసావిధానము ననుసరించి కారణమునుండి జన్మ ప్రారంభముగాన, అద్వితీయాఖండ నిర్మల నిర్వికార నిర్గుణ నిర్విశేష బ్రహ్మమున ప్రస్తుత స్థూల దృష్టికి, స్థూలముగ గోచరించుచున్న జీవప్రకృతుల కారణత్వము బ్రహ్మేతరముగ ననుపపత్తియగుటచే, నిక జీవేశ్వర జగత్తులకు కారణము బ్రహ్మమునందే యుపపన్నముగ నూహించి, స్థూలదృష్టి గల నధిక సంఖ్యాకుల భ్రమనివారణమునకై బ్రహ్మమునందు మాయ యూహింపబడియున్నది. యథార్థమున 'నా విద్యాకర్తృభ్రాంతం చ బ్రహ్మ కింతునైవా బ్రహ్మ అవిద్యాకర్తా చేతనో భ్రాంతోఽన్య ఇష్యతే' (బృ. భా. 1.4.10) బ్రహ్మము అవిద్యాకర్తగ గాని, భ్రాంతుడు గాని కానేరడు. కాని బ్రహ్మేతర

మైన చైతన్యవస్తువు అవిద్యా కర్తగ భ్రాంతునిగ నుండ నవకాశములేదు. మరియు 'ఆత్మాత్మావబోధమాత్రస్య విధిత్సా త్సర్వోయమర్థవాదః' ఈ కల్పనమంతయు నాత్మావబోధకొరకే గాన నివి అర్థవాదమాత్రములు గాని యథార్థములు కావు. కాన సామాన్యులకు 'సుఖావబోధ ప్రతిపత్త్యర్థః' (ఐ. భా. 4. 1) సుసుఖముగ నర్థమగుటకై యీ గాథలు కల్పితములు. అందుచే మాయాకల్పనము అన్వయ సౌకర్యములకొరకును, మందప్రజ్ఞతోషణముకొరకునై యున్నదని తాత్పర్యము. అయినను తదన్వయము కష్టసాధ్యమైయుండుటచే మాయ లేనిదయ్యును ఉన్నదని ప్రతిపాదింపబడుచున్నది గాన నెట్టున్నది వచింప దుర్లభమగుటచే ననిర్వాచ్యమని తెలుపబడియున్నది. ఆవిధముగ మాయా ప్రతిపాదనము వెనువెంటనే మాయాకార్యవివరణము ఆరంభింపబడుచున్నది.

---

## ఈశ్వరుడు

ఇటనుండి అద్వైత సిద్ధాంతము సామాన్య సృష్టివాదమువలె బ్రవర్తించును. కాని యిం దుపాదాన నిమిత్త కారణములను అన్య సిద్ధాంతములవలెగాక పూర్వోక్తచందము బ్రహ్మమునకే అన్వయింప వలసియున్నది. అట్లు సృష్టికి కారణమైన కారణద్వయ సమన్వయమునకే మాయాకల్పనము అనిర్వాచనీయముగ బ్రహ్మమునందు కావింపబడి యున్నది. ఈ కల్పన మైనను 'పరమేశ్వరస్యా వీచ్ఛా

వశాన్మాయా మయం రూపం సాధకానుగ్రహార్థం ।' (బ్ర. సూ. భా. 1. 1. 20) పరమేశ్వరునకు నుపాసకుల యను గ్రహార్థము యిచ్చ జనింప మాయామయమగు రూప కల్పనము బ్రహ్మమున కేర్పడినది. అదియు మాయా కల్పనమే యని విస్మరింప జనదు. అందుచేతనే 'అపి చ యత్ర నిరస్త సర్వ విశేషం పారమేశ్వరం రూప ముద్దిశ్యతే భవతి తత్ర శాస్త్రం 'అశబ్ద మస్పర్శ ...' మిత్యాది' ఎచట సర్వోపాధి విరహిత బరమేశ్వరు డుపదేశింపబడునో అచట అశబ్దత్వాది శాస్త్ర వాక్యము లుపయుక్తము లనియు, అట్లుగాక 'సర్వకారణత్వాత్తు వికారధర్మైరపి కైశ్చిద్విశిష్టః పరమేశ్వర ఉపాస్యత్వేన నిర్దిశ్యతే'సర్వకర్మా సర్వకామ...' (బ్ర. సూ. భా. 1. 1. 20) ఎచట పరమేశ్వరు డుపాస్యుడని నిర్దేశింపబడినదో అచట సర్వకామాది శబ్దము లుపయుక్తము లని శంకరుడు హెచ్చరిక జేసెను. మరియొకచోటగూడ 'పరమేవ హి బ్రహ్మ విశుద్ధోపాధి సంబంధం క్వచిత్కై శ్చిద్వికార ధర్మై ర్మనోమయత్వాదిభి రుపాసనా యోపదిశ్యమాన మపరమితి స్థితిః' (బ్ర. సూ. భా. 4. 3. 9) పరమగు బ్రహ్మమే విశుద్ధోపాధి సంబంధము గలదై యొకానొకచో మనోమయత్వాది వికారధర్మములతో నుపాసనముకొరకు నుపదేశింపబడుచున్నది కాన నది అపర బ్రహ్మమగుచున్నది.'ఏవం సహస్రశోవిద్యావిద్యావిషయభేదేన బ్రహ్మణో ద్విరూపతాం దర్శయంతి వేదాంతవాక్యాని । తత్రావిద్యావస్థాయాం బ్రహ్మణ ఉపాస్యోపాసకాది లక్షణ స్సర్వోవ్యవహారః' (బ్ర. సూ. భా. 1. 1. 11) ఇట్లు సహస్ర

సంఖ్యాకమైన వేదాంతవాక్యములు విద్యావిద్యావిషయక విభేద కల్పనముతో బ్రహ్మమునకు ద్వివిధరూపముల బోధించు చున్నవి. అట అవిద్యావస్థయందు బ్రహ్మమున కుపాస్యోపాసకాది వ్యవహారమంతయు గలదు. 'తదాకారాలంబనో బ్రహ్మణ ఆకారవిశేషోపదేశ ఉపాసనార్థః' (బ్ర. సూ. భా. 3. 2. 15) ఉపాసనార్థము బ్రహ్మము అట్టి యాకారముచు బొందినదివలె దోచును. మరియు 'కిం ద్వే బ్రహ్మణీ పర మపరం చేతి' పరము నపరమునని బ్రహ్మములు రెండా? అని ప్రశ్నించి, యిరువురని అంగీకారమును స్పష్టపరచి, 'కిం పునః పరంబ్రహ్మ కిమపరమితి ఉచ్యతే, యత్రావిద్యాకృత నామరూపాది విశేష ప్రతిషేధా దస్థూలాది శబ్దై ర్బ్రహ్మోపదిశ్యతే తత్పరం। తదేవ యత్ర నామరూపాది విశేషాణాం కేనచిద్విశిష్టముపాసనా యోపదిశ్యతే 'మనోమయః...' ఇత్యాది శబ్దైస్తదపరం' (బ్ర. సూ. భా. 4.3.14) అయిన పరాపర బ్రహ్మము లెవ్వి? అని పునః ప్రశ్నించుకొని, ఎద్ది అస్థూలాది శబ్దములచే నవిద్యాకృతములగు నామరూపాది విశేషముల ప్రతిషేధమున నుపదేశింపబడుచున్నదో, అది పరమగు బ్రహ్మము. ఏది నామరూపాదికముతో మిళితమై, మనోమయాది శబ్దముల నుపాసనకొరకు కుపదేశింపబడుచున్నదో అది అపర బ్రహ్మమగు చున్నది అని శంకరుడు వివరించెను. కాన సుస్పష్టముగ 'నిరాకారమేవ బ్రహ్మావధారయితవ్యం। ఇతరాణిత్వాకారవద్బ్రహ్మ విషయాణి వాక్యాని న తత్ప్రధానాని ఉపాసనావిధి ప్రధానాని హి తాని' (బ్ర. సూ. భా. 3.2.14) కాబట్టి యథా

శ్రుతముగ నిరాకారమగు బ్రహ్మమే నిశ్చయము. ఇతరము లగు బ్రహ్మస్వరూప ప్రతిపాదనము ప్రధానముగాగలవిగాక, నితరములు ఉపాసనావిధి ప్రధానములు అని తాత్పర్యము. 'మందబుద్ధీనాం దిగ్దేశాదిభేదవత్ ...ఉపదేష్టవ్యః' (ఛాం. భా. 8. 1. 1) మందబుద్ధులకు సర్వము దేశకాలాది బద్ధమను విశ్వాసముండుటచే, దీని పరమార్థ విషయమున నన్వయింప నశక్యమయినను, బ్రహ్మోపగతి వినా పురుషార్థసిద్ధి గలుగదు కాన, ఆమందబుద్ధులకొరకై బ్రహ్మము దేశబద్ధముగా నుప దేశింపబడుచున్నది. అంతియకాక 'ప్రతిషిద్ధ సర్వవిశేషస్యాపి బ్రహ్మణ స్సర్వశక్తియోగస్సంభవతీ త్యేతదప్యవిద్యా కల్పిత రూపభేదోపన్యాసేనో క్తమేవ' (బ్ర. సూ. భా. 2. 1. 31) నిర్వి శేష బ్రహ్మమునకు సర్వశక్తియోగము సంభవించుననుమాటయు నవిద్యా కల్పిత రూప భేద ప్రతిపాదనమే యనియు మరువ రాదని శంకరుని హెచ్చరిక. అందుచే నిర్గుణ బ్రహ్మమున మాయా ప్రతిపాదనము, తత్ఫలితముగ ఈశ్వర కల్పనము కేవలము మందప్రజ్ఞుల భయనివారణము కొరకును, వారి యుపాసనోపయోగము కొరకు జరిగినదని స్పష్టము. మాయ ఎట్లు అనిర్వచనీయమని తెలుపబడి యున్నదో, నీ ఈశ్వరత్వ కల్పనము అతని స్థితియు ననిర్వాచ్యమై, పరిణామాది కార్య వ్యవహారమున కాస్పదమగుచున్నది. (బ్ర. సూ. భా. 2. 1. 27) 'పారమార్థికేన చ రూపేణ సర్వ వ్యవహారాతీత మపరిణత మవతిష్ఠతే' (బ్ర. సూ. భా. 2. 1. 27) పారమార్థికముగ నెల్ల వ్యవహారముల కతీతమయి, అపరిమితమై రాజిల్లు చున్నది.

ఆవిధముగ బ్రహ్మమునందు ఈశ్వరకల్పనము బ్రహ్మమునకు కళంకము గావింపదా అని ప్రశ్నించుకొనిన 'సర్వగతస్యాపి బ్రహ్మణ ఉపలబ్ధ్యర్థం స్థానవిశేషో న విరుధ్యతే సాలగ్రామ ఇవ విష్ణోరిత్యే తదప్యుక్తమేవ' (బ్ర. సూ. భా. 1.2.14) సర్వగతమైన బ్రహ్మమునకు సాక్షాత్కారమునకై విష్ణువునకు సాలగ్రామమువలె స్థాన విశేషము విరోధము కానేరదని స్పష్టపరుపబడెను. అటులే 'ప్రతిఫలతి భానురేకోఽనేక శరావోదకేషు యథా తద్వదసౌ పరమాత్మా హ్యేకోఽనేకేషు దేహేషు' (ప్ర. సు. 124) సూర్యుడొక్కడైయుండి అనేక శరావజలములలో ప్రతిబింబించిన విధానమున పరమాత్మ అనేక దేహములలో ప్రతిబింబించుటచే 'వాచారంభణమాత్రత్వా చ్చావిద్యాకల్పితస్య నామరూపభేదస్య న నిరవయవత్వం బ్రహ్మణః కుప్యతి' (బ్ర. సూ. భా. 2.1.27) అవిద్యాకల్పితమైన నామరూప భేదము వాచారంభణమాత్రమగుటచే, బ్రహ్మముయొక్క నిరవయవత్వమునకు విరోధము కానేరదు. 'యథా విశుద్ధం గగనం నిరంతరం న సజ్జతేనాపి చ లిప్యతే తథా। సమస్త భూతేషు సదైవ తేష్వయం సమః సదాఽత్మాఽహ్యజరోఽమరోఽభయః' (ఉ.సా.2.14.47) విశుద్ధమును నిరంతరమును అయిన ఆకాశము దేనిచేతను అంటబడకుండునట్లు సమస్తభూతస్థమైన ఆత్మయు అంటనిదై అజరామరాభయ లక్షణములతో విరాజిల్లుచుండును. 'భూతదోషైః సదాఽస్పృష్టం సర్వ భూతస్థ మీశ్వరం। నీలం వ్యోమ యథా బాలో దుష్టం మాం వీక్షతే జనః॥' (ఉ.సా. 2.9.5) సకల ప్రాణులందు ఆత్మగనుండి పాలించుచు, ఆభూతదోషముల నంటక

భాసించెడునన్ను (బ్రహ్మమును) బాలు రాకాశము నల్లగనున్న దనివచించునట్లు, నన్ను (బ్రహ్మమును) దోషవంతునిగ భావించె దరు. అనగా బ్రహ్మము అసంగుడు నిర్లిప్తుడనియే తాత్ప ర్యము. అటులే 'యథాఽయస్కాంతో మణిః స్వయం ప్రవృత్తిరహితోఽప్యయసః ప్రవర్తకో భవతి। యథా చ రూపాదయో విషయాః స్వయం ప్రవృత్తిరహితా అపి చక్షు రాదీనాం ప్రవర్తకా భవంతి। ఏవం ప్రవృత్తిరహితోఽపీశ్వర స్సర్వగత స్సర్వాత్మా సర్వజ్ఞ సర్వశక్తిశ్చ సన్ సర్వం ప్రవర్తయే దిత్యుపపన్నం' (బ్ర. సూ. భా. 2. 2. 2) ఎట్లయస్కాంత మణి తా ప్రవృత్తిరహితమయ్యును ఇనుమునకు బ్రవర్తకమగు చున్నదో, నెట్లు రూపాదులగు విషయములు తాము ప్రవృత్తి లేనివయ్యును నేత్రాదులకు బ్రవర్తకములైనటుల, ఈశ్వరుడు ప్రవృత్తిశూన్యుడైయుండియు సర్వగతాది సర్వశక్తియుక్తు డగుచు సర్వమును బ్రవర్తింప జేయుచున్నాడు. అయినను 'యథా స్వయం ప్రసారితయా మాయయా మాయావీ త్రిష్వపి కాలేషు న సంస్పృశ్యతే అవస్తుత్వాత్। ఏవం పర మాత్మాపి సంసారమాయయా న సంస్పృశ్యత ఇతి' (బ్ర. సూ. భా. 2. 1. 9) ఇంద్రజాలకుడు ఎట్లు తనచే బ్రసరింపజేయ బడిన మాయ లేనిదేగాన మూడుకాలములందును దానిచే స్పృశింపబడడో, అట్లే బ్రహ్మము సంసారమాయచే స్పృశింప బడడు. అటులే 'యథా చ స్వప్నదృగేకః స్వప్నదర్శన మాయయా న సంస్పృశ్యతే' స్వప్నద్రష్ట ఒకడు స్వప్నదర్శన మాయచే నెట్లు స్పృశింపబడడో, అట్లే బ్రహ్మముగూడ సృష్ట్యాదికముచే నంటబడడు. 'రజ్జ్వా ఇవ సర్పా భావే నేతి'

(బ్ర. సూ. భా. 2. 1. 9) రజ్జువునకు సర్పాదిభావమువలె కేవలము మాయయే యని నిర్ణయము. అందుచే బరబ్రహ్మము మాయాప్రభావమున నీశ్వరత్వమును వహించి, తద్ద్వారా సృష్ట్యాదికమునకు సర్వకారణమైనట్లు గోచరించినను, యథార్థమున సతతము సర్వాతీతుండై యుండును. అనగా బూర్ణము శుద్ధ పరబ్రహ్మమైయుండ పారమార్థికస్థితి యనియు, సత్యమనియు వచించబడుచు, నీమాయాకల్పనముతో వ్యావహారికమున దిగినట్లు అగును. 'త్రికాలాబాధ్యం సత్యం' అనునట్లు కాలత్రయముల నెట్టి విభేదములు లేక, కాలపరిమాణమునకే అతీతుడై యున్న ఆ పరమసత్యము వ్యావహారిక ప్రవేశమున త్రికాలబద్ధమై యొప్పారును. పూర్ణము నిర్వికార నిరాకారాది అవ్యక్త లక్షణముల నవాఙ్మానసగోచరమైన యా కూటస్థ సత్యము, సంతత వికార భూయిష్ఠమైనట్లు దోచుచు, బరిణమించుచు, బరిణామ సత్యమైనదని వ్యవహరింపబడుచున్నది. కాని యీవ్యవహారమంతయు గల్పనము మాత్రమే యగుచున్నదని పూర్వమే వ్యక్తము. అందుచే బరబ్రహ్మము సదా సంపూర్ణమే అయియున్నది. అది నిర్వికారమే.

పూర్ణము పరబ్రహ్మ విషయమున గల్పింప బడిన మాయ అనిర్వచనీయమై నిర్వితర్క్యమై యుండ, నది యింకను అవస్థా విభేదము నొంది 'సా చ గుణత్రయరూపా సూతే సచరాచరం విశ్వం' (ప్ర. సు. 99) గుణత్రయమై సచరాచరమైన విశ్వమునకు జనని యగుచున్నది. ఎట్లన బ్రథమమున నది తన త్రివిధ గుణములతో 'అస్యోపాధిః శుద్ధ సత్త్వ ప్రధానా మాయా యత్ర త్వస్య నాస్త్యల్ప భావః' (స. వే.

సి. సా. 503) ఎచట అల్పత్వము లేకుండునో అట్టి శుద్ధ సత్త్వ ప్రధానమై మాయ అతని కుపాధి యగుచున్నది. 'ఇయం సమష్టి రుత్కృష్టా సత్త్వాంశోత్కర్షతః పురా। మాయేతి కథ్యతే తజ్జైః శుద్ధ సత్త్వైక లక్షణా॥' (స. వే సి సా. 509) ఉత్కృష్టమును సమష్టి రూపమునునైన సత్త్వాంశము ఉత్కర్షముచే మాయ అని పూర్వము ఋషులచే శుద్ధ సత్త్వలక్షణముగలది అని వివరింపబడినది. శుద్ధ సత్త్వమగుటచే దానికి ప్రాధాన్యము గలిగి సమష్టిత్వముగూడ దానికి ఏర్పడినది. 'తస్మిన్ మహతి బ్రహ్మణి యో నౌ గర్భం హిరణ్యగర్భస్య జన్మనో బీజం సర్వభూత జన్మకారణం బీజం దధామి' (గీ. భా. 14. 3) త్రిగుణాత్మకమైన మాయయే సర్వమున కుపాదానకారణము. అదియు బ్రహ్మమునాబడు. అనగా ఈశ్వరుడు అని తాత్పర్యము. సర్వభూతజన్మకారణమై హిరణ్యగర్భ కారణమైన బీజమును అందు నేనుంచెదను అను వాక్యము చందము యీ శుద్ధసత్త్వాంశ విశిష్ట మాయోపాధిక బ్రహ్మము మహచ్ఛబ్దముచేగూడ వాకొనబడినది. అది సర్వభూత కారణము. కాన నిర్గుణము శుద్ధమాయా విశిష్టమై సగుణమ్ముగ నగుచు నీశ్వర నామధేయమున వ్యవహరింపబడుచున్నది. అదియే సర్వసృష్టికి కారణమగుచున్నదని గ్రాహ్యము.

ఇంతదనుక బ్రహ్మ మాయా సంబంధము అనిర్వచనీయముగ నెట్లేర్పడియున్నది వివరింపబడియున్నది. కాని ఈ అనిర్వచనీయ ద్వయ తత్త్వమేళనముచే నీశ్వరుడునా సగుణ బ్రహ్మము, అనగా నపర బ్రహ్మము ఏర్పడినట్లుండుటయు విశదీకరింపబడియున్నది. ఎట్లాలోచించినను శుద్ధ నిర్గుణమునకు

సృష్ట్యాదికార్యము నన్వయించుట కవకాశ మభావమగుటచే తత్క్రియా కారకత్వమునకై అనిర్వచనీయ మాయ యొండు కల్పింపబడి, నిర్గుణముతో దాని కొక అనిర్వాచ్య సంబంధము నేర్పాటుగావించి, దాన నొక సగుణ బ్రహ్మమును గల్పించి, తద్వారా సృష్టికార్య సమన్వయమును మందాధికారులకై చేసి శాస్త్ర ముద్యమించుట గాంచియున్నారు. కార్యనిర్వహణము కేవల వస్తువునకుగాక తదంతర్గత శక్త్యపేక్షితము గాన 'కో మాయాశీ పరమేశః' (ప్ర. ఉ.ర. 58) అనురీతి నా పరమేశ్వరరూప సగుణబ్రహ్మమే మాయ అని నిర్దేశింపబడుచు, 'శివశక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' (సౌం. ల. 1) సదాశివుడు శక్తితో గూడియే సృష్టినిర్మాణ సమర్థుడగుచున్నాడు అను తాత్పర్యమున నా మాయానామక 'ప్రకృతి కారణమవిద్యా అవ్యాకృతాఖ్యా' (ఈ. భా. 12) యగు తత్త్వమును 'అవ్యక్త నామ్నీ పరమేశశక్తిరనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా। కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్సర్వమిదం ప్రసూయతే॥' (వి. చూ. 110) అవ్యక్తాఖ్యయైన పరమేశ్వరశక్తి మాయ అవిద్య అని వచింపబడును. ఇది అనాదియై కార్యపరమై త్రిగుణాత్మకమై కార్యమునుండి తత్త్వజ్ఞులచే నూహింపబడినది. దీనినుండియే సర్వసృష్టి యుత్పన్న మగుచున్నదను విధమున నది పరమేశ్వరశక్తిగా నూహింపబడి యున్నది. ఇది కేవలము అనుమానప్రమాణమే యనియు నీశ్లోకము విశదపరచుచున్నది. ఈశక్తిసంబంధముననే బ్రహ్మము సృష్టి కారణముగ వ్యవహరింపబడుచున్నది.

మరియు 'కర్తృత్వాదిక మేతస్మాయా శక్త్యా ప్రతీయతే నిఖిలం!' (స్వా. ని. 74) నిఖిలమగు కర్తృత్వాదికము యీ మాయాశక్తిచేతనే ప్రతీతమగుచున్నది. 'అవృణో త్యపరాశక్తిః సా సంసారస్య కారణం' 'బ్రహ్మణ్యావస్థితా మాయా విక్షేపావృతి రూపిణీ! ఆవృత్యాఖండతాం తస్మిన్ జగజ్జీవౌ ప్రకల్పయేత్॥' (వా. సు. 15,35) అపరాశక్తియే ఆవరించుచున్నది, అదియే సంసారకారణము; బ్రహ్మములో నుండు విక్షేపావరణరూప శక్తి అఖండము నావరించి, అందు జీవ జగత్కల్పనము గావించుచున్నది. 'తథా తత్సర్వం తచ్ఛక్తిరైవాత్మశక్తి ర్మాయైవ కరోతి' (స. సు. భా. 2.21) ఆత్మశక్తియైన మాయయే యీ సర్వమును గావించుచున్నది. వటబీజమునగల వృక్షశక్తివలె 'సర్వస్య జగతో బీజభూత మవ్యాకృతనామరూపం సతత్త్వం సర్వకార్యకారణశక్తిః...' (కఠ. భా. 3.11) సర్వజగత్తునకు బీజభూతమై, నామరూపముల అవ్యాకృతమై, మాయయే సర్వ కార్య కారణశక్తిగ నున్నది. అటులే 'అక్షర మవ్యాకృతం నామరూపబీజశక్తిరూపం భూతసూక్ష్మ మీశ్వరాశ్రయం' (బ్ర. సూ. భా. 1.2.22) అక్షరము, అవ్యాకృతము, నామరూపముల బీజశక్తి భూత సూక్ష్మము ఈశ్వరాశ్రయము ననియు, 'అవిద్యాత్మికా హి సా బీజశక్తి రవ్యక్త శబ్దనిర్దేశ్యా పరమేశ్వరాశ్రయా' (బ్ర. సూ. భా. 1. 4. 3.) అవిద్యాత్మకమై బీజశక్తి నాబడునదియే నవ్యక్తశబ్దమున వ్యవహరింపబడుచు, పరమేశ్వరాశ్రయముగా తెలుపబడియున్నది. 'సర్వజ్ఞ స్యేశ్వరస్యాత్మభూతే ఇవ విద్యా

కల్పితే నామరూపే తత్త్వాన్యత్వాభ్యామనిర్వచనీయే సంసార ప్రపంచబీజభూతే సర్వజ్ఞస్యేశ్వరస్య మాయాశక్తిః ప్రకృతిరితి చ శ్రుతిస్మృత్యోరభిలప్యేతే' (బ్ర. సూ. భా. 2. 1. 14) సర్వజ్ఞుడగు నీశ్వరునకు నాత్మభూతమువలె గాన్పించుచు, నవిద్యచే గల్పింపబడి, ననిర్వచనీయములైన నామరూపములు, సృష్టికి బీజభూతములయిన సర్వజ్ఞుడగు నీశ్వరుని మాయాశక్తి, ప్రకృతి యనియు, శ్రుతిస్మృతులందు వచింపబడుచున్నది. 'ఏకస్యాపి బ్రహ్మణో విచిత్ర శక్తియోగాత్ క్షీరాదివ ద్విచిత్రః పరిణామ ఉపపద్యతే' (బ్ర.సూ.భా. 2.1. 24) ఒకటియగు బ్రహ్మమునకు విచిత్రశక్తిసంయోగముచే క్షీరాదులందువలెనే విచిత్రమైన పరిణామ ముపపన్నము అనియు నీ వాక్యముల మాయ సగుణ బ్రహ్మముయొక్క సృష్టికారకశక్తిగను జగత్తుయొక్క బీజశక్తిగను వివరింపబడుచున్నది.

ఈ భావమును గీతాభాష్యము యింకను విశదపరచుచున్నది. గీతాశాస్త్రము ముఖ్యముగ స్థూలదృష్టిగల ముముక్షువులకు నిర్దేశ్యమై, తాత్త్విక విషయములకంటె బ్రహ్మప్రాప్తిహేతు మార్గముల బోధించుచు, సాధన సిద్ధుల నుపదేశించు గ్రంథము కావుటచే నది స్థూలముగనే తత్త్వ విషయముల దెలిపియున్నది. అందుచే ఉపనిషత్తులు శ్రుతి అనియు, సూత్రము యుక్తిఅనియు, గీత అనుభవమనియు మున్నే చెప్పబడియున్నది. అందుచే నాయా గ్రంథపఠన కాలముల నాదృష్టి గలిగియే అధ్యయనము గావించుట అవసరము. అనుభవమునకు యుక్తి తోడు గావలయును. దానికి శ్రుతిప్రమాణ మవసరము. అందుచే శ్రుతిభావముల యుక్తితో

బరిశీలించి, అనుభవము నన్వయించుట ఆర్యవిధానముగాన పూర్వోక్త శ్రుతి తాత్పర్యములనే గీతాశాస్త్రమున నన్వయించుకొనవలెను. కాన గీతాశాస్త్రబోధిత శక్తి సృష్టికారణమని తెలుపబడుచున్న సగుణబ్రహ్మపరముగనే నన్వయించుకొనవలెను గాని, సాక్షాత్తు పరబ్రహ్మమున నన్వయింప యత్నించుట దోషయుక్తము. గీతాశాస్త్రమున విశ్వకర్తృస్థానమునుండి ప్రసంగించుచున్న శ్రీకృష్ణునిచే నావచనములు బలుకబడుటచే నవి సగుణబ్రహ్మాన్వయముతో జగుచున్నవి. తదనుగుణముగనే శంకరభాష్యముగూడ ననువర్తించుచుండు టలో నాశ్చర్యమేమియులేదు.

'మదీయా మాయా త్రిగుణాత్మికా ప్రకృతి ర్యోనిః సర్వభూతానాం కారణం' (గీ. భా. 14. 3) త్రిగుణాత్మక ప్రకృతియై, సర్వభూతములకు కారణమైన నా మాయ అనియు, 'అవ్యాకృత మీశ్వర శక్తిః' 'మమ మాయా దురత్యయా' (గీ. భా. 13. 5) అనునట్లు అవ్యాకృతమైన ఈశ్వరశక్తియే ప్రస్తాపితమనియు, 'భగవతో మాయాశక్తిః క్షరాఖ్యస్య పురుష స్యోత్పత్తి బీజం' (గీ. భా. 15. 16) క్షరుడైన పురుషుని ఉత్పత్తికారణమైన భగవంతుని మాయాశక్తి, 'యథా చేశ్వర శక్త్యా భక్తానుగ్రహాదిప్రయోజనాయ బ్రహ్మ ప్రతిష్ఠతే ప్రవర్తతే। సా శక్తి ర్బ్రహ్మైవాహం శక్తి శక్తిమతో రనన్యత్వా దిత్యభిప్రాయః' (గీ. భా. 14. 27) భక్తుల ననుగ్రహించు ప్రయోజనముగల ఈశ్వరశక్తిచే బ్రహ్మముగా దా ప్రవర్తించును. ఆ శక్తి బ్రహ్మమును నేనే. శక్తి శక్తిమానులకు అనన్యముగదా! 'ప్రకృతి ఈశ్వరస్య వికార కారణ

శక్తి స్త్రిగుణాత్మికా మాయా' (గీ. భా. 13. 19) ఈశ్వరుని వికారకారణశక్తియై, త్రిగుణాత్మకమైన ప్రకృతి మాయ. 'పుట్టుక లేని వాడనయ్యు, నా జ్ఞానశక్తి అవ్యయమై యున్నను, బ్రహ్మాదిస్తంబ పర్యంత సృష్టికి యీశ్వరుడనై యున్నను, త్రిగుణాత్మకమైన 'ప్రకృతిం స్వాం మమ వైష్ణవీం మాయాం త్రిగుణాత్మికాం' నా వైష్ణవీ శక్తియైన మాయా వశమున 'సంభవామి దేహ వానివ' (గీ. భా. 4. 6) దేహధారునివలె జనించెదను.' అను వచనములనేగాక, గీతా భాష్య ప్రారంభముననే 'స చ భగవాన్ జ్ఞానైశ్వర్య శక్తి బలవీర్య తేజోభిః సదా సంపన్నః త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాం మాయాం మూల ప్రకృతిం వశీకృత్యాఽజోఽవ్యయో భూతానా మీశ్వరో నిత్య శుద్ధ ముక్తస్వభావోఽపి సన్ స్వమాయయా దేహవానివ జాత ఇవ చ లోకానుగ్రహం కుర్వన్ లక్ష్యతే' (గీ. భా. ఉ. 1. 1) తన అనంత జ్ఞానైశ్వర్య శక్తి బల వీర్య తేజో లక్షణముల గలిగియు, తన వైష్ణవీ మాయయైన, త్రిగుణాత్మకమైన మూల ప్రకృతిని వశము గావించుకొని, అజత్వ అవ్యయత్వాదిక లక్షణములుగల ఈశ్వరుడు, నిత్య శుద్ధ ముక్తస్వభావము గలిగియుండియు, ఆత్మ మాయచే లోకానుగ్రహార్థమై దేహధారి అయినట్లు గోచరించును అని శంకరుడు నిర్గుణ బ్రహ్మమును సగుణ బ్రహ్మముగ గావించుటకేగాక, నా అనిర్వాచ్య మాయా బలముచే నా సగుణ బ్రహ్మమునకు రామకృష్ణాద్యవతార ధారణమునుగూడ సమ్మతించెను. అనగా అద్వైత సిద్ధాంత రహస్యము నిర్గుణ బ్రహ్మ ప్రతిపాదనమునకే ప్రాధాన్యము

నొసంగునుగాని, స్థూల ప్రజ్ఞులకై కల్పింపబడిన మాయచే కాలాంతరమున నెట్టి కల్పనములు అనంతముగ గల్గినను ఆ సిద్ధాంతము కాదనదు. ఈ కల్పన లెట్లు ఏర్పడినవో, వాని రహస్యముల గ్రహించి అనర్థహేతువులైన దుష్టకల్పనముల శ్రేష్ఠ కల్పనములతో నిరాసము గావించి, స్థూలముల నుండి సూక్ష్మ సుసూక్ష్మముల కెగబ్రాకి, లయచింతనముల ననుసరించి, జీవత్వమును శోషింపజేసి, ఈశ్వరత్వమును బొంది, 'ఈశ్వ రోహం' వృత్తిని అంత దాని లయింపజేసి, 'బ్రహ్మై వాహం' వృత్తికి నెక్కి అంత అవాఙ్మానసగోచర స్థితినొంది, పరిపూర్ణబ్రహ్మత్వ స్థితినుండుటయే అద్వైతవాద తాత్పర్యము.

ఈ మాయాశక్తినే 'ఈశస్య మాయా మహదాది కారణం'. (వి. చూ. 245) మహదాదులకారణమై ఈశుని మాయ అనియు, 'ఇంద్రః పరమేశ్వరో, మాయాభిః ప్రజ్ఞాభిః' (బృ. భా. 2.5.19) ఇంద్రుడైన పరమేశ్వరుడు తన ప్రజ్ఞ యనబడు మాయనుగలిగి అనియు, 'స్వయం స్వ మాయయా స్వమాత్మానమాత్మా దేవః ఆత్మన్యేవ వక్ష్యమాణం భేదాకారం కల్పయతి రజ్వాదివ సర్పాదీన్' (మాం. భా. 2.12) ఆత్మ తనమాయద్వారా తనలో వివిధ ఆకారముల రజ్జువుపై జూడబడు సర్పాది స్వరూపములవలె గల్పించుకొనును. 'మాయైషా తస్యాత్మనో దేవస్య... తథేయమపి దేవస్య మాయా యయాఽయం స్వయమపి మోహిత ఇవ మోహితో భవతి' (మాం. భా. 2.19) స్వప్రకాశకమైన ఆత్మలోగల మాయవలన భ్రాంతి జరుగును.... తనమాయచే

నాత్మయే విభ్రాంతినొంది నట్లుండును. 'ఆత్మానం సృజా మ్యహం మాయయా' (గీ.భా. 4.7) స్వీయమాయచే నావిర్భవించెదను. 'ప్రకృతిర్భగవతో మాయా త్రిగుణాత్మికా' (గీ. భా. 13.20) ప్రకృతి యన త్రిగుణాత్మికయగు భగవన్మాయాశక్తి అను అర్థముననే 'ప్రకృతిసంభవా భగవన్మాయా సంభవా' (గీ. భా. 14.5) 'ఈశ్వరస్య ప్రకృతిస్త్రిగుణాత్మికా మాయా' (గీ. భా. 18.41) అను వాక్యములును అన్వయములు. 'యయా యోగమాయయా సమావృతం మాం లోకో నాభిజానాతి నాసౌ యోగమాయా మదీయా సతీ పరమేశ్వరస్య మాయావినో జ్ఞానం ప్రతిబధ్నాతి యథాన్యస్యాపి మాయావినో మాయా జ్ఞానం తద్వత్' గీ. భా. 7.25) ఏ యోగమాయ నన్నావరించినదో, దేనిచే నన్ను జీవులు గ్రహింపలేకున్నారో, అది నాదై నా స్వాధీనమై యున్నది. అందుచే నది మాయావినైన నాజ్ఞానమును ప్రతిబంధింపనేరదు. మాయావియొక్క జ్ఞానమును మాయ నివారింపనేరదుగదా! అందుచే 'యద్యపి మాయయా సంవ్యవహారేణ తస్య కర్మణః కర్తారమపి సంతం మాం పరమార్థతో విద్ధ్యకర్తారం' (గీ. భా. 4. 13) మాయా దృష్టితో జూడ నీకార్యములకు నేను కర్తగా దోచినను, నేను పరమార్థతః సంసారమునకు కర్తగగాని కర్మనుగగాని లేను అని కృష్ణపరమాత్మ బ్రహ్మపదార్థముయొక్క నిర్లిప్తతను జాటియుండ, దాని శంకరుడనువదించి యున్నాడు. ఆ విషయముననే 'అక్షరాత్పరో నిరుపాధికః పురుషః' (ముం. భా. 2. 1. 2) అక్షరమైన మాయకంటె పరుడైనవాడు నిరు

పాధికుడైన పురుషునిగా శంకరుడు వచించియున్నాడు. అయినను వ్యావహారికముగ 'ప్రకృతి పురుషులు ఈశ్వర ప్రకృతులు. ఈప్రకృతి పురుషు లనాదులు. ఈశ్వరు డనాది యగుటచే నివికూడ ననాదులే' (గీ. భా. 13. 19) అనియు తెలిపెను. కాన నీమాయ ఈశ్వరు నాశ్రయించి, విచిత్ర శక్తి నాబ్రఖ్యాతి నార్జించి, అఘటనాఘటన సామర్థ్య మున నీ సృష్టికంతటికి ఉపాదానత్వమును బొంది యున్న దని తాత్పర్యము. అంతియగాక అది పారమార్థికముగ నభావమే యని గ్రాహ్యము.

---

## ఈశ్వర గుణములు

'యో మోహయతి భూతాని స్నేహపాశానుబంధనైః। సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః॥' (మ. వా. ద. 238) సృష్టియొక్క రక్షణమునకై ఏమహాత్ముడు స్నేహ పాశములచే సర్వజీవులను మోహింపజేయుచున్నాడో, అట్టి అజ్ఞానోపాధిక పరమేశ్వరునకు నమస్కారము. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ విశుద్ధం పరం స్వతః సిద్ధం। నిత్యానందైక రసం ప్రత్యగభిన్నం నిరంతరం జయతి॥' (వి. చూ. 227) అబా ధిత సత్తాస్వరూపముగలదై, స్వప్రకాశమై, దేశకాలవస్తుపరి చ్ఛేదరహిత అనంతమై, శుద్ధమై, పరమై, స్వతస్సిద్ధమై, శాశ్వ తానందస్వరూపమై, ప్రత్యగభిన్నమై పరమాత్మ ప్రకాశించు చున్నాడు అను వాక్యమున నీశ్వరునకు సత్యంజ్ఞానమనంతం

లక్షణములు ఆపాదింపబడియున్నవి. ఇట్లు ఈశ్వరలక్షణ ప్రతిపాదనముతో ఈశ్వరుడు గ్రాహ్యుడై, సద్గుణగణసంపన్నుడై భక్త్యుత్తేజకరముగ వర్ణింపబడుచుండును. ఇటనుండియే జ్ఞానేతర కర్మ భక్తి యోగాది మార్గము లుపపన్నములు. మానవులగల సంకుచిత సద్గుణపుంజములు సర్వేశ్వరునిలో అనంతముగ గల్పింపబడుట యుండు గానగలము. కాన బ్రహ్మ జీవులకుకంటె, జీవేశ్వరులకు సన్నిహితత్వము గలుగును. అవును, 'అవిద్యోపాధికో జీవో మాయోపాధిక ఈశ్వరః' (వే. డిం. 30) అనునట్లు, యిరువురును శుద్ధాశుద్ధ మాయోపాధి విశిష్టులు గదా! అందుచే తరతమ భావములతో నేక గుణముల గలిగియుండుటయు, కాన సన్నిహితత్వముచే తత్ఫలిత పరస్పరాపేక్షిత్వమును గలిగియుండుటయుం జాశ్చర్యము లేదు. కాన సత్య జ్ఞాన అనంతాదిలక్షణములు ఈశ్వరునకు ఉపపన్నములే యగును.

'సత్యం జ్ఞానం మనంతం చ బ్రహ్మలక్షణ ముచ్యతే' (త. ఉ. 18) 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మే త్యేతస్య లక్షణం ప్రథతే' (స్వా. ని. 20) అను వాక్యములు సత్య జ్ఞానానంతగుణముల దెలిపియున్నవి. ఈపదములు బ్రహ్మమును నిర్వచించుచున్నవి. ఈ పదములు పరస్పరాన్వయ విశేషణములుగాక, ప్రత్యేకముగ బ్రహ్మపదమునకే అన్వయించును. అటులే 'సత్య జ్ఞానానందరూప' (అ. మ. 4) 'సత్య జ్ఞాన సుఖాత్మకం |' (స. వే. సి. సా. 996) అని ప్రవచింపబడి యున్నది. అదియే మరల కించిద్ శబ్దవ్యత్యాసమున 'సచ్చిదానంద మద్వయం' (ఆత్మబోధ. 56) 'సచ్చిదానందః'

(స్వా. ని.71) 'యదేకంసదాసచ్చిదానంద కందం' (ని.మం. 9) అనియు, 'అస్తి భాతి ప్రియం రూపం నామం చే త్యంశ పంచకం। ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం॥' (వా. సు. 20) అనియు, బర్యాయ పదముల వర్ణితమై యున్నది. 'జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ భేదః పరాత్మని న విద్యతే। చిదానందైక రూపత్వాత్' (ఆ. బో.41) అనుచోట కేవలము చిదానందస్వరూపమనగను, 'ఈశ్వరం మాయినం విద్యాన్మాయాతీతం నిరంజనం। సదానందే చిదాకాశే...' (సదాచార. 41) అను వచనమున సదానందచిదాకాశ శబ్దములతోడను, 'నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం। శుద్ధం విజ్ఞాన మానందం బ్రహ్మ' (మ.వా.ద.177) అను వాక్యమున 'విజ్ఞానమానందం బ్రహ్మ' అను పదములతోడను ఈశ్వరుడు వర్ణింపబడెను. ఆయా వచనములుంగల నితర గుణములును పరిగ్రాహ్యములే యగును.

'తతో భావాభావరూపం సకలం సత్యమేవ హి' (మ. వా. ద.132) భావాభావరూపమైన సర్వమును సత్య పదముచే నన్వయము. 'బ్రహ్మైవ సత్య శబ్దార్థః। సత్యం జ్ఞాన మితి శ్రుతేః' (మ. వా. ద. 133) సత్య శబ్దమునకు బ్రహ్మమే అర్థము. సత్య జ్ఞానానంతము బ్రహ్మమని శ్రుతితాత్పర్యము గదా! అందుచేతనే 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య జీవో బ్రహ్మైవ నాపరః।' (వే. డిం. 66, బ్ర. జ్ఞా. మా. 21) అనువాక్యమున బ్రహ్మేతరములైన జీవ జగత్తుల జూపి, తదన్యత్వము బ్రహ్మమనియు నందుచే సత్యమని నిరూపితమైయున్నది. ఎట్లనగా 'మృదాది కారణం నిత్యం త్రిషు కాలేషు దర్శనాత్। ఘటాద్యనిత్యంతత్కార్యం యత స్తన్నాశ ఈక్ష్యతే॥ తథైవై తజ్జగ

త్సర్వ మనిత్యం బ్రహ్మకార్యతః। తత్కారణం పరం బ్రహ్మ భవేన్నిత్యం మృదాదివత్॥' (స. వే. సి. సా. 17, 18) త్రికాలములయందును మృదాదికారణములు నిత్యములు. కాని తత్కార్యములైన ఘటాదుల నాశము చూడబడుచుండు టచే నవి అనిత్యములు. అటులే బ్రహ్మకార్యములగు జగ దాది సర్వము అనిత్యము కాని, దానికారణమైన పర బ్రహ్మము నిత్యము అగుచుండుటచే సత్యత్వము త్రికాలా బాధ్యము అని గ్రాహ్యము. 'సత్యమితి యద్రూపేణ యన్ని శ్చితం తద్రూపం న వ్యభిచరతి సత్యత్వం' (తై. భా. 2. 1.) దేనిరూపముచే దాని నిశ్చయము జరుగునో అది అవ్యభి చారితమై సత్య మనబడును. అనగా దాని రూపము స్వతః సిద్ధమై, అన్యత్ర నలభ్యమై యుండుటయు సత్యత్వ మన బడును. 'నైతత్సదాఖ్యం బ్రహ్మ స్వేనరూపేణ వ్యేతి వ్యభిచరతి నిరవ యవత్వా ద్దేహాదివత్ - - అతోఽవ్యయస్యాస్య బ్రహ్మణో వినాశం న కశ్చి త్కర్తు మర్హతి' (గీ. భా. 2. 17) సన్నా మకమైన బ్రహ్మము దేహాదికములవలె అవయవములు గలది కాదు కాన నిరంతము. అందుచే నట్టి అవ్యయ బ్రహ్మమునకు వినాశము గల్పింప నేరికి నసాధ్యము. ఈ సదాఖ్యతత్త్వమే లేకున్న సర్వాభావము సర్వశూన్యత్వ మేర్పడును గాన 'సదాస్పదం హి సర్వం సర్వత్ర సద్బుద్ధ్యనుగమాత్ । న హి మృగతృష్ణికాదయోఽపి నిరాస్పదా భవంతి' (గీ.భా. 13. 14) సత్తుమీదనే సర్వము నాధారపడియున్నది. అఖిలమునకు సద్భావము ఇమిడియే యున్నది. మృగతృష్ణికాది భ్రాంతుల కైనను సత్తు ఆధారమైయున్నది.

సచ్ఛబ్దమువలెనే జ్ఞాన చిచ్ఛబ్దములు పూర్వము తెలుపబడియున్నవి. 'సుఖరూపం చిదద్వైతం దుఃఖరూపమసజ్జడం' (త. ఉ. 49) అద్వైతమైన చిదంశము సుఖరూపమైయుండ, అసత్తునై జడమైనది దుఃఖాత్మక మగుచున్నది. అదియే 'చిన్మాత్ర జ్యోతిషో నిత్యం తమస్తస్మిన్న విద్యతే' (ఉ. సా. 2. 14. 37) చిన్మాత్రమై జ్యోతిస్స్వరూపమనియు, నిత్యమైనదనియు వాకొనబడి, అందు తమస్సు అభావమని తెలుపబడియున్నది. అందుచేతనే 'అంతః పూర్ణం బహిః పూర్ణం స్వయమద్వయ మక్రియం। యదనంతం పరంజ్యోతి బ్రహ్మ...' (మ. వా. ద. 172) బాహ్యాభ్యంతరములు లేనిదై, అద్వయమై, అక్రియమై, అనంతమైన పరంజ్యోతియైన బ్రహ్మము, 'జ్యోతి శ్శాంతం హ్యనంతం' (శ. శ్లో. 90) అనియు నిర్వచింపబడియున్నది. అటులే నది చైతన్యమగుటచే 'దృగ్దృశ్యౌ ద్వౌ పదార్థౌ పరస్పర విలక్షణౌ। దృగ్ బ్రహ్మ దృశ్యం మాయా స్యాత్ సర్వవేదాంత డిండిమః॥' (బ్ర. జ్ఞా. మా. 18, వే. డిం. 29) పరస్పర వైలక్షణ్యముగల దృగ్దృశ్యములు నా రెండుపదార్థములు గలవు. అందు దృక్ బ్రహ్మము, దృశ్యము మాయయని వేదాంత తాత్పర్యము. ఈవిధముగ సచ్చిదానంద ఆనందాది పదములు దేశకాలవస్తు విభేదముల కతీతమై, (తై. భా. 2. 1) యొప్పారుచున్నవని విదితము. ఈ గుణములు ప్రథమతః ఈశ్వరునకు నాపాదింపబడియున్నవి. వాని ఫలితముగ నావిర్భవించిన నసంఖ్యాకమగు నీశ్వర గుణములలో గొన్నింటెనిమాత్రము చూచెదము గాక.

'సర్వేశత్వ స్వాతంత్రత్వ సర్వజ్ఞత్వాదిభిర్గుణైః । సర్వోత్తమః సత్యకామః సత్యసంకల్ప ఈశ్వరః॥' (స. వే. సి. సా. 721) 'మాయోపహిత చైతన్యం సాభాసం సత్త్వబృంహితం। సర్వజ్ఞత్వాది గుణకం సృష్టి స్థిత్యంతకారణం ॥ అవ్యాకృతం తదవ్యక్త మీశ ఇత్యపి గీయతే । సర్వశక్తిగుణోపేతః సర్వజ్ఞానావభాసకః॥ స్వతంత్రః సత్య సంకల్పః సత్యకామః స ఈశ్వరః । తస్యైవ తస్య మహావిష్ణో ర్మహాశక్తే ర్మహీయసః॥' (స. వే. సి. సా. 310-12) మాయోపాధిక చైతన్యమును, ఆభాసయుక్తమును సత్త్వప్రధానమును, సర్వజ్ఞత్వాది గుణములు గలవాడును సృష్టి స్థితి లయ కారణుడును, అవ్యాకృత అవ్యక్త మీశాది నామధారియు, సర్వశక్తియై సర్వజ్ఞాన విశిష్టుడును, స్వతంత్రాది లక్షణములు గలిగిన మహావిష్ణువునకు మహాశక్తిగలదు అను వాక్యముల ఈశ్వర గుణము లెన్నియో క్రోడీకరింపబడియున్నవి. అటులే 'సర్వజ్ఞత్వం పరేశత్వం తథా సంపూర్ణ శక్తితా । ' (31) 'మాయోపాధి ర్జగద్యోనిః సర్వజ్ఞత్వాది లక్షణః ।' (45) అనియు వాక్యవృత్తి కథనము.

ఈ విధముగనే భాష్యగ్రంథములు 'ఈశ్వరో నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావః సర్వజ్ఞః సర్వశక్త్యుపాధిః' (ముం. భా. 3. 1. 1) 'సర్వభూత నియంతృత్వా దీశానః' (21) 'సర్వశక్తిమత్తయా ఈశ్వరః' (వి. స. భా. 22) సర్వశక్తిమంతుడుగాన ఈశ్వరుడని యనబడును అని పలుచోట్ల వివరించియున్నవి.

కాని 'ఏవం చ సతి సర్వక్షేత్రేష్వపి సతో భగవతః క్షేత్రజ్ఞ స్యేశ్వరస్య సంసారిత్వగంధమాత్రమపి నాశంక్యం!' (గీ. భా. 13. 2) యిట్లు క్షేత్రజ్ఞుడై, ఈశ్వరుడై, సర్వక్షేత్రముల నుండియున్నను ఈశ్వరునికి నిసుమంతయైనను సంసార గంధము అంటసేరదని గీతాభాష్యము వచింప, నీ సర్వజ్ఞత్వాదిక గుణాదులు మాయాసృష్టి కల్పనమునకు మాత్రముప యుక్తమనియు, (ఐ. భా. 4. 1), 'తదేవ మవిద్యాత్మకోపాధి పరిచ్ఛేదాపేక్ష మేవేశ్వర స్యేశ్వరత్వం సర్వజ్ఞత్వం సర్వ శక్తిత్వం చ న పరమార్థతో విద్యయాపాస్త సర్వోపాధి స్వరూపే ఆత్మనీశి త్రీశితవ్య సర్వజ్ఞత్వాది వ్యవహార ఉప పద్యతే' (బ్ర. సూ. భా. 2.1.14) ఈప్రకారముగా నీశ్వరునకు ఈశ్వరత్వ,సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వములు అవిద్యాత్మక ఉపాధి పరిచ్ఛేదనార్థమై చేయబడినవే కాని విద్యచే సర్వోపాధిస్వరూప వర్జితుడైన ఆత్మయందు సత్యముగ ఈశత్వ ఈశితవ్యములుగాని, సర్వజ్ఞత్వాదులుగాని ఉపపన్నము కావు. ఈవిషయమునే వివరించుచు, ఎట్లు ఆరోపిత రజతమునకు శుక్తిమాత్రమే అధిష్ఠానమై, శుక్తేతరస్థితి ఉపపన్నముగాక నుండునో అట్లే బ్రహ్మేతర పదార్థము అభావమగుటచే 'అతోఽహీశే సర్వజ్ఞ త్వాదయో మృషా' (మ. వా. ద. 155) ఈశ్వరుని యందు సర్వజ్ఞత్వాది గుణములు అసత్యములే యగునుగదా! 'స్వాజ్ఞానకల్పితాః సర్వే స్వస్మిన్ కించిద్జ్ఞతాది వత్' సర్వ సర్వజ్ఞత్వాది గుణములును, కించిజ్ఞత్వాదికములును, తన నాశ్రయించియున్న అజ్ఞానకల్పితములు, (156.7) అని మహావాక్యదర్పణము నిరసించుచున్నది.

పైవిధముగనే యీశ్వరునందు యింక ననేకగుణములు చెప్పఁబడియున్నవి. 'ఈశ్వరః। సర్వాత్మా సర్వరూపశ్చసర్వాతీతోఽహ మవ్యయః॥' (అ. అ. 40) ఈశ్వరుడు సర్వాత్మ సర్వరూపుడు, సర్వాతీతుడు, అవ్యయుడు అతడే నేను. 'తస్య నియామకః। ఈశ్వరః శక్త్యుపాధిత్వాత్' (త. ఉ. 19) జీవుని నియంతయు శక్త్యుపాధిగలవాడును ఈశ్వరుడు. 'నిరస్తాశేష సంసారదోషోఽస్థూలాది లక్షణః। అదృశ్యత్వాది గుణకః పరాకృత తమోమలః॥ నిరస్తాతిశయానందః సత్యః ప్రజ్ఞాన విగ్రహః। సత్తా స్వలక్షణః పూర్ణః పరమాత్మేతి గీయతే॥' (వా. వృ. 29,30) సంసృతిదోష రహితమును అస్థూలాది లక్షణోపేతమును, అదృశ్యత్వాది గుణకమును, అజ్ఞానమాలిన్య రహితమును, ఆనంద పరమావధియు, సత్యస్వరూపమును, ప్రజ్ఞానమూర్తియు, సల్లక్షణమును పూర్ణమును అగునదియే పరమాత్మ. సర్వజ్ఞుడనియు పరేశుడనియు సంపూర్ణ శక్తిమంతుడనియు, 'నియంతృత్వంచ' (35) నియంతగను, 'కర్మణాం ఫలదాతృం... జీవానాం హేతు కర్తృత్వం' (36) కర్మఫలదాతయు, జీవులను కర్మలయందు నియోగించువాడును అనియు వాక్యవృత్తి అభివర్ణనము. 'ఉపాధిరేవ మాహాత్మ్య జీవాచ్ఛ్రేష్ఠత్వ మీశితుః'(23) ఉపాధిమహిమ చేతనే జీవునికంటె ఈశ్వరునకు ఆధిక్యత యేర్పడినది. శుద్ధమాయ ఈశ్వరునకును, మలినమాయ జీవునకు ఉపాధులగుటచే ఈశ్వరు డధికుడగుచున్నాడు (22) అని మహావాక్య దర్పణ వివరణము. 'మాయాభాసో విశుద్ధాత్మా త్రయమేతన్మహేశ్వరః' (స్వా. ప్ర. 39) మాయ, ప్రతిబింబము, ఆత్మల

కూడికయే మహేశ్వరు డగుచున్నాడు. అతడు 'పూర్ణత్వా న్నిర్వికారిత్వా ద్విశుద్ధత్వా న్మహేశ్వరః' (స్వా. ప్ర. 40) పూర్ణత్వ నిర్వికారత్వ విశుద్ధత్వము లుండుటచే మహేశ్వరు డగుచున్నాడు.

'నిత్య నిరతిశయ జ్ఞానశక్త్యుపాధిః ఆత్మాంఽతర్యా మీశ్వరః ఉచ్యతే, స ఏవ నిరుపాధిః కేవలః శుద్ధః స్వేన స్వభావే నాక్షరం పర ఉచ్యతే' (బృ. భా. 3. 8. 12.) ఆత్మకు నిత్య నిరతిశయజ్ఞానశక్తి ఉపాధిగ నయినప్పుడు అంతర్యామి అనియూ ఈశ్వరుడనియు ననబడును. అదియే నిరుపాధిక కేవలశుద్ధమై, అక్షరమై, పరమని వచింపబడును. 'తదత్యంత విశుద్ధ ప్రజ్ఞో పాధి సంబంధేన సర్వజ్ఞ మీశ్వరం సర్వసాధారణావ్యాకృత జగద్బీజప్రవర్తకం... హిరణ్యగర్భసంజ్ఞం భవతి' (ఐ. భా. 5. 3.) శుద్ధ ప్రజ్ఞోపాధి సంబంధముచే బ్రహ్మము, సర్వజ్ఞుడైన ఈశ్వరుడుగను, సర్వసాధారణమైన అవ్యాకృత జగద్బీజ ప్రవర్తకమైన హిరణ్యగర్భనామమును బొందును. 'బ్రహ్మా పరివృఢో మహాన్ ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యైః సర్వానన్యా నాతిశేతః' (ముం. భా. 1, 1. 1) బ్రహ్మమనగ పూర్తి అభి వృద్ధినొందినదై మహత్తై సర్వేతరములకంటె ధర్మ జ్ఞాన వైరాగ్యైశ్వర్యముల నధిగమించినదైనదని తాత్పర్యము. 'స హి సర్వాధ్యక్షః' (బ్ర. సూ. భా. 3. 2. 38) 'యత్ర యత్ర విభూత్యాద్యతిశయః స ఈశ్వరః' (బ్ర. సూ. భా. 1. 1. 11) ఎచ్చెటచ్చట అతిశయ విభూతిగలదో అతడే ఈశ్వరుడు. 'బ్రహ్మాదీనా మపీశ్వరత్వాత్ సర్వలోక మహేశ్వరః' (వి. స. భా. 6) త్రిమూర్తులగూడ నియమించుటచే మహే

శ్వరుడు అనుకీతి నా సగుణ బ్రహ్మమునకు జీవ జగత్తుల సృజించి, పాలించి, లయించు వేళల, అవసరమైన సర్వవిధ లక్షణములు గల్పితమై, అతనిపై నారోపింపబడియు వివరింప బడియున్నవి. వాని నన్నింటిని శంకరుడుగూడ యథాతథ ముగనే స్వీకరించి, తన గ్రంథముల వివరించియుండుట దీన విదితమగుచున్నది. అందుచే నద్వైతసిద్ధాంతభంగము వాటిల్ల నేరదు. సగుణత్వాదికమంతయు కల్పితమే అని పూర్వమే వచింపబడియున్నది. ఆ భావమును మనసా ధరించి ముందు గ్రంథమును చూచెదముగాక.

---

# జీవుడు

## స్వరూపము

'అచేతనా శ్చేతనతాం ప్రయాంతి బుద్ధ్యాదయో యస్య మహా ప్రసాదాత్ । సర్వాంతరః సర్వవిలక్షణో య స్తం ప్రత్యగాత్మాన మవేహి విద్వాన్॥' (మ. వా. ద. 38) ఓ విద్వాంసుడా, ఏజ్ఞాన స్వరూపునియొక్క అనుగ్రహముచే అచేతనములైన బుద్ధ్యాదితత్త్వములు చేతనములై యొప్పారు చుండునో, ఎవడు సర్వాంతరుడై యుండియు విలక్షణుడై యుండునో అట్టి ప్రత్యగాత్మను గ్రహింపుము. ఎందుచేనన "సంబంధినోః సతోర్నాస్తి నివృత్తిః సహజస్య తు। కర్మ

క్షయాత్ ప్రబోధాచ్చ నివర్తేతేక్రమాదుభే॥' (వా. సు. 9) అహంకార చిదాభాస సంబంధము సహజన్యమగుటచే నివర్తింపదు. కర్మక్షయమై ప్రబోధగల్గుటతోడనే అహంకార సాక్షులకుగల భ్రాంతిసంబంధము సమసిపోవును. అనగా నా భ్రాంతిజన్యసంబంధముజ్ఞానోదయమున విచ్ఛిన్నమై స్వాత్మప్రకాశము గలుగుచున్నది. ఈ భ్రాంతికారణముననే 'యదేవ దృశ్యతే లోకే తేనాభిన్నత్వ మాత్మనః। ప్రసద్యతే తతో మూఢ స్తేనాత్మానం న విందతి॥' (ఉ. సా. 2. 12. 2) వ్యవహారకాలమున దృశ్యముల నన్నింటిని ఆత్మభిన్నములుగ దలంచి, అజ్ఞాని తాను బ్రహ్మముగ గ్రహింపజాలడుగదా! అందుచే 'యో హి లోకే నిరతిశయప్రియః స సర్వప్రయత్నేన లబ్ధవ్యో భవతి' (బృ. భా. 1.4.8) సర్వప్రయత్నములచే ప్రపంచమున ప్రియతమముల నన్నింటినైన ద్రోసిపుచ్చి, నిరతిశయ ప్రియమైన ఆత్మను బొంద యత్నించుట ప్రాజ్ఞుని లక్షణము. లోకమున నుత్తమోత్తమమై ప్రియతరమైన వానికొరకై హేయముల త్యజించుట సహజమేగదా! అట్లు క్రమన్యాయమున కరుదెంప నన్నింటికంటె పరమైన ఆత్మయే, సర్వాతిశ ప్రియతమ తత్త్వమై యొప్పారుటచే, తత్సిద్ధికై సర్వేతరముల ద్రోసి, ఆత్మతో సంపూర్ణైక్యాను భూతి నొంద యత్నించుట అత్యంత సముచితము. అందుచే నాత్మతత్త్వ గ్రహణమునకై, దానిమీద అధ్యస్తమై విరుద్ధముగ దోచుచున్న జీవత్వ లక్షణముల ప్రథమతః గ్రహించుట యుక్తము. జీవత్వభ్రాంతిచే నాత్మ అగోచరమై తద్గత సుఖాస్వాదనము భ్రాంతుల కందకుండుటచే నీమీమాంస అవసరమగుచున్నది.

అస్తిత్వము పారమార్థిక, వ్యావహారికముగ ద్వివిధమై, త్రికాలములయందు స్వతఃసిద్ధ లక్షణములతో నిర్వికారముగ నుండుట పారమార్థిక సత్యమనియు, తద్విరుద్ధము వ్యావహారికమనియు బూర్వగ్రంథమున గాంచియున్నాము. పారమార్థిక సత్యత్వము కేవల నిర్గుణాఖండాద్వయ బ్రహ్మము నందే యన్వయింప, ననిర్వచనీయ మాయా కల్పనము తోడ వ్యావహారిక సత్యము ప్రారంభమై, కూటస్థేతరముగ పరిణామి సత్యనామము నార్జించి, నిత్య వికార పరిణామముల నొందుచు నుండుటయు గాంచియున్నాము. వ్యావహారిక సత్తా గలిగి, శుద్ధమాయా శబలితమై, అయినను స్వతంత్రత నుండి, జన్మతోబాటు నన్నింట బ్రథముడై, ఉత్తముడై, శుద్ధత్వమునగలిగిన సృష్టి స్థితి లయాది అష్టైశ్వర్య సహితుడైన ఈశ్వరు విషయము నిసుమంత జూచియున్నాము. అటులే మాయాజనితుడైన జీవునివిషయము ఆలోచనీయము.

ఈశ్వరునివలెనే జీవుడును మాయాజన్ముడై యున్నను ఈశ్వరుడు సమష్టిరూపుడై నిర్గుణమునగల సత్యానంతత త్వములగ్రహించి, చిదానందముల మేళవించి, మాయాతీతుడై మాయచే గార్యాచరణము గావించుచునుండ, జీవుడు అవిద్యాజన్ముడై, అజ్ఞుడై కించిజ్ఞత్వాది లక్షణోపేతుడై, మాయాధీనుడై, బద్ధుడై వ్యవహరించుచు తత్ఫలిత సుఖదుఃఖాది ద్వంద్వముల నిరికి బ్రవర్తించుచున్నాడు. ఈతని జీవత్వము ఈశ్వరునికివలె దీర్ఘకాలికము కాకపోయినను, జ్ఞానోదయమున నశించుచు, స్వతః సిద్ధ బ్రహ్మమేయై వెలుగొందుటచే నది తాత్కాలికమగుటచే, వ్యావహారిక మనబడుచున్నది.

ఈశ్వర వ్యావహారికత్వము స్వార్థము లేనిదగుటచే, స్వతంత్రమై, ఆనందదాయకమై యుండ జీవుని వ్యవహారము స్వార్థపరమై దుఃఖభూయిష్ట మగుచున్నది. ఈశ్వరువలె సమష్టిత్వముగాక వ్యష్టిత్వమును బొందుచున్నది.

అయినను జీవుని సంసారము వ్యావహారిక మనుటతోడనే అయథార్థమని స్పష్టము. కాన 'సవికల్పక జీవోయం' (ల. వా. వృ. 13) అనబడుచున్న జీవుడు, 'వస్తుతో నిష్ప్రపంచోసి నిత్యముక్తః స్వభావతః । న తే బంధవిమోక్షౌ స్త కల్పితౌ తౌ యతస్త్వయి॥' (త. ఉ. 80) యథార్థమున నీవు ప్రపంచాతీతుడవు. స్వాభావికముగ నిత్యముక్త స్వరూపుడవు. నీయందు బంధమోక్షము లభావములు. నీలో నవి కల్పితములు అనురీతి సర్వము అతనిపై గల్పితము. యథార్థమున 'న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః । న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (త. ఉ. 81) జనన మరణములు బంధమోక్షములు సాధకత్వము లేమియు లేవు. ఇదియే పరమార్థము. అట్లు గాక 'అనాది కాల మారభ్య మోక్షాత్ పూర్వమిదం ద్వయం । వ్యవహారే స్థితం తస్మాదుభయం వ్యావహారికం॥' (వా. సు. 37) అనాదికాలమునుండి మోక్షకాల పర్యంతముగల కాలము వ్యావహారికము. ఈ మధ్యగల జీవ జగత్తు లుభయము వ్యావహారికములే యగును. 'ఆత్మనో విక్రియా నాస్తి బుద్ధే ర్బోధో న జాత్వపి । జీవః సర్వమలం జ్ఞాత్వా జ్ఞాతా ద్రష్టేతి ముహ్యతి॥' (ఆ. బో. 29) ఆత్మకు వికారములేదు. బుద్ధికి జ్ఞానశక్తియును గానము. కాని జీవుడు మిథ్యాజ్ఞానము

వలన తనను జ్ఞాతగను, ద్రష్టగను భావించుకొని, మోహము నొందుచున్నాడు. అనగా 'ఆత్మనః సచ్చిదంశ శ్చ బుద్ధేర్వృత్తి రితి ద్వయం । సంయోజ్య చా వివేకేన జానామీతి ప్రవర్తతే॥' (ఆ. బో. 25) ఆత్మ సచ్చిదంశము, బుద్ధివృత్తిని మేళవించి లోకులు నే నెరుగుదును అని అవివేకమున వ్యవహరించెదరు. అంతియగాక 'రూపం నామ చ జాతిం చ కల్పయిత్వా స్వశక్తితః । బ్రహ్మజ్ఞమపి వా చిత్తం సంసారయతి పూరుషం' (మ. వా. ద. 61) నామరూపములను, జాత్యాదులను చిత్తము స్వశక్తిచే గల్పించి, బ్రహ్మవేత్తనైనను సంసారమును చెందున ట్లొనరించుచున్నది. ఆహేతువుచే 'సంసారో మనసా పుంసః కల్పితో౽స్తి న వస్తుతః' (మ. వా. ద. 62) పురుషునియొక్క సంసారము మనస్సుచేతనే కల్పింపబడినది. కాని వస్తుతః లేనేలేదు. 'మనో హ్యావిద్యా భవబంధహేతుః' (వి. చూ. 171) మననే అవిద్య. అదియే భవ బంధ హేతువగును. 'ఇతి జీవేశ్వరా భాతః స్వాజ్ఞానా న్న హి వస్తుతః' (స్వా. ప్ర. 41) ఇట్లు జీవేశ్వరులు స్వాజ్ఞానమువలననే రూపొందుచున్నారుగాని వస్తుతః కాదు. కాన 'తస్మాదేతత్త్రయం మిథ్యా' (స్వా. ప్ర. 41) జీవ జగదీశ్వరులు మిథ్య. ఆ దృష్టితో గాంచినచో 'విషయత్వం వికారిత్వం నానాత్వం వా న హీష్యతే । న హేయో నా ప్యుపాదేయ ఆత్మా నాన్యేన వా తతః॥' (ఉ. సా. 2.17.42) విషయియగు ఆత్మ దేనికిని విషయము కాదు. వికారరహితము, నేకము గనుక జడమగు నితరముచేగాని, తనచేగాని గ్రహింపబడదు. యథార్థముగ 'న బాహ్యం మధ్యతో వా౽ంతః

ద్విద్యతే ఒ న్యత్ స్వతః క్వచిత్ ।' (ఉ. సా. 2. 17. 70) స్వయంప్రభయగు ఆత్మకు అంత ర్బాహ్య మధ్యములుగాని, అన్యత్వముగాని శూన్యము. 'రూప వత్త్వా ద్యసత్త్వా న్న దృష్ట్యా దేః కర్మ తా యథా। ఏవం విజ్ఞానకర్మత్వం భూమ్నో నాస్తీతి గమ్యతే॥' (ఉ. సా. 2. 9. 9) ఆత్మ రూపాదులు లేనిదగుటచే దర్శనాది క్రియకు గర్మము కాని విధమున విజ్ఞాన క్రియకును గర్మముకాదు. అటుల 'బంధో నాఽపి న ముక్తి ర్నపరాత్మత్వం న చాపి జీవత్వం' (స్వా. ని. 102) బంధ మోక్షములు గాని జీవత్వ పరాత్పరత్వములుగాని లేవు.

అందుచే నీ చూడబడుచున్న 'మర్త్యత్వం త్వయి కల్పితం భ్రమవశాత్ ...నో వస్తుతస్తన్ మృషా' (స. వే. సి. సా. 284) మర్త్యత్వాదికములు భ్రమవశమున కల్పితమైనవి. అవి వస్తుతః లేవు. అవి లేనివే. ఈ యర్థమునే 'భ్రాంత్యా ప్రాప్తో జీవభావః' (వి. చూ. 198) జీవభావము భ్రాంతి జన్యమనియు, 'మాయా మాత్ర మిదం ద్వైతం...। ద్వైతస్య భ్రమ కార్య త్వాత్ ...... ॥ ధర్మాణాం మృషా ...' (మ. వా. ద. 156, 157) మాయా కల్పితమే యీ ద్వైతము. అది భ్రమ కార్యము కాన, జీవేశ్వరుల ధర్మములన్నియు మృషా అనియు దెలుపబడి యున్నది. 'ఉత్పత్తి రేవ త్వస్య న సంభ వతీతి వదామః కస్మాత్ నిత్యత్వా చ్చ తాభ్యః' (బ్ర. సూ. భా. 2. 3. 17) అసంభవముగాన దానికి ఉత్పత్తి లేదని చెప్పుచున్నాము. దానికి నిత్యత్వము వచింపబడినదిగదా ! అసలు ఆత్మ తన నిజధర్మమైన విశుద్ధత్వ జ్ఞానత్వా దికముగ గాంచబడక పోవుటచేతనే, అది జీవ ప్రాణాది రూపమున

నవలోకింప బడుచున్నదని 'ఇత్యేష సర్వోపనిషదాం సిద్ధాంతః' (మాం. భా. 2. 17) సర్వోపనిషత్తుల సిద్ధాంతము.

---

## జీవుడు – అవిద్య

'ఏకస్య బ్రహ్మణః శుద్ధ సత్వోపాధి సమన్వయాత్ ।
ఈశతా జీవతాప్యస్య మలినోపాధి యోగతః॥' (మ. వా. ద. 22) ఈ పరబ్రహ్మము ఒక్కడై యున్నను, శుద్ధసత్వోపాధితో గూడి ఈశ్వరత్వమును, మలినోపాధి సమన్వయమున జీవత్వమును సంభవించుచున్నవి. అనగా మాయాంతర్గత సత్వరజస్తమో గుణములలో శుద్ధ సత్త్వప్రధానమైన ఉపాధి శుద్ధ మాయ అనియు, మూలప్రకృతి యనియు చెప్పబడి, ఈశ్వరునకుపాధి యగుచుండ, నందుగల రజస్తమో ప్రధానమైన మాయ, అశుద్ధమాయ అనియు, తూలాప్రకృతి అనియు, మలినమాయ అనియు వ్యవహారము. కాన ప్రస్తుతము జీవునకు 'ఆత్మనో మాయాఽవిద్యా తయా' (మాం. భా. 3. 10) ఆత్మయొక్క మాయ అను అవిద్యచే ననురీతి, 'ఏకస్యైవ మాయా బహురూపం తస్మాత్స ఏవ కారణాత్మా పరమేశ్వరః కార్యాత్మానం జీవాత్మానం' (స. సు. భా 2. 20) ఏకమైన మాయ బహురూపముల బొంది, అదియే కారణ రూపమున పరమేశ్వరుడుగను, కార్యరూపమున జీవుడుగను రూపొందుచున్నది. అందుచేతనే 'కారణోపాధిరీశ్వరః కార్యోపాధి రయం జీవః' అనియు వాకొనబడి యున్నది. 'ఈశస్య

మాయా మహదాది కారణం జీవస్య కార్యం శృణు పంచ కోశం' (వి. చూ. 245) జీవునకు గార్యమగు అవిద్యాకల్పిత పంచకోశములు ఉపాధి. ఈశ్వరునకు మహదాదికము కారణము. 'అతస్తౌ మాయయా క్లుప్తౌ బంధమోక్షౌ న చాత్మని' (వి. చూ. 574) అందుచే బంధమోక్షములు గూడ మాయా కల్పితములేగాని ఆత్మధర్మములు కావు. ఈ వాక్య సంచయముచే జీవునకుపాధి మలినమాయ అని గ్రాహ్యము.

'అనాదిత్వ మవిద్యాయాః కార్యస్యాపి' (వి. చూ. 200) అనాది అయిన అవిద్య దాని కార్యజాతము అనియు, 'ఏషా అవిద్యాయా న్నిమిత్తః సంసారః' (ఉ. సా. 1. 110) అవిద్య మూలముననే సంసార ముత్పన్నము. 'అవిద్యా హేతవో దోషాః వాఙ్మనఃకాయ ప్రవృత్తి హేతవః' (ఉ. సా. 1.112) మనోవాక్కాయ కర్మలకును అవిద్యయే హేతువు. 'అమూర్తమూర్తాని చ కర్మ వాసనా......। అవిద్యయా హ్యాత్మని మూఢదృష్టిభిః' (ఉ.సా.2.14.48)మూర్తామూర్తములును వాసనాచయము, అవిద్యాహేతువుచే మూఢదృష్టి గోచరములు. 'ఏవ మాత్మన్యవిద్యాతో దేహాధ్యాసో హి జాయతే॥' (అ. అ. 87) ఇట్లు ఆత్మయం దవిద్యచే దేహాద్యధ్యాస గలుగుచున్నది. 'కర్తృభోక్తౄదికం సర్వ తదవిద్యోత్థమేవ చ' కర్తృభోక్తృత్వములు సర్వము అవిద్యాకల్పితములే. ఆత్మోపాధే రవిద్యాయా అస్తి శక్తిద్వయం మహత్' (స. వే. సి. సా. 488) ఆత్మోపాధియైన అవిద్యకు గొప్ప శక్తిద్వయము గలదు అను వాక్యరీతి బూర్వ మలిన మాయ అవిద్యాపద వాచ్యమై యున్నది. అటులే

'సోయమాత్మా పరమార్థా పరమార్థరూప శ్చతుష్పా దిత్యుక్తః। తస్యా పరమార్థరూప మవిద్యాకృతం' (మాం.భా. 1. 7) ఆత్మ పరమార్థ అపరమార్థముగ ద్వివిధమై, అపర మార్థరూపమున చతుర్విధము. అపరమార్థరూపము అవిద్యా కృతము. 'అవిద్యాసృష్టివిషయైవ సర్వా గౌణీ ముఖ్యా చ సృష్టి ర్న పరమార్థతః' (మాం.భా.3. 23) అవిద్యాసృష్టి యంతయు అయథార్థము, పరమార్థతః సృష్టి లేదు. 'అవిద్యా కామ కర్మ విశిష్ట కార్య కరణోపాధిః ఆత్మా సంసారీ జీవ ఉచ్యతే' (బృ. భా. 3. 8. 12) అవిద్యా జనిత కామ కర్మ విశిష్టమైన కార్యకరణోపాధి కలిగిన ఆత్మ సంసారి అయి, జీవుడని నిర్వాచ్యము. 'ఏకస్యా ప్యాత్మనోఽవిద్యా విషయ నామరూపో పాధ్యనుపాధికృత విశేషాభ్యుపగమాత్' (ప్ర. భా. 9. 3) ఆత్మకు నిరుపాధికము, అవిద్యాకృత నామరూప విశిష్టమైన ఔపాధిక రూపములు రెండు గలవు. 'పరమేశ్వర స్త్వవిద్యా కల్పితాచ్ఛరీరాత్' (బ్ర. సూ. భా. 1. 1. 17) పరమేశ్వరుడు అవిద్యా కల్పితుడైన జీవుని కన్యము. 'జీవో హ్యావిద్యా వేశవశాత్' (బ్ర. సూ. భా. 2. 3. 46) జీవు డవిద్యావేశ వశుడై, 'పరమాత్మనో రవిద్యా ప్రత్యుపస్థాపిత నామరూప' (బ్ర. సూ. భా. 1. 4. 22) పరమాత్మయొక్క అవిద్యా కల్పిత నామరూపములు 'యావద్ధ్యవిద్యా న నివర్తతే తావద్ధర్మాది గోచరత్వం జీవస్య జీవత్వం చ న నివర్తతే' (బ్ర. సూ. భా. 1. 4. 6) ఎంతవరకు అవిద్య నివర్తింపదో అంతవరకు జీవుని జీవత్వ ధర్మములు అంతరింపవు. ఈ 'అవిద్యా ప్రత్యుపస్థాపిత నామరూపకృత దేహా ద్యుపాధియోగా త్తదవి

వేక భ్రమకృతో జీవస్య జ్ఞానైశ్వర్య తిరోభావః' (బ్ర. సూ. భా. 3 2 6) అవిద్యా నిర్మిత నామరూప యుక్త దేహాది ఉపాధివలన నేర్పడిన భ్రాంతికృతమైన జీవునికి, ఐశ్వర్యము నశించును అనువాక్యముల వలనను, జీవునకు అవిద్యయే ఉపాధిగ దీర్మానము. 'క్రియాకారక ఫలభేదబుద్ధి రవిద్యా త్మని నిత్యప్రవృత్తా । ఇయం అవిద్యా అనాదికాల ప్రవృత్తా' (గీ. భా. 18. 66) క్రియాకారక ఫలవిభేదములుగల అవిద్య, ఆత్మలో నిత్యప్రవృత్తమై యుండును. ఈఅవిద్య అనాదికాలము నుండి ప్రవృత్తము, 'సదేకమేవ వస్త్వవిద్యయోత్పత్తి వినా శాది ధర్మైర్నటవ దనేకథా వికల్ప్యతే' (గీ భా. 18.48) సత్తు ఏకమైనది. అవిద్య ఉత్పత్తివినాశాది ధర్మములగలిగి, నటుని వలె నానాత్వమును గల్పించుచున్నది. 'సతోఽవిద్యా కృతో పాధిభేదతః సంసారిత్వమివ భవతి' (గీ. భా. 13. 2) సత్తులో అవిద్యాకృతమైన ఉపాధిచే భేద ముద్భవించి. సంసారిత్వ మున్నట్లు దోచుచున్నది. 'తస్మాత్ అవిద్యామాత్రం సంసారః' (గీ. భా. 13. 2) అందుచే సంసారము అవిద్యామాత్రమే. 'న క్షేత్రజ్ఞస్య కేవలస్య అవిద్యా తత్కార్యం చ' (గీ. భా. 13. 2) కేవలుడైన క్షేత్రజ్ఞునికి అవిద్యయు దాని కార్యజాత మును లేవు అను వాక్య సముచ్చయమువలనను, జీవత్వ కారణము అవిద్యయనియు బోధితమగును.

మరల అవిద్యయే అజ్ఞానమనియు ననబడియున్నది. 'అజ్ఞానం నామ అనాది సదసద్భ్యా మనిర్వచనీయం త్రిగు ణాత్మకం జ్ఞానవిరోధి భావరూపం యత్కించిదితి వదంతి 'అహ మజ్ఞ' ఇత్యాద్యనుభవాత్' (ఆ. వి. 8) అజ్ఞానము అనాదియై

అనిర్వచనీయమై, త్రిగుణాత్మకమై జ్ఞానవిరోధియై, భావరూప ముగనుండి 'నేను అజ్ఞుడను' అను అనుభూతినిగలుగ జేయుచున్నది. 'అధిష్ఠానం చిదాభాసో బుద్ధి రేతత్త్రియం యదా। అజ్ఞానా దేక వద్ భాతి జీవ ఇత్యుచ్యతే తదా॥' (స్వా. ప్ర. 3౬) అధిష్ఠాన చిదాభాస, బుద్ధులు మూడు, అజ్ఞానముచే నొకటిగ దోచి, జీవసంజ్ఞ మేర్పడుచున్నది. 'అత్రానాత్మన్యహామితి మతి ర్బంధ ఏషోఽస్య పుంసః। ప్రాప్తోఽజ్ఞానాత్ జనన మరణ క్లేశ సంపాత హేతుః॥' (వి. చూ. 139) అనాత్మయగు దేహమే నేను అనెడు బుద్ధి పురుషునకు బంధమగును. ఈ దేహాత్మబుద్ధి అజ్ఞానమువలన గలిగినదై జన్మమరణ రూప సంసారమునకు హేతువగును. 'అభిమానోఽపి కస్మాత్ భవతి? అవివేకాత్। (7) అవివేకః కస్మాత్ భవతి? అజ్ఞానాత్। అజ్ఞానం కేన భవతీతి చేత్? న కేనాపి? అజ్ఞానం నామ అనాది' (ఆ. వి. 8) అభిమానము దేనివలన గలుగును? అవివేకమువలన. అవివేకము దేనివలన గలుగును? అజ్ఞానమువలన. అజ్ఞానము దేనిచే గలుగును. అది దేనిచేతను గలుగదు. అజ్ఞాన మనునది అనాది. 'అధ్యాసమూలమజ్ఞాన మాహు రావృత్తిలక్షణం' (స.వే.సి.సా. 509) అధ్యాసమూలము వికారరూపమగు అజ్ఞానమగును. ఈ అజ్ఞానము వ్యష్ట్యభిప్రాయాత్ భూరుహా ఇత్యనేకతా' (స.వే.సి. సా.317) వ్యష్టిదృష్టితో వృక్షాదులవలె ననేకమై యుండును. అనగా నదినానాత్వమును గల్పించును. ఈ విషయమునే 'యదేకస్మి న్ననేకత్వ కల్పనా కారణం పరే। తదజ్ఞానం విజానీహి కారణం వపురాత్మనః॥' (మ.వా.ద.53) ఏకరూపుడైన పర బ్రహ్మమునందు ననేకత్వము గల్పించుట యందు ఏది కారణమై

యున్నదో, ఆయజ్ఞానము దేహాత్మాభిమానమునకు గారణ మగు చున్నది అనువాక్యము వివరించియున్నది. పైవాక్యములచే నామలినమాయ అవిద్యాశబ్దమున వాచ్య మగుటయేగాక, నజ్ఞానపదమునగూడ వ్యవహార్యమనియు నిశ్చయము.

పూర్వోక్త మలినమాయ, అవిద్యా అజ్ఞానములవలె జీవుని ఉపాధిని 'అంతఃకరణ వికారమేవ' (ముం. భా. 2.1.4) అంతఃకరణ మనియు, దానినే 'కల్పితమిహ జీవత్వం సన్నిధి దోషా దహంకారస్య' (మ. వా. ద. 80) అహంకారసన్నిధి దోషముచేతనే యీ కల్పిత జీవత్వమను వాక్యమున అహంకారముగను, అటులే 'యద్బుద్ధ్యుపాధి సంబంధా త్పరికల్పిత మాత్మని॥ జీవత్వం...' (వి. చూ. 202) బుద్ధ్యుపాధి సంబంధమువలన పరమాత్మయందు జీవత్వము కల్పింపబడు చున్నది. 'బుద్ధ్యుపాధి ధర్మాధ్యాసనిమిత్తం హి కర్తృత్వ భోక్తృత్వాది లక్షణం సంసారిత్వం' (బ్ర. సూ. భా. 2.3.29) బుద్ధ్యుపాధివలన గలిగిన ధర్మాధ్యాస నిమిత్తముగ కర్తృత్వ భోక్తృత్వ సంసారిత్వములు కల్పితములు. 'బుద్ధ్యుపాధి సంబంధః' (బ్ర. సూ. భా. 2. 3. 30) 'దేహేంద్రియమనో బుద్ధ్యుపాధిభిః' (బ్ర. సూ. భా. 1. 2. 6) మొదలగు వాక్యములలో బుద్ధియే ఉపాధిగ నభివర్ణింపబడియున్నది. 'దేహేంద్రియప్రాణ గుణై ర్నిబధ్య' (వి. చూ. 180) అనియు, 'దేహాద్యుపాధా స్స్య జీవ స్తస్య నియామకః' (త. ఉ. 19) శరీరాదులగు ఉపాధులుండిన వానితోగల సంబంధము ననుసరించి బ్రహ్మమే ఆశరీరాదుల నియంతయగు జీవుడనబరగును అను వచనముల దేహేంద్రియాదులు గూడ నుపాధు లనబరగి

నవి కాని యివి స్థూలోపాధులు. సూక్ష్మముగ ప్రథమమున మలిన మాయోపాధిమహిమ చేతనే, అఖండము ఖండమైనట్లు దోచి, నానాత్వకల్పనమున జీవత్వము దోచుచున్నది. అనంతరమున నీజీవునకు ప్రథమ కారణమైన ఆవరణమాయతో బాటు, విక్షేపశక్తియుదోడై నిఖిల సంసారమును బెంచి, జీవుని సర్వవిధ బద్ధునిగా గావించినట్లు దోచుచున్నది. అది ఎట్లు?

---

## అధ్యాసరూపము

'అధ్యాసదోషాత్సముపాగతోఽయం సంసారబంధః ప్రబలప్రతీచః। యద్యోగతః క్లిశ్యతి గర్భవాస జన్మాప్యయ క్లేశభయై రజస్రం॥' (496) అధ్యాసదోషముచే గలిగిన యీ సంసారబంధము ప్రబల ప్రాచీనమై, తత్సంబంధముచే జీవుడు గర్భవాస, జన్మ, మరణాది క్లేశభయముచే సదా బాధ ననుభవించుచుండును. 'అధ్యాసో నామ ఖల్వేష వస్తునో యోఽన్యథా గ్రహః। స్వాభావిక భ్రాంతిమూలం సంసృతే రాదికారణం॥' (స. వే. సి. సా. 497) వస్తువునందు అన్యథాగ్రహణమే అధ్యాస అనబడును. అదియే స్వాభావికమైన భ్రాంతికిని సంసృతికిని ఆదికారణమై యున్నదని సార సంగ్రహ కథనము. 'అధ్యాసాదేవ సంసారః॥' (499) అనియు తద్వచనము. అధ్యాస తాత్పర్యమును బూర్వము చూచియున్నాము. 'స్మృతిరూపః పరత్ర పూర్వ దృష్టావభాసః' (బ్ర. సూ. భా. 1.1.1)

అని శంకర నిర్వచనము. ఎదుటనున్న వస్తువు విస్మరింపబడి, దానగల కొన్ని సాదృశలక్షణ ప్రభావమున పూర్వము దేశాంతరమున దృష్టమైన అన్యవస్తులక్షణముల స్మృతిరూపమున గైకొని, ప్రత్యక్ష వస్తువుపై నారోపించుటయే అధ్యాస అని స్పష్టము. ప్రత్యక్షాపరోక్షములకు ఆరోపము జరుగుచున్నది. అందు ప్రత్యక్షమైన, అనగా తత్కాలికమైన మరియు నింద్రియగోచరమైన, వర్తమానకాలిక వస్తువు ఆధారముగ గైకొనబడి, పరోక్షమై భూతకాలికమై, బుద్ధిగోచరమైన దేశాంతర వస్తువుతో నీ ప్రసిద్ధ వస్తులక్షణములు గొన్ని గోచరించుటచే నీ యధ్యాస ఏర్పడుచున్నది. ఈ కార్యమున ప్రత్యక్షవస్తువు అధిష్ఠానమనియు, నారోపిత వస్తువు అధ్యస్తమనియు నాబడును. అధిష్ఠానముయొక్క విస్మరణము అజ్ఞానమగుచుండ, పరవస్తుస్మరణము అన్యథాజ్ఞానమగుచున్నది. అజ్ఞానము తాటస్థ్యముచే నిశ్చలత్వము సూచింప, తత్ఫలితమైన నన్యథాజ్ఞానము ప్రమాదభరితమై, ఆశా సూయా భయక్రోధాదిక దుష్టత్వమునకు గారణమై, నష్టకష్ట హేతు వగుచుండును. 'అధ్యాసో నామ అతస్మింస్తద్బుద్ధిః' (బ్ర. సూ. భా. 1.1.1) అధ్యాసము అన నదికాని దానియందు అది యను భ్రాంతి యని తాత్పర్యము. అదియే సర్వానర్థ హేతు వగుచున్నది. జీవత్వ ముండునంతవరకు జీవున కిదినైసర్గికముగనే వచింపబడును. జీవత్వభ్రాంతి అనాదిమాయా కల్పితముగాన నీ అధ్యాసయు ననాదిగనే వ్యవహార్యము. అధ్యాసకార్యమున వస్తుద్వయముండుట స్పష్టము. కాని వానిలో నొకటి భూతకాల దృష్టము. ఈ వస్తుద్వయమున

గొన్ని సామాన్య లక్షణములు అవసరము. అట్లున్నచో స్థూల మైన ప్రత్యక్షవస్తువుపై సూక్ష్మమైన పరోక్ష వస్తు లక్షణము లధ్యసింపబడుచున్నవి. ప్రత్యక్షవస్తువు సమగ్రముగగాక, అందుగల సాదృశ లక్షణములే గైకొనబడి, పరోక్ష వస్తువుతో నైక్యమొనర్పబడి యుండుటచే, అధ్యాస కార్యమున వస్తువుల కధ్యాస మేర్పడక వాని ధర్మముల కధ్యాస గలుగుచుండుటచే దీని ధర్మాధ్యాస అనియు నందురు. మరియు నిందు కేవలము ఒక వస్తుగుణములేగాక, వస్తువుల రెండింటి గుణములు పరస్పర కారణములగుచు నధ్యసించు టచే అన్యోన్యాధ్యాస అనియు వచింపబడును. అనగా ముందున్న రజ్జు దర్శనమున, నందుగల వక్రత్వ దీర్ఘత్వాది ధర్మములు, పూర్వదృష్ట సర్పమును స్మరింపజేయు సర్పము యొక్క సాదృశ బాహ్య ధర్మములు రజ్జువుపై దోచి, భయ కంపనాదుల ద్రష్టకు గల్పించుచున్నవి. ఇందు అధిష్ఠాన విపరీత ధర్మములు పూర్తిగ విస్మరింపబడి యున్నవి. వాని అజ్ఞానమే అధ్యాసకు ప్రబల కారణమనియు చెప్పనగును. మరియు అధ్యస్తవస్తు సామాన్య అంశముల కంటె, అధిష్ఠాన పర ధర్మ ములే అనర్థహేతువు లగుటయు విదితము. సర్పాధ్యాసలో రజ్జువుయొక్క విశేష ధర్మములైన అచేతనత్వ శిరోవాల రాహిత్యాదులే గోచరించుచో సర్పాధ్యాస గలుగనేరదు. అటులే, సర్పముయొక్క వక్రత్వాదిక సామాన్య లక్షణములు భయకారణము గానేరవుగాని రజ్జ్వేతర చేతనత్వ విషత్వాది కమే భయకారణము. ఆవిధమున నధ్యాసకార్యమున రజ్జువు యొక్క విశేషలక్షణముయొక్క అజ్ఞానముకంటె, సర్పము

యొక్క విపరీతధర్మములే అనగా అన్యథాజ్ఞానమే అనర్థదాయకముగ బరిణమించుచున్నదని స్పష్టము. అందుచే అధ్యాసకు మూలకారణము అజ్ఞానముగనుండ, దానినావరించి అన్యథాజ్ఞానమున గలుగు భ్రాంతి తత్ఫలితముగ నేర్పడుచున్నది. ఈ అజ్ఞాన, అన్యథాజ్ఞాన భ్రాంతులు పరస్పరాపేక్షికములుగాన, నివి జీవత్వకారణములుగా, జీవోపాధులుగా పూర్వము వచింపబడియున్నవి. అధిష్ఠాన జ్ఞాన మెప్పుడు గలుగునో, అనగా అధిష్ఠానముయొక్క విశేషజ్ఞానము ఎప్పు డుదయించునో, అంత అజ్ఞానము నశింప, దానితో కార్యపరంపర అంతరించును.

ఇటుల అధ్యస్తమైన సర్పము ఎంతకాలము దృశ్యమానమో, అంతకాలము దానికి ప్రత్యేక ప్రతిపత్తి రజ్జ్వేతరముగ నుండనేరదు. అధ్యస్త సర్పము అధిష్ఠానరూపము ననుసరించి యుండవలెనేగాని, తన వ్యక్తిత్వమును జూపజాలదు. అధిష్ఠానరూపమునకు వ్యత్యస్తముగ వ్యవహరింప జాలదు. అధిష్ఠాన భిన్న సత్తా దానికి అభావము. అందుచే దానికి ప్రత్యేకవ్యక్తిత్వ మిట లేదు. యథార్థమున జూడబడుచున్నది అధిష్ఠానమేగాని, అయథార్థముగ అధ్యస్తము గాంచబడుచున్నది. అధ్యస్తమున నెన్ని వికారములు గల్పింపబడుచున్నను, అధిష్ఠానము ఎట్టి వికారములు లేక నుండుచునే యున్నది. అధ్యాసకార్యమున నెట్లు అధిష్ఠానముండెనో, అటులే [illegible]సకాలమునగూడ యుండును. అటులే అధ్యాస నివారణానంతరము గూడ నది పూర్వరీతి నిర్వికారమే. అనగా అధ్యాస కల్పిత అన్యథాజ్ఞానరూప భిన్నగుణములు, అధిష్ఠానమున నెట్టి విభిన్నత్వమును వికారమును గలుగజేయ

నేరవు. అది యీ త్రికాలముల నొకేరీతి నుండును. అట్లుగాక అధ్యస్తమైన సర్పాదికము ఆదిశూన్యమై, అంతవంతమై, మధ్యకాలస్థితమైమాత్రము గోచరము. అవుడైనను పూర్వోక్తమురీతి గోచరమేగాని వానికి వస్తుత్వము లేదు. వస్తుత్వము అధిష్ఠానమునకు జెంద, గుణపరిణామమున నిది భాసించుచుండుటచే భ్రాంతి మృషాస్వరూపము అగుచున్నది.

అందుచేసి అధ్యాసవిషయమున భ్రాంతిగోచర గుణములు ప్రధానములుగాక, అధిష్ఠాన వస్తువునే ప్రధానముగ భావించి అదియే సద్వస్తువనియు, తదన్యము అసత్తనియు శాస్త్రసిద్ధాంతము. అధిష్ఠానము సర్వదా సర్వథా ఏకమైయుండ, నీ భ్రమాస్వరూపము నానాత్వమై యుండును. అధిష్ఠానము స్థిరమై, నిశ్చలమైయుండ, భ్రాంతము అస్థిరమై, సంతత వికారభూయిష్ఠమై, చంచలమై యొప్పారును. ఇట్లు ప్రధానమైన అధిష్ఠాన పదార్థమును గ్రహించి, భ్రాంతిరూపమును భ్రాంతిగ గాంచి ద్రోసిపుచ్చుట అద్వైతసిద్ధాంత తాత్పర్యము. ఈవిధముగ సర్వసంసార వికారములకు అధిష్ఠానమైన బ్రహ్మ ప్రతిపాదనము గావించి అది ఏకము, నిర్వికారము, అనర్థవిదూరము, సత్యము అని బోధించి, తదన్యము తద్విరుద్ధము గాన, నా విశుద్ధధర్మ విశిష్టుడైన జీవుడు భ్రాంతిరూపుడేగాన, సర్పనిరాసమున రజ్జుగోచరమురీతి, జీవ నిరాసమున బ్రహ్మజ్ఞానమను పరమరహస్యమును బోధించుటయే అద్వైత వేదాంత విధానము. అధ్యాససంబంధమున శాస్త్రముల నుపయుక్తమైన సర్వోదాహరణములును, ఉపమానములును, యీరహస్యబోధనమున కేర్పడియున్నవి. సర్వవికల్ప కల్పన

ముల కతీతము బ్రహ్మైకత్వప్రతిపాదనము, జీవత్వమున నధిష్ఠానముగూడ బ్రహ్మమే యను యథార్థమును బోధించుటయే శాస్త్ర ముఖ్య తాత్పర్యము.

అట్లుగాక నీయుపమానముల ఉపమాన ఉపమేయాంశముల గల లక్ష్య విషయమునే గాంచి, అందే యీ ఉపమానాన్వయముల గావించు టుచితముగాని, ఉపమానములు సర్వవిషయముల నన్వయింపవుగదా! (బ్ర. సూ. భా. 3. 2. 5) అద్వైతతాత్పర్యము మందప్రజ్ఞులకు సుఖావబోధార్థమై యీ ఉపమానోదాహరణము లుపపన్నములని విస్మరింపరాదు, అందుచే నీ యధ్యాసగల సర్పము పూర్వదృష్టమై యుండుటచే సత్యమనియు, నందుచే రజ్జు సర్పద్వంద్వమేర్పడుటచే నద్వైత భంగమను వాదనలు అనావశ్యకములు. పూర్వోక్తచందము అధిష్ఠానమేకము, నిర్వికారము, సత్యము అనియు, అధ్యస్తము తద్విరుద్ధముగాన మృషా అనియు దెలుపుచు, అధిష్ఠానాధ్యస్తములకు వస్తుతః అభేదమనియు, గుణతః విభేదమనియు, నను పరమార్థ బోధనమునకే యీ యుపమానములు అన్వయార్హములు. అందులకై వివిధ రీతుల నీ యుదాహరణములు శాస్త్రముల బేర్కొనబడి యున్నవి.

మరియు నీ అధ్యాస వివరణమున కుపయోగింప బడి యున్నఉదాహరణములలో నొక క్రమము గ్రంథముల బాటింపబడకున్ననునదిగోచరించుచున్నది. ఆక్రమము స్థూలత్వమునుండి సూక్ష్మత్వమునకు బరిణమించుచు, క్రమన్యాయమున నద్వైత సిద్ధాంతమునకుఅతిసన్నిహితముగ జెల్వొందును.ఇందునన్నింట,

అది గానిదానిని అదిగా భావించుటనుండి, తాను గానిదానిని దానుగా భావించుట వరకు బరిణమించును. అనగా అధిష్ఠాన అధ్యస్త ద్రష్టలుగ త్రివిధతత్త్వములుగల అధ్యాస, క్రమమున సర్వము ఒక్కటిగనే మారుచు, శుద్ధాద్వైతస్థితిని అందించును. అందు బ్రథమమునకు అధిష్ఠానము స్థూలము (రజ్జుసర్ప, శుక్తి రజతాదులు) ద్వితీయమున సూక్ష్మము, (మరుమరీచాదులు) తృతీయమున నంతఃకరణము(స్వప్నాదులు) చతుర్థమున తానే (దశమోహం) యగుచున్నది. వాని ముందు గ్రంథమున జూచెదముగాక.

రజ్జు – సర్ప

'రజ్జు సర్పవదాత్మానం జీవో జ్ఞాత్వా భయం వహేత్।
నాహం జీవః పరాత్మేతి జ్ఞానం చే న్నిర్భయో భవేత్॥'

(ఆ.బో.27)రజ్జువునందు సర్పాధ్యాసమువలె, జీవుని ఆత్మయందు గాంచి భయము వహించును. నేను జీవుడగాను, పరమాత్మను అను జ్ఞానముచే నిర్భయము గలుగుచున్నది. 'రజ్జ్వజ్ఞానాద్ భాతి రజ్జౌ యథాఽహిః స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః' (ఆ.ప.2) త్రాడు అని తెలియకుండుటచేనందు పాము గోచరించునట్లు, స్వాత్మాజ్ఞానమువలననే జీవభావము ఏర్పడుచున్నది. 'యథా హి లోకే రజ్జు సర్ప మరీచ్యాదికాదీనాం'(ఉ. సా.1. 2. 109) లోకమున రజ్జు సర్ప, మరు మరీచికాదికము వలె, 'రజ్జ్వాం సర్ప ఇవాద్వయః' (ఉ. సా. 2. 14. 17) విద్యచే సర్ప భ్రాంతి పోవగ అద్వయమైన రజ్జువవలె 'గ్రహీతుర్గ్రాహ దోషేణ నానాత్వం న చ వస్తునః । తద్దృష్టం స్థాణు రజ్జ్వాదౌ పండితై ర్వస్తుదర్శిభిః' (మ. వా. ద. 133) నానాత్వము గ్రహించు

వానియొక్క దృష్టిదోషముచే గలుగుచున్నది. వస్తుదోష మునకాదు. వస్తు వస్యరీతి గోచరించుట వస్తుజ్ఞానముగల పండి తులచే స్థాణు రజ్వాదులందు గ్రహింపబడినది. 'రజ్జౌ దృష్ట వ్యాలవత్' (వి. చూ. 248) రజ్జువునందు దోచు సర్పమువలె నను చందము రజ్జు సర్ప దృష్టాంతము అ. అ. 70, 43; స. వే. సి. సా. 467; శ శ్లో. 94; మాం భా. 1. 7, 2. 33; బ్ర.సూ.భా. 2. 1. 14, ఛాం. భా. 6. 2. 2, 6. 2. 3; గీ. భా. 13. 26. మొదలగు ననేక వచనముల శంకరునిచే విరివిగా గైకొనబడినది.

స్థాణు – పురుష

మందాంధకారమున రజ్జుదర్శనమున సర్పాధ్యాసగలిగి నట్లు 'స్థాణౌ పురుషవ ద్భ్రాంత్యా కృతా బ్రహ్మణి జీవతా' (ఆ. బో. 15) స్థాణువుపై పురుష బుద్ధి భ్రాంతి గలిగినట్లు, బ్రహ్మమునందు జీవత్వ భ్రాంతి గలుగుచున్నది అను వాక్యమురీతి స్థాణు పురుష న్యాయముగూడ నుపయో గింపబడి యున్నది. మందాంధకారమున మార్గమునగల త్రాటినిగాంచి, సర్పభ్రమచే భయ కంపనాదులు గల్గుచున్నవి. అటులే మొద్దునుగాంచి అంధకారమున చోరాదిక భయము వాటిల్లుచున్నది. ఆ రజ్జు స్థాణువులు నిర్వికారముగనే యున్నవి. కాని వానిపై స్మృతిరూపమైన సర్ప, పురుషులు ఆరోపింప బడి భ్రాంతికాలమున భాసించుచున్నారు. భ్రాంతికి బూర్వము లేరు, భ్రాంత్యనంతరమున గూడ లేరు. కాని మధ్య కాలమున నెట్లు ఆదేశము జరిగినదియు, మరల నెట్లు అదృశ్యమైనదియు, [illegible] గష్ట సాధ్యము. అటులే నవి ఆయా అధిష్ఠానముల

నెట్లు గోచరించి యున్నదియు, వాని యథార్థస్థితియు ననిర్వా చ్యము. అందుచేతనే యీ భ్రాంతిదృశ్యముల, బూర్తిగ సంధ్యా పుత్రునివలె నసత్తుగ శంకరుడు తీర్మానింపక, నట్లగుటచే సత్తు అనక సదసత్తనక ననిర్వచనీయ ఖ్యాతిగ నిర్ణయించెను. స్థాణు పురుష భ్రాంతి ఆ.బో. 45, స్వా.ప్ర. 57, బ్ర. సూ. భా. 1. 3. 19., గీ. భా. 13. 2 మొదలగు ననేక ప్రదేశముల సూచింపబడి యున్నది.

## శుక్తి – రజత

మందాంధకార మవసరములేని శుక్తి రజత భ్రాంతియు ప్రఖ్యాతమే. ముత్యపు జిప్పనుగాంచి వెండి యని భ్రాంతి నొందుట. ఇందు భయకంపనాదులుగాక ఆశానందములు జనించును. అ. అ. 70, స. వే. సి. సా. 470, క. భా. 5. 11, బృ. భా. 1. 4. 7, బ్ర. సూ. భా. 1. 1. 1, గీ. భా. 13. 26. ఈ మూడు అధ్యాసలును ఒకే జాతికి జెంది అందు గల అధిష్ఠానము స్థూలముగ నుండ, స్మృతిరూప పరత్ర పూర్వదృష్టావభాసయే యిచట నేర్పడుచున్నది. ఇవియే అద్వైత సిద్ధాంతమున జీవత్వభ్రాంతి కుదాహరణములుగ బహుళ ప్రచారము నొందియుండి, సర్వే సర్వత్ర గ్రంథ ముల నుపయోగింపబడుచున్నవి.

## మరు మరీచి

'ఆరోపితం నాశ్రయ దూషకం భవేత్కదాపి మూఢైర్మతి దోషదూషితైః । నార్ద్రీకరోత్యూషరభూమి భాగం మరీచికా వారిమహాప్రవాహః॥' (వి. చూ. 499) ఎండ

మావుల యందలి జలప్రవాహము ఊషర క్షేత్రమును దడుపజాలనియట్లు బుద్ధిదోషముగల మూఢులచేత గల్పింప బడిన ఆరోపిత వస్తువు అధిష్ఠానమును దూషింప నేరదు. 'మరీ చ్యుదకాదీనాం' (ఉ. సా. 1. 2. 109) 'ఊషరదేశం స్నేహేన పంకీకర్తుం శక్నోతి మరీచ్యుదకం। తథా అవిద్యా క్షేత్రజ్ఞస్య న కించి త్కర్తుం శక్నోతి' (గీ. భా. 13. 2) ఎండమావులలోని జల మూషర క్షేత్రమును దడుపజాలని యట్లు అవిద్య క్షేత్రజ్ఞుని ఏమియు జేయజాలదు అను వచనముల గల మరుమరీచి కోదాహరణముగూడ ప్రశస్తము. ఇందు అధిష్ఠానము సూక్ష్మమగు ఆతపము. అది జల భ్రాంతిని గలుగజేయును. కాని అందు జలమావంతయు నభావము. అటులే బ్రహ్మమునందు విభ్రాంతిచే జీవత్వాదులు భాసింపు చున్నవే గాని యథార్థముగ లేవు.

స్వప్న

'అవిద్యా కార్యతస్తుల్యా ద్వావపి స్వప్న జాగరౌ। దృష్ట దర్శన దృశ్యాదికల్పనోభయతః సమా॥' (స. వే సి. సా. 766) దృష్టదర్శన దృశ్యాది కల్పనముతోగూడిన స్వప్న జాగ్రత్తులు రెండును అవిద్యాకార్యములగుటచే సమానము. 'కరణం కర్మ కర్తా చ క్రియా స్వప్నే ఫలం చ ధీః। జాగ్రత్యేవం యతో ద్రష్టా ద్రష్టా తస్మాత్తతోఽన్యథా॥' (ఉ. సా. 2. 14. 8.) స్వప్నములోని కర్త కర్మ, కరణములు బుద్ధి వికారములు. అటులే జాగ్రత్తులోని ద్రష్టా దృష్టాదులు గూడ బుద్ధికార్యములే యగుచున్నవి. 'మనోవృత్తం మనశ్చైవ స్వప్నవజ్జాగ్రద్' (ఉ.సా.2.11.4) స్వప్నమున మనస్సే సర్వమగు చున్నది. జాగ్రత్తుగూడనటులే. 'స్వప్నః సత్యో యథా బోధా

ర్దేహాత్మత్వం తథైవ చ। ప్రత్యక్షాదేః ప్రమాణత్వం జాగ్రత్ స్యాదాత్మవేదనాత్॥' (ఉ. సా. 2. 11. 5.) మేల్కాంచు నంతవరకు స్వప్నము సత్యమగునట్లు ప్రబోధ పర్యంతము దేహామే ఆత్మ యనుకొనుట సత్యమగును. ఆత్మజ్ఞానము గలుగు నంతవరకు ప్రత్యక్షాదికము ప్రమాణముగాని, పిమ్మట ప్రమాణము కాదు. స్థూల గోచరమగు జాగ్రదవస్థయు, సూక్ష్మ గోచరమైన స్వప్నము సంసార మనబడును. వీనికి గారణము అజ్ఞానమైన సుషుప్తి. ఇవి సాక్షియగు ఆత్మయం దారోపితములుగాన మిథ్యయే యగును. (ఉ. సా. 2. 16. 18) 'ఏషా అవిద్యా యన్నిమిత్తః సంసారో జాగ్రత్స్వప్న లక్షణః' (ఉ. సా. 1. 2. 110) జాగ్రత్స్వప్న లక్షణమైన సంసారము నకు అవిద్యయే కారణము. 'జనిమత్ జ్ఞాన విజ్ఞేయం స్వప్న జ్ఞానవదిష్యతే।' (ఉ. సా. 2. 9. 7) ఏ వస్తువునకు జన్మ గలిగి జ్ఞానగోచరమగుచు జడమగుచున్నదో అది స్వప్నదృశ్యముల వోలె జాగ్రదవస్థయందును మిథ్యయే యగును. స్వప్నము నందు అనుభవింపబడిన రాజ్యభోగ, రాజ్యభ్రష్టత్వము లెట్లు మృషా స్వరూపములో 'తద్వత్ జాగ్రద్దృశ్యానాం వ్యవ హృతిమఖిలం స్వప్నవ ద్విస్మరేచ్ఛేత్' (శ. శ్లో. 33) అట్లు జాగ్రదవస్థాదృశ్య సర్వము స్వప్నమువలె స్మరింపవలెను. 'స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా భోక్త్రాది విశ్వం మన ఏవ సర్వం। తథైవ జాగ్రత్యపి నో విశేష స్తత్సర్వమేత న్మనసో విజృంభణం॥' (వి. చూ. 172) అర్థశూన్యమగు స్వప్న మునందు భోక్తృ భోగ్య భోగరూప సమస్త ప్రపంచమును మనస్సే స్వశక్తిచే సృజించుచున్నది. ఆ ప్రకారమే జాగ్ర

దవస్థయందుగూడ సృజించుచున్నది. అందుచే స్వప్న జాగ్ర దవస్థలు రెండును సమానమేగాని విశేషములేదు. ఇందు గోచ రించు విశ్వమంతయు మనోవిజృంభణమేగాని వాస్తవము కాదు. 'నేదం నేదం కల్పితత్వా న్న సత్యం ...స్వప్నవచ్చ' (వి. చూ. 248) ఇది కాదు. స్వప్నమువలె గల్పితమగుటచే సత్యము కాదు. 'ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలం విన శ్యతి' (వి. చూ. 201) జ్ఞానోదయమున నీసర్వము సమూల ముగ స్వప్నదృశ్యములవలె నశించును. 'నిద్రాకల్పిత దేశకాల విషయ జ్ఞాత్రాది సర్వం యథా। మిథ్యా తద్వదిహాఽపి జాగ్రతి జగత్స్వాజ్ఞాన కార్యత్వతః॥' (వి. చూ. 254) స్వప్నమున గల్పితమైన దేశ కాల విషయములు జ్ఞాత్రాదిక త్రయము, సర్వము ఎట్లు అసత్యమో, అటులే జాగ్రదవస్థగల దృశ్య ప్రపంచమంతయు మిథ్యయే. 'స్వప్నే యథా నిర్విషయేఽపి సంసృతిం సూతే మనః స్వస్థిత వాసనాబలాత్। తథైవ జాగ్రత్యపి పూరుషస్య సర్వం మనః కల్పయతే స్వశక్త్యా॥' (మ. వా. ద. 59) ఏవిషయములు లేని స్వప్నమున తన వాసనాబలముచే మనస్సు సంసృతి నెట్లు సృజించుచున్నదో, అట్లు పురుషునకు జాగ్రత్తులోగూడ మనస్సే స్వశక్తిచే సర్వసంసారమును కల్పించు చున్నది. 'మన ఏ వాఖిలం విశ్వం సృజత్యత్ర తు నో విధిః। స్వప్నవత్' (మ. వా. ద. 60) మనస్సే సర్వపదార్థములను వలె సమస్తవిశ్వమును సృజించు చున్నది. 'ఆత్మనః స్థూలభిన్నత్వం స్వప్నే దృష్ట్వాపి మోహితాః। స్థూలే ష్వహం తాం నో ముంచంతి' (మ. వా. ద. 9) స్వప్నమున ఆత్మకు స్థూలదేహము లేకుం

డుట గాంచియు మోహితులై, స్థూల దేహేంద్రియాదుల ఆత్మాభిమానమును విడువజాలకున్నారుగదా! 'ప్రాతిభాసిక జీవో యస్తజ్జగత్ ప్రాతిభాసికం। వాస్తవం మన్యతేఽన్యస్తు మిథ్యేతి వ్యావహారికః॥ (40) వ్యావహారిక జీవో యస్తజ్జగద్వ్యావహారికం। సత్యం ప్రత్యేతి మిథ్యేతి మన్యతే పారమార్థికః॥' (వా. సు. 41) ప్రాతిభాసికుడైన స్వప్నపురుషుడు తన లోకమునే వాస్తవముగ నెంచును. కాని వ్యావహారికుడైన జాగ్రత్పురుషుడు దానిని మిథ్యగ దలపోయును. వ్యావహారిక జీవుడు జాగ్రత్కాల వ్యవహారములను సత్యముగ నెంచును. కాని పారమార్థికదృష్టిగలవాడు దీనినిగూడ మిథ్యగనే భావించును 'జాగరస్స్వప్నయోరేవ బోధాభాస విడంబనా' (ల.వా వృ.4) జాగ్రత్స్వప్నములందే యీ బోధాభాసుని వంచనము. 'ప్రతీతికాల ఏవైతే స్థితత్వాత్ ప్రాతిభాసికే। న హి స్వప్నప్రబుద్ధస్య పునః స్వప్నే స్థితి స్తయోః॥' (వా. సు. 39) స్వప్నానుభూతములగు జీవ జగత్తులు స్వప్నకాలముననే అనుభూతములై జాగరమునగాని, మరల స్వప్నమునగాని గోచరింపవు గాన ప్రాతిభాసికములని వచింపబడుచున్నవి. ఈవిధముగనే స్వప్నదృశ్య మిథ్యాత్వముతో సహా జాగ్రదవస్థయొక్క మృషాత్వమును, బృ. భా. 4. 3. 18, 4. 3. 17, 4. 3. 7, 2. 1. 18; తై. భా. 2. 8; బ్ర. సూ. భా. 2. 3. 46, 2. 1. 9, మొదలగు నసంఖ్యాక వాక్యముల శంకరుడు వివరించియున్నాడు. పూర్వదృష్టాంతములకంటె నిది విశిష్టమై అద్వైతభావ వివరణమును స్పష్టము గావించుచున్నది. స్వప్నదృశ్యములు తత్కాలమున సత్యములై దోచి, జాగ్రత్తులో

అయథార్థములగుట సర్వానుభవసిద్ధమే. అటులే జాగ్రత్ దృశ్యములు సుషుప్తిలో నదృశ్యమగుచుండ, తురీయమున మిథ్యలుగనే నిశ్చయింప బడుచున్నవి. ఇది విద్వదను భవము. కాన నీ జీవునకు వ్యవహార రంగమైన అవస్థాత్రయ ములు భ్రాంతి సిద్ధము లగుటచే జీవత్వమే మిథ్యయై తదతీత బ్రహ్మ తత్త్వమే జీవుడని వ్యక్తమగును. పూర్వోక్త దృష్టాంతములకంటె, నిది సర్వజనానుభవ వేద్యమైన దగుటచే, నద్వైతవాదమున కీ యుదాహరణము చాల ముఖ్యమై వెల్గొందుచున్నది. ఈదృష్టాంతమున జీవ జగత్తుల మిథ్యాత్వప్రతిపాదనముతో బ్రహ్మైకత్వము సాధింపబడి యున్నది. అనిర్వచనీయ అవస్థాత్రయ కలిమిచే, బ్రహ్మమున కెట్టి వికారములు గలుగ నేరవనుటకు స్వప్నానుభూతి ఉదా హరణము. స్వప్నదృశ్యములు జాగ్రత్తునగల పురుషున కెట్టి అనుభవమును గలుగజేయవుగదా! ఈదృష్టాంతమున అధిష్ఠా నాధ్యస్తములు అనన్యములై ఏకమనస్సునందే గల్పింపబడుట గమనార్హము. ఒక్క మనస్సే స్వప్నకాలమున అధిష్ఠానమై వాస నాపూర్వకమైన దృగ్దృశ్యములుగూడ నగుచున్నది. కాన నీ దృష్టాంతము అద్వైతప్రతిపాదనమునకు కడు సన్నిహితమై, ఏక త్వము నానాత్వముగా స్వశక్తిచే నెట్లగునో విశదపరచుచున్నది. అట్లు స్వప్నమున సర్వసృష్టికర్తయగు చిత్తము, జాగ్రత్తులోనికి ప్రవేశించుతోడనే, పూర్వముగల అధిష్ఠానత్వము, దృగ్దృ శ్యాదిక స్వరూపత్వములు, అదృశ్యములై తన ఏకత్వమును బ్రక టించుచున్నది. స్వప్నమునగల అవస్థాత్రయముగూడ వ్యావ హారిక జాగ్రత్తులో నసత్యములైనవి. అటులే వ్యావహారిక

అవస్థాత్రయమునకును, చిత్తవికారములకును పరమాధిష్ఠానమైన ఆత్మానుభూతి కాలమున నివియన్నియు నంతరించి, తమ మిథ్యాత్వమును వ్యక్తపరచుచున్నవి. జాగ్రత్స్వప్నాదులు లేని సుషుప్తియందు హాయి ననుభవించుచున్న జీవుడు అవస్థాత్రయ విరహితమైన ఆత్మానుభూతికై వేరగు నవసరము కానరాదు. అన్యథాజ్ఞానములేని అజ్ఞానమే హాయి నొసంగనా యజ్ఞానముగూడ లేని ఆత్మానుభూతి ఎంతటి ఆనంద సంధానమో ! అందుచే నీ దృశ్యమాన ప్రపంచము అట లేకుండుటచే నే మగుదునో అను భయము అనావశ్యకము. 'ద్వితీయాద్వై భయం భవతి' (బృ. 1. 4. 2) రెంటితోడనే భయము గలుగుననిగదా సూక్తి. కాన నీ స్వప్న దృష్టాంతము అతి ప్రసిద్ధమై ముఖ్యము.

దశమ పురుష

స్వప్నదృష్టాంతమున జాగ్రత్పురుషుని విస్మృతి గోచరము. అజ్ఞాన అన్యథాజ్ఞానములు వేర్వేరు అవస్థలలో గోచరము. కాని యీ అజ్ఞానాన్యథాజ్ఞానము లొకే అవస్థలో బ్రత్యక్షమైన మరియొక యుత్కృష్ట దృష్టాంతము గ్రంథముల గోచరము. ఇటగూడ అధిష్ఠానాధ్యారోపములు ఏకముగనే యుండును. నదిని దాటిన పదిమంది పురుషులు తమలో దాము లెక్కించుకొనుచు, దనను గాక నితరులమాత్రము గణించి, లెక్కకొకడు లోపించుటచే విచారించు నట్టి ఉదాహరణము. దీనినే 'దశమోహం' అందురు. ఈ గాథ యుక్తి బాహ్యమని త్రోసిపుచ్చుచో, అన్యుల చెంత బెరిగి, స్వకీయ

జననీ జనకుల మరచియున్న బాలక దృష్టాంతము సూచింపబడును. యథార్థమైన తలిదండ్రుల నతడు నిశ్వసింపక, పెంచువారినే మాతాపితలుగ నమ్మెను. తాను వారి పుత్రునిగా భావించెను. ఈ దృష్టాంతముల, తానే దశముడైయుండి, లేక యథార్థ పుత్రుడై యుండి, కాదనుకొనినంతమాత్రమున కాకుండునా? సత్యమును విస్మరించుట చేతనే దుఃఖాదులుగలిగెను. యథార్థ జ్ఞానముతో హర్షముగలిగెను. జ్ఞానకాలమున నూతనముగ దశముడుగ గాని పుత్రుడుగ గాని కాలేదు. ఈ యుదాహరణము అద్వైతమునకు బూర్తిగ సన్నిహితమే.

ఈదృష్టాంతములు గాక జీవత్వ మృషాత్వ నిదర్శనము నకును, ఆత్మైకత్వ వివరణమునకును అనేకములైన ఉదాహరణములు వచింప బడియున్నవి. వీనినన్నింటిని శంకరుడు తన గ్రంథముల జొప్పించి వివరించియుంచుట గమనార్హము. వానిగూడ నొకించుక జూచెదముగాక.

## ఇంద్రజాల

'యతో యస్మాత్పురుషాత్ సంసార మాయావృక్ష ప్రవృత్తిః ప్రసృతా నిఃసృతా ఐంద్రజాలికాదివ మాయా పురాణీ చిరంతనీ' (గీ. భా. 15. 4) ఈ పురుషుని నుండియే మాయాసంసారవృక్షము ఐంద్రజాలిక మాయా దృశ్యముల వలె గల్పింపబడెను. మాయావి అయిన ఐంద్రజాలికుడు మాయాగజమును సృజించి, దాని నధిరోహించి నట్లుండును గాని, సత్యమున నతడు క్రిందనే యుండును. మాయాకల్పిత హారమును నెక్కినట్లుండునుగాని అతడు ఎక్కుటయేలేదు.

ఆ యా దృశ్యములు సృజించి, అందు క్రీడించుచున్నట్లు అసత్య దృష్టికి గోచరముగాని, యథార్థదృష్టికి అతడు వాని కన్యుడు అగుచుండును. అటులే బ్రహ్మము మాయాకల్పిత సంసారవృక్ష జనిత దేహేంద్రియాదులతోగాని, పుణ్యపాపములతోగాని సంబంధము లేనివాడై, నిర్వికారుడై, ఏకుడైయుండునని పర మార్థము.

### ఆకాశ—నగరత్వాది

'నామ రూపాదయో యత్ర కల్పితా శ్చిత్త విభ్ర మాత్ । వ్యోమ్నీవ నగరం...' (మ. వా. ద. 170) నామ రూపాదులు చిత్తవిభ్రాంతిచే నిట ఆకసమునందు గల్పింపబడు నగరము వలె గల్పితము. అటులే 'స్వయం తత్త్వ మవిజ్ఞాయ సర్వం త్వయి వికల్పితం। నిర్వికారే నిరాకారే వ్యోమని శ్యామ తాదివత్॥' (మ.వా.ద.191) స్వయముగా తత్త్వమును గ్రహిం పక, నిర్వికారమైన నీయందు, నిరాకారమైన ఆకాశమునందు శ్యామత్వాది వర్ణమును గల్పించినట్లు, సర్వము కల్పింపబడు చున్నది. 'వ్యోమ్ని నీలతాది' (స. వే. సి. సా. 478) 'దేహేంద్రియగుణాన్ కర్మాణ్యమలే సచ్చిదాత్మని । అధ్యా స్యంతేఽవివేకేన గగనే నీలతాదివత్॥' (ఆ. బో. 21) అమల మైన సచ్చిదాత్మయందు దేహేంద్రియ గుణకర్మలను అవి వేకముచే, గగనమున నీలత్వాది కల్పనమువలె అధ్యాస గావింపబడినది. 'తత్రైవం సతి కర్తృత్వ భోక్తృత్వలక్షణః సంసారో జ్ఞేయస్థో జ్ఞాతర్యవిద్యయా అధ్యారోపిత ఇతి న తేన జ్ఞాతుః కించిత్ దుష్యతి । యథా బాలైరధ్యారోపితే నాకాశస్య తలమలవత్త్వాదినా' (గీ. భా. 13. 2) బాలురచే

గల్పింపబడిన వర్తులత్వ మలినత్వములచే నాకాశము మలి నత్వాదికముల బొందనియటుల, అవిద్యచే, జ్ఞాత యందుగల దని జెప్పబడుచున్న అవిద్యచే, కర్తృత్వ భోక్తృత్వాదిక సంసార లక్షణములచే జ్ఞాత యిసుమంతయైనను మలినము కానేరదు. ఈ ఉదాహరణమున నధిష్ఠానము నిరవయవమై వ్యాప్తమై యుండుట గాంచనగును. అనగా నధిష్ఠానము రజ్జ్వాదికమువలె అవయవియై స్థూలమై, సాదృశ్యాది లక్ష ణోపేతముగ నుండ నవసరములేదని యీ ఉదాహరణము బోధించును. అట్టి ఆకాశమున కెట్టును సంబంధించని నగ రాదులు, పుష్పాదులు, నీలత్వాదికము గల్పింపబడుచున్నవి. అయినను నది నిర్వికారము, నిర్మలము అనంతము. అటులే ఆత్మయు, నాత్మేతర పదార్థ లక్షణములచే నధ్యస్తమై యున్నను, నది నిరతిశయము నిర్మలము ఏకము.

## స్ఫటిక — జపాకుసుమ

'జపాకుసుమ సాన్నిధ్యా ద్రక్తత్వం స్ఫటికే యథా। తథా హంకార సాన్నిధ్యా జ్జీవత్వం ప్రత్యగాత్మని॥' (మ. వా. ద. 81) స్ఫటికము రక్తపుష్ప సన్నిధానముచే రక్తవర్ణ లక్షణమువలె గోచరించు చందము, అహంకార సన్నిధాన మహిమచే ఆత్మకు జీవత్వ మాపాదించియున్నది. 'స్ఫటికే రక్తతా మిథ్యా మృషా ఖే నీలతా యథా। తథా జగదిదం మిథ్యా ...' (అద్వై. అ. 72) స్ఫటికమునకు రక్తత్వము ఆకసమునకు నీలత్వము లెటువలె మిథ్యలో, అటులే యీ జగత్తు మిథ్యయే. ఇచట స్ఫటికమున దోచు వర్ణము ఆభాస

మాత్రమే అగుచు, అయథార్థముగ నుండుట గమనార్హము.

ప్రతిబింబ

అటులే 'ముకురస్థం ముఖం యద్వన్ముఖవత్ ప్రథతే మృషా। బుద్ధిస్థాభాసక స్తద్వత్ ఆత్మవత్ ప్రథతే మృషా॥' (అద్వై. అ. 64) దర్పణమునందు దోచు ముఖప్రతిబింబము, ముఖమువలె దోచియు, మృషాత్వము నొందియుండిన నటుల, బుద్ధిగత ఆభాస ఆత్మవలెనే వ్యవహరించును గాని అది మిథ్యయే. మరియు 'ఇదం చిదాత్మస్ఫురణానువృత్త్యా విస్ఫూర్తిమత్యంత ముపైతి సన్నిధౌ। చిదాత్మనస్తుల్యతయా విభాతి సూర్యస్య దీప్త్యా స్ఫటికో యథా తథా॥' (పు. వా. ద. 63) ఈ అంతఃకరణము చిదాత్మస్ఫురణముయొక్క అనుసరణముచే ఆత్మసాన్నిధ్యమున మిగుల ప్రకాశమును బొందుచున్నది. అనగా కర్తృత్వాదికమును బొందుచున్నది. సూర్యకాంతిచే స్ఫటికము ఎట్లో అట్లే నది బ్రహ్మతుల్యమువలె ప్రకాశించును. 'జీవో ధీస్థ చిదాభాసో భవేత్ భోక్తా హి కర్మకృత్' (వా. సు. 33) బుద్ధిస్థమైన చిదాభాసుడైన జీవుడే భోక్తయు కర్తయునగును. 'ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే యుత్స్వప్న దేహే హృది కల్పితాంగే। యథాత్మబుద్ధి స్తవ నాస్తి కాచి జ్జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు॥' (వి. చూ. 165) నీ ఛాయా శరీరమందును, నీట ప్రతిబింబించిన ప్రతిబింబిత శరీరమునందును, స్వప్నగతదేహమునందును, ఊహాకల్పిత దేహమునందును ఎట్లు ఆత్మబుద్ధికలుగదో అట్లే జాగ్రదవస్థయందు దృశ్యమగు నీ స్థూలదేహామందు సయితము ఆత్మబుద్ధి

గలుగనీయకుము. అనగా ఛాయాశరీరములు అసత్య మైనట్టుల స్థూలదేహములుగూడ నట్లే అయథార్థమని తాత్పర్యము. 'ఘటోదకే బింబితం సూర్యబింబ మాలోక్య మూఢో రవిమేవ మన్యతే। తథా చిదాభాస ముపాధిసంస్థం భ్రాంత్యాహమిత్యేవ జడోఽభిమన్యతే॥' (వి. చూ. 220) ఘటోదకమందు ప్రతిఫలించిన సూర్యబింబమును మూఢుడు గాంచి, దాని సూర్యబింబముగనే భావించునట్లు, వివేక శూన్యుడు బుద్ధ్యుపాధి స్థితుడైన చిదాభాసునే తానని భ్రాంతిచే ననుకొనును. అనగా అసత్య ప్రతిబింబమునే బింబముగా నవివేకముచే భ్రాంతినొంది భావించుచున్నాడు. 'ఆదర్శస్థ యదాభాసో ముఖాకారస్స ఏవ సః। యథైవం ప్రత్యయాదర్శే యదాభాసస్తదా హ్యహం॥' (ఉ. సా. 2. 18. 109) అద్దమున బ్రతిఫలించు ఆభాసము ముఖమేగాని అన్యము కాదు. అట్లే చిదాభాసమగు ఆత్మ బ్రహ్మమే కాని అన్యము కాదు. కాని అధ్యస్తాంశము మిథ్యయని నిషేధింపగా బ్రహ్మమే శేషించును. 'ఆదర్శానువిధాయిత్వం ఛాయాయా అస్యతే ముఖం। బుద్ధిధర్మానుకారిత్వం జ్ఞాభాసస్య తథేష్యతే॥' (ఉ. సా. 2. 18. 70) ముఖప్రతిబింబము యొక్క ఆదర్శానుకారము ముఖమునం దారోపింప బడినట్లు, చిదాభాసునియొక్క బుద్ధిధర్మానుకారము ఆత్మయం దారోపింప బడును. ఈ దృష్టాంతము బింబ ప్రతిబింబ న్యాయమును విశదీకరించుచు, బింబ ప్రతిబింబములకు తత్వతః అభిన్నత్వమును, నామరూపముల భిన్నత్వమును జూపెట్టుచు, దార్ష్టాంతికమున జీవ బ్రహ్మములకు వస్తుతః అభేదమును,

నామరూపతః విభేదమును బోధించుచున్నది. ఇందు అద్వైత వాదమునగల ప్రతిబింబవాదము గోచరము. అనగా బ్రహ్మము యొక్క ప్రతిబింబము అంతఃకరణము నాబడు అవిద్యలో నేర్పడుటయే జీవత్వమనియు,నా ప్రతిబింబము చిదాభాసమనియు నిందు గానబడినది. ఉపనిషద్వచనములైన 'అనుప్రవిశ్య' 'తదేవానుప్రావిశత్' అను సూక్తులకు అఖండానంతలక్షణు డైన బ్రహ్మమెట్లు సృష్టిలో బ్రవేశించునను సంశయనివారణ మున, బ్రతిబింబరూపమున బ్రవేశము వాకొనబడుటచే నన్వయ మగుచు బ్రహ్మముయొక్క నిర్వికారత్వ, అనంతత్వ, నిర్లిప్త త్వాది లక్షణములకు దోషము వాటిల్లనీయదు యీ ప్రతిబింబ వాదము. మరియు బ్రతిబింబ మృషాత్వమును రూపించి, బింబ సత్యత్వమును ముందుంచును.

## జలసూర్య

ఇటులే జలసూర్యన్యాయముగూడ వర్తించును. 'తోయాశ్రమేషు సర్వేషు భానురేకోఽప్యనేకవత్। ఏకోఽ ప్యాత్మాతథా భాతి సర్వ క్షేత్రే ష్వనేకవత్॥' (అద్వై. అ. 52) ఒక్కడయ్యు సూర్యుడు సర్వజలాశయములలో ననేకమైనట్లు గోచరించు చందము ఆత్మ ఏకమయి యుండియు సర్వక్షేత్రముల ననేకముగా భాసించును. 'ప్రతి ఫలతి భాను రేకోఽనేక శరావోదకేషు యథా। తద్వదసౌ పరమాత్మా హ్యేకోఽనేకేషు దేహేషు॥' (ప్ర. సు.124) ఒకడైన భానుడు అనేక జలముల ననేకముగ బ్రతిబింబించురీతి, ఈ పరమాత్మ ఏకమైయుండియు ననేక దేహములలో ననేకముగా దోచును.

(స్వా. ప్ర. 8) 'జలభేదగత సూర్యప్రతిబింబవత్' (ఐ. భా. 5. 3) వివిధజలములగల సూర్య ప్రతిబింబములవలె ననువాక్యములు ఏకత్వము అనేకత్వ మగునట్లు దోచు విధానమును దెలుపుచున్నవి. బింబము అభిన్నముగ నుండినను వివిధజలాశయముల ప్రతిబింబించుటచే ననేకరూపముల దాల్చినట్లు అనేకముగ నయినట్లు దోచునట్లొనరించుట యింపు గాననగును. కాని బింబము అఖండము అనంతముగనే యొప్పారుచున్నది. ప్రతిబింబము బింబలక్షణముల గైకొనియున్నను, బింబమునకు అంశాంశి భావ సంబంధమునుండ నేరదుగదా! అనగా నది బింబ ఖండము కాదుగదా! ఆ ప్రతిబింబ మెన్నివిధములుగ విభిన్నత్వమునొంది ననేకముగ నైనను, బింబము నిశ్చలము నిర్వికారము. కాని బింబ ప్రకాశమును అది గొని, ప్రతిబింబిత పదార్థమున బింబతుల్యముగ ప్రకాశించుట విదితము. అందుచే బింబమే ప్రతిబింబరూపముగ నా ప్రతిబింబింపఁజేయు పదార్థమున ప్రవేశించినట్లు వచింపనగును. అందుచే 'సూర్య ప్రతిబింబవ దంతః ప్రవిశ్య' (ఛాం. భా. 6. 3. 2) సూర్యప్రతిబింబమువలె నంతరమున ప్రవేశించి 'జీవోహి నామ దేవతాయా ఆభాస మాత్రం। బుద్ధ్యాది భూతమాత్రాసంసర్గజనితః, ఆదర్శే ఇవ ప్రవిష్టః పురుష ప్రతిబింబో జలాదిష్వివ చ సూర్యాదీనాం' (ఛాం. భా. 6.3.2) జీవుడు ఆభాసమాత్రుడు. బుద్ధ్యాది భూతసంబంధమున వానిలో అద్దమున పురుషప్రతిబింబము, జలాశయముల సూర్యాదులవలె ప్రవేశించును. 'జల సూర్యాది ప్రతిబింబ వదాత్మ ప్రవేశశ్చ ప్రతిబింబవత్' (బృ. భా. 1. 4. 7) జలములగల సూర్యప్రతిబింబమువలె ఆత్మ ప్రవే

శించును అను వచనములు ప్రవేశవిధానమును బోధించుచున్నవి. 'చరతర తరంగ సంగాత్ప్రతిబింబం భాస్కరస్య చ చలం స్యాత్ । అస్తి తథా చంచలతా చైతన్యే చిత్తచాంచల్యాత్॥' (ప్ర. సు. 115) చలించుచున్న తరంగ సంగముచే సూర్యప్రతిబింబము చలించునట్లుండురీతి చిత్తచాంచల్యమున చైతన్యముగూడ చలించునట్లు దోచును. 'ప్రతిబింబ చలత్వాద్యా యథా బింబస్య కర్హిచిత్ । న భవేయుస్తథాఽఽభాస కర్తృత్వాద్యాస్తు నాత్మనః॥' (అద్వై. అ. 55) ప్రతిబింబము యొక్క చలనత్వము బింబమునకు లేనియట్లు, చిదాభాసుని వికారములు ఆత్మకుండనేరవు. 'మాయయా వ్యాత్మాఽవికారోఽపి బహుధైకో జలార్కవత్' (ఉ. సా. 2.17.27) మాయావి అయిన ఆత్మ అవికారియైనను, ఒకడేయైన సూర్యుడు నానాత్వముల దోచు చందము వికారియైనట్లు దోచును. 'అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీని చాత్మని । కల్ప్యంతేఽంబుగతే చంద్రే చలనాది యథాంభసః॥' (ఆ. బో. 22) జలముల గదలికను అందు బ్రతిబింబించిన చంద్రునకు ఆరోపించునట్లు అజ్ఞానవశమున మనస్సంబంధములైన కర్తృత్వాదుల నాత్మకు నారోపించెదరు. 'జలగతం సూర్యప్రతిబింబం జలవృద్ధౌ వర్ధతే జలహ్రాసే హ్రసతి జలచలనే చలతి జలభేదే భిద్యత ఇత్యేవం జలధర్మానువిధాయి భవతి, న తు పరమార్థతః సూర్యస్య తథాత్వమస్తి, ఏవం పరమార్థతో ...' (బ్ర. సూ. భా. 3.2. 20) జలమునందలి సూర్యప్రతిబింబము జలము వర్ధిల్లగా వర్ధిల్లుచు, క్షీణింపగా క్షీణించుచు, చలింపగా చలించుచు, జలభేదమున భేదిల్లుచున్నది. ఇట్లు జలధర్మముల

ననుసరించుచున్నది గాని పరమార్థమున సూర్యున కెట్టి వృద్ధిక్షయములు లేవు. అట్లే బ్రహ్మము పరమార్థముగ నవికృతము. కాని దేహాద్యుపాధుల నాభాసరూప ప్రవేశన మొనర్చుటచే వానిలక్షణముల బొందినట్లు భాసించును. కాని పరమార్థతః లేదు అను వాక్యములు బ్రహ్మముయొక్క నిర్వికారిత్వమును అసాంసారికత్వమును బోధించుచున్నవి. ఉపాధి యగు అంతఃకరణ గుణములు అందు ఆభాసరూపమున నున్న ఆత్మకు అన్వయింపబడును గాని యథార్థమున నవి ఉపాధి గతములే యగును. అనగా ఉపాధిగల లక్షణము లెట్లున్నను అందుగల ఆభాసకాధారభూతమైన బ్రహ్మము సర్వాతీతుడని యీ వాక్యము లుపదేశించుచున్నవి. అట్లగుటచే బింబ ప్రతిబింబముల కనన్యత్వ ప్రతిపాదనము నొనర్చినట్లుండుటచే, జీవ బ్రహ్మ భిన్నత్వ మేర్పడును. కాని 'ఆభాస ఏవ చైష జీవః పరస్యాత్మనో జల సూర్యకాదివ త్ప్రతిపత్తవ్యః న స ఏవ సాక్షాన్నాపి వస్త్వంతరం' (బ్ర. సూ. భా. 2. 3. 50) ఈ జీవుడు నీటం బ్రతిబింబించిన సూర్య ప్రతిబింబమువలె బరుడగు నాత్మ ప్రతిబింబమే యగును. సాక్షాత్తుగా బరమాత్మయుగాక, తదన్యము గూడ కాదు. అన్యానన్య సంబంధమున నుండును. అనగా దత్త్వతః అనన్యమే అయినను, ఉపాధిగతు డగుటవలన అన్యమగుచు, ఉపాధి లక్షణముల భాసించుచున్నాడు. అందుచేతనే ఒక జలము కంపింప నందలి సూర్యప్రతిబింబము మాత్రమే కంపించును గాని, అన్నిజలముల బ్రతిబింబము కంపింపనియట్లు ఒకచిదాభాసుని లక్షణములు అన్యునికి అన్వయింప నేరవు. ఉపాధి

భేదములు దానికి కారణము. కాని 'ఘటం జలం తద్గత మర్కబింబం విహాయ సర్వం దివి వీక్షతేఽర్కః। తటస్థ ఏతత్త్రితయావభాసకః స్వయం ప్రకాశో విదుషా యథా తథా॥' (వి. చూ. 221) ఘటము, జలము, అందలి సూర్యప్రతిబింబము నను నీ సర్వమును త్యజించి, వీనికి తటస్థముగ నుండి, వీనిని ప్రకాశింపజేయుచు, గగనమున స్వయంప్రకాశమునగల సూర్యుని బండితులు, ఘటాదిభిన్నునిగ నెంచుచున్నారు. అట్లే దేహాది యుపాధిక విషయములు అందు దోచు చిదాభాసాదికమున కన్యముగ, నతీతముగ బ్రహ్మము గలడని తాత్పర్యము. ఈవిధముగ నీ జలార్కదృష్టాంతము కొంత సమగ్రముగ నద్వైతతాత్పర్యబోధ గావించుచున్నది. అద్వైతసిద్ధాంత ప్రతిపాదనమునగల యనేక సంశయముల నిదినివారణము గావించుచున్నది.

### ద్విచంద్ర

ద్విచంద్రన్యాయముగూడ నధ్యాస కుదాహరణము. 'అక్షిదోషాద్ యథైకోపి ద్వయవద్భాతి చంద్రమాః। ఏకో ప్యాత్మాతథా భాతి ద్వయవన్మాయయామృషా॥'(అద్వై.అ. 4) నేత్రదోషముచే నేకమైయున్న చంద్రుడు ద్వయముగా గోచరించునట్లు ఏకమైన ఆత్మయు మృషయయిన మాయచే ద్వయముగా గానుపించును. 'ఏకశ్చంద్ర స్సద్వితీయ వదితి' (బ్ర. సూ. భా. 1. 1. 1) ఒక చంద్రుడు యిరువురుగా నగుబడునట్లు ఇందు కేవలము నేత్రదోషమే ప్రధానముగ నగును. అటులే మాయా ప్రభావముననే నానాత్వము కల్పితమని యీదృష్టాంతము వక్కాణించును.

వివిధాకాశ

ఆకాశోపమానముగూడ ప్రశస్తము. 'ఆత్మైక స్సర్వ భూతేషు తాని తస్మింశ్చ ఖే యథా' (ఉ. సా. 2. 15. 9) సర్వభూతములయందును ఆత్మ ఏకముగనేయున్నది. అవకాశ రూప ఆకాశము సర్వవస్తువుల నేకముగ నుండునుగదా! 'జ్ఞః ఖమివైకరసోఽద్వయః' (ఉ. సా. 2. 12. 11) ఆకసము వలె నతఁడు ఏకైకరసుఁడు అద్వయుఁడు. అతఁడు సర్వాంతరుఁడు. గగనమువలె 'నిర్వికారోఽచలః శుద్ధోఽ......' (ఉ సా. 2. 12. 19) నిర్వికార అచల శుద్ధాదిక లక్షణుఁడు. అయినను 'కార్యభూతో యథాకాశ ఏక ఏవ స హి ద్విధా' (అద్వై. అ. 6.) కార్యభూతమైన ఆకాశము రెండుగాక నేకముగనుండు చందము ఆత్మయునేకమే. కాని 'ఏకోఽపిద్వయవద్భాతి యథా కాశ ఉపాధితః' (అద్వై. అ. 9) ఏకమై యున్నను, ఉపాధిచే ద్వయముగా నాకాశము దోచురీతి, 'యథాఽఽకాశో హృషీకేశో నానోపాధిగతో విభుః। తద్భేదాత్ భిన్నవద్భాతి తన్నాశే కేవలో భవేత్॥' (ఆ. బో. 10) ఆకాశమువలె బ్రహ్మము సర్వవ్యాపియైయుండి, నానా ఉపాధి బలమున తద్భిన్నముగ భిన్నమువలె గానుపించును. ఉపాధినాశమున కేవలత్వము గలుగును. ఎట్లన 'ఘట మఠ కుడ్యై రావృత మాకాశం తత్తదాహ్వాయం భవతి। తద్వ దవిద్యావృత మిహ చైతన్యం జీవ ఇత్యుక్తః॥' (ప్ర. సు. 106) ఘట మఠ కుడ్యములచే నావృతమైన ఆకాశము అట్లు వచింపబడు చుండునట్లు అవిద్యావృతమైన ఆత్మ జీవుడని అనబడును. 'నానావిధత్వం కుంభానాం న యాత్యేవ యథా నభః। నానా

విధత్వం దేహానాం తద్వదేవ న యామ్యహం॥' (అద్వై. అ. 28) నానావిధములైన కుండలలో నాకాశ ముండునట్లు, నానా విధ దేహములలో నాత్మనైన నేనుందును. అనగా 'ఘటాకాశ మఠాకాశౌ మహాకాశే ప్రకల్పితౌ। ఏవం మయి చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ॥' (స్వా. ప్ర. 42) మహాకాశమున ఘటాకాశ మఠాకాశములు కల్పింపబడినట్లు, నా చిదాకాశమున జీవేశ్వరులు కల్పితము. 'ఘటాభావే ఘటాకాశో మహాకాశో యథా తథా। ఉపాధ్యభావే త్వాత్మైవ స్వయం బ్రహ్మైవ కేవలం॥' (స. వే. సి. సా. 694) ఘటనష్టమున ఘటాకాశము మహాకాశమే యగును. అటులే ఉపాధి నశింప ఆత్మ బ్రహ్మమే స్వయముగ నగును. మరియు 'ఘటాకాశ జన్మనాశ గమనాగమన స్థితి వత్సర్వ శరీరేష్వాత్మనో జన్మమరణాది ర్హాకాశే నావిలక్షణః ప్రత్యేతవ్య ఇతి।' (మాం. భా. 3. 9) ఆత్మకు నన్వయింపబడు జన్మమరణాదివికారములు ఘటాకాశమునకు నన్వయించు గమనాగమనములవలె నుండును. 'న పరమార్థత ఇత్యభిప్రాయః' (మాం. భా. 3. 3) అనగా నీ సృష్టి యథార్థము కాదు. అన్నియు మృషాకల్పితములే. 'యథా ఘటేషు నష్టేషు ఘటాకాశో న నశ్యతి। తథా దేహేషు నష్టేషు న నశ్యామి సర్వగః॥' (అద్వై. అ. 29) ఘటములు నశించినను ఘటాకాశము నశింపదు. అట్లే దేహములు నశించినను సర్వగుడనైన నేను నశింపను. ఘటములు నశించినను, కల్పాంతములైనను మహాకాశమునకు ఎట్టి బాధయు కలుగదు. అంతియగాక ఘటాకాశమున ఘటాకాశము నశింపక మహాకాశమే అగుచున్నది. అనగా సర్వదా అది మహాకాశమే అయి

యుండియు ఘటోపాధిచే ఘటాకాశము నాబడి వ్యవహరింపబడుచున్నను, అది నామమాత్రమేగాని, అది సర్వధా మహాకాశమే. అట్లే కల్పిత దేహాద్యుపాధులచే పరివృతమై ఆత్మ జీవుడని వ్యవహరింపబడుచున్నను, ఆత్మ ఎల్లపుడును అపరిచ్ఛిన్న పరబ్రహ్మముగనే ఉండును. ఉపాధినిరాసమున నది పరిపూర్ణ బ్రహ్మముగనే రూపొందుచున్నది. అనగా గల్పిత నామరూపముల విడనాడి, తన స్వభావసిద్ధస్థితినుండునని యీ దృష్టాంతము వలన గ్రాహ్యము.

## నావయాన

'పోతేన గచ్ఛతః పుంసః సర్వం భాతీవ చంచలం। తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥' (అ. అ. 76) ఓడలో బోవునట్టివానికి బాహ్యమునగల సర్వము చంచలముగా దోచునట్లు, అజ్ఞానవశమున నాత్మయందు దేహత్వాదులను జూచుచున్నాడు. అటులే 'పాలేన భ్రామ్యమాణేన భ్రమతీవ యథా మహీ' (అద్వై. అ. 42) నాగలి తిరుగునపుడు భూమిగూడ దిరుగునట్లు దోచును. అటులే మూఢబుద్ధికి నిశ్చలమైన ఆత్మ చంచలమైనట్లు దోచును.

## వివిధోదాహరణములు

'యద్వన్మృది ఘటభ్రాంతిం శుక్తౌ వా రజత స్థితిం। తద్వద్బ్రహ్మణి జీవత్వం భ్రాంత్యా పశ్యతి న స్వతః॥'(అ.అ.59) మృత్తికయందు ఘటభ్రాంతియు, శుక్తియందు రజతభ్రాంతియు వలె బ్రహ్మమునందు జీవత్వమును భ్రాంతిచే గాంచుచున్నాడు. స్వహజముగ కాదు. అటులే 'యథా మృది ఘటో నామ

కనకే కుండలాభిధా। శుక్తౌ హి రజతఖ్యాతిః జీవశబ్ద స్తథా పరే॥' (అ. అ. 60) మట్టియందు కుండ యను నామము, సువర్ణమునందు కుండలనామము, శుక్తియందు రజతనామము వలె బ్రహ్మమునందు జీవనామము గలిగెను. అనగా జీవత్వము భ్రాంతులవలె కల్పితమేగాని సత్యముగాదని తాత్పర్యము. అయినను 'ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేనైవ తంతవః। వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా॥' (అ అ.71). పృథ్వి ఘటత్వముగను, దారములు పటత్వముగను నిశ్చయింపబడినట్లు,ఆత్మ దేహాత్వముగ మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.మరియు నిట్లు మృత్తు, ఘటరూపములబొంది, నామరూప వ్యవహారమున ఘటేతరముగ దోచినను, యథార్థమున మృత్తు ఘటాదికమున కుపాదానమగుటచే, కార్యాంతరముగనుండి, కార్యాభిన్నముగనే నుండునట్లు, బ్రహ్మము దేహాదులయందు అనుస్యూతముగనే యుండి అభిన్నముగనే యుండును. (వి.చూ. 192) 'మృద్వివేక దర్శినాం ఘటాదిశబ్దబుద్ధీ నివర్తతే' (ఛాం. భా. 6.2.3) అధిష్ఠానమైన మృద్వివేకమున ఘటశబ్దబుద్ధి నివర్తించునట్లు బ్రహ్మజ్ఞానమున ఉపాధిగత మృషారూప దేహాది జీవత్వములు నివారించును. అదేవిధముగా 'లయే ఫేనస్య తద్ధర్మా ద్రవాద్యాః స్యు స్తరంగకే। తస్యాపి విలయే నీరే తిష్ఠంత్యేతే యథా పురా॥ ప్రాతిభాసిక జీవస్య లయే స్యుర్వ్యావహారికే। తల్లయే సచ్చిదానందాః పర్యవసంతి సాక్షిణి॥' (వా. సు. 45, 46) నురుగు లీనమైన దానిధర్మములగు ద్రవాదులు తరంగమునను, తరంగము లయమైన నీరమునను లయించునట్లు, సచ్చిదానందాది ధర్మములు, ప్రాతిభాసికజీవుని లయ

మైన వ్యావహారికుని యందును, అతడు లయమైన యథార్థపదార్థము సాక్షియందును వెలయుచుండును. ఈ దృష్టాంతముల మృదాదికము ఘటాదులకు స్థూలముగ కారణమైనట్లు గోచరముగాని, యథార్థమున మృత్తు నిర్వికారమై యుండ, నీ ఘటద్వారమున నామరూపములు మృత్తుపై అధ్యసింపబడియున్న వనియే తాత్పర్యము. సర్వానుభవసిద్ధమైన యీ దృష్టాంతమును సమ్యగ్దృష్టి బరిశీలించినచో, అధ్యస్తమైన నామరూపములు వికార భూయిష్ఠములై దేశకాల వస్తు కారణబద్ధమై యుండ, దీనికి కారణమని వ్యావహారికముగ దెలుపబడుచున్న మృదాదికము నిత్యమై, నిర్వికారమై, కార్యవ్యాప్తమై యొప్పుచునే యున్నది. కార్యనష్టమున నీ ఘటాదికము మృదాదికమున లయించుటగాక, తన అధ్యస్త నామరూపముల వీడి స్వతఃసిద్ధ మృద్రూపమునే దాల్చుటయు గమనార్హము. అనగా రజ్జు సర్పాధ్యాసలో వలె నిందును అధిష్ఠానమైన మృత్తు, స్థిరమై త్రికాలాబాధ్యమై యుండ, అధ్యస్తమైన కార్యము, ఘటాదులు పూర్వాపరముల నభావములై తత్కాల సత్తామాత్రములై యున్నవి. అందుచే నీ దృష్టాంతములగూడ ఆరంభణ, పరిణామవాదములుగాక, అధ్యాసనాబడు వివర్తవాదమే నిరూపితమై అద్వైతసిద్ధాంతమునే బలపరచునట్లు విదితము. ఆరంభణవాదము ప్రకారము మృత్తునుండి ఘటము జనింపలేదు. అటులే పరిణామవాదము ననుసరించి ఘటము మృత్పరిణామముగూడ కాదు. కాని పూర్వదృష్టాంతములలో వలె మృదధిష్ఠానముపై నామరూపాత్మక ఘటాదికము భాసించి కాలాంతరమున నదృశ్యమగుటయే యిందలి ముఖ్యాంశము.

మరియు 'తప్తాదిలవణోపేత మజ్జిగ్లవణవత్ యథా...।
అయఃకాష్ఠాదికం యద్వద్వహ్ని వద్వహ్ని యోగతః।భాతిస్థూలాదికం సర్వమాత్మవత్ స్వాత్మ యోగతః।' (అద్వై. ను. 19, 22)
మజ్జిగలోనున్న లవణముచే నజ్జులు దాని లవణముగనే భావించు నట్లు, కర్ర యినుములకు అగ్నిసంయోగముచే నవియే అగ్నిగా వ్యవహరించునట్లు, ఆత్మ సాన్నిధ్యముగల సర్వము ఆత్మవలెనే చూడబడు చున్నది. ఇచట అగ్ని అన్యమై యున్నను, కాష్ఠాదికముతో ననన్యముగ భావింప బడుచున్నది. అగ్నిత్వము కాష్ఠాదికమునకు సంక్రమించి యున్నది అటులే 'యథా శీతం జలం వహ్నిసంబంధా దుష్ణవద్ భవేత్। బుద్ధి తాదాత్మ్య సంబంధాత్ కర్తృత్వం వస్తుతో న హి॥' (స్వా. ప్ర. 54) స్వభావ శీతలమైన జలము అగ్ని సంయోగమున నుష్ణత్వమును బొందినట్లు, అకర్తయగు నాత్మయు బుద్ధ్యాదిక సంబంధమున కర్తవలె దోచును. ఇట్ల అసంగమై ఆత్మకు కర్తృత్వాదిక సంబంధము అధ్యసింపబడుచున్నది.

వీని నన్నింటిని చేర్చి శంకరులు అపరోక్షాను భూతిలో నిట్లు వచించు చున్నాడు. 'యద్వన్మృది ఘట భ్రాంతిః శుక్తౌ వా రజతస్థితిం' (59) మృత్తిక యందు ఘటభ్రాంతియు, శుక్తియందు రజతభ్రాంతియువలె, 'యథా మృది ఘటో నామ కనకే కుండలాభిధా । శుక్తౌ హి రజత ఖ్యాతిః' (60) మట్టియందు కుండయను నామము, స్వర్ణము నందు కుండలనామము, శుక్తియందు రజతనామము వలె, యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే। పురుషత్వం

యథా స్థాణౌ——॥' (61) ఆకాశమునందు నీలత్వము, ఎండ మావులందు ఉదకము, స్థాణువునందు మనుష్యత్వము వలె, 'యథైవశూన్యే వేతాళో గంధర్వాణాంపురంయథా। యథాఽఽకాశే ద్విచంద్రత్వం— —' (62) ఎట్లు శూన్యమునందు భేతాళ స్వరూపము, గంధర్వనగరము గలవో, ఆకాశమునందు చంద్ర ద్వయము వలె, 'యథా తరంగకల్లోలై ర్జలమేవ స్ఫురత్యలం। పాత్రరూపేణ తామ్రం హి — —' (73) ఉదకము కెరటము లుగ, తామ్రము పాత్రస్వరూపముగ దోచుటవలె, బ్రహ్మము నందు జీవత్వాదులు గల్పితములు. అటులే 'గృహత్వేనేవ కాష్ఠాని ఖడ్గత్వేనేవ లోహతా।' (74) కొయ్యలు గృహ ములుగను, ఇనుము కత్తిగను, 'యథా వృక్షవిపర్యాసో జలాద్భవతి కస్యచిత్।' (75) నీటిచే వృక్షము తలక్రిందైనట్లు గోచరించు విధాన, 'పోతేన గచ్ఛతః పునః సర్వం భాతీవ చంచలం' (76) ఓడలో బోవువానికి సర్వము చంచలముగా దోచునట్లు, 'పీతత్వం హి యథా శుభ్రే దోషాద్భవతి కస్యచిత్' (77) నేత్రరోగముచే తెల్లని వస్తువు పచ్చగ గన్పించునట్లు, 'చక్షుర్భ్యాం భ్రమశీలాభ్యాం సర్వం భాతి భ్రమాత్మకం' (78) భ్రమించు నేత్రముచేత సర్వము తిరుగుచున్నట్లు గోచ రించునట్లు 'అలాతం భ్రమణే నైవ వర్తులం భాతి సూర్యవత్' (79) కొరివిని ద్రిప్పుటచే సూర్యునివంటి వర్తులము దోచు నట్లు 'మహత్త్వే సర్వవస్తూనా మణుత్వం హ్యతి దూరతః।' (80) సర్వవస్తువుల యొక్క మహత్త్వము అతిదూరముచే అణువుగా గనబడునట్లు, 'సూక్ష్మత్వే సర్వ వస్తూనాం స్థూలత్వం చోపనేత్రతః।' (81) సకల వస్తువులయొక్క

సూక్ష్మత్వము ఉపనేత్రముచే స్థూలముగా గానబడునట్లు, 'కాచభూమౌ జలత్వం వా జలభూమౌ హి కాచతా।' (82) స్ఫటికభూమి యందు జలత్వము, జలభూమియందు స్ఫటికత్వము దోచురీతి, 'యద్వదగ్నౌ మణిత్వం హి మణౌ వా వహ్నితా పుమాన్।' (83) అగ్నియందు రత్నత్వము, రత్నత్వమునందు అగ్నిత్వము పురుషునకు దోచురీతి 'అభ్రేషు సత్సు ధావత్సు సోమో ధావతి భాతి వై' (84) మేఘములు పర్వెత్తుచుండ చంద్రుడు పరువెత్తుచున్నట్లు గనబడుచందము, 'యథైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్' (85) మోహముచే దిక్కులు తెలియని భ్రమగలిగినట్లు, 'యథా శశీ జలే భాతి చంచలత్వేన కస్యచిత్।' (86) జలమునందు చంద్రుడు చంచలముగా దోచునట్లు, 'తద్వదాత్మని దేహాత్వం పశ్యత్యజ్ఞానయోగతః'॥ (86) అజ్ఞానవశముచే నాత్మయందు దేహాత్వమును చూచుచున్నాడు.

---

## జీవుడు - ఏకము

పూర్వోక్త దృష్టాంత దార్ష్టాంతికముల సూక్ష్మపరిశీలనము గావించినచో 'అనేన వపుషా చ్ఛన్నః ప్రత్యగాత్మా స్వయంప్రభః। అసంసార్యపి సంసారివదేవాభా త్యవిక్రియః'॥ (మ. వా. ద. 54) ఈ శరీరాదులచే నావరింపబడినవాడై, స్వయంప్రకాశరూపుడైన ప్రత్యగాత్మ వికారములు లేనివాడై

యుండియు, సంసారివలె ప్రకాశించుచున్నాడని వాకొనబడి యున్నను, ఒకేసూర్యుడు అనేకజలముల ప్రతిబింబించి, తానేకుడై నిర్వికారముగ నుండునట్లు, సువర్ణ మృదాదికము కుండల ఘటాదిక మనేకరూపముల దాల్చినట్లు దోచినను, నిర్వికారముగ నేకమైయుండురీతి, సర్వ దేహాద్యుపాధ్యంతర్వర్తివలె దోచు నాత్మయు, 'ఆకాశవ త్సర్వ గతశ్చ నిత్యః' (ము. వా. ద. 78) ఆకసమువలె సర్వగతమై నిత్యమై ఏకమై యుండుచు, 'రూప స్మృత్యంధకారార్థాః ప్రత్యయా యస్య గోచరాః । స ఏవాత్మా సమో ద్రష్టా సర్వభూతేషు సర్వగః॥' (ఉ. సా. 2. 15. 34) రూపము, స్మృతి, అంధకారముల గ్రహించు వృత్తికి సాక్షియగు ఆత్మ సముడై, సర్వద్రష్ట, సకలభూతవాసి, సర్వవ్యాపకుడై యుండును. 'అప్రకాశో యథాఽదిత్యే నాస్తి జ్యోతిః స్వభావతః । నిత్యబోధస్వరూపత్వాన్నాజ్ఞానం తద్వదాత్మని॥' (ఉ. సా. 2. 16. 37) జ్యోతిస్స్వరూపుడగుటచే సూర్యునకు అంధకారము లేనియట్లు, నిత్యబోధ స్వరూపుడైన ఆత్మకు అజ్ఞానము సర్వదా లేదు. (ఉ. సా. 2. 10. 9) అందుచే 'గుడఖండ శర్కరాద్యా భిన్నాః స్యుర్వికృతయో యథైకేక్షోః। కేయూరకంకణాద్యా యథైక హేమ్నాభిదాశ్చ పృథక్॥ (129) ఏవం పృథక్స్వభావం పృథగాకారం పృథగ్వృత్తి । జగదుచ్చావచముచ్చైరేకేనైవాత్మనా చలతి॥' (ప్ర.సు.130) బెల్లము చక్కెర మొదలైనవి విభిన్నములై యున్నను, చెరుకు ఏకమై యుండు చందము, కేయూర కంకణాదికము నానాత్వము గలిగి యున్నను, సువర్ణమేకమై యుండునటుల,

నానాభావముల, నానారూపముల నానావృత్తుల గలిగిన జగత్తు ఏకమైన ఆత్మగనేయుండును.

'సర్వవ్యాపి తదాత్మతత్త్వం సర్వసంసార ధర్మవర్జితం స్వేన నిరుపాధికేన స్వరూపే ణావిక్రియమేవ సత్ ఉపాధి కృతాః సర్వాః సంసార విక్రియా అనుభవతీ వావివేకినాం మూఢానా మనేకమివ...' (ఈ. భా. 4) సర్వవ్యాపియైన ఆత్మతత్త్వము, సంసారధర్మము లెవ్వియు లేకయే, నిరుపాధిక స్థితిలో నిర్వికారమై యుండియు, దానిపై నారోపిత సంసార వికారము బొందినట్లుగనడుచు, ఏకమై యుండియు, అజ్ఞుల దృష్టికి ననేకముగను, దేహబద్ధముగను దోచును. 'స ఏవ సర్వ శరీరేష్వేక ఏ వాత్మానన్య ఇతి' (ఐ. భా. 3.1) సర్వ శరీరముల గల ఆత్మ ఏకము. జగదుత్పత్త్యాదిక ప్రతిపాదనము ఆత్మైకత్వ దర్శనముకొరకే వచింపబడియున్నది. (బృ. భా. 1. 4. 7) 'తస్మా దుత్పత్త్యాది శ్రుతయః ఆత్మైకత్వ బుద్ధ్యవ తారాయైవ నాన్యార్థాః కల్పయితుం యుక్తాః।' (మాం. భా. 3. 15) అందుచే సృష్టి ప్రతిపాదన శ్రుతివాక్యములు ఆత్మై కత్వబుద్ధి నిశ్చయార్థముగనే వచింపబడినవిగాని, యితరము గాదని సయుక్తికముగ తీర్మానించితిమి అను వాక్యము పూర్వార్థమును దెలుపుచున్నది. అటులే (మాం. భా. 3. 14). అందుచే సంవృతికల్పనము పరమార్థమున లేదు. (మాం. భా. 4. 74). కాన 'అజ మవ్యయ మాత్మ తత్త్వం మాయయైవ భిద్యతే న పరమార్థతః। తస్మా న్న పరమార్థ సత్ ద్వైతం' (మాం. భా. 3. 19) అజము, అవ్యయము అయిన ఆత్మ తత్త్వము, పరమార్థమున నానాత్వము కానేరదు. అందుచే

ద్వైతము పారమార్థికము కానేరదు. 'స సర్వ సృష్టి ప్రకారో జీవపరమాత్మైకత్వ బుద్ధ్యవతారాయ ఉపాయోఽస్మాకం' (మాం. భా. 3. 15) జీవబ్రహ్మైకత్వ నిర్ధారణమునకే సర్వసృష్టి ప్రకార మువదేశింపబడియున్నది. అట్లు విచారింప 'ఏకఏవ తథా సర్వ భూతాంతరాత్మా రూపం రూపం సర్వేషాం భూతానా మభ్యంతర ఆత్మా' (కఠ. భా. 5. 9) ఏకమైన ఆత్మయే సర్వభూతాంతరాత్మయై రూపరూపమున గలదు. 'సర్వవ్యాప్యేక ఏవాత్మా జగతో నాత్మభేద' (కఠ. భా. 5.2) సర్వవ్యాప్తమై ఆత్మ ఏకమైయున్నది. ఆత్మ భేదము లేదు.

'పారమార్థికం చానంత్యం' (బ్ర. సూ. భా. 2. 3. 29) ఆత్మ వ్యావహారికముగ నణుపరిమాణమున నున్నను, పారమార్థికముగ అనంతము. 'యద్యప్యేక ఏవాత్మా సర్వభూతేషు స్థావరజంగమేషు గూఢః' (బ్ర. సూ. భా. 1. 1. 11) ఏకమైన ఆత్మయే స్థావరజంగమాత్మక సర్వభూతములలో గూఢముగ నున్నాడు. అందుచే 'అవిద్యాప్రత్యుపస్థాపిత నామ రూప రచిత దేహాద్యుపాధి నిమిత్తో భేదో న పారమార్థిక ఇత్యేషోఽర్థ స్సర్వై ర్వేదాంతవాదిభి రభ్యుపగంతవ్యః' (బ్ర. సూ. భా. 1. 4. 22) అవిద్యా కల్పిత నామరూపాది దేహాద్యుపాధులవలన భేదముగాని, పారమార్థికముగ లేదను అర్థమును సర్వవేదాంతవాదులు సమ్మతింపవలెను.

పై వాక్య సముచ్చయము ఆత్మైకత్వమును బ్రతిపాదించుచు, నది సర్వవ్యాప్తముగను, నిర్వికారముగను, నిత్యముగను వచించుచు, దానిపై మాయాకల్పిత దేహాద్యుపాధుల

మిథ్యలుగ ద్రోసిపుచ్చియున్నవి. అట్టిచో నీ ఆత్మయొక్క యథార్థ స్వరూప మెయ్యది ?

---

## జీవ బ్రహ్మైకత్వము

పూర్వోక్తవిధమున జీవున కధిష్ఠానమైన ఆత్మ ఏకమై, వ్యాప్తమైయుండి, జీవత్వరూప దేహాద్యుపాధులు భ్రాంతిసిద్ధములగుట స్పష్టము. కాన జీవుడు ఈశ్వరుడగునా, బ్రహ్మమే యగునా యను సంశయమేర్పడును. 'జీవేశ్వరాదిభావేన భేదం పశ్యతి మూఢ ధీః' (అద్వై. అ. 73) భేదబుద్ధులకే జీవేశ్వరాదివిభేద భావనము. అందుచే 'ఏవం దేహద్వయా దన్య ఆత్మా పురుష ఈశ్వరః । సర్వాత్మా సర్వరూపశ్చ సర్వాతీతో ఒహ మవ్యయః॥' (అ. అ. 40) శరీర ద్వయమునకు అన్యమైన ఆత్మ ఈశ్వరుడును, సర్వాత్మయును సర్వరూపుడును సర్వాతీతుడును, ననెడి ప్రత్యయమునకు ఆలంబనమైన జ్ఞాన స్వరూపమై యుండునదియును అవ్యయ మనియు తెలియవలెను. అనగ వ్యష్టిరూపమున గోచరించు జీవుడు, సమష్టి రూపుడైన ఈశ్వర భిన్నుడుగాక, యథార్థమున నొక్కటియే యని దృఢము. అట్లు అయిన నీశ్వరుడు జీవున కధిష్ఠానమని వచింప వీలులేదు. 'న దీపస్యాన్యదీపేచ్ఛా యథా స్వాత్మ ప్రకాశనే' (ఆ. బో. 29) ఒకదీపము ప్రకాశింప, నన్యదీపాపేక్ష లేనియటుల, ఆత్మ స్వప్రకాశమైనది గదా ! అందుచే ఆత్మకు ఈశ్వరాపేక్ష యుండ నేరదు. కాన దేహాదిభ్రాంతి రహిత

జీవుడు, ఈశ్వరుడే యగును గాని అన్యము గాదు అని స్పష్టము. కాన జీవుడు 'తత ఆత్మా సదానందో నాస్య దుఃఖం కదాచన' (వి. చూ. 109) అనగా నాత్మ సర్వదా ఆనంద స్వరూపుడు. దుఃఖము కొంచమేనియు నభావము.

అట్లయినను జీవత్వముతో సమానమగు నీశ్వరత్వము గూడ పూర్వోక్తరీతి మాయోపాధికమై సమష్టిస్వరూపమే గాని, సర్వోపాధిరహితస్థితి గాకుండుటచే, జీవత్వమును బాసిన జీవుడు, ఆత్మయై, ఈశ్వరత్వమునకుగూడ నతీతుడై యొప్పాచుచున్నాడు. కావున 'అవచ్ఛేదః కల్పితః స్యా దవచ్ఛేద్యంతువా స్తవం। తస్మిన్ జీవత్వమారోపాద్ బ్రహ్మత్వం తు స్వభావతః॥' (వా. సు. 33) చిదాత్మయొక్క అవిచ్ఛేదమగు జీవత్వము కల్పితమే యగుచున్నది అవచ్ఛేద్యమైన శుద్ధ చైతన్యమే వాస్తవము. ఆ వాస్తవవస్తువు యందే జీవత్వ మారోపితము. కాని స్వాభావికముగ జీవుడు బ్రహ్మమే. 'సచ్చిదానందరూపత్వాత్ బ్రహ్మైవాత్మా న సంశయః। ప్రమాణకోటి సంధానాత్ ఇతి — —॥' (వే. డిం. 59) సచ్చిదానందరూపత్వముచే నాత్మ బ్రహ్మమనుటకు సంశయము లేదు. ప్రమాణకోటి సంధానముగూడ నిట్లే నిరూపించుచున్నది అని వేదాంత డిండిమము. 'న జీవ బ్రహ్మణోర్భేదః నామరూపేణ విద్యతే। నామ్నో రూపస్య మిథ్యాత్వాత్ ఇతి...' (వే. డిం. 64) నామరూప దృష్టిజూచినను జీవ బ్రహ్మములకు అభేదమే. నామరూపములు మిథ్యగదా! కావున 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః। జీవన్ముక్తస్తు తద్విద్వాన్ ఇతి—॥' (వే. డిం. 66) బ్రహ్మము సత్యము. జగత్తు మిథ్య. జీవుడు

బ్రహ్మమే అన్యముకాదు. దీనిగ్రహించినవాడే జీవన్ముక్తుడు. ఈ పరమార్థమును బోధించునదే సచ్ఛాస్త్రము (బ్ర. జ్ఞా. మా. 21) 'శివ ఏవ సదా జీవో జీవ ఏవ సదా శివః। వేత్త్యైక్య మనయో ర్యస్తు స ఆత్మజ్ఞో స చేశ్వరః॥' (అద్వై. అ. 75) శివ జీవు లొక్కటియే. వీని ఐక్యమును గ్రహించినవాడే ఆత్మజ్ఞుడు. 'అయమాత్మా హి బ్రహ్మైవ సర్వాత్మకతయా స్థితః' (అ. అ. 55) సర్వాత్మగ నుండుటచే యీ ఆత్మ బ్రహ్మమే యగును.

'అస్తి కశ్చిత్ స్వయం నిత్య మహం ప్రత్యయ లంబనః। అవస్థాత్రయ సాక్షీ సన్ పంచకోశవిలక్షణః॥' (వి. చూ. 127) అహం ప్రత్యయమునుచే తెలియబడుచు, నిత్యమై అవస్థాత్రయ సాక్షియై, పంచకోశవిలక్షణుడై, సర్వ ప్రకాశకుడగు పరమాత్మ యొకడు గలడు. అనగా పంచకోశస్థుడై, అవస్థాత్రయముల ననుభవించుచున్నట్లు దోచుచున్న జీవుడే అహం ప్రత్యయ వాచ్యుడై, సర్వాతీత బ్రహ్మమే యగుచున్నాడని తాత్ప ర్యము. ఈ అర్థనిర్ణయమునకు తత్త్వమస్యాది మహావాక్య చతుష్టయమును సమిమర్శగా శ్రవణ మనన నిదిధ్యాసనముల ద్వారమున గ్రహించి, తత్త్వం పదైకత్వమును నిశ్చయించు కొననగును. అట్లుగాక 'స్వల్ప మప్యంతరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః। యః సంతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాభిభాషితం॥' (అ.అ. 52) ఏ అవివేకి జీవాత్మ పరమాత్మ లకు కొంచమేని విభేదమును గల్పించుచున్నాడో వానికి భయము తెలుపబడియున్నది. అందుచేత 'శ్రుతేః స్మృతేశ్చాపి తత్త్వం పర్యాలోచ్య స్వయుక్తిభిః। బ్రహ్మాత్మనో ర్నైవ భేద

మీాప త్పశ్యంతి సూరయః॥' (మ. వా. ద. 168) శ్రుతి స్మృతి యుక్తులచే తత్, త్వం, పదముల విమర్శించి, ఆత్మ జీవ బ్రహ్మముల భేదము యీాపణ్మాత్రముగనైన విద్వాంసులు గాంచరు.

అట్లు పరమార్థమైన జీవబ్రహ్మైక్య రహస్యమును గ్రహించినవేత్తలు తద్గత ఆనందము నాస్వాదించుచు 'యథాఽమృతం విషాద్ భిన్నం విషదోషై ర్న లిప్యతే। న స్పృశామి జడాద్ భిన్నో జడదోషాన్ ప్రకాశయన్॥' (స్వా. ప్ర. 49) విషముకంటె వేరగు అమృతము విషదోషమువలన నంటబడని విధమున జడముల బ్రకాశింపజేయుచు జడదోషముల స్పృశింపను.'సవికల్పక చిద్యోఽహం బ్రహ్మైకం నిర్వికల్పకం' (ల. వా. వృ. 14) సంకల్పక చైతన్యమైన నేనే నిర్వికల్పక బ్రహ్మమునై యున్నాను. 'నాహం దేహో న మే దేహః కేవలోఽహం సనాతనః। ఏకమేవాద్వితీయం వై బ్రహ్మణో నేహ కించన॥'(బ్ర.అ.28) నేను శరీరమునుగాను. నాకు శరీరము లేదు. నేను కేవలుడను. సనాతనుడను. ఈ జగత్తున ఒకే అద్వితీయ బ్రహ్మముకాక అన్యము లేదు. కాన నేను బ్రహ్మమును. 'బ్రహ్మైవ పంచ భూతాని బ్రహ్మైవ భువనత్రయం। బ్రహ్మైవాహం బ్రహ్మ చ త్వం బ్రహ్మణోఽన్య న కించన॥' (మ. వా. ద. 120) పంచభూతములు, త్రిలోకములు, నేను నీవు సర్వము బ్రహ్మమే. బ్రహ్మేతరము కొంచెమేనియులేదు.'అత్ర ప్రమాణం వేదాంత గురవోఽనుభవ స్తథా। బ్రహ్మైవాహం న సంసారీ న చాహం బ్రహ్మణః పృథక్॥' (బ్ర.అ. 27) ఈ విషయమున సర్వవేదాంతములును, గురువాక్యము, అనుభవమని

ప్రమాణములు. నేను బ్రహ్మస్వరూపుడను. నేను బ్రహ్మేతరము కాదు.

అట్లగుటచే 'ఆత్మా హి బ్రహ్మ' (తై. భా. 1. 1) 'స్వయం చాత్మా పరంబ్రహ్మే త్యుక్తం' (తై.భా. 1. 1) 'తదేవ చే త్పరం బ్రహ్మ జీవ స్తస్మా జ్జీవస్యాపి నిత్యచైతన్య స్వరూపత్వం' (బ్ర. సూ. భా. 2. 3. 18) ఆ బ్రహ్మమే జీవుడని నిశ్చయము కాన జీవుడు నిత్య చైతన్య స్వరూపుడు. జీవబ్రహ్మైకత్వ నిర్ణయముచే 'నైవాత్మోత్పద్యతే ప్రవిలీయతే' (బ్ర. సూ. భా. 2. 3. 17) ఆత్మ జనింపదు. మరణింపదు. కాన నిత్యము. అటులే గీతాభాష్యమునగూడ 'సిద్ధం క్షేత్రజ్ఞస్య నిత్యమేవేశ్వరత్వం' (13. 2) క్షేత్రజ్ఞుడైన ఆత్మకు నీశ్వరత్వము నిత్యమే అని వచించుచు, 'క్షేత్రోపాధి భేద కృతం విశేషజాతం మిథ్యైవ' (గీ. భా. 13. 13) క్షేత్రరూప ఉపాధివిభేదను మిథ్య యగుటచే క్షేత్రజ్ఞుడైన ఆత్మ బ్రహ్మమే యగుచున్నది.

ఈ విధమున నెట్లు విచారించినను, ఆత్మ బ్రహ్మముల కెట్టి విభిన్నత్వమును గానరాక, వ్యవహారకాలమున దోచు వ్యత్యాసము మిథ్యాకల్పితమనియు, నా మిథ్యానిరాసమున ఆత్మ, బ్రహ్మమే తానని గుర్తించి, అవ్యయానందమున నుండుననియు, శాస్త్ర యుక్తి అనుభవ ప్రమాణములచే శంకరుడు మీమాంసించి తీర్మానించియున్నాడు.

---

# ప్రపంచము

ఇంతవరకు బ్రహ్మ ఈశ్వర మాయా జీవుల స్వరూప స్థితులగూర్చి సాకల్యముగ గాంచియున్నారము. వాని వాని పరస్పర తారతమ్యము కేవలము భ్రాంతిసిద్ధమే గాని యథార్థము కాదనియు, మాయాబలమున ఏక బ్రహ్మమున నానాత్వ దర్శనము ప్రాప్తమనియు గ్రహించియున్నారము. మాయా కల్పిత జీవత్వలోపమున కేవల అద్వయ బ్రహ్మమే విరాజిల్లుటచే నిక జీవునకు భోగ్యము నాబడుచున్న యీ సృష్టి రూప ప్రపంచ విషయము వేరుగ బ్రస్తావింప నవసరము లేదు. భోక్త అభావమైనచో నిక భోగ్య మెచట? భోక్తృత్వముపై భోగ్యత్వ మాధారము గదా! కాన జీవత్వ నిరాసార్థము ఎన్ని వాదములు ప్రకటింపబడియున్నవో అవి యన్నియు నీ సృష్టి తిరస్కార సమయమునగూడ నుపయుక్తము. అచట నెన్ని ఉపమానము లుదాహరింపబడి యున్నవో అవియు యథాతథముగ నిందును ప్రయోగార్హములు. అయినను క్లుప్తముగ సృష్టి స్వరూప గ్రహణము గావింప యత్నించెదము గాక.

---

## మిథ్యాత్వము

'యత్ర యత్ర మనస్ఫూర్తి స్తత్ర తత్ర జగత్రయం।
యత్ర యత్ర మనో నాస్తి తత్ర తత్ర న కించన॥' (మ. వా. డ. 63) ఎచ టెచట మనస్ఫూర్తి యుండునో అచ టచట

జగత్త్రయము గోచరము. ఎచటెచట మనస్సులేదో అచటచట నేమియు లేదు. 'యత్ర చిత్తం తత్ర విశ్వం స్వయమేవ ప్రతీయతే। యత్ర చిత్తంనాస్తి తత్ర నాస్తి కించి జ్జగత్కథా॥' (మ. వా. ద. 140) ఎచట చిత్తముండునో అట విశ్వము స్వయముగా ప్రతీతమగును. చిత్తమెట లేదో అట జగద్విషయమే అభావము అను వాక్యములరీతి జగత్స్ఫూర్తి కేవలము మనస్సుపై ఆధారపడి యున్నది. పూర్వగ్రంథమున నీమనోరూపము కేవలము మాయా జన్యముగా వివరింపబడి యున్నది. కాన మనోదృశ్యమైన యీ విశ్వముగూడ 'మాయా మాత్రమిదం ద్వైత మద్వైతం పరమార్థతః' (వి. చూ. 406) ద్వైతముగాన మాయా మాత్రమై యొప్పార అద్వైతము మాత్రము పరమార్థముగ శంకర తాత్పర్యము. అద్వైతము శివంకరమై అభయమై విరాజిల్ల ద్వైతము నా విభేదదృష్టి 'భేదదృష్టేస్తు సంసారం దురంతం భయలక్షణం' (మ. వా. ద. 161) దురంతమై భయలక్షణమైన సంసారమునకు గారణ మగుచున్నది. అందుచే సృష్టి యంతయు దత్త్వతః నభావమై, స్వరూపతః గోచరమై దోచుచున్నదని గ్రాహ్యము.

జీవ స్వరూప నిర్ణయ సమయమున బూర్వ ముదాహరింప బడియున్న భ్రాంతి చిత్రములే సృష్టి స్వరూప నిర్ణయమునగూడ విరివిగా నుపయోగింపబడి యున్నవి. 'భ్రమేణైవ జగజ్జాతం రజ్జ్వాం సర్పభ్రమో యథా' (స. ఆ. 25) రజ్జువులో సర్పభ్రమవలె భ్రమవలననే జగత్తు జనితము. 'సర్పాదౌ రజ్జు సత్తేవ బ్రహ్మ సత్తైవ కేవలం। ప్రపంచాధారరూపేణ

వర్తతే సజ్జగన్న హి॥' (స్వా. ప్ర. 6) సర్పాదులకు రజ్జువే సత్తుగా నున్నట్లు కేవల బ్రహ్మమే ప్రపంచమున కాధారమై సత్తై యున్నది. జగత్తు లేదు. 'కాలత్రయే యథా సర్పో రజ్జౌ నాస్తి...। జగన్నాస్తి...' (స్వా. ప్ర. 52) రజ్జువులో సర్పము కాలత్రయమున అభావమైనట్లు జగత్తు శూన్యము. 'రజ్జ్వజ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ। భాతి తద్వచ్చితిః సాక్షా ద్విశ్వాకారేణ కేవలా॥' (అ. అ. 44) రజ్జువు యొక్క అజ్ఞానముచేత క్షణములో రజ్జువు సర్పముగా గోచరించునట్లు కేవలము చిత్తు విశ్వరూపముగా గనబడుచున్నది. 'యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వై భ్రమాత్। తద్వత్సత్య మవిజ్ఞాయ జగద్దృశ్యతి మూఢధీః॥' (అ.అ. 95) రజ్జువును బరిత్యజించి భ్రమచే సర్పమును గాంచునట్లు, మూఢబుద్ధిగలవాడు సత్యము నెరుంగనేరక జగత్తును జూచుచున్నాడు. 'అధ్యస్తో రజ్జు సర్పోయం సత్యవత్ రజ్జుసత్తయా। తథా జగదిదం భాతి సత్యవత్ స్వాత్మసత్తయా॥' (అద్వై. అ 69) అధ్యస్తమైన సర్పము రజ్జు సత్తచే సత్యముగా గోచరించును. అటులే ఈ జగత్తు ఆత్మ సత్తచే సత్యమువలె భాసించుచున్నది. 'గ్రహీతు ర్గ్రాహదోషేణ బ్రహ్మైవ జగదాత్మనా। ఆభాతం సర్పవద్రజ్జు ర్యథా తద్వ దవిక్రియం॥' (మ. వా. ద. 102) త్రాడు పామువలె ఎట్లు తోచునో, అటులే నిర్వికార బ్రహ్మమే చూచువాని దృష్టిదోషముచే జగద్రూపముగా దోచుచున్నది. మరియు 'మరుదేహాంబు రూపేణ యథైవాభాత్యవిక్రియః। రజ్జు రేవాహి రూపేణ...తథైవ జగదాత్మనా బ్రహ్మైవాభాత్యవిక్రియః॥' (మ. వా. ద. 92) ఎట్లు

నిర్వికారమైన మరుభూమియే జలరూపముతో ప్రకాశించునో ఎట్లు ఏ మార్పులేని రజ్జువు సర్పరూపముతో భాసించునో అట్లే అవిక్రియుడైన బ్రహ్మము జగదాకృతి ప్రకాశించు చున్నాడు. ఇటులే సర్పరజ్జు దృష్టాంతము జగద్భ్రాంతి నిర్ణయ సందర్భమున భాష్యములలోగూడ విరివిగా శంకరునిచే నుప యోగింపబడియున్నది.

అదేవిధముగా 'తావత్ సత్యం జగద్భాతి శుక్తికా రజతం యథా' (ఆ. బో. 7) ముత్యపుచిప్పను వెండియని తలంచునట్లు జగత్తు సత్యముగనే తోచును. 'శుక్తౌ రూప్యం మృషా యద్వత్ తథా విశ్వం పరమాత్మని' (త. ఉ. 51) శుక్తియందు దోచు రజతము భ్రాంతి యగునట్లు పరమాత్ముని యందు దోచు విశ్వముగూడ భ్రాంతి యనురీతి శుక్త రజత భ్రాంతి దృష్టాంతము గూడ బహుళోపయుక్తముగనే గాను పించును.

'మరుభూమౌ జలం' (స్వా. ప్ర. 8) మరుభూమియందు జలము, 'యథా నీరం మరుస్థలే' (అ. అ. 61) మరుస్థలమున నీరమువలె, 'మరుదేశానాం మరీచి సలిలం యథా' (ము. వా. ద. 93) మరుదేశమున మృగతృష్ణజలమువలె అను చందము మృగతృష్ణికా జల దృష్టాంతము, 'యథైవ వ్యోమ్ని నీలత్వం' (అ. అ. 61) ఆకాశమునందు నీలత్వము, 'యథైవ శూన్యే వేతాళో గంధర్వాణాం పురం యథా' (అ. అ. 62) శూన్య ప్రదేశమున వైతాళికుడు, గంధర్వనగర భ్రాంతులు, 'యథా కాశే ద్వి చంద్రత్వం' (అ. అ. 62, అద్వై. అ. 6) ఆకాశ మున ద్విచంద్రదర్శనము, మొదలగు బాహ్య భ్రాంతి దృష్టాంత

ములు భాష్యముల ప్రకరణముల విరివిగా నుపయోగింప బడియున్నవి.

'అసత్కల్పం మృషాప్రాయం స్వప్నతుల్యం భ్రమో దితం। జగత్సర్వ మితి జ్ఞేయం పండితై స్తత్త్వదర్శిభిః॥' (మ. వా. ద. 12) తత్త్వదర్శకులైన పండితులచే, సర్వజగత్తు అసత్కల్పముగను, మృషాప్రాయముగను, స్వప్నతుల్యము గను, భ్రమరూపముగను జ్ఞేయమగుచున్నది. 'అసద్రూపో యథా స్వప్న ఉత్తరక్షణ బాధతః' (అ. అ. 56) ఉత్తరక్షణ మున లేని స్వప్నమువలె ఈ లోకము అసద్రూపము, 'స్వప్నవ త్సర్వదా మృషా' (మ. వా. ద. 84) స్వప్నమువలె నిది సర్వదా భ్రాంతి అను వాక్యముల జగత్తు స్వప్నతుల్యమనియు, నటుగ 'స్వాప్నద్వైతవదేవ జాగ్రత మపి ద్వైతం మనో మాత్రకం మిథ్యైత్యేవ' (ప్రౌ. అ. 9) స్వప్నగత ద్వైతమువలె జాగ్రదవస్థగల ద్వైతముగూడ మనోకల్పితమై మిథ్యగనున్నది. 'స్వప్నార్థవ జ్జాగ్రతి నైక సత్యం' (స. వే. సి. సా. 763) స్వప్నమునగల దృశ్యములవలె జాగ్రత్తుగూడ నసత్యము అను వాక్యముల జాగ్రదనుభూతులు స్వప్నానుభూతుల చందము భ్రాంతిసిద్ధములుగనే నిర్ణయింపబడియుండుటయు గోచరము.

మరియు 'నామరూపాత్మకం విశ్వం ఇంద్రజాలం విదుర్బుధాః' (వే. డిం. 69) నామరూపాత్మకమైన విశ్వము ఇంద్రజాలముగా బుధులు గ్రహించెదరు అని తెలుపుచు, ఇంద్రజాలకునిచే గల్పింపబడిన మాయాహస్త్యాదు లనేకములై యున్నను మాయావి ఒక్కడైయుండి, యితరము భ్రాంతి కల్పితము లైనట్లు (ఉ. సా. 2. 17. 29) 'అద్వితీయస్యాపి

పరమాత్మనో మాయయా బహురూపత్వ ముపపద్యతే' (స. సు. భా. 2. 20) అద్వితీయుడైన పరమాత్మలోగూడ మాయచే బహురూపత్వము చెప్పబడుచున్నది అనియు, 'మాయయా సర్వశక్తిత్వా దజః సన్బహుధా మతః' (ఉ. సా. 2. 17. 79) మాయయొక్క సర్వశక్తిత్వముచే అజమైన బ్రహ్మము బహుధా భావింపబడుచున్నది అనురీతి, 'మాయా యోగాత్మకైవాత్మా ప్రపంచాఽకారతామియాత్' (అద్వై అ. 13) మాయాయోగముచే ఆత్మయందు ప్రపంచాకారములు గోచరమగుచు, 'ఉత్పద్యంతే విలీయంతే మాయా మారుత విభ్రమాత్' (వి. చూ. 497) మాయావాయు విభ్రమముచే జనించుచు నందు లయించుచున్నవి. అందుచేత బ్రహ్మాభిన్నమైయున్న జీవునికి మిథ్యాద్వైతము గోచరించుటచే 'మాయయా వంచితో నరః' (అ. అ. 48) నరుడు మాయచే మోసగింపబడుచున్నాడనియు శంకరతాత్పర్యము.

అందుచేతనే 'అవిద్యాప్రభవం సర్వ మసత్తస్మాదిదం జగత్' (ఉ. సా. 2. 17. 20) ఈసర్వము అవిద్యాజనితముగాన యీ జగత్తు అసత్తు, 'అవిద్యాకృత సంసార ఆత్మని' (బృ. భా. ఉ.) ఆత్మలో సంసారము అవిద్యాకృతము, 'సర్వోఽయం లౌకికో వైదికశ్చ వ్యవహారోఽవిద్యావిషయ ఏవేతి' (మాం. భా. 2. 32) లౌకిక వైదిక వ్యవహారము సర్వము అవిద్యావిషయము, 'అనాద్యవిద్యాకృత బంధ' (వి. చూ. 85) అనాదియైన అవ్యాకృతమే యీ బంధము అనువాక్యములలో నవిద్యాపదమువలెనే, 'అజ్ఞానాత్ బ్రహ్మణో జాత మాకాశం' (బ్ర. అ. 10) బ్రహ్మమునుండి ఆకాశము అజ్ఞానము

చేతనే జనితము. 'పరిచ్ఛిన్న ఇవాజ్ఞానాత్' (ఆ. బో. 4) అజ్ఞానమువలననే బ్రహ్మ మపరిచ్ఛిన్నమై యుండియు బరిచ్ఛిన్నముగా గోచరించుచున్నది. 'ఉపాదానం ప్రపంచస్య... అజ్ఞానం చైవ' (అ. అ. 94) ప్రపంచమునకు ఉపాదాన కారణము అజ్ఞానమే. 'యదిదం సకలం విశ్వం నానారూపం ప్రతీత మజ్ఞానాత్' (కేవలోహం. 5) నానాత్వముగా ప్రతీతమైన యీ సకలవిశ్వము అజ్ఞానమువలననే గోచరించును (వి.చూ.229). 'తదజ్ఞానం తమోరూపం సంసారాదిమ కారణం' (మ. వా. ద. 82) తమోరూపమైన అజ్ఞానము సంసారమునకు బ్రథమకారణము అను వచనములలో అజ్ఞాన పదముగూడ నుపయోగింపబడి యున్నది.

ఈ విధముగా అవిద్యా లేక అజ్ఞానముచే జనించిన సృష్టియంతయు, 'భ్రాంతిమాత్ర మిదం విద్వాన్ విశ్వం బ్రహ్మణి కల్పితం' (మ.వా ద. 142) విద్వాంసుడా ! బ్రహ్మము న గల్పితమైన యీ విశ్వము భ్రాంతిమాత్రము. 'ఏతమేత జ్జగత్సర్వం భ్రాంతి బుద్ధివికల్పితం' (ఉ. సా. 2. 17. 12) ఈ సర్వజగత్తు బుద్ధి వికల్పితమై భ్రాంతిమాత్రము అను వచనములచే సృష్టి భ్రాంతి యని నిశ్చయింపబడియున్నది. అందుచే 'బ్రహ్మాదిస్తంబ పర్యంతా మృషామాత్రా ఉపాధయః ।' (వి. చూ. 387) బ్రహ్మాది స్తంబపర్యంత సృష్టియంతయు నసత్యము. 'సర్వాత్మనా దృశ్యమిదం మృషైవ' (వి.చూ.294) ఇంద్రియ గోచరమెల్ల మిథ్య, 'అతో మిథ్యా జగత్సర్వం ఇతి' (వే. డిం. 36) జగత్సర్వము మిథ్యయే అనురీతి సృష్టి మృషా స్వరూపముగా నిర్ణయమగుచున్నది. అందుచే నది

'విద్యతే న స్వతః సత్త్వం నాసతః సత్త్వమస్తి వా।బాధ్యత్వా న్నైవ సద్ద్వైతం నాసత్ ప్రత్యక్ష భానతః॥' (త. ఉ. 52) స్వాభావికముగ జగత్తునకు సత్యము శూన్యము. అసద్వస్తువునకు సత్యమెట్లు? బాధితమగుటచే ద్వైతము సత్యము కాదు. కాని అది కేవల మసత్తు గూడ కాదు. దానికి ప్రత్యక్ష భానత్వము గలదు. అందుచే మిథ్య యని వాకొనబడి యున్నది.

రూపతః దృగ్గోచరమైనను భ్రాంతివస్తువులకు వస్తుత్వ మభావ మగునట్లు, 'న హి ప్రపంచో న హి భూతజాతం ।- - బ్రహ్మైవ సత్యం పరమార్థరూపం॥' (స్వా. ప్ర. 17) ప్రపంచము భూతములు లేవు. పరమార్థరూపమైన బ్రహ్మమే యున్నదనియు, నందుచే 'న మే బంధో న మే ముక్తిర్న మే శాస్త్రం న మే గురుః' (స్వా. ప్ర. 20) అనుచు, 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః । న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (2. 32) అను మాండూక్య కారికవలె సర్వ అజాతివాదము గూడ బ్రతిపాదింపబడి, 'ఇదానీం యదీశ్వరస్య కారణత్వం తదపి మాయోపాధికం' (స. సు. భా.2.21) ఈశ్వరుని కారణత్వముగూడ మాయాకల్పితముగనే వచింపబడుచున్నది.

పూర్వోక్తఉపమానములవలె ప్రత్యక్షముగ భ్రాంతిగ దోచక, కార్యకారణత్వ ప్రభావజనితము లగుచున్న కొన్ని విశిష్ట దృష్టాంతములుగూడ సృష్టివిషయమున బ్రసంగింపబడి యున్నవి. వివర్త దృష్టాంతములు వస్తుసత్యత్వమును, అధ్యస్తముయొక్క అసత్యత్వమును రూపించుచు, అధిష్ఠానారోపిత

ముల కనన్యత్వము విభిన్నత్వము బోధించుచు, వస్తుదృష్టిని బ్రబలపరచుట కుపయుక్తమగుచున్నవి. కాని కార్య కారణ సంబంధముగల మృద్ఘటాదిక దృష్టాంతములు, కార్యమైన ఘటాదుల దృష్టిని నశింపచేసి, కారణమైన మృదాదికదృష్టిని గలిగించుచు, కార్యరూప వికారము లన్నియు మృదాదిమాత్రమనుగ నేకముగనే నున్నటుల పర్యవసానమునకు జిజ్ఞాసువును నడిపించును. అటులే 'మృత్కార్యం సకలం ఘటాది సతతం మృన్మాత్ర మేవాభితః' (వి. చూ. 253) ఘట కలశాదికము మృత్తికయొక్క కార్యము. ఆఘటాదికము మృత్తికయే. 'ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నా హి తంతవః । జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయం తత్తదభావతః॥' (అ. అ. 64) పృథ్వి ఘటనామమునను, నూలు వస్త్రనామమునను ప్రకాశించు నటుల చిత్తు జగమనెడి నామముచే ప్రకాశించుచున్నది. ఆ యా నామముల అభావముచే నధిష్ఠానము గ్రాహ్యము. 'అతో ఘటః కల్పిత ఏవ మోహాత్ మృదేవ సత్యం పరమార్థభూతం' (కేవలోహం. 7) మోహవశమున ఘటము కల్పితము. పరమార్థముగ మృత్తికసత్యము. 'మృదాది దృష్టాంతబలేన యుక్త్యా శ్రుత్యానుభూత్యా సదిదం విదిత్వా । నిర్మూల్య భేదం స్వమనః ప్రసూతం స్వస్మిన్ రమస్వాత్మసుఖేన నిత్యం॥' (మ. వా. ద. 200) మృదాది దృష్టాంత బలముచేతను, శ్రుతియుక్తులచేతను, అనుభూతిచేతను ఈ ప్రపంచము బ్రహ్మమేయని గ్రహించి, స్వకీయ మనముచే గల్పింపబడిన విభేదమును నిర్మూలించి, సదా ఆత్మసుఖమున స్వస్వరూపమున క్రీడింపు మనియు మహావాక్యోపదేశము.

అదేవిధముగా 'హేమ్నో వివర్తం కటకం హేమైవ భవతి స్వయం। శిలావివర్తః శ్రీవిష్ణుః శిలైవ భవతి స్వయం॥' (మ. వా. ద. 127) సువర్ణకార్యమైన కటకకుండలాదులు స్వర్ణమే యగునట్లు శిలారూపమైన విష్ణువిగ్రహము శిలయే యైనట్లు అనియు, 'తామ్ర కల్పిత దేహాది స్తామ్రాదన్య ఇవ స్ఫురేత్' (అద్వై. అ. 66) తామ్ర కల్పిత దేహాదులు తామ్రమే యగుచందము, 'సర్వా హాటకే కటకాదివత్' (అ. బో. 8) సువర్ణమున కటక కుండలాదులవలె, అను సువర్ణదృష్టాంతము గూడ శంకరునిచే స్వీకరింప బడియున్నది. మరియు 'సృష్టిర్నామ బ్రహ్మరూపే సచ్చిదానంద వస్తుని। అబ్ధౌ ఫేనాదివత్ సర్వనామ రూపప్రసారణా॥' (వా. సు.14) సృష్టియనగా సముద్రమున తరంగ బుద్బుద ఫేనాదికమువలె సచ్చిదానందరూప బ్రహ్మమున నామరూప ప్రసారము, 'ఉపాదానే ఽఖిలాధారే జగంతి పరమేశ్వరే। సర్గస్థితిలయాన్ యాంతి బుద్బుదానీవ వారిణి॥' (ఆ. బో. 8) అఖిలాధారుడును, ఉపాదాన స్వరూపుడును అగు పరమేశ్వరునియందు నీటియందు బుడగలవలె, అనంత బ్రహ్మాండములు సృష్టి స్థితి లయముల బొందుచున్నవి. 'యథా తరంగ కల్లోలై ర్జలమేవ స్ఫురత్యలం। పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాండౌఘ స్తథాత్మనా' (అ. అ. 63) ఉదకము అలలుగను, తామ్రము పాత్రరూపముగను కనుపడునట్లు, ఆత్మత్వము బ్రహ్మాండములుగా గానంబడు చున్నది. 'బ్రహ్మాది స్తంబ పర్యంతాః ప్రాణిన స్త్వయి కల్పితాః । బుద్బుదాది తరంగాంతా వికారాః సాగరే యథా॥' (స్వా. ప్ర. 9) సాగరమున

బుద్బుద తరంగాదిక కల్పనమువలె నీలో బ్రహ్మాస్తంబ పర్యంత జీవకోటి కల్పితము, మొదలుగాగల వాక్యసమూహము తరంగ ఫేన బుద్బుద జలవికారముల దృష్టాంతమును గూడగైకొని, బ్రహ్మ సృష్టి సంబంధములగల కల్పిత కార్య కారణత్వమును బ్రతిపాదించుచున్నది.

భ్రాంతిరూపములైన సర్ప నీర పురుషాదులు రజ్జు మరుస్థల స్థాణ్వాదులపై వివర్తములయి నటుల 'ఇదం బ్రహ్మ వివర్తత్వాత్ బ్రహ్మాభిన్నం జగత్సదా । మృద్వివర్తః స్వయం కుంభో మృదభిన్నో యథా తథా॥' (మ.వా. ద 108) ఎట్లు మృద్వికారమైన కుంభము అధిష్ఠానమృత్తికంటె అభిన్నమో అటులే ఈజగత్తు బ్రహ్మవివర్తమగుటచే సదా బ్రహ్మాభిన్నము గనే యున్నది. 'జగత్సర్వం వివర్తం బ్రహ్మణ స్త్వితి।' (మ. వా. ద. 91) సర్వప్రపంచము బ్రహ్మముయొక్క మారుప్ప అనగా భ్రాంతిసిద్ధరూపాంతరముగ నున్నదనియు, 'జగత్సర్వం సద్వివర్తం' (మ. వా. ద. 126) 'ప్రతిలోమ మిదం సర్వం' (ఉ. సా. 2. 18. 95) అను వాక్యసంచయము మృదాదికము నుండి ఘటాదులు కార్యకారణమునగాక వివర్తముగ అనగా భ్రాంతి రూపముగ జనించుటయే ప్రధానముగ గైకొనబడినట్లు 'బీజాంకుర వత్తాత పుత్రవద్బ్రహ్మణో జగత్' (మ. వా. ద. 90) 'నేదం జాతమితి బ్రూమో వయ మద్వైత వాదినః। కింతు బ్రూమో జగత్సర్వం వివర్తం బ్రహ్మణ స్త్వితి॥' (మ. వా. ద. 91) ఈ విశ్వము బీజమునుండి అంకురమువలె, తండ్రినుండి పుత్రునివలె, బ్రహ్మమునుండి జనించినది అని అద్వైతవాదుల మైన మేము వచించుటలేదు. కాని సర్వలోకము బ్రహ్మము

యొక్క భ్రాంతి సిద్ధరూపాంతరముగ చెప్పుచున్నాము. అంతి యేగాక 'విచార్యమాణే సద్బుద్ధ్యా శ్రుతి స్మృత్యుపపత్తిభిః। సదేవేదం జగత్సర్వం సద్వివర్తం యతః స్వయం॥' (మ. వా. ద. 12(6) నిర్మల బుద్ధితోడను, శ్రుతి స్మృతి వాక్యముల తోడను అనుభవనీయ యుక్తుల తోడను, సమ్యగ్విచారణముగా వింపగా ఈ సర్వ జగత్తు స్వతంత్రముగా ఏకారణముచే బ్రహ్మవివర్తమై యున్నదో అందుచే నది బ్రహ్మమే యగుచున్నది అని శంకరుడు ఘంటాపథముగా పూర్వోక్త కార్యకారణ వాదము కేవలము వివర్తమనే రూపొందింపబడి యున్నట్లు స్పష్టపరచి, యీ ఉదాహరణములు కేవల సృష్టి వాదమును బ్రతిపాదించుట లేదనియు, భాన మగుచున్న ప్రపంచమునకు బ్రహ్మాంతర ప్రతిపత్తి లేదని మాత్రము బోధించు చున్నవని వివరించి యున్నాడు. అనగా నట సృష్టి ప్రధానముగాక, బ్రహ్మైకత్వ దర్శనమే ముఖ్యముగా గ్రాహ్యము.

ఆ కారణముననే 'మృత్కార్యం సకలం ఘటాది సతతం మృన్మాత్రమేవాభిత...' (వి. చూ. 253) మృద్వికారములైన ఘటాదికము సర్వదా మృన్మాత్రమే యగుచున్నవి అని స్పష్ట పరుపబడియున్నది. బృహదారణ్యక భాష్యముగూడ (2. 1. 20) నీ ఉదాహరణములను 'ఏకత్వ ప్రత్యయార్థపరత్వాత్' బ్రహ్మైకత్వభావ ప్రతిపాదనార్థమే యని వివరించుచు, అగ్నివిస్ఫులింగాదికములుగాని, అంశాంశిసంబంధములుగాని 'ఏకత్వప్రత్యయార్థాః' అని నిశ్చయించి, 'తస్మాదుత్పత్త్యాది శ్రుతయః ఆత్మైకత్వ ప్రతిపాదనపరాః' అందుచే నుత్పత్తిని

వచించు శ్రుతులు ఆత్మైకత్వమును మాత్రమే బోధించును అని నిర్ణయించియున్నవి. 'తస్మాదేక రూపైకత్వ ప్రత్యయ దార్ఢ్యాయైవ సర్వవేదాంతేషు ఉత్పత్తిస్థితిలయాది కల్పనా న తత్ప్రత్యయ కరణాయ' (బృ. భా. 2. 1. 20) కాన సర్వ వేదాంతములలో సర్గముయొక్క సృష్టి స్థితి లయ వాక్యములు బ్రహ్మైకత్వమున స్థిరత్వమునకేగాని, సృష్టి సత్యత్వ ప్రతిపాదనార్థము గాదనియు, నందుచే బండితులైనవారు యథార్థబ్రహ్మాత్మత్వమును గ్రహింప అంశాంశిభావసంబంధమును గాని, కార్యకారణసంబంధమునుగాని చూడకూడదని హెచ్చరించుచు, 'సర్వకల్పనాపనయనార్థసారపరత్వాత్సర్వోపనిషదాం' బ్రహ్మమునుగూర్చిన సర్వకల్పనముల నివారించుటకే ఉపనిషత్తుల తాత్పర్యమని భాష్యప్రబోధముగ విదితము. మరియు 'న హి సృష్ట్యాఖ్యాయికాది పరిజ్ఞానా త్కించిత్ఫల మిష్యతే। ఏకాత్మ్యస్వరూప పరిజ్ఞానాత్తు అమృతత్వం ఫలం సర్వోపనిషత్ప్రసిద్ధం' (ఐ. 4. 1) సృష్టి కల్పన విషయ జ్ఞానమువలన కొంచెమేని ఫలితము సున్న. బ్రహ్మైకత్వస్వరూపపరిజ్ఞానము వలననే అమృతత్వఫలసిద్ధి అని సర్వోపనిషత్తులలో నిర్ధారింపబడియున్నదనియు భాష్యనిశ్చయము. కావున 'యావత్సమ్యగ్దర్శనేన హేతుఫలావేశో న నివర్తతే క్షీణః సంసారస్తావదాయతో దీర్ఘో భవతి।' (మాం. భా. 4. 56) ఎంత కాలము యీ కార్యకారణభావ విశ్వాసము, సమ్యక్ జ్ఞానముచే నశింపదో అంతవరకు మన జనన మరణ పరంపరరూప సంసారము దీర్ఘముగనే సాగుచుండును. అది నశించినచో కారణ అభావముచే సంసారనాశము గలుగుననియు భాష్య హెచ్చరిక.

ఈ సృష్టిగాథ యంతయు 'మందబుద్ధి ప్రతిపిపాదయిషయా' (మాం. భా. 3. 3) సమ్యగ్జ్ఞానవిషయమైన బ్రహ్మైకత్వ మును గ్రహింపజాలని మందప్రజ్ఞులకొరకై ప్రథమతః వచింప బడి, క్రమముగా కార్యకారణవిభిన్నత్వముద్వారా, అధిష్ఠాన అధ్యారోపములలో అధ్యారోపము భ్రాంతిసిద్ధ మగుటయు, అధిష్ఠానము నిర్వికారత్వాది లక్షణోపేతమై, త్రికాలాబాధ్యమై యొప్పారుటయు బోధించి, బ్రహ్మైకత్వమును బోధించుటకే ఉపనిషత్తులు ప్రియుక్తములని భాష్యగ్రంథములు విశదీకరించి యున్నవి.

---

## సృష్టివిధానము

కాని దృష్టికి గోచరించు నీసృష్టియొక్క అస్తిత్వవిశ్వా సము గలవాడై, సృష్టివిధాన బోధ అవసరమగుటచే శంకరుడు ఉపనిషత్తులనుండియే ఆరంభణాది వాదానుకూల విషయ సేకరణము గావించి, వానిని మందప్రజ్ఞుల యుపయోగార్థము వివరించెను. వ్యావహారికమున మునిగియున్న వారికి వ్యావ హారిక దృష్టి బోధించి క్రమగతముగ పారమార్థికస్థితికి గొంపోయి యంత పారమార్థికసత్యమై, సృష్టిమిథ్యాత్వము జీవత్వభ్రాంతి, బ్రహ్మైకత్వముల బోధించుటయే శాస్త్రాభి ప్రాయమగుటచే శంకరుడును అదే పథము నవలంబించుటయం దెట్టి ఆశ్చర్యమును లేదు. అయినను పరమగమ్యము

పారమార్థికమేగాని, వ్యావహారికసృష్టి మాత్రము గాదని మరల హెచ్చరిక అవసరము.

లోకమున నేవస్తునిర్మాణమును బరిశీలించినను, దాని కారూపము నొసంగుటకు ముఖ్యముగా ఉపాదాన నిమిత్త కారణములు ప్రస్ఫుటము. ఉపాదానమున వస్తుత్వమనియు, నిమిత్తమన చేతన సహకారము అని గ్రాహ్యము. ఉపాదాన కారణము కార్యరూపమున అవినాభావసంబంధమున అభిన్నమై యొప్పారును. ఘటకార్యమున మృత్తిక ఉపాదాన కారణమై ఘటవ్యాప్తముగ నుండును గదా! మృద్వినా ఘటమే అసంభవము. కాని నిమిత్తము కార్యనిర్మాణమునకు బ్రబల కారణమై యున్నను, కార్యాంతర్గతము కాక, కార్య భిన్నముగ నుండును. ఘట కార్యమున నిమిత్తకారణమైన కులాలుడు ఘటభిన్నముగ నుండుట ప్రత్యక్షముగదా!

ఈ న్యాయము ననుసరించి ప్రకృతీశ్వరుల నుపాదాన నిమిత్తకారణములుగ జతిర్చి, 'తే నామరూపే అవ్యాకృతే సతే వ్యాక్రియమాణే తస్మాదేతస్మా దాత్మనా ఆకాశ నామాకృతీ సంవృత్తే' (ఉ. సా. 1. 1. 19) ఆత్మ నుండి అవ్యాకృతము, దానినుండి ఆకాశము జనించెను.'తమః ప్రధాన ప్రకృతి విశిష్టాత్పరమాత్మనః। అభూత్ఖాకాశా దాకాశ మాకాశాద్వాయురుచ్యతే ॥ (8౯౯) వాయోగ్ని స్తథైవాగ్నే రాపోఽద్భ్యః పృథివీక్రమాత్ । శక్తేస్తమః ప్రధానత్వం తత్కార్యే జాడ్య దర్శనాత్॥' (స. వే. సి.సా.౯౨౬) ఆత్మలో గల తమః ప్రధానమైన ప్రకృతినుండి ఆకాశము; అందుండి వాయువగ్ని జల, పృథ్వీభూతములు క్రమముగా నుద్భవించెను.

శక్తి తమః ప్రధానమై యుండ, తత్కార్యమున జడత్వము గోచరించెను, అను అనేకవచనముల, తమః ప్రధానమైన మాయాశక్తియే సృష్టికి అవ్యాకృత నామమున నుపాదాన కారణ మగుచున్నట్లు విస్పష్టము. ఈ విషయ సమీక్ష మాయా వివరణమున గాంచియున్నారము. సృష్టికి బూర్వము మాయాశక్తి అవ్యాకృత, అవ్యక్త, మూలా ప్రకృతి, మొదలగు నామముల నుండి, అకారణ కారణమున సృష్టిక్రియకు కారణమై జగ దుత్పత్తికి ఉపాదానకారణమై యున్నట్లు గ్రాహ్యము. ఈ సృష్టివిషయమున శంకరుడు కపిల ప్రోక్త త్రిగుణవిధానమును, తజ్జనిత సృష్టిక్రమమును స్వీకరించి, దానిని ప్రమాణముగా గైకొనినట్లు 'గుణసంఖ్యానే కాపిలే శాస్త్రే తదపి గుణసంఖ్యానం శాస్త్రం గుణభోక్తృ విషయే ప్రమాణమేవ' (గీ. భా. 18. 19) ఇటగల గుణ ప్రస్తావన కాపిల సిద్ధాంతము నన్వయించును. గుణవిధానము, వాని భోక్తృవిషయమున కాపిల సిద్ధాంతము ప్రామాణికమే యగు నని వాక్యము తెలుపుచున్నది. అందుచే ఆకాశాది పృథ్వీ పర్యంత భూతసృష్టియు, నందలి పంచీకరణ విధానము దేహేం ద్రియాదికయుత్పత్తి మొదలగు యంశముల శంకరుడు కపిల సాంఖ్యము ననుసరించినట్లు విదితము.

నిమిత్తకారణ నిర్ణయమున అద్వైతసిద్ధాంతము పర బ్రహ్మమునే నిమిత్తోపాదాన కారణముగ నిర్ణయించినను, ఉపాదానత్వమునకై అవ్యాకృత ప్రస్తావన గావించి నిమిత్తముగ నీశ్వరుని గూడ ప్రత్యేకించుట గాంచనగును. ఈ ఈశ్వర ప్రకృతులకు రెండింటికి పరమ కారణముగ బ్రహ్మముండుటయు

స్పష్టము. అయినను స్థూలదృష్టికి ప్రత్యేక సృష్టికర్త యవసర మని తోచుటచే 'అనంతశక్తి సంపన్నో మాయోపాధిక ఈశ్వరః। ఈక్షామాత్రేణ సృజతి విశ్వమేత చ్చరా చరం॥' (330) నిమిత్తమ త్యుపాదానం స్వయమేవ భవన్విభుః। చరాచరాత్మకం విశ్వం సృజతి...॥' (స. వే. సి. సా. 332) మాయోపాధికుడై, అనంతశక్తియుక్తుడైన ఈశ్వరుడు సంకల్ప మాత్రమున చరాచరాత్మక విశ్వము నంతటిని సృజించెను. స్వయముగా నతడే నిమిత్తోపాదానకారణములై సృజించెను. నిమిత్తోపాదాన కారణద్వయము ఏకముగనుండుటకు సాలె పురుగు దృష్టాంత ముదాహరింపబడియున్నది (స. వే. సి. సా. 334). పూర్వము ప్రత్యేకముగ వర్ణింపబడియున్న ప్రాగుత్పత్తిస్థితిదైన నవ్యాకృతము, కాపిల ప్రధానమువలెగాక, నస్వతంత్రమై, పరమేశ్వరాధీనమై యొప్పారుటచే, నప్పరమేశ్వరుడే నిమిత్తోపాదానకారణములుగ రూపింపబడి యున్నది (బ్ర. సూ. భా. 1. 4. 1, 2. 1. 22). అంతియగాక నీశ్వరుడు సృష్టికర్తయయి, జీవసంసారకారకుడగుటయే గాక, ఈశ్వరుడు జీవు ననుగ్రహించి, విజ్ఞానము నొసంగి, తత్ఫలితముగ మోక్షసిద్ధినిగూడ బ్రసాదించుచున్నాడు (బ్ర. సూ. భా. 2. 3. 41). ఈ విధముగనున్న ఈశ్వర గుణములను, అతనికి జీవ సృష్టులకుగల సంబంధ బాంధవ్యములను బూర్వ గ్రంథముననే గాంచియున్నారము. ఈసృష్టికార్య నిర్వహణమున సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది అసంఖ్యాకలక్షణములు అతనికి అన్వయింపబడియున్నవి (బ్ర.సూ.భా.1. 1. 5 , 1.1.2). బ్రహ్మేతరవస్తువు అభావమగుటచే 'యద్ధి యస్మాత్ప్రభవతి

యస్మింశ్చ ప్రలీయతే తత్తస్యోపాదానం ప్రసిద్ధం' (బ్ర. సూ. భా. 1. 4. 25) దేనినుండి జనించి, ఎందు లయించునో అది ఉపాదానమగుటచే, నా బ్రహ్మమే సత్యమునకు సర్వోపాదాన త్వము నొందియున్నది. ఈ సృష్టికార్యమును ఈశ్వరుడు ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె సునాయాసముగ, (బృ. భా. 2. 4. 10) స్వాభావికముగ, కేవలము లీలారూపముగ (బ్ర. సూ. భా. 2. 1. 33) గావించుచున్నట్లుగూడ స్పష్టము. కాని సృష్టికార్యము పూర్వోక్త చందము 'యథా రజ్జ్వాదిః సర్పాదే ర్మిథ్యాకల్పితస్య' (గీ. భా. 13. 16) రజ్జ్వాదికమున సర్పాదు లుత్పత్తి యైనటుల జరుగుచున్నట్లు వ్యక్తము. సత్యమారయుచో నీ సృష్టి కార్యకథన మంతయు 'అత్రాత్మావబోధ మాత్రస్య వివక్షితత్వా త్సర్వోయమర్థవాదః' ఆత్మతత్త్వగ్రహణార్థమే, అర్థవాదప్రసంగమువలె గావింపబడి యున్నది. కాన 'మాయావివద్యా, మహామాయావీ దేవః సర్వజ్ఞః సర్వశక్తిః సర్వమేతచ్ఛ్రకార సుఖావబోధార్థప్రతిపత్త్యర్థం లోకవదాఖ్యాయికాది ప్రపంచం ఇతి యుక్తతరః పక్షః' (ఐ. భా. 4. 1) సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాది లక్షణములుగల ఈశ్వరుడు, ఇంద్రజాలకునివలె మహామాయావియై, సులభ గ్రహణమునకై, అన్వయార్థము కథలనువలె అసత్యకల్పనము గావించె నను టయు, సముచితము అనియు భాష్యకారుడు నిర్దుష్టముగ వచించెను.

---

## సర్వము బ్రహ్మమే

అందుచే 'యదిద మేక మద్వైతం పరమార్థతః' (బృ. భా. 2. 4. 12) పరమార్థదృష్టికి నిది యంతయు నద్వైతమై, 'బ్రహ్మమాత్రం హి విశ్వం, నాధిష్ఠానాద్భిన్న తారోపితస్య' (వి. చూ. 233) అధిష్ఠానేతరముగ నారోపిత మభావమగుటచే సర్వ విశ్వము బ్రహ్మమే యగుచున్నది. అనగా 'ఘటకుడ్యాదికం సర్వం మృత్తికా మాత్రమేవ చ। తథా బ్రహ్మ జగత్సర్వం ఇతి...॥' (వే.డిం. 39) ఘటకుడ్యాదికము సర్వము మృత్తికయే యైనట్లు సర్వజగత్తు బ్రహ్మమే యగుచున్నదనుటయం దెట్టి సంశయము లేదు (మ.వా.ద.88,వి.చూ.230). అటులే 'సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతం'(అ. అ. 51) సువర్ణవికారము లన్నియు సువర్ణముగ శాశ్వతముగ నుండునుగదా! కావున 'యత ఏవం తతో విశ్వం సర్వం బ్రహ్మైవ కేవలం। విచార్యమాణే సద్యుక్తి శ్రుతి స్మృత్యుపపత్తిభిః॥' (మ. వా. ద. 106) సద్యుక్తి శ్రుతి స్మృతి అనుభవములచే విచారించినచో విశ్వము బ్రహ్మేతరముగాక యుండుటచే నది బ్రహ్మమే యగుచున్నది. ఈ విషయములే 'బ్రహ్మమయం సర్వం' (వే. డిం. 34) 'అఖిలం బ్రహ్మైవ' (మ. వా. ద. 166) 'సర్వప్రపంచోఽయం బ్రహ్మైవ' (అ. అ. 45) మొదలగు ననేకవాక్యములు స్థిరపరచుచున్నవి. కాని ఈ వాక్యములు బ్రహ్మమే ప్రపంచమయినట్లు వచించి, బ్రహ్మమునందు వికారిత్వము ఘటిల్లజేసెనని సంశయింప నవసరము లేదు. ఆరోపిత లక్షణములు అధిష్ఠానమును బాధింపనేరవుగదా। అధిష్ఠాన

జ్ఞానమున అధ్యస్త మదృశ్యమయినట్లు 'ఏవం పరమార్థావస్థాయాం సర్వవ్యవహారాభావం వదంతి వేదాంతాః' (బ్ర.సూ. భా. 2. 1. 14) పరమార్థావస్థలో సర్వవ్యవహారము అభావము కాగా, కేవలబ్రహ్మమే చెల్వొందుట పర్యవసానమగుచున్నది. అందుచే భ్రాంతిరూప జగత్తులో మునిగి దాని సత్యత్వము నారయనేరక, దాని బాహ్యలక్షణములచే నాకర్షింపబడుచు, దుఃఖముల పాలుగాక, సర్వజగదాధారమై అధిష్ఠానమై యొప్పు పరబ్రహ్మము నారయ, శ్రుతి యుక్తి అనుభవములచే సమ్యగ్పరిశీలనము గావించి, జీవ జగత్తుల కేవల భ్రాంతిరూపములుగ గ్రహించి, సర్వాధిష్ఠానమైన నా బ్రహ్మమున నేకత్వస్థితి విరాజిల్లుటయే ముఖ్యకర్తవ్యముగా ముముక్షులోకము గ్రహించి తదనుగుణ ప్రవర్తనమున విరాజిల్లెదరు గాక అని ఆశించెదము.

---

# సాధన

'జన్మ మృత్యుప్రవాహేషు పతితో నైవ శక్నుయాత్।
ఇతి ఉద్ధర్తు మాత్మానం జ్ఞానాదన్యేన కేనచిద్॥' (ఉ. సా. 2.15.52) జనన మరణ ప్రవాహపతితుడగువానిని నుద్ధరించుటకు జ్ఞానముకంటె వేరు సాధనములేదు. ముముక్షువు జ్ఞానముచేతనే యీ ప్రవాహమునుండి దరిజేరును. 'న యోగేన న సాంఖ్యేన న కర్మణా నో న విద్యయా। బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షః సిద్ధ్యతి నాన్యథా॥' (వి. చూ. 58) యోగా

భ్యాసమువలన గాని, సాంఖ్యశాస్త్రరీతిగా ప్రకృతి పురుష వివేచనమూలమున గాని, యజ్ఞాది కర్మాచరణముచే గాని, తర్కమీమాంసాది శాస్త్రాధ్యయనమునలనగాని, పూర్వోక్త బంధవిముక్తి పూర్వకముగ బరమానంద ప్రాప్తిరూప మోక్షము సిద్ధింపదు. బ్రహ్మాత్మైకత్వ జ్ఞానమువలననే మోక్ష ప్రాప్తి యగును. ఇంతకంటె సాధనాంతరములేదు. 'అవిద్యా కామకర్మాది పాశబంధం విమోచితుం। కః శక్నుయా ద్వినా త్మానం కల్పకోటి శతైరపి॥' (వి. చూ. 57) జన్మకారణము లగు అవిద్యా కామకర్మాది పాశములచే జనించు ప్రతిబంధము ఆత్మజ్ఞానమువలననే విమోచనము కావలెనుగాని జ్ఞానోద యము కానిచో శతకోటి కల్పముల కయినను బంధవిముక్తి కానేరదు. 'అభేద దర్శనం మోక్షః సంసారో భేదదర్శనః। సర్వవేదాంత సిద్ధాంతః ఇతి వేదాంత డిండిమః॥' (వే. డిం 70) మొదలగు అసంఖ్యాక వాక్యములు బంధమునను న్న జీవ విమోచనార్థము సాధనవిధానమును బోధించియున్నవి. మాయా కల్పిత సర్పాదిక నివృత్తికి దండతాడనాదులుగాక, మందాంధ కార నివృత్తియు, అధిష్ఠాన రజ్జు జ్ఞానప్రాప్తికి, దీపికాదిక మవ సరము అగుచున్నవి కదా! 'దశమస్య పరిజ్ఞానే నాయా సోఽస్తి యథా తథా। స్వస్య బ్రహ్మాత్మ విజ్ఞానే ఇతి వేదాంత డిండిమః।' (వే. డిం. 74) దశముని గణించుటలో శ్రమలేనట్లు, తానే బ్రహ్మమని గ్రహించుటలో నాయాసము సుమంతయు లేదు అను రీతి సాధనాంతరములు శ్రమహేతు వును, శ్రమసంకీర్ణములునై యొప్పారునుగాని, ఆత్మజ్ఞానము సులభసాధ్యమనియే శాస్త్రతాత్పర్యము. అట్టి సులభసాధ్య

దశము జ్ఞానమునకై సాధనేతరముల నాశ్రయించుటయు అజ్ఞానమే యగుచున్నది.

పూర్వగ్రంథమున గాంచియున్నటుల అనాదిమాయా ప్రభావముచే జీవ సర్గము లేర్పడి స్వాత్మ విభ్రాంతిచే 'మాయాకార్యై స్థిరోభూతో నైవ ఆత్మానుభూయతే' (స. వే. సి. సా. 476) మాయా కార్యములైన దారాపుత్రాది కమున నిరికి, ఆత్మానుభూతిని విస్మరించుట సర్వానుభవ సిద్ధమే అంత 'స్వవాసనాప్రేరిత ఏవ వర్తతే సర్వోపి లోకః సకల క్రియాసు । సంసార బంధః ఖలు వాసనా కృతః...' (మ. వా. ద. 279) సర్వ ప్రపంచము స్వవాసనా ప్రేరితమై వర్తించును. సంసార బంధము వాసనామయము అను వచనమురీతి పూర్వాపూర్వ కర్మ ఫలిత, పూర్వాపూర్వవాసనా బద్ధమై ప్రపంచ ప్రవృత్తి జనింప, నందు బద్ధమై ఆత్మానంద పీయూషపాన విస్మృతిచే బాహ్యావిషయ సుఖభ్రాంతి జనింప, దానికై యన్వేషించి, తజ్జనిత ఆనందతర సుఖదుఃఖ పరంపరా స్రవంతి మునింగి, జన్మమరణ పరంపరలో జీవుడు పడిపోవుచున్నాడు. అట్టివాని నుద్ధరించు మార్గము ఏమి? ఈ సంసార బంధము ఆత్మానాత్మ వివేక శూన్యమై కర్మ ప్రవృద్ధి మూలమై బహుదుఃఖ హేతువగుచు, కోటి కర్మలచే నైన నివృత్తికాక (మ. వా. ద. 24) 'యథా ప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి। ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖం॥' (వి. చూ. 325) నీటిపై దట్టముగ క్రమ్మియుండు నాచును దొలగింపగా, నది క్షణమాత్రమైనను దొలగియుండక మరల క్రమ్మినట్లు స్వస్వ

రూపాను సంధానమునుండి, పరాఙ్ముఖుఁడైనవాఁడు పండితుఁడైనను, మాయ వానిని నావరించుచునే యుండును అను రీతి అనాత్మజ్ఞుని మరల మరల సంసారపాశమున ముంచుచున్నది. ప్రపంచమున సుఖకారణములని భావింపఁబడుచున్న 'ధనం భయ నిబంధనం సతత దుఃఖ సంవర్ధనం' (స. వే. సి. సా. 70) భయ నిబంధనమును సదా దుఃఖసంవర్ధనమును నైన ధన పుత్ర కళత్రాదిక విషయముల 'కా తవ కాంతా క స్తే పుత్రః' (చ. పం. 2) నీ భార్య ఎవరు? పుత్రు లెవరు? వారికి నీకు సంబంధ మెద్ది? అను విషయముల మునిగి, వాని నన్వేషించి, 'భోగ్యదృష్టి సదా యస్య న తస్య బ్రహ్మదర్శనం' (మ. వా. ద. 210) ఎవనికి భోగ్యదృష్టియే యుండునో వానికి బ్రహ్మదర్శన ముండజాలదు కాన, 'పునరపి జననం పునరపి మరణం' (చ. పం. 1. 8) పునః పునః జనన మరణ ప్రవాహమున గొట్టుకొని పోవుచున్నాఁడు. విషయ సంగమే జన్మ యగుటచే (ప్ర. ఉ. ర. 64) 'సత్సంగత్వే నిఃసంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం। నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥' (చ. పం. 31) అనురహస్యము నెరింగి, 'బాహ్యే ఽనిత్యే' (ఆత్మబోధ. 1) బాహ్యము లనిత్యములని గ్రహించి 'ఆత్మలాభా త్పరో నాన్యో లాభః కశ్చన విద్యతే' (ఉ. సా. 2. 17. 4) ఆత్మలాభముకంటె నన్య మెద్దియు లేదని అవగాహన మొనరించి, 'చిత్తస్య బాహ్యార్థ విమోక్షమేవ మోక్షం' (స. వే. సి. సా. 133) చిత్తముయొక్క బాహ్యార్థ విషయ విమోక్షమే మోక్షమను పరమార్థ సాధనా తత్త్వము నవలోకించి, బాహ్యార్థముల గల దోషముల గాంచి, (స. వే.

సి. సా. 25) 'బంధశ్చ మోక్షో మనసైవ' (స. వే. సి. సా. 358) బంధ మోక్షములకు మనస్సే కారణముగాన, తన్నాశమే మోక్షమగుటచే (ప్ర. మ. మా) తత్కార్యసిద్ధికై, 'సత్యార్థీ గురుమాశ్రయేత్' (ఉ. సా. 2. 17. 5) సత్యార్థియై సద్గురువు నాశ్రయింపవలెను. అంత 'స్థితో బ్రహ్మాత్మనా జీవో బ్రహ్మజీవాత్మనా స్థితం। ఇతి సంపశ్యతాం ముక్తిః...' (వే. డిం. 14) జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు అని పరికించువారికే మోక్షమగుటచే అట్టి సమ్యక్ జ్ఞాన ప్రాప్తికై, సద్గురు సన్నిధానమున సాధనము గావింప, సాధకుడుద్యుక్తుడు గావలయునని తాత్పర్యము. అందుల కెట్టి సాధనలో ముముక్షువు నిమగ్నము కావలయునో విచారించెదముగాక.

---

## కర్మమార్గము

'కర్మాణి చిత్తశుద్ధ్యర్థం ఐకాగ్ర్యార్థ ముపాసనా। మోక్షార్థం బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాంత డిండిమః॥' (వే. డిం. 25) కర్మలు చిత్తశుద్ధికొరకును, ఉపాసన ఏకాగ్రత్వమునకు బ్రహ్మవిజ్ఞానము మోక్షార్థ మగుచున్నది. 'చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే। వస్తు సిద్ధి ర్విచారేణ న కించి త్కర్మ కోటిభిః॥' (వి. చూ. 11) కర్మ చిత్తశుద్ధి కొరకేగాని వస్తుప్రాప్త్యర్థము కాదు. వస్తుసిద్ధి విచారణముచే నగునుగాని కోటికర్మలచేనైన కానేరదు. 'కర్మణాం శుద్ధి

సాధనత్వ మేవావగమ్యతే । న మోక్ష సాధనత్వం' (స. సు. భా. 2. 6) కర్మలచే శుద్ధిసాధన గలుగును గాని మోక్ష సాధనము కాదు. 'కర్మణాం విశుద్ధి హేతుత్వం' (బృ. భా. 4. 4. 22) కర్మలచే విశుద్ధత్వము గలుగుటచే నను అసంఖ్యాక వచనములు వర్ణాశ్రమోచిత సర్వకర్మ సమూహము చిత్తశుద్ధి కారకమాత్రములే గాని పరమలక్ష్యమైన మోక్ష సాధన యోగ్యములు గావని నిశ్చయించుచున్నవి. యథార్థముగ నందుచే 'న కర్మణా న ప్రజయా ధనేనేతి స్వయం శ్రుతిః। కర్మణో మోక్షహేతుత్వం సాక్షాదేవ నిషేధతి॥' (స. వే. సి. సా. 168) కర్మసంతాన, ధనములచే మోక్షప్రాప్తి స్వయముగ లేదని శ్రుతి తాత్పర్యము. సాక్షాత్తుగ కర్మద్వారా మోక్షము నిషేధింపబడియున్నది. అవిద్యాజన్యమైన కర్మ 'అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్' (ఆత్మబోధ. 3) అవిద్యతో నవిరోధమగుటచే, నవిద్యను నివర్తింప నేరక, 'సంసారవర్ధకం కర్మ తన్నివృత్త్యై న కల్పతే । న హి పంకస్య పంకేన నివృత్తి రవలోక్యతే॥' (మ. వా. ద. 27) సంసారవర్ధకమై తన్నివృత్తి నొదింప నేరదు. పంకమునకు బంకముతో నివృత్తి యుండ జాలదుగదా ! కావున 'న స్నానైరపి కీర్తనైరపి జపైర్నో కృచ్ఛ్రచాంద్రాయణై। ర్నో వాప్యధ్వర యజ్ఞ దాన నిగమై ర్నో మంత్ర తంత్రై రపి ॥ జ్ఞానాదేవ తు కైవల్యం' (స. వే. సి. సా. 169, 170) స్నానములచే గాని, కీర్తనాదులచే, జపములచే, కృచ్ఛ్రి చాంద్రాయణాదికర్మలచేతను, యజ్ఞ దానాగమములచే, మంత్రతంత్రములచేగాక జ్ఞానముచేతనే కైవల్యసిద్ధి గలుగునని ముఖ్యార్థము.

ఆవిధముగా 'అజ్ఞానమూలకం కర్మ జ్ఞానం తూభయ నాశకం' (స. వే. సి. సా. 854) కర్మ అజ్ఞానమూలకమైనదై జ్ఞానము అజ్ఞానకర్మ నాశకమైన దగుటచేతను, 'అపి కోట్యాజ కల్పానాం కర్మణా ముక్తిరిష్యతే' (మ. వా. ద. 28) బ్రహ్మయొక్క కోటికల్పములకైనను కర్మచే ముక్తి కలుగ నేరదు. కావున 'న హి బాహ్యక్రియావాన్ ఆత్మక్రీడ ఆత్మరతిశ్చ భవితుం శక్తః' (ముం. భా. 3. 1. 4.) బాహ్యక్రియా సక్తుడు, ఆత్మక్రీడాసుఖముల నొంద నశక్తుడను నమ్మకమున 'త్యజేత్తస్మా త్క్రియాః సర్వాః సాధనైః సహ మోక్షవిత్' (ఉ. సా. 2. 16. 43) సాధనలతోసహా సర్వకర్మల మోక్షవిదుడు త్యజింపవలెను (ఉ. సా. 2. 15. 6). కర్మ ముముక్షులోకమునకు హేయభూతగనే యెవ్వారును (ఉ.సా. 2. 1. 15). జ్ఞాన కర్మలకు ఈ విధముగ వైరుధ్యముండుటచే కేవల కర్మ కాకపోయినను జ్ఞాన కర్మ సముచ్చయముగూడ అసాధ్యము, యుక్తిబాహ్యము. 'తస్మాత్ ... ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేన వా కర్మణాత్మజ్ఞానస్య సముచ్చయో న కేనచిద్దర్శయితుం శక్యః' (గీ. భా. 2. 11) శ్రుతివలనగాని స్మృతివలనగాని తెలుపబడని జ్ఞాన కర్మ సముచ్చయమును, గీతా శాస్త్రము బోధించుచున్నదని ఎవరును నిరూపింపజాలరు అను భాష్యములగల బహు వచనములు, కేవల కర్మయే గాక జ్ఞాన కర్మ సముచ్చయముగూడ దుర్లభముగా శంకర తాత్పర్యము.

అట్లు అయినచో నిక కర్మకాండయొక్క గతి ఏమి? ఇక మీమాంసాది వేదభాగము వ్యర్థమగుటయేనా యను

సంశయము పొడగట్టుట సహజమే. కాని శంకరుడు, కర్మకు ఉచితస్థాన మొసంగియున్నాడు. 'సమాసయ్య క్రియాః సర్వా దారాగ్న్యాధాన పూర్వికాః। బ్రహ్మవిద్యా మథేదానీం వక్తుం వేదః ప్రచక్రమే॥' (ఉ. సా. 2. 1. 2) గృహస్థునకు అగ్న్యుపాసనాది విహితకర్మలను సంపూర్ణముగ బోధించి సాధన చతుష్టయ సంపన్నుడగు నధికారికి బ్రహ్మవిద్యను బోధించుచున్నది. అనగా ఆరురుక్షువగు అభ్యాసకునకు కర్మకర్తవ్యము. 'సంసారిణో హి కర్మాణి విధీయంతే' (ఉ. సా. 1. 1. 30) సంసారులైనవారికి కర్మవిధింపబడినది. ఆభావమునే 'దేహాద్యైరవిశేషేణ దేహినో గ్రహణం నిజం। ప్రాణినాం తదవిద్యోత్థం తావత్కర్మ విధిర్భవేత్॥' (ఉ. సా. 2. 1. 16) జీవునకు దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యాభిమానము అవివేకజన్యమగు నజ్ఞానముచే గలుగును. దేహేంద్రియాత్మజ్ఞానముండునంత కాలము ప్రమాణమగు గర్మవిధి వ్యర్థము కానేరదనియు 'మోక్షాధికారీ సంన్యాసీ గృహస్థః కిల కర్మణి' (స. వే. సి. సా. 180) సన్న్యాసి మోక్షాధికారియై యుండ గృహస్థు కార్మాధికారి యనియు నిశ్చయించి యున్నాడు. అటులే భాష్యగ్రంథములగూడ 'అతఃకర్మాణ్యవిద్యావస్థాయామేవ చోద్యంతే న విద్యావస్థాయాం' (గీ. భా. 2. 69) అందుచే నవిద్యావస్థలో నున్నవారికి కర్మవిధింపబడెను. కాని జ్ఞానావస్థలోనున్న వారికి గానేరదు. అనగా 'ప్రాగ్జ్ఞాననిష్ఠాధికార ప్రాప్తేః కర్మణ్యధికృతేన కూప తడాకాద్యర్థ స్థానీయమపి కర్తవ్యం' (గీ. భా. 2. 46) కర్మాధికారియైనవాడు జ్ఞానాధికారి యగుటకు పూర్వము కూప తటాకాది

నిర్మాణాది కర్మల నాచరించుట కర్తవ్యము. అట్లు గావిం చుటయు 'ఈశ్వరార్పణ బుద్ధ్యానుష్ఠీయమానః' (గీ. భా. ఉ.) ఈశ్వరార్పణబుద్ధితో స్వార్థత్యాగ మొనరించి గావింప వలయునని ఆదర్శము. 'అవిద్యాది దోషవత ఏవ కర్మాణి విధీయంతే। నాద్వైతజ్ఞానవతః' (ఛాం. భా. ఉ) అవిద్యా దోషసంపర్కము గలవానికే కర్మలు విధింపబడియున్నవి గాని అద్వైతజ్ఞానికి గాదు. 'కేవల బ్రహ్మవిద్యారంభాచ్చ పూర్వం కర్మాణ్యుపన్యస్తాని' (తై. భా. 1. 11. 1) ప్రథమతః బ్రహ్మవిద్యారంభ పూర్వము కర్మలు విధింపబడియున్నవి. అట్లు యజ్ఞాది వర్ణాశ్రమకర్మలు 'విద్యోత్పత్త్యావపేక్షితవ్యాని' (బ్ర. సూ. భా. 3. 4. 27) యథాశ్రుతముగా విద్యచే నుత్పత్తియం దపేక్షింపబడుచున్నవి. మోక్షసాధనమున సాక్షాత్తుగ నుపయుక్తము కాకున్నను కర్మలు 'విద్యా సహకారిణి చేతి స్థితం' (బ్ర.సూ. భా. 3. 4. 35) విద్యాసాధనము లగుచున్నవి అనియు శంకరుడు తీర్మానించి కర్మమార్గమును చిత్తశుద్ధికారణముగ గ్రహించి, జ్ఞాన పూర్వస్థానము నొసంగి వైదికకర్మ వ్యర్థత్వ శంకా నివారణము గావించియున్నాడు. అనగా జ్ఞానమార్గమునకు పూర్వము కర్మాచరణము ముఖ్య మగుటయు, తదనంతరము కేవల జ్ఞానము మాత్రమే శరణ్య మగుటయు గ్రాహ్యము.

## యోగమార్గము

పూర్వోక్త కర్మమార్గము వలెనే అందందు యోగము గూడ శంకరవచనములచే ఖండింపబడియున్నది. బ్రహ్మసూత్ర భాష్యమున, యోగము సిద్ధాంతపరముగ సాంఖ్యసిద్ధాంతముతో జేర్చబడి ఖండితమైయున్నది గాని యోగమార్గము నిరసింపబడలేదు. అయినను అద్వైతమార్గమునకు సంపూర్ణాధికారియైన వానికి యోగాదు లనుపయుక్తములు అనావశ్యకములు. అందుచేతనే 'అర్థస్య నిశ్చయోదృష్టో విచారేణ హితోక్తితః। న స్నానేన న దానేన ప్రాణాయామ శతేన వా॥' (వి. చూ. 13) సద్గురూపదిష్ట తత్త్వమస్యాది మహావాక్యార్థమును విచారణవలన నిశ్చయింపగ అపరోక్షజ్ఞానము కలుగును. తీర్థముల గ్రుంకుటచే గాని, దానాది కర్మలచే గాని, దీర్ఘకాల ప్రాణయామాదుల వలనగాని అపరోక్షజ్ఞానము కలుగదు అని వచనము. ఆత్మలాభము గలిగినచో 'ప్రాణాయామః సాధితో వా తతః కిం' (అ. (శ్రీ). ప్ర. 7) ప్రాణాయామమును సాధించి ఫలితమేమి ? కుంభకము వలన ప్రయోజనమేమి? అను ప్రశ్నయు నుదయించినది. (అ.(శ్రీ) ప్ర. 8, 9) అనగా ఆత్మజ్ఞాన పరునకు యోగాదు లప్రధానమనియే తాత్పర్యము.

కాని జ్ఞానార్హత లేనివానికి 'నళినీదళగత సలిలం తరలం తద్వజ్జీవిత మతిశయ చపలం। విద్ధి వ్యాధ్యభిమాన గ్రస్తం లోకం శోకహతం చ సమస్తం॥' (ద్వా. పం. 10) పద్మపత్రోదకమువలె జీవితము అతిచంచలమై, వ్యాధి అభి

మాన బద్ధమై, సమస్తలోకము శోకహతముగా నుండుటచే నట్టి పరిస్థితికి 'శృణుష్వ విద్వన్ మన ఏవ జీవో మనో హి విశ్వం మన ఏవ చేశః। మనో హి మాయా మన ఏవ బంధః మనో లయో ముక్తిరయం యథార్థః॥' (మ. వా. ద. 256) అని వివరింప బడిన మనస్సే కారణము అగును. 'సర్వానర్థ నిదానం మన ఏవ భవత్యముష్య పురుషస్య।' (మ. వా. ద. 65) పురుషునకు మనస్సే సర్వానర్థములకు మూలకారణము. దానిచే సంసారబంధమునుండి ముక్తికొరకు మనస్సు నిగ్రహింపబడవలెను అనురీతి శోకకారణమై మన స్సుండుట గమనార్హము. మరియు 'యత్రాసక్తిర్మన స్తత్ర తదా కారేణ తిష్ఠతి' (మ. వా. ద. 246) ఎచ్చట ఆసక్తియుండునో అట చిత్తము ఆ యాకారమునొంది యుండుచు విషయా సక్తిచే విషయాకారముల బొంది, జీవునకు దుఃఖహేతు వగు చున్నదగుటచే, 'చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నా న్మునేః' (వి. చూ. 369) మునులకు చిత్తనిరోధమే సదా కర్తవ్యము. విషయసంపర్కముగల మనస్సు, అశుద్ధమై దుఃఖహేతు వగుటచే 'తన్మనః శోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా । విశుద్ధే సతి చైతస్మిన్ముక్తిః కరఫలాయతే॥' (వి. చూ. 183) ముముక్షువు మనస్సును శుద్ధ పరుపవలెను. అది శుద్ధమగునేని ముక్తి కరతలామలకమగును. అది శుద్ధ మగుటచే నది జయింపబడి, 'బ్రహ్మానంద సుఖప్రాప్తి హేతు ర్మానం' (స.సు.భా.2.41) అనురీతి ఆనందమునకు దారిదీయును. అట్టి శుద్ధ చిత్తము లేనిదై అమనస్కమై, 'అద్వయం బ్రహ్మకేవలం' (మ. వా. ద. 254) కేవల బ్రహ్మమై

వి రా జిల్లును. అట్లు మనో జయము సామాన్యుల కసాధ్య మనిపించును గాని 'ఉన్మేషశ్చ నిమేషశ్చ సుకరః స్యాద్యథా తథా। మనోజయో ఽపి సుకరః పురుష స్యాఽఽత్మ వేదినః॥' (మ. నా. ద. 248) ఆత్మవిదులకు రెప్పపాటువలె అతిసులభ సాధ్యము. కాన 'బాహ్యే విరుద్ధే మనసః ప్రసన్నతా మనః ప్రసాదే పరమాత్మ దర్శనం' (వి. చూ. 369) బాహ్యవిషయ నిరోధముతో మనస్సు ప్రసన్నమై, పరమాత్మ దర్శన మొసంగును. కావున జ్ఞాన సముపార్జనమునకు ఆత్మ్యంతకు మూలకారణమైన మనోజయము ముఖ్యమగుటచే, శంకరుడు యోగమును ముముక్షువులకు ప్రథమతః నియోగించి యున్నాడు.

అణిమాద్యైశ్వర్య ప్రాప్తిహేతువని స్మరింపబడుచున్న యోగమును, కేవలము సాహసమున నిరాకరింప దగదు. 'శ్రుతిశ్చ యోగ మాహాత్మ్యం ప్రఖ్యాపయతి' (బ్ర. సూ. భా. 1. 3. 33) శ్రుతియు యోగమహిమను బ్రకటించి యున్నదని శంకరుడు వాకొని, 'ప్రాణాయామం ప్రత్యాహారం నిత్యానిత్య వివేకవిచార' (ద్వా. పం. 9) ములను విధించుచు, 'యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధో ఽ పరిగ్రహః' (వి. చూ. 368) యోగమునకు వాఙ్నిరోధాపరిగ్రహములు ప్రథమద్వారములుగ వచించి, 'యోగతారావళీ' 'సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహా'ది గ్రంథముల శంకరుడు యోగ గత యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణధ్యాన సమాధుల వివరించియున్నాడు. అందుచే యోగసాధనగూడ జ్ఞానోత్పత్తికి బూర్వము, మనోనిగ్రహముకొరకు కుపయుక్త-

ముగా అద్వైతమార్గమున స్థానము దానికి గలదని వ్యక్తము. కాని అది సాక్షాత్తు మోక్షహేతువుమాత్రము కానేరదనియు విస్పష్టము.

---

## భక్తిమార్గము

కర్మ యోగ మార్గములవలె ఉపాసనయనబడు భక్తి మార్గముగూడ నద్వైతదృష్టికి నజ్ఞానభాజనమై, 'అఖండే సచ్చిదానందే నిర్వికల్పైకరూపిణి। స్థితేఽద్వితీయభావేఽస్మిన్ కథం పూజా విధీయతే॥' (అ. పూ. 1) నిర్వికల్పమును, ఏక స్వరూపమును, అద్వితీయమును, అఖండమునునగు సచ్చిదా నందబ్రహ్మమును పూజించుటెట్లు? 'స్వమేవాకృత్రిమం దేవ మజ్ఞాత్వా ప్రతిమాం జడాః। భజంతి దేవతాబుద్ధ్యా అహో అజ్ఞజనాజ్ఞతా॥' (మ. వా. ద. 6) ఆత్మనే స్వభావసిద్ధమైన దేవతగా గ్రహింపనేరక, మూఢులై ప్రతిమల దేవతాబుద్ధి సేవించు చున్నారు. అజ్ఞానుల యజ్ఞాన మెంత ఆశ్చర్య కరము అని సంశయాశ్చర్యముల జనింప జేయును. 'హిత్వా త్మానం సదానంద మాత్మనః సుఖ కామ్యయా। యజంతి దేవాన్ యజ్ఞాద్యైర హో అజ్ఞ జనాజ్ఞతా॥' (మ. వా. ద. 5) సర్వదా ఆనంద స్వరూపమైన స్వస్వరూపమును వదలి సుఖ కామ్యతచే దేవతలను యజ్ఞాదులద్వారా పూజించుచున్నారు గదా అనియు అద్వైతి అచ్చెరు వొందును. 'రూపవర్ణాదికం సర్వం విహాయ పరమార్థవిత్' (అ. బో. 40) పరమార్థతత్త్వ

విడుడు రూపవర్ణాదికముల సర్వమును త్యజించి, 'దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవః సదా శివః। త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్॥' (ఆ. పూ. 10). దేహమే దేవాలయము. జీవుడే సదాశివుడు. అజ్ఞాన నిర్మాల్యమును త్యజించి సోహం భావార్చనము గావింపనగును అని విశ్వసించి, అట్లుగాక 'అన్యోఽసావహమన్యోఽస్మీత్యుపాస్తే యోఽన్యదేవతాం। న స వేద నరో బ్రహ్మ స దేవానాం యథా పశుః' (బ్ర.అ. 6) ఉపాస్య దేవతకంటె తనను వేరుగా భావించి, అన్యదేవతోపాసన మొనరించువాడు బ్రహ్మము నెరుంగక, దేవతలకు పశుతుల్యుడై యొప్పారును అనియు ఉపాసకునిగూర్చి చింతించును. మరియు నవిద్యావస్థయందు జీవుడు కార్యకరణ సంఘాతవిషయమైన భ్రమస్వరూపము గలవాడై, అవిద్యా తిమిరాంధుడగుచు నుండ, నతనికి బరుడుగా భావింపబడు ఈశ్వరుని అనుగ్రహము వలననే విజ్ఞానోత్పత్తియు, నంత మోక్షము సిద్ధించును. అనగా నీశ్వర విశ్వాసము అజ్ఞాన జనితముగా గ్రహించుకొనును. అట్టి సమష్టి రూపమైన యీశ్వరత్వము అజ్ఞానము (స. వే. సి. సా. 711). 'ఇత్యేవ ముపాసనాశ్రితో ధర్మః సాధకో యేనైవం క్షుద్ర బ్రహ్మవిత్' (మాం. భా. 3. 1) అట్టి ఉపాసనాశ్రిత ధర్మము నాశ్రయించి, అసమగ్ర బ్రహ్మము నెరిగిన సాధకుడు క్షుద్ర బ్రహ్మవిదు డనబడుననియు, నుపాసనా విధానమును అద్వైతి ఖండించును. భగవన్నామ సంకీర్తనాదుల నజ్ఞాన సూచికములుగ జ్ఞాని త్రోసిపుచ్చును (స. వే. సి. సా. 169).

అయినను, అవిద్యావస్థలో నున్న సాధకునికి ఈశ్వరాస్తిక్య భావము దృఢముగనుండి, అతని అనుగ్రహార్థ ప్రవృత్తి యవసర మగుటచే, (బ్ర. సూ. భా. 2. 3. 41) 'శివ ప్రసాదేన వినా న సిద్ధిః... శివప్రసాదేన వినా న ముక్తిః' (స. వే. సి. సా. 279) శివానుగ్రహము లేక సిద్ధిగాని ముక్తిగాని లేదనియు, 'శివ ప్రసాదాత్ సుఖబోధరూపం' (ప్ర. మ. మా. 27) అని వచించుటయే గాక 'మోక్షవాసనా ఈశ్వరానుగ్రహాత్స్యాత్' (వే. డిం. 72) ఈశ్వరానుగ్రహవిశేషముననే మోక్షవాసనయు జనించుననియు వచింపబడియున్నది. అందుచేతనే 'దుర్లభం త్రయమేవైతద్దేవానుగ్రహహేతుకం । మానుషత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః॥' (వి. చూ. 3) మనుష్య దేహప్రాప్తియు, మోక్షేచ్ఛయు, మహాపురుష సేవయు దుర్లభము. అవి దైవానుగ్రహమునమాత్రమే లభించును అనుచు మనుష్యత్వముగూడ ఈశ్వరానుగ్రహ ప్రాప్తముగనే వర్ణింపబడియున్నది. అట్లు ఉపాసనార్థము శాస్త్రము ఈశ్వరదేవతాసికమును గ్రహించినట్లు (బృ. భా. 1. 3. 1) శంకర తాత్పర్యము. జ్ఞానస్థితి కరు దేవనిహానికి సర్వము, సంసారసాగరతరణముగూడ ఈశ్వరానుగ్రహ కారణముననే గలుగుననియు శంకరుడు నొక్కి వర్ణించియున్నాడు (వి.చూ. 477). అట్టి ఈశ్వరుని కృపాసిద్ధికై యుపయుక్తమైన సర్వేతర సాధనములలో 'మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ।' మోక్షము నొందించు మార్గములలో భక్తి సర్వశ్రేష్ఠము అని వచించుచు 'స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥' (వి. చూ. 32)

స్వస్వరూపానుసంధానమే భక్తి యని వచింపబడు ననియు దెలుపబడి యున్నది. ఈ నిర్వచనము కేవల మద్వైత పరముగ నన్వయింపబడియున్నను, 'శ్రద్ధా భక్తి ధ్యాన యోగా న్ముముక్షో ర్ముక్తేర్హేతూన్వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గిః॥' (వి. చూ. 48) స్వతఃప్రమాణమైన వేదము, ముముక్షువులకు మోక్షప్రాప్తికి నాలుగు మార్గముల బోధించుచున్నది. అవియే శ్రద్ధా భక్తి ధ్యాన యోగములు అనుచు, భక్తిని గూడ శంకరుడు ప్రధానముగ గ్రహించి, అనేక భక్తిగీతములగూడ ననేక దేవతామూర్తుల సంబోధించి వ్రాసి యున్నాడు. ఆత్మజ్ఞానమునకు బూర్వసాధనములలో భక్తినే ముఖ్యముగ నతడు గ్రహించి, అనేక దేవతాప్రతిష్ఠల, నుపాసనావిధానముల నెలకొల్పి, సర్వముముక్షు లోకోపయుక్త విధానమున సమరసత్వమును బ్రకటించియున్నాడు.

'ఆసీన కర్మోపాసనం' (బ్ర. సూ. భా. 4, 1. 8) ఉపాసనము గూరుచుండిగావింప హెచ్చరించుచు, ఏకచిత్తమున నుపాసింప బోధించుచు (ధ. అ. 6), ఏదిక్కున, నేదేశమున నేకాలమున నేకాగ్రతా సౌకర్యము గలుగునో దానిననుసరించి గావింప నుపదేశించుచు (బ్ర. సూ. భా. 4. 1. 11), 'ఉపాసనం నామ యథాశాస్త్ర ముపాస్యస్యార్థస్య విషయీకరణేన సామీప్య ముపగమ్య తైలధారావ త్సమానప్రత్యయ ప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం తదుపాసన మాచక్షతే' (గీ. భా. 12. 3) ఉపాసన మనగా, శాస్త్రానుసారముగ నుపాస్యమును సమీపించి, తైలధారవలె నా నుపాస్యమును [illegible]వమున చిరకాలము నిలిపి, ఆసీనమై యుండుట యని

నిర్వచింపబడియున్నది. అట్లు నిరతనిష్ఠచే 'ధ్యానయోగేన మాసైకాద్ బ్రహ్మహత్యాం వ్యపోహతి। సంవత్సరం సదభ్యాసాత్ సిద్ధ్యష్టకమాప్నుయాత్॥' (20) యావజ్జీవం సదాభ్యాసాత్ జీవన్ముక్తో భవేత్ యతిః॥' (బ్ర. అ. 21) ధ్యానయోగమును మాసము అభ్యసించిన బ్రహ్మహత్యాది పాతకనాశమును, సంవత్సరాభ్యాసమున అణిమాదికసిద్ధులు, యావజ్జీవసమ్యక్సాధనచే జీవన్ముక్త స్థితియు గలుగుననియు శంకర ప్రతిజ్ఞ. ఈ విధముగ నభ్యసించియే వ్యాసాదులు దేవతాప్రత్యక్షముల బొందియుండిరనియు నుదహరింపబడి యున్నది (బ్ర. సూ. భా. 1. 3. 33).

ఈ విధముగ సగుణారాధనరూప ఉపాసన, భక్తి ధ్యానములగూడ మందప్రజ్ఞులకై, అనగా బ్రహ్మజ్ఞానార్హత నింకను ఆర్జింపని సాధకకోటికై, అద్వైతమార్గ ముపదేశించునట్లు శంకరయతి తీర్మానించియున్నాడు.

---

## జ్ఞానమార్గము

### సాధన చతుష్టయము

'తత్త్వావబోధస్తు విచార్యమాణే సమ్యక్ పదార్థే సముదేతి పుంసః। శ్రుతి స్మృతి న్యాయబలేన బుద్ధ్యా న స్నానమంత్రార్చన కీర్తనాద్యైః॥' (మ. వా. ద. 25) పురుషునకు తత్త్వజ్ఞానము శ్రుతి స్మృతి న్యాయములబలముచే, బ్రహ్మ

విచారణము బాగుగా గావింప జనించును. కాని స్నాన జప సంకీర్తనాదులచే గాదని పూర్వ ముల్లేఖింపబడియున్నది. అనగా విచారణమే తత్త్వావబోధకు కారణమగును గాని సాధనానంతర మభావమని స్పష్టము. కాని తద్విచారణా సానుకూల్యతకు ముందు సాధనచతుష్టయము అత్యవసర మగుటచే 'సాధనచతుష్టయ సంపన్నో అధికారీ' (అ. వి. 12) అనియు, 'సాధనచతుష్టయసంపత్తి ర్యస్యాస్తి ధీమతః పుంసః। తస్యైవైతత్ఫలసిద్ధి ర్నాన్యస్య కించిదూనస్య॥' (స. వే. సి. సా. 12) ఏపురుషునికి సాధనసంపత్తియుండునో అతనికే తత్ఫలసిద్ధిగాని యితరులకు కానేరదు అనియు, 'వివేకినో విరక్తస్య శమాదిగుణ శాలినః। ముముక్షో రేవ హి బ్రహ్మ జిజ్ఞాసాయోగ్యతా మతా॥' (వి చూ. 17) సారాసార విచక్షణుడు, వైరాగ్యసంపన్నుడు, శమాది షట్కసంపన్నుడు ముముక్షువగు వాడే బ్రహ్మోపదేశమున కర్హుడగును అని వచింపబడియున్నది. అనగా సుసూక్ష్మమైన బ్రహ్మమునుగూర్చి విచారింప 'మేధావీ పురుషో విద్వా నూహాపోహ విచక్షణః। అధికార్యాత్మవిద్యాయా ముక్తలక్షణ లక్షితః॥' (వి. చూ. 16) ధారణాశక్తిగలిగి, శాస్త్రపఠనశీలుడై, తర్క వితర్క సమర్థత గల పురుషుడు, ఆత్మ విద్యోపదేశమున కధికారి అను రీతి సల్లక్షణోపేతుడై యుండి, దేహేంద్రియానీక జయము సాధించి, బ్రహ్మతత్త్వోన్ముఖ చిత్తముగలవాడే అధికారి అని నిర్ణయము.

'కోఽహం కథమిదం జాతం కో వా కర్తా ఽస్య విద్యతే। ఉపాదానం కిమస్తీహ విచారః సోఽయ మీదృశః॥'

(అ. అ. 12) నే నెవడను? ఈప్రపంచ మెట్లు కలిగెను? దీనికి కర్త ఎవరు? దీనికి ఉపాదానకారణ మేది? అను లక్షణములతోనున్న విచారణము గావింపనేరక, 'కిమత్ర హేయం కనకం చ కాంతా' (ప్ర. మ. మా. 8) కనక కాంతలే హేయములని గ్రహింపజాలక, 'కామ ఏవ యమః॥' (స. వే. సి. సా. 53) యముడైయున్న కామమును, 'కామ ఏవ సర్వలోక శత్రుర్యన్నిమిత్తా సర్వానర్థప్రాప్తిః ప్రాణినాం॥' (గీ. భా. 3. 37) సర్వలోకశత్రువై, సర్వానర్థముల ప్రాణులకు గలుగజేయుచు శరీరము జీర్ణించుచున్నను అది జీర్ణింపని కామము ననుసరించు చుండుట (స. వే. సి. సా. 60) అధికారి లక్షణముకాదు. బాహ్యప్రపంచగత విషయములన్నియు అనర్థదాయకములే యని గ్రహించుకొనుటకు, 'ఆత్మానాత్మ వివేకేన జ్ఞానం భవతి నిశ్చలం' (స. ఆ. 20) 'ఆత్మానాత్మ వివేకేన జ్ఞానం సిద్ధ్యతి నాన్యథా' (స.వే. సి. సా. 518) అను రీతి ఆత్మానాత్మవివేకమే ఆత్మజ్ఞానమునకు ముఖ్యకారణమై యొప్పారుచున్నది. అందులకు 'స్థూలాద్యజ్ఞానపర్యంతం కార్యకారణ లక్షణం। దృశ్యం సర్వమనాత్మేతి విజానీహి విచక్షణా॥' (స. వే. సి. సా. 456) స్థూలభూతములనుండి అజ్ఞానము వరకు కార్యకారణసంబంధమునగల సర్వదృశ్యములు అనాత్మ యని సూక్ష్మబుద్ధితో గ్రహించి, సద్వివేకమున జింతించినచో, 'నోత్పద్యతే వినా జ్ఞానం విచారేణాన్యసాధనైః' (అ. అ. 11) విచారణముచేగాక నితరోపాయములచే జ్ఞాన ముద్భవింపదను నట్లు విచారణయే జ్ఞానసాధనము. దానికై 'యథార్థ దర్శనం వస్తు న్యనర్థస్యాపి చింతనం। సంకల్పస్యాపి కామస్య తద్వ

ధోపాయ ఇష్యతే॥' (స. వే. సి. సా. 69) వస్తుతత్వముయొక్క యథార్థమును, దాని అనర్థలక్షణముల చింతనము, సంకల్పములయొక్క కామనముల మార్గముగా నెంచి నిత్యానిత్య విచారణము గావింపవలెను. 'నిత్యమాత్మస్వరూపం హి దృశ్యం తద్విపరీతగం।' (అ. అ. 5) ఆత్మయే నిత్యము అన్యము అనిత్యము అని విచారించి, 'నిత్యానిత్యవివేకశ్చ దేహ క్షణికతామతిః' తద్విచారణముగ దేహాదికము క్షణికమని గ్రహించి, జ్ఞానార్హతకు నొక సోపానము నధిగమించును. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యే త్యేవం రూపో వినిశ్చయః। సోఽయం నిత్యానిత్య వస్తువివేకః సముదాహృతః॥' (వి. చూ. 20) బ్రహ్మమే సత్యము జగత్తు మిథ్యయను నిశ్చయజ్ఞానమే వివేక మనబడును.

అట్లు నిత్యానిత్యపరిశీలనము గావింప అసత్యపదార్థముపై హేయత్వ ముదయించుట సహజము. 'తద్వైరాగ్యం జిహాసా యా దర్శనశ్రవణాదిభిః। దేహాది బ్రహ్మపర్యంతే హ్యనిత్యే భోగ్యవస్తుని॥' (వి. చూ. 21) దేహమునుండి బ్రహ్మదేవుని వరకుగల సమస్తానిత్య భోగ్యవస్తువులయందు దర్శన శ్రవణ భోగములం దిచ్ఛలేకుండుట వైరాగ్యము. 'బ్రహ్మాదిస్థావరాంతేషు వైరాగ్యం విషయేష్వను। యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలం॥' (అ.అ. 4) బ్రహ్మ నుండి స్థావరములవరకుగల సర్వవిషయములందు కాకి మలమునం దిచ్ఛ లేనట్లు ఇచ్ఛలేకుండుటయే నిర్మలవైరాగ్యము. ఇట్లుదయించిన 'వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలం। స్వానందానుభవాచ్ఛాంతి రేషైవోపరతేః ఫలం॥'

(వి. చూ. 420) ఫలము తత్త్వజ్ఞానము. దానిచే ఉపరతి గలుగును. తత్ఫలితముగ స్వస్వరూపానుభవముచే పరమ శాంతియు గలుగుచున్నవి. ఈవిధముగ ఫలప్రదమైనది గను కనే 'వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్ పక్షౌ విజానీహి విచక్షణత్వం। విముక్తి సౌధాగ్రతలాధిరోహణం తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి॥' (వి. చూ. 375) పక్షికి పక్ష ద్వయమువలె, మోక్షసౌధాగ్రము నెక్కుటకు వైరాగ్య జ్ఞాన ములు పురుషునకు ముఖ్యములు. ఈ రెండింట నేది లోపించి నను మోక్షముసిద్ధింపనేరదు. కాన వివేకముద్వారా అనాత్మ లక్షణముల గ్రహించి, దాని త్యజించుటయే వైరాగ్యమన బడినట్లు స్పష్టము.

ఈవిధముగా నార్జింపబడిన వైరాగ్యము వలన 'సదైవ వాసనాత్యాగః శమోఽయమితి శబ్దితః। నిగ్రహో బాహ్య వృత్తీనాం దమ ఇత్యభిధీయతే॥' (అ. అ. 6) సదా వాసనా నిగ్రహము శమమనియు, బాహ్యప్రవృత్తినిగ్రహము దమ మనియు తెలుపబడిన శమదమాదిక ముదయించును. 'విరజ్య విషయవ్రాతాద్దోషదృష్ట్యా ముహుర్ముహుః। స్వలక్ష్యే నియ తావస్థా మనసః శమ ఉచ్యతే॥' (వి. చూ. 22) విషయేభ్యః పరావర్త్యస్థాపనం స్వస్వగోళకే। ఉభయేషా మింద్రియాణాం స దమః పరికీర్తితః॥' (వి. చూ. 23) జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ముల వమ తమ వ్యాపారముల బ్రవేశింపనీయక, బ్రహ్మమున నైక్యమొనరించుట దమమని నిర్వచనము. 'బాహ్యాలంబనం వృత్తేరేషోపరతిరుత్తమా' (వి. చూ. 24) చంచలమగు మన స్సును నిశ్చలముగజేసి, బాహ్యావిషయములనుండి మరలించి

బ్రహ్మలక్ష్యమునందుంచుట ఉపరతియగును. అటులే 'సహనం సర్వదుఃఖానా మప్రతీకార పూర్వకం । చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే॥' (వి.చూ. 25) శీతోష్ణ క్షుత్పిపాసాది ద్వంద్వములచే గలుగు దుఃఖముల కోర్చుచు, ప్రతీకార భావము లేక యుండుట తితిక్ష యనంబడును. 'శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావధారణా । సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే॥' (వి.చూ. 26) శాస్త్ర గురువాక్యములు సత్యములనెడు నిశ్చయబుద్ధితో నుండుట శ్రద్ధయగును. 'సమ్యగాస్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా । తత్సమాధాన మిత్యుక్తం' (వి. చూ. 27) బ్రహ్మమునందు ఏకాగ్రముగ బుద్ధిని స్థాపించి యుండుట సమాధాన మగును. అట్లు వివేక వైరాగ్యముల యనంతరము శమాది షట్కము అతి ముఖ్యస్థానము నాక్రమించి యున్నది. అందు చేతనే 'మోక్షస్య కాంక్షా యది వై తవాస్తి త్యజాతి దూరాద్విషయాన్ విషం యథా। పీయూషవ త్తోషదయాక్షమార్జవ ప్రశాంతి దాంతీ ర్భజ నిత్యమాదరాత్॥' (వి. చూ. 84) సర్వానర్థముల దొలగించి, నిత్య సుఖమునుగూర్చు మోక్షేచ్ఛ గలదేని అనర్థదాయకమునైన విషము నెట్లు త్యజించెదమో అటులే భవబంధ హేతువులగు దేహాది విషయములం దాసక్తిని బూర్తిగ విడువుము. మరియు సంతోషము, దయ, క్షమ, ఆర్జవము, ప్రశాంతి, దాంతి యను వానిని అమృతమువలె నత్యంతాదరమున భజింపుము అని ఆదేశింపబడి యున్నది.

ఇట్లు సర్వసద్గుణ లక్షణోపేతుడైన సాధకుడు 'అహం

కారాది దేహాంతాన్ బంధా నజ్ఞానకల్పితాన్ । స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా॥' (వి. చూ. 28) అజ్ఞానకల్పిత అహంకారాది దేహాంతము వరకుగల బంధములలో జిక్కి, అగ్నిచే గాల్పబడుచున్న వానివలె బరితపించుచు, సద్గురు బోధవలన నట్టి బంధమునుండి విముక్తినొంద గలిగెడి తీవ్రేచ్ఛ ముముక్షుత్వము నా నిర్వచింపబడినట్లు మోక్షాసక్తి కర్త్వడగుచున్నాడు. ఇందులకు రజస్తమో గుణములను క్షీణింపజేసి, శుద్ధసత్వమును బెంపొందింప జేయుట ముఖ్యము (సం. వే. సి. సా. 361). అట్టి విశుద్ధ చిత్తమునగల ముముక్షుత్వము సర్వసాధనలకు మూలకారణమై (స. వే. సి. సా. 227) చిత్తప్రసాదమునకు మార్గగామి యగును. సంసారబంధనిర్ముక్తి నాకాంక్షించుట యను నా ముముక్షుత్వము (అ. అ. 9) 'జన్మభిః కోటిపర్యంతై ర్నిర్వృత్తైః పుణ్యకర్మభిః' (మ. వా. ద. 13) కోటి జన్మల గావింపబడిన పుణ్యకర్మలచే శుద్ధాత్మ నొందినవారికే జనించును. అంతకష్టసాధ్యమైన ముముక్షుత్వముయొక్క అపేక్షలేక ఆత్మజ్ఞానసిద్ధి ప్రాపిలనేరదు. కాన నిది అవశ్య మవలంబనీయమని వేరుగ వచింప ననావశ్యము.

ఈవిధముగ బ్రహ్మజిజ్ఞాసాశీలతకు సాధన చతుష్టయ సంపత్తి అత్యంతావసరమై సర్వసాధకులకు ముఖ్యానుష్ఠేయమై తత్త్వజ్ఞానముతో బ్రథమమున నవినాభావ సంబంధమున విరాజిల్లుచున్నదని గ్రాహ్యము. ఈ విషయము ఎల్లవేదాంత గ్రంథములతో బాటు శంకరవిధానము గూడ బ్రతిపాదించుచున్న దనుట కెట్టి సందియమును లేదు.

## శ్రవణాదులు

అద్వైతసిద్ధి హేతుభూత సాధనమునుగూర్చి ప్రసంగించుచు, పూర్వము కర్మ యోగ భక్తిమార్గములు అజ్ఞానదశయందుమాత్ర ముపయుక్త మనియు, సాధన చతుష్టయ సంపత్తినార్జించి, 'తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణాం । ముముక్షూణా మపేక్ష్యోయ మాత్మబోధో విధీయతే॥' (ఆ, బో. 1) వివిధ తపోకార్యములచే పాపరహితులై శాంతచిత్తులును, నిష్కాములును అగు ముముక్షువుల నుద్దేశించియే, ఆత్మబోధ యనునట్లు, 'విశుద్ధ సత్వస్య తు నిష్కామస్యైవ ...విరక్తస్య ప్రత్యగాత్మ విషయా జిజ్ఞాసా ప్రవర్తతే' (కే. భా. ఉ.) విశుద్ధసత్వ బుద్ధులకు, నిష్కామ చిత్తులకు, విరక్తులకు, ఆత్మజిజ్ఞాస తెలుపబడు చున్నది అనియు వచింపబడినరీతి విరక్తులకే అద్వైతజ్ఞాన జిజ్ఞాసకు అర్హత గలుగునని స్పష్టము. అట్టివానికి 'స్వల్పాపి దీపకణికా బహుళం నాశయేత్ తమః । స్వల్పోపి బోధో మహతీ మవిద్యాం శమయేత్ తథా॥' (స్వా. ప్ర. 50) స్వల్పమై యుండియు దీపిక విస్తారమైన చీకటిని దోలుచందము స్వల్పబోధయే బహుళావిద్యనుగూడ నశింప జేయగల్గును. అజ్ఞానమువలన 'కర్మిణో వినివర్తంతే నివర్తంతే ఉపాసకాః। జ్ఞానినో న నివర్తంతే...॥' (వే.డిం.19) కర్మపరులు, ఉపాసనాశీలురు పునః జన్మించెదరుగాని జ్ఞాని జన్మింపడు అనుచందము పునరావృత్తి యుండదు. 'అద్వైతవాదాన్మోక్షస్స్యాత్' (వే. డిం. 18) అద్వైతవాదమువలననే మోక్షము సిద్ధించును.

అట్టి ఆత్మజ్ఞాన సిద్ధికి 'వాక్యార్థశ్రుతిమాత్రేణ సమ్యక్ జ్ఞానం భవిష్యతి' (స. వే. సి సా. 703) వాక్యార్థశ్రవణము చేతనే జ్ఞానము జనించు నావాక్యరీతి మహావాక్యార్థశ్రవణము సద్గురు సన్నిధానమున నాచరింపవలెను. అట 'లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనం। శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు॥'(వి.చూ.271) లోక దేహ శాస్త్రవాసనల త్యజించి, మిథ్యాజ్ఞాన అపనయనముద్వారమున బ్రహ్మాత్మైకత్వజ్ఞానమును బొందుటకై, (బ్ర. సూ. భా. 1.1.4) దశముగాథలో దశమజ్ఞానమునకే నిరీక్షించుచు, సర్వేతరముల త్యజించు రీతి, (ఉ. సా. 2. 18. 174) నేకాగ్రచిత్తమున 'మోక్షేచ్ఛయా కృతం సమ్యక్ఫలతి శ్రవణాదికం' (మ.వా.ద.21) తీవ్రమోక్షేచ్ఛతో గావింపబడిన శ్రవణాదికము సమ్యక్ఫలితము నొసంగును. పూర్వముండిన 'మిథ్యాజ్ఞానస్యవిచ్ఛిత్తిః సమ్యక్ జ్ఞానేన సిద్ధ్యతి॥' (మ.వా.ద.30)మిథ్యాజ్ఞానము సమ్యగ్ జ్ఞానముచే నశించును. అజ్ఞానము 'పదార్థస్య విచారేణైవ నాన్యథా' (మ. వా. ద. 30) యితరమార్గముల గాక విచారణమువలననే గలుగును. అట్టి విచారణమువలననే 'అబ్రహ్మత్వ భ్రమో చ్ఛిత్త్వా త్వహం బ్రహ్మేతి నిశ్చయః। జాయతే' (మ. వా. ద. 29) జీవుడు బ్రహ్మాభిన్నమను భ్రమ తొలగి అహం బ్రహ్మ మను నిశ్చయము జనించును. జ్ఞానము చేతనే అజ్ఞాన నాశము గలుగును. అదియు విచారణముననే గలుగును. (వి. చూ. 47) అట్లు జ్ఞానార్జనము గావింపకున్నచో 'వదంతు శాస్త్రాణి యజంతు దేవాన్ కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః। ఆత్మైకత్వబోధేన వినా విముక్తి

ర్షసిద్ధ్యతి బ్రహ్మ శతాంతరేపి॥' (వి. చూ. 6) శాస్త్రములు పఠించినను, దేవతలకు యజ్ఞముల గావించినను, కర్మల నాచరించినను, దేవతల నారాధించినను, ఆత్మైకత్వబోధ లేక ముక్తి శత బ్రహ్మకల్పముల కైనను సిద్ధింపదు. కావున సమ్యగ్దర్శన నిష్ఠలేనిది యేదియు సాధ్యము కాజాలదని ముఖ్య తాత్పర్యము.

అట్టి సమ్యగ్‌జ్ఞాన ప్రాప్త్యర్థము 'బ్రహ్మ చైవ మాచార్యోపదేశ పరంపరయైవా ధిగంతవ్యం న తర్కతః...' (కే. భా. 1. 4) బ్రహ్మము తర్కముచేగాక ఆచార్యోపదేశమువలననే సాధ్యమగును గాన, నా ఆదర్శ గురుసన్నిధానమున జేరి, శ్రవణ మననాదుల గావింపవలెను. 'శ్రవణాదిభి రుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః। జీవః సర్వ మలాన్ముక్తః స్వర్ణవత్ ద్యోతతే స్వయం॥' (ఆ. బో. 66) శ్రవణాదికము చే ప్రదీప్తమై, జ్ఞానాగ్నివలన సముజ్జ్వలత నొంది, సర్వపాప విముక్తుడై బంగారమువలె జీవుడు ప్రకాశించుటచే (బ్ర.సూ. భా. 3. 4. 51) అవశ్యావలంబనీయములు. శ్రవణ మనగా 'షడ్విధ లింగై రశేష వేదాంతానా మద్వితీయ వస్తుని తాత్పర్యా వధారణం' (అ. వి. 12) వేదాంతముల బ్రతిపాదితమైన బ్రహ్మవస్తువును షడ్లింగముల ద్వారా గ్రహించుట శ్రవణము నాబడును. అనగా 'ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలం। అర్థవాదోపపత్తిశ్చ లింగం తాత్పర్య నిర్ణయే॥' ఉపక్రమోపసంహారములు, అభ్యాసము అపూర్వత్వము ఫలము అర్థవాదము ఉపపత్తి యను ఆరు లింగము లచే నుపనిషద్వాక్యముల దాత్పర్య నిర్ణయము గావించుట శ్రవ

ణము అగును. అట్లువినినదాని 'శ్రుతస్యార్థస్యోపపత్తిభిశ్చింతనం మననం' (ఆ. వి 16) అర్థమును శ్రుత్యనుకూల యుక్తులచే బలుమారు చింతించుట మననమగును. మరల 'విజాతీయ దేహాదిప్రత్యయరహితా ద్విజాతీయవస్తు సజాతీయ ప్రత్యయ ప్రవాహో నిదిధ్యాసనం' (ఆ. వి. 16) విజాతీయ విషయమును వదలి, సజాతీయమును అవిచ్ఛిన్నముగ ధ్యానించుట నిదిధ్యాసనము అనబడును.

ఈ విధముగా 'తద్వద్బ్రహ్మవిదోపదేశ మనన ధ్యానాదిభిర్లభ్యతే। మాయాకార్య తిరోహితం స్వమమలం తత్త్వం న దుర్యుక్తిభిః॥' (వి. చూ. 67) ఆత్మవస్తు లాభము నకై సద్గురూపదిష్టమార్గమున ఆత్మానాత్మ వివేక పూర్వకముగ మనన నిదిధ్యాసనాదులచే మాయా తత్కార్యములైన అహంకారాదులచే గప్పబడియున్న నిర్మలాత్మతత్త్వమును గ్రహింపవలెను. కుతర్కములచే గానేరదు అను హెచ్చరికను స్వీకరించి, 'శ్రుతేః శతగుణం విద్యాన్మననం మననా దపి। నిదిధ్యాసనం లక్షగుణో మనంతం నిర్వికల్పం॥' (వి. చూ. 365) శ్రవణ ముత్తమము. దానికంటె మననము నూరురెట్లధికము. మననముకంటె నిదిధ్యాసనము లక్షమడుంగు లధికము. దానికంటె నిర్వికల్పకసమాధి అనంత ఫలదము. అందుచే 'నిత్యాభ్యాసాదృతే ప్రాప్తిర్నభవే త్సచ్చిదాత్మనః। తస్మాద్బ్రహ్మ నిదిధ్యాసా జ్జిజ్ఞాసుః శ్రేయసే చిరం॥' (అ. అ.101) నిత్యాభ్యాసములేక సచ్చిదానందమైన ఆత్మను బొందుటకు గాదు. కాన జిజ్ఞాసువు మోక్షముకొరకు నిత్యము బ్రహ్మనిదిధ్యాసనము గావింపవలయును.

కేవలము శ్రవణమాత్రముచే బ్రహ్మానుభూతి నొందు అర్హునకు మనన నిదిధ్యాసనాదు లవసరము లేదు గాని ఆ ప్రజ్ఞలేనివాని కవి అవసరము (బ్ర. సూ. భా. 4. 1. 2). 'తత్త్వమసి' అను మహావాక్య శ్రవణము చేతనే జీవ బ్రహ్మాభిన్న జ్ఞాన మనుభూతమగు సమర్థునకు శ్రవణమే చాలును గాని యితరులకు గాదు. అందుచే సాధన చతుష్టయ సంపన్నుడైన అధికారి గురు సన్నిధానమున శ్రవణ మనన నిదిధ్యాసనముల గావింపవలసియే యుండును.

అయిన శ్రవణ మనగా నేమి? 'నిత్యముక్తత్వ విజ్ఞానం వాక్యాద్భవతి' (ఉ. సా. 2. 18. 190) నిత్యముక్త విజ్ఞానము వాక్యమువలన గలుగును. 'తత్త్వం పదార్థే సువిచారణీయా సమ్యఙ్మహావాక్యగతౌ ముముక్షుణా । తయోర్వివేకోదయ బోధవహ్నిః సంసారబంధం ప్రదహత్యశేషం॥' (మ. వా. ద. 32) ముముక్షువులచే మహావాక్యమున గల 'తత్' 'త్వం' పదములయొక్క అర్థము చక్కగా విచారణీయము. వాని వివేకజ్ఞానము వలన జనించిన బ్రహ్మజ్ఞానాగ్నిచే సంసారబంధము సంపూర్ణముగా దహింపబడును అనువచనమురీతి తత్త్వమస్యాది మహావాక్య శ్రవణ మనన నిదిధ్యాసనము విధింపబడినదిగాని యితరవిషయ శ్రవణము గాదని నిర్ణయము.

మహావాక్యవిచారము వివేకచూడామణి, ఉపదేశ సాహస్రి, స్వాత్మనిరూపణ, తత్త్వోపదేశ, సర్వవేదాంతసిద్ధాంత సారసంగ్రహాది గ్రంథముల శంకరుడు వివరించియున్నాడు. 'తత్త్వమసి' అనువాక్యమున సాధకునకు సన్నిహితమును సులభ

గ్రాహ్యమునైన 'శోధితే త్వం పదార్థే హి తత్త్వమస్యాది చింతనం!' (త. ఉ. 22) 'త్వం' పదార్థ శోధనమైనగాని వాక్యార్థము గలుగనేరదు. 'దేహేంద్రియాది ధర్మాన్ యః స్వాత్మన్యారోపయన్ మృషా। కర్తృత్వాద్యభిమానీ చ వాచ్యార్థ స్త్వం పదస్య సః॥' (త. ఉ. 23) మిథ్యాభూతములగు శరీరేంద్రియధర్మముల నాత్మయందు ఆరోపించుకొని కర్తృత్వ భోక్తృత్వములయందభిమానము నెవడు వహించుచున్నాడో వాడే 'త్వం'పదమునకు వాచ్యార్థము. వాచ్యార్థమనగా ప్రస్ఫుటార్థము నాబడును. 'దేహేంద్రియాది సాక్షీ యస్తేభ్యో భాతి విలక్షణః। స్వయంబోధస్వరూపత్వాల్లక్ష్యార్థ స్త్వం పదస్య సః॥' (త. ఉ. 24) శరీరేంద్రియాదులకు సాక్షియు, తదన్యముగ బ్రకాశించువాడును, స్వయంప్రకాశుడును అగువాడే 'త్వం' పద లక్ష్యార్థము. అట్లే 'వేదాంతవాక్యసంవేద్యం విశ్వాతీతాక్షరాద్వయం। విశుద్ధం యత్ స్వసంవేద్యం లక్ష్యార్థ స్తత్పదస్య సః॥' (త. ఉ. 25) వేదాంతవేద్యుడును, విశ్వాతీతుడును, అవినాశియు, అద్వితీయుడును, శుద్ధుడును, అగు స్వయంప్రకాశస్వరూపుడే అనగా నీశ్వరుడే తత్పదము నకు లక్ష్యార్థము. ఈవిధముగ 'తత్' 'త్వం' పదములు జీవ బ్రహ్మైక్యము నుపదేశించుచున్నవి.

ఇట్లు అన్వయించుకొనుటకు ముఖ్యార్థమున గాక లక్షణావృత్తిచే యీ పదద్వయమునకు ఏకత్వ మేర్పడగలదు. లక్షణ త్రివిధము. 'వాచ్యార్థ మఖిలం త్యక్త్వా వృత్తిః స్యాత్ యా తదన్వితే। గంగాయాం ఘోష ఇతి వజ్జహతీ లక్షణా హి సా॥' (త. ఉ. 33) వాచ్యార్థమును వదలువృత్తి జహల్లక్షణ.

ఎట్లనగ గంగలో పల్లె యనుచోట గంగను త్యజించి గంగా తీరమును గ్రహించుట యగును. మరల 'వాచ్యార్థ మపరిత్యజ్య వృత్తిరన్యార్థకే తు యా। కథితే య మజహాత్తి శోణోఽయం ధావతీతి వత్' (త. ఉ. 35) వాచ్యార్థమును త్యజింపక అన్యార్థమును గ్రహించుట అజహల్లక్షణ. ఎరుపు పరుగిడుచున్నది. ఎరుపుశబ్దమును పరిత్యజించి, ఎర్రని గుర్రమును గ్రహించుట యగును. వాచ్యార్థ స్యైక దేశం చ పరిత్యజ్యైక దేశకం। యా బోధయతి సా జ్ఞేయా తృతీయా భాగలక్షణా॥' (త. ఉ. 37) వాచ్యార్థము నందలి ఒక భాగమును వదలి మరియొక భాగమును బోధించునదియే మూడవది యగు భాగ లక్షణ అనగా జహదజహల్లక్షణము. 'సోఽయం విప్రః' అను వాక్యమున ఆ యా కాలములకు గల విరుద్ధ ధర్మముల త్యజించి బ్రాహ్మణవ్యక్తినే గైకొనుట యగును. అట్లే 'తథైవ ప్రకృతే తత్త్వమసీ త్యత్ర శృతౌ శృణు। ప్రత్యక్త్వాదీన్ పరిత్యజ్య జీవధర్మాంస్త్వమః పదాత్॥ సర్వజ్ఞత్వ పరోక్షతాదీన్ పరిత్యజ్య తతః పదాత్। శుద్ధం కూటస్థ మద్వైతం బోధయత్యాదరాత్ పరం॥' (త. ఉ. 40, 41) అట్లే తత్త్వమసి వాక్యమున 'త్వం' పదవాచ్యుడగు జీవుని ధర్మములగు ప్రత్యక్ మొదలైన వానివదలి, 'తత్' పదవాచ్యుడైన ఈశ్వరుని సర్వజ్ఞత్వము పరోక్షత్వాది ధర్మముల విడచి, శృతి, ఆదరమున శుద్ధమును కూటస్థమును అగు అద్వైత వస్తువునే బోధించుచున్నది. ఈ విధముగా తత్త్వమసి మహావాక్యము జీవబ్రహ్మైకత్వ జ్ఞానమును బోధించుచున్నది. ఈ రీతిగ మహావాక్య శ్రవణాదులచే జీవబ్రహ్మైక్యమును

'అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।
శమాది సహితస్తావ దభ్యసే చ్ఛ్రవణాదికం॥' (వా. వృ. 49)
బోధపడ నంతవరకు శమాది షట్కసంపత్తి నార్జించి, శ్రవణ మనన నిదిధ్యాసనముల గావింపుమనియు ఆదేశము.

'త్వం' పదార్థ నిర్ణయమునకై పంచకోశాదిక విచారము గావించి, నేతి నేత్యాది దృష్టితో నవి ఆత్మేతరములని నిర్ణయించి త్రోసిపుచ్చి 'తత్' 'త్వం' పదైకత్వమును బొందవలయును.

---

## పంచకోశ నిరాసము

'సదే రుపని పూర్వస్య క్విపి చోపనిషద్భవేత్। మందీకరణభావాచ్చ గర్భాదే శ్శాతనాత్తథా॥' (ఉ. సా. 2. 1 26)
'సద్' ధాతువునకు శిథిలీకరణము ప్రాణము నాశనము అని అర్థత్రయము గలదు. ఉప+ని+సద్+క్విప్=ఉప,ని,అను ఉపసర్గలతో గూడిన 'సద్' ధాతువుపైన 'క్విప్' అను ప్రత్యయమును చేర్పగ 'ఉపనిషత్' అను పదము ఏర్పడుచున్నది. నిత్య నిరంతర బ్రహ్మజ్ఞాననిష్ఠ గలవారికి గర్భజన్మ జరా దుఃఖమును బోగొట్టుననియు, జిజ్ఞాసువునకు బ్రహ్మమును నిశ్చయముగ సాక్షాత్కరింప జేయుననియు, తత్త్వవేత్తలకు గర్భవాసాది దుఃఖమును బోగొట్టును అనియు, త్రివిధాన్వయములు గలవని శంకరులిచే దీర్మానింప బడియున్న ఉపనిషత్సంచయములో ముఖ్యస్థానము నలంకరించియున్న

బృహదారణ్యకమునగల 'ఏష నేతి నేత్యాత్మా।' (2. 3. 5) అను ప్రధానవాక్యము ననుసరించి జ్ఞానమార్గ జ్ఞానస్థితులు వ్యవహరించుచుండుట ప్రత్యక్షము. అద్దాని ననుసరించి శంకరుడును 'సోఽధ్యాసో నేతి నేతీతి ప్రాప్తవ త్ప్రతిషిధ్యతే॥' (ఉ. సా. 2. 18. 21) శరీరములో నాత్మకు అధ్యాసము సత్యముగ దోచుట గాంచి, 'నేతి నేతి' అనువిచారణముచే నది విచారింపబడుచున్నదనియు, నటులే 'అహం కర్త్రాఽఽత్మని న్యస్తం చైతన్యే కర్తృతాది యత్। నేతి నేతీతి తత్సర్వం సాహం కర్త్రా నిషిధ్యతే॥' (ఉ. సా. 2. 18. 25) చిద్రూపమైన ఆత్మయందు జీవునిచే ఏ కర్తృత్వాదికము, ఆరోపింపబడినదో ఆసర్వము ఇది కాదు ఇది కాదు అని అహంకారముతో గూడ నిషేధింపబడును అనియు 'నిషిధ్య నిఖిలోపాధీన్ నేతినేతీతి వాక్యతః॥' (ఆ. బో. 30) శరీరేంద్రియములు ఆత్మకాదు అను నేతి నేతి శ్రుతివాక్యములు శరీరాది సర్వోపాధుల నిషేధ మొనరించుచున్నవి, అను వాక్యములద్వారమున 'నేతి నేతి' వాక్యద్వయ విధానము నాశ్రయించి ఆత్మపై నధ్యస్తమై యున్న నిఖిలోపాధి నిరాసము గావించుచున్నాడు.

అట్లు ఆత్మపై అధ్యస్తమై ఆత్మలక్షణముల మరుగు పరచి ఆత్మేతరగుణముల పైకి దోపింపజేయు (పూర్వోక్త విధానమున) ఆవరణ విక్షేపరూపమాయాశక్తులలో ఆవరణము సూక్ష్మవృత్తి అహం రూపాత్మకమై యొప్పు, విక్షేపము మాత్రము స్థూలమై, మమరూపమై, శరీరత్రయమై, కోశ పంచకమై విరాజిల్లుచున్నది. తత్త్వమస్యాది మహావాక్యవిచా

రణమునకు ఫలితాంశమైన 'దేహో నాహం అచేతనోఽయ మనిశం కుడ్యాదివన్నిశ్చితో। నాహం ప్రాణమయోఽపి వా ధృతిధృతో వాయుర్యథా నిశ్చితః। సోఽహం నాఽపి మనోమయః కపిచలః కార్పణ్యదుష్టో న వా । బుద్ధి ర్బుద్ధకువృత్తికేవ కుహనా నాజ్ఞానమంధం తమః॥' (ప్రో. అ. 3) స్తంభము వలె అచేతనమగు దేహమును నే గాను. అది స్పష్టము. కొలిమితిత్తివలె వాయుపూరితమైన ప్రాణమయకోశమునుగూడ నే గాను. కార్పణ్యదుష్టమగు మనోమయమునుగూడ నేను గాను. కుత్సితబుద్ధియైన విజ్ఞానమయకోశమునుగూడ కాను. అంధకారబంధురమైన ఆనందమయమును కూడ నేను కాను అను ఆరూఢజ్ఞానసిద్ధికై, 'దేహాది పంచకోశస్థా యా సత్తా ప్రతిభాసతే। నా సత్తాఽఽత్మా న సందేహః ఇతి వేదాంత డిండిమః॥' (వే. డిం. 50) అన్నమయాది పంచకోశముల గోచరించెడు సత్తారూపమే ఆత్మ, సందేహము లేదు అను వేదాంత డిండిమ నిశ్చయమును గ్రహించి, 'పంచానామపి కోశానాం మాయానర్థవ్యయోచితా। తత్సాక్షీ బ్రహ్మవిజ్ఞానం – – ॥' (వే. డిం. 79) అను రీతి ప్రత్యక్షగోచరమైన యీ పంచకోశములు మాయయనియు, అనర్థదాయకములై అనిత్యములనియు, వీనికి బ్రహ్మము సాక్షి అనియు గ్రహించి, ఆపంచకోశస్థమైన ఆత్మ తానే యనియు, కావున ఆ బ్రహ్మము 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యార్థమున దానే అనియు విచారించుటకు తైత్తిరీయకశ్రుతి ననుసరించి పంచకోశవిచారణమును, అంత వాని నిరాకృతియు శంకరుడు తన భాష్యగ్రంథములమాత్రమే గాక ప్రకరణగ్రంథములగూడ బలు

తావుల గావించి, ఆవరణ విక్షేపరూప మాయా నిరాసము నొనర్చి సువిస్పష్ట ఆత్మాపరోక్షమును బ్రసాదించి యున్నాడు

శంకర గ్రంథరత్న చూడామణియైన 'వివేకచూడామణి' యీ విచారణను 150వ శ్లోకమునుండి 225 శ్లోకములవరకు వివరముగా గావించియున్నది. అందలి తాత్పర్యమును మాత్రము గ్రహించెదముగాక.

'కోశై రన్నమయాద్యైః పంచభిరాత్మా న సంవృతో భాతి। నిజశక్తిసముత్పన్నైః శైవలపటలై రివాంబు వాప్యస్థం॥' (వి. చూ. 151) బావియందు నీటివలన బెరిగిన నాచు నీటి నెట్లు మాటుపరుచునో అట్లు, ఆత్మశక్తియైన అవిద్యచే నుత్పన్నమైన అన్నమయాది పంచకోశములు ఆత్మను బూర్తిగ నాచ్ఛాదించుచుండుటచే నాత్మ ప్రకాశింపకున్నది అట్లాపస్థ శుద్ధ జలములకై ఆ నాచును బ్రక్కకు దొలగింపవలసినట్లు, 'పంచానామపి కోశానా మపవాదే విభాత్యయం శుద్ధః। నిత్యానందైకరసః ప్రత్యగ్రూపః పరం స్వయంజ్యోతిః॥' (వి. చూ. 153) ఆవిధముగ ఆత్మను మరుగుపరచుచున్న పంచకోశములను అన్వయ వ్యతిరేకములచే నిషేధింపగా, నిత్యానందైకరసస్వరూపుడును, జన్మాదిరహితుడును, స్వయంప్రకాశమానుడును నై ప్రత్యగ్రూపుడైన పరిశుద్ధాత్మ ప్రకాశించును. ఈవిధముగ 'దృశ్యవర్గాత్ ప్రత్యంచ మాత్మానం... వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం తదాత్మనా తిష్ఠతి యః స ముక్తః॥' (వి. చూ. 155) దృశ్యవర్గమునందు సర్వసూత్రాత్మయై త్రితయసంబంధరహితుడై కర్తృత్వాది ధర్మశూన్యుడై యుండు

ఆత్మను పంచకోశములనుండి వేరుపరచి దృశ్యములు లయింప జేసి ఎవడు స్వస్వరూపమున సుస్థిరుడగునో, వాడే ముక్తుడు.

'దేహోఽయమన్న భవనోఽన్నమయస్తు కోశ శ్చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః। త్వక్చర్మమాంస రుధిరాస్థి పురీషరాశిర్నాయం స్వయం భవితు మర్హతి నిత్యశుద్ధః॥' (వి. చూ. 156) ఈస్థూలశరీరము అన్నమువలన నుత్పన్నమై అన్నమువలన జీవించుచు, అన్నములేనిచో నశించునది గాన అన్నమయకోశము నాబడును. ఈ దేహము త్వక్చర్మమాంస రక్తాస్థిపురీష సముదాయముచే హేయమై నశ్వరమైనది. అట్టి దేహము నిత్యుడును శుద్ధుడును అగు ఆత్మ కాజాలదు. ఈ దేహము ఉత్పత్తికి పూర్వముగాని మరణానంతరముగాని లేదు. అనుక్షణము వికారముజెందును. జడముకాన నది ఆత్మ ఎట్లగును? (157) ఈ దేహము కరచరణా ద్యవయవ సంయుక్తము. ఆత్మ నిరవయవము. శరీరము జడముగాన నియ మ్యము. ఆత్మ నియంత కాన శరీరము ఆత్మ కాదుగదా (158). స్థూలమై షడ్భావవికారమై గమనాదిక్రియోపేతమై బాల్యా ద్యవస్థల గలిగిన యీ దేహము ఆత్మ ఎట్లగును? (159). మలినమైన శరీరము నిర్మలాత్మయగునా? (160). కావున 'దేహాత్మధీరేవ నృణామసద్ధియాం జన్మాదిదుఃఖప్రభవస్య బీజం। యతస్తతస్త్వం జహి తాం ప్రయత్నాత్ త్యక్తే తు చిత్తే న పునర్భవాశా॥' (వి. చూ. 166) భ్రాంతిచే గలిగెడు దేహాత్మబుద్ధియే నరులకు జన్మమరణాది దుఃఖములకు బీజము కాన శరీరాధ్యాసముగల వానికి భవసాగరమగ్నత గలుగుచునే యుండును. కావున సర్వప్రయత్నములచే దేహాత్మబుద్ధిని

విషయము. అట్లాచరించిన బునర్జన్మభయము ఎంతమాత్రము లేదు అని శంకరుడు అన్నమయకోశవిమర్శను గావించి హెచ్చరించి యున్నాడు.

అటులే 'కర్మేంద్రియైః పంచభి రంచితోఽయం ప్రాణో భవే త్ప్రాణమయస్తుకోశః । యేనాత్మవా నన్నమయోఽన్న పూర్ణః ప్రవర్తతేఽసౌ సకలక్రియాసు॥' (వి. చూ. 167) వాగాది పంచకర్మేంద్రియములతో గూడిన ప్రాణమే ప్రాణమయ కోశము దీనిచే అన్నమయకోశము అన్నపూరితమై, పంచ వాయుపూరితమై, అహంప్రతీతికి విషయమై, గమనాదిక్రియల బ్రవర్తించుచున్నది. కాన అన్నమయమునవలె నిదియు నాత్మ కానేరదు. ప్రాణమయము వాయువికారముగదా! కాన అనా త్మయే. వాయువునకువలె ఆత్మకు గమనాగమనములుం గలవా? ప్రాణమయము పరాధీనము కావుట ఎట్లును ఆత్మ కానేరదు (168).

మరియు జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయః స్యాత్ కోశో మమాహమితి వస్తు వికల్పహేతుః । సంజ్ఞాది భేదకలనాకలితో బలీయాం స్తత్పూర్వకోశ మభిపూర్య విజృంభతేయః॥' (169) శ్రోత్రాది పంచ జ్ఞానేంద్రియములును మనస్సునుగూడి మనోమయకోశమగును. మనస్సు ప్రధాన మగుటచే నానామము గలిగెను. ఇది అహం మమాది వస్తుకల్పన మునకు హేతువగును. నామజాత్యాది భేదకల్పనమున బలీ యమై ప్రాణమయమును వ్యాపించి విజృంభించును. పంచేంద్రియ సహాయమున విషయవాసనలచే బోషింపబడుచుండును. కాని మనస్సు అవిద్య గాన బరిణమించి సంసార రూపము

నొందుచున్నది. కర్తృత్వ భోక్తృత్వాదులు దీనిచే నభివృద్ధి గాంచును. మనస్సు లయింప నివి అదృశ్యముగదా ! ఇదియే జీవుని బంధమోక్షములకు గారణము. వాయువుచే నరుదెంచిన మేఘములు ఆవాయువుచే దూరమగుట స్పష్టము. అటులే 'దేహాది సర్వవిషయే పరికల్ప్య రాగం బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన । వైరస్య మిత్థ విషవత్సు విధాయ పశ్చా దేనం విమోచయతి తన్మన ఏవ బంధాత్॥' (175) దేహాదిక సర్వవిషయములందును మనస్సు అనురాగమును గల్పించి, పశువును బంధించు త్రాటివలె జీవిని రాగపాశముచే గట్టి, మరల నా విషయములందు విషమువలె నిరసనమును గల్పించి, పురుషుని బంధమునుండి ఆ మనస్సే దొలగించు చున్నది. కాన 'తస్మాన్మనః కారణ మస్య జంతో ర్బంధస్య మోక్షస్య చ' (176) జీవుని బంధమునకును మోక్షమునకు మనస్సే కారణము. బంధహేతువగు యీ మనస్సు 'అతః ప్రాహుర్మనోఽవిద్యాం పండితా స్తత్త్వ దర్శినః' (182) కాన అవిద్యయని తత్త్వదర్శకులైన అనుభవజ్ఞులు వాకొం దురు. కావున 'మనోమయో నాపి భవే త్పరాత్మా' (185) మనోమయముగూడ పరమాత్మ గానేరదు. అది ఆద్యంత ములు వృద్ధి క్షయములు గలిగి ఆత్మకు దృశ్యమగు చున్నది. ఆత్మ అట్లు కాదు కదా!

ఇక విజ్ఞానమయకోశమును బరిశీలింపగా 'బుద్ధి ర్బుద్ధీంద్రియైః సార్థం స వృత్తిః కర్తృలక్షణః। విజ్ఞానమయకోశః స్యాత్పుంసః సంసారకారణం॥' (186) క్షణిక విజ్ఞానరూపమగు బుద్ధి జ్ఞానేంద్రియ సహితముగను, వాని వృత్తులతోడను,

కర్తృత్వాహంకారముల తోడను గూడి విజ్ఞానమయకోశమగును. ఇదియే జీవుని కర్తృత్వాదికమునకు గారణము. వానిచే సుఖదుఃఖాదుల జీవున కొసంగును. ఈవిజ్ఞానమయమే జీవస్వరూపము. దీనికి పశు పక్ష్యాది జన్మలు, పరలోక గమనాదులు జాగ్రదాది యవస్థలుండి సుఖదుఃఖములు గలుగుచుండును (189). ఇది పరాత్మకు సన్నిహితమగుటచే బ్రకాశమానమై దేహేంద్రియాదుల బ్రకాశింపజేయుచు, వానితో దాదాత్మ్యభావమున వర్తించుచుండును. ఇది ఆత్మ కుపాధి (190). అందుచేత 'అతో నాయం పరాత్మా స్యాద్విజ్ఞానమయ శబ్దభాక్ । వికారిత్వా జ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వ హేతుతః। దృశ్యత్వా ద్వ్యభిచారిత్వాన్నానిత్యో నిత్య ఇష్యతే' (208) విజ్ఞానమయకోశము పరాత్మకాదు. ఇది వృద్ధిక్షయాది వికారములుగలిగి, జడమై పరిచ్ఛిన్నమై, దృశ్యమై, అనేక దేశస్థముగాన అనిత్యము. అయినచో నది పరాత్మ ఎట్లు అగును?

పంచమమైన ఆనందమయకోశమో? 'ఆనంద ప్రతిబింబ చుంబిత తనుర్వృత్తి స్తమోజృంభితా। స్యా దానందమయః' (209) తమోగుణ పరిణామమగు ఆనంద ప్రతిబింబయుక్తమాత్మాంతఃకరణవృత్తి ఆనందమయకోశము అగును. అది 'ప్రియాదిగుణకః' ప్రియమోద ప్రమోదాది గుణభూయిష్టము. 'ఇష్టార్థలాభోదయః' ఇష్టవస్తు సంప్రాప్తమున బుట్టొందును. 'పుణ్యస్యానుభవే విభాతి' పుణ్యపురుషులకు పుణ్యఫలానుభవరూపము. 'కృతి నామానందరూపః స్వయం భూత్వా నందతి' అంతర్ముఖులకు స్వయముగ నానందరూపమై ప్రసన్నులౌచేయును. అయినను 'నైవాయ మానందమయః పరాత్మా'

(211) ఈ ఆనందమయకోశముగూడ ఆత్మకాదు. తమోగుణ రూప ఉపాధి గలది గనుకను, అది ప్రకృతి పరిణామ మగుట చేతను, సుకృతకర్మ ఫలానుభవము గలది యగుట చేతను, నానావిధ వికారములు గలది యగుటచేతను అది ఆత్మ ఎట్లగును? ఆత్మ వీని కతీతము గదా!

ఈ విధముగ 'పంచానా మపి కోశానాం నిషేధే యుక్తితః కృతే। తన్నిషేధావధిః సాక్షీ బోధరూపోఽవ శిష్యతే॥' (212) యుక్తి శ్రుతులచే అన్నమయాది కోశ పంచకమును నిషేధింపగా, సర్వసాక్షియు బోధస్వరూపుడును అగు పరమాత్మ శేషించును. ఆ పరమాత్మ 'స్వయం జ్యోతిః పంచకోశ విలక్షణః అవస్థాత్రయ సాక్షి సత్ నిర్వికారో నిరంజనః। సదానందః' (213) అగుటచే సర్వముముక్షువులచే నతడు 'స్వాత్మత్వేన స విజ్ఞేయః' (213) స్వాత్మయనియే బండితులచే గ్రహింపబడవలెను. ఈ విధమున బంచకోశ నిరాసముతో స్థూల సూక్ష్మ కారణరూప శరీరత్రయముగూడ నిరాకరింపబడుచున్నది.

ఎట్లనగా 'స్థూల స్త్వన్నమయో దేహస్సూక్ష్మః స్యా ద్వాసనామయః। మూలాజ్ఞానం యత్తదేవ శరీరం కారణాభిధం॥' (మ వా. ద. 284) అన్నమయముచే జనించి, దానిచే అభివృద్ధిగాంచు దేహము స్థూలశరీరము. వాసనామయమైనదీ సూక్ష్మశరీరము. మూలాజ్ఞానము కారణ దేహము గాన వాని నిరాసమనగా వాని నాశనముగాక 'నాహం మమేద మిత్యాది ప్రత్యయః పరబోధనాత్। యదా భవతి సూక్ష్మస్య తదా నాశ ఇతీష్యతాం॥' (మ.వా. ద. 289)

నేను నాది అను సంకల్పములు ఎప్పుడు స్వాభావికములుగ గలుగవో పరులచే దెలుపబడినప్పుడునూరక నియతముగ గలుగవో, అప్పుడు సూక్ష్మశరీరము నశించిన ట్లగును. 'కారణస్యాపి సూక్ష్మస్య వినాశే సతి వర్ణణః' (మ. వా. ద. 290) సూక్ష్మశరీర నాశ లక్షణము గ్రహింప గారణశరీరము గూడ నశించెనని నిర్ణయము. అట్లు యీ దేహత్రయ నిరాసముగలుగకున్నచో 'మూఢో నానా యోనిషు జాయతే॥' (అద్వై. అ. 44) నానాగర్భములనా అజ్ఞాని జనించుచుండును. కాక 'అనిదమ్ఞం శరీరాది దృశ్యం బుద్బుదవత్ క్షరం' (ఆ. బో. 31) శరీరాది దృశ్యములు అవిద్యాకల్పితము లనియు 'ఏత ద్విలక్షణం విద్యా దహం బ్రహ్మేతి నిర్మలం' (ఆ. బో. 31) వీనికి విలక్షణమైన వాడను నేను, నిర్మల బ్రహ్మస్వరూపుడ ననియు, 'నాహం దేహో న మే దేహః కేవలోఽహం సనాతనః' (బ్ర. అ. 28) అనియు నారూఢ తన్మయుడై యుండువానికే బునరావృత్తిరహితమైన కైవల్యము కరతలామలకము. 'తస్మా ద్దేహత్రయం సద్భిస్తత్త్వాధన నిష్ఠయా। విధ్వంస్యతాం ప్రయత్నేన నిర్వాణసుఖసిద్ధయే॥' (మ. వా. ద. 292) కాన సత్పురుషులు ఆయా సాధనముల నభ్యసించుటచే స్థూలాది శరీరముల మూడింటి, మోక్షసుఖప్రాప్తికై ప్రయత్నముతో నశింపజేయుదురుగాక.

అంత నీ శరీరత్రయముతో సత్యసంబంధముగల జాగ్రదాది అవస్థాత్రయముగూడ నిరాసమొందింపబడి, 'స్వప్నసత్యే యథాఽబోధా ద్దేహాత్మత్వం తథైవ చ। ప్రత్యక్షాదేః ప్రమాణత్వం జాగ్రత్ స్యాదాత్మ వేదనాత్॥' (ఉ. సా. 2.

**11.** 5) ప్రబోధము కలుగు పర్యంతము స్వప్నము సత్యమగు నట్లు ప్రబోధపర్యంతము దేహమే యాత్మ యనుకొనుట సత్యమగును. అట్లు జ్ఞానము కలుగునంతవరకు ప్రత్యక్షాది కము ప్రమాణమగును- గాని, పిమ్మట కాదు అను దృఢ జ్ఞానము గలుగును. అనగా 'స్వాప్నద్వైతవదేవ జాగ్రతమపి ద్వైతం మనోమాత్రకం మిథ్యేత్యేవ విహాయ సచ్చిదమలం స్వాన్త్మైకరూపోస్మ్యహం।' (ప్రౌ. అ 9) స్వప్నమున అనుభ వింపబడు ద్వైతము వలెనే జాగ్రదనుభూత ద్వైతముగూడ మనః కల్పనమే. కాన దీని మిథ్యగా గ్రహించి, త్యజించి, సచ్చిదమల స్వరూపముననే నెలకొనియుండవగును. అట్టి స్థితి నున్నవాడు 'నిర్ద్వైతస్య న హేయ మన్యదపి వా నో వాప్యవే యాంతరం శాంతోఽఽద్యాస్మి విముక్తతోయ విమలో మేఘో యథా నిర్మలః॥' (ప్రౌ. అ. 10) ఈ జ్ఞేయ సముదాయము నా స్వరూపమే యని ఎరిగి, వాయువులేని మహాసాగరమువలె ప్రౌఢుడనై గంభీరుడనై యుందు నను శ్లోకమురీతి అతిప్రశాంత గాంభీర్యమాధుర్యస్థితి తత్ జ్ఞాని యుండును. అవును స్వప్నపురు షుని సుఖదుఃఖాదులు, జాగ్రత్పురుషుని అంటనేరవు గదా!(అ. అ. 45) స్వప్నదృశ్యములు తత్కాలమున సత్యములై దోచి జాగ్రత్తులో నసత్యము లగునట్లు జాగ్రత్తులోని సర్వము తురీయమున నదృశ్యముగదా. అట్లు అవస్థాదులగూడ నతీ తించుట క్రమన్యాయమున నేర్పడును. దానికై తీవ్రయత్నము గూడ అత్యవసరమని మున్నే వక్కాణింపబడి యున్నది.

ఈవిధముగ 'త్వం' పదార్థశోధనమునకై శ్రవణానంతర మననము గావించి, 'బంధస్య హేతుర్మలినం రజోగుణై ర్మోక్షస్య శుద్ధం విరజస్తమస్కం'(వి చూ. 176) రజో గుణ సంసర్గముచే మనస్సు మలినమై బంధహేతు వగుచున్నది. కాని రజస్తమములనుండి దూరమై శుద్ధ సత్వ ప్రధానమగు చున్నదై మోక్షకారణ మగుచున్నదని వచింపబడినట్లు నై శ్రవణ మననములచే జిత్తము శుద్ధమై అనగ సత్త్వప్రధానమై 'ప్రకాశరూపిణీం సత్త్వశక్తిం' (స. వే. సి. సా. 180) అను రీతి ప్రకాశస్వరూపమై యుండొప్పారును. అట్టి సత్త్వభావము గలుగగా 'ప్రసాదస్తేన జాయతే। ప్రసన్నేసతి చిత్తేఽస్య ముక్తిః సిధ్యతి—' (స. వే. సి. సా. 131) దానిచే బ్రసాదస్థితియు, నా ప్రసన్నత్వముచే ముక్తియు గలుగును అనురీతి సాధకుని స్థితియో నొక స్థిరత్వము ఏర్పడుచున్నది. అట్టి శుద్ధ సత్త్వగుణవిభూషితమైన నిస్సంశయావస్థయే నిదిధ్యాసనస్థితియనఁగును. జ్ఞాన మార్గావలంబకుఁడు యిట్లు శ్రవణ మనన నిదిధ్యాసనముల ద్వారమున గుణద్వయము నతీతించి మూడవదియైన సత్త్వమున గాలిమటయేగాక, క్రమమున నీ త్రిగుణములును సత్త్వముతో సహా 'ప్రకృతిసంభవ' (స. అ. 30) ములని గ్రహించి అవి మూఁడును మిథ్యయనియు నటులే 'త్రయమేవం భవేన్మిథ్యా గుణత్రయ వినిర్మితం' (అ. అ 58) త్రిగుణనిర్మిత అవస్థాత్రయముగూడ మిథ్యయనియు దానైన ఆత్మ సర్వాతీతమనియు బరమార్థమును గ్రహించి నిత్యానందస్థితినుండును.

ఈవిధముగ స్వస్వరూపసంధానమును గరతలామలకము నొనరించు జ్ఞానమార్గము కర్మాది సర్వేతరమార్గములే

గంటు సర్వోత్తమముగ నింతవరకు గ్రహించియున్నారము. అందుచే 'జాయత ఇతి జ్ఞానం' తెలియబడునది అను కర్మవ్యుత్పత్తి ననుసరించి స్వస్వరూప జ్ఞానసిద్ధికి 'జాయతేఽనేన జ్ఞానం' దేనిచే దెలియబడునో అను కరణవ్యుత్పత్తి ప్రకారము (ఉ. సా. 2. 18. 56), బాహ్యాకారభేదబుద్ధి నివృత్తి రూపజ్ఞానమార్గము (గీ. భా. 18. 50) ముఖ్యము. ఈ మార్గమున, 'పండా ఆత్మ విషయాబుద్ధి ర్యేషాం తే హి పండితాః॥' (గీ. భా. 2. 11) ఆత్మవిషయ జ్ఞానముగలిగిన పండితులుగా సాధకులు రూపొంద నవకాశ మేర్పడుచున్నది. 'పదయోరైక్య బోధస్తు జ్ఞానవిజ్ఞానసంజ్ఞితం। ఆత్మానాత్మవివేకస్య జ్ఞానమాహు ర్మనీషిణః॥' (స.అ. 47) 'తత్' 'త్వం' పదైక్యబోధయే జ్ఞానము, విజ్ఞానము. అనగా ఆత్మానాత్మ వివేకజ్ఞానమే జ్ఞానము. జ్ఞానమార్గ గమ్యము ఆత్మానాత్మవివేక ద్వారమునగలిగిన విరాగ శమాదిక ముముక్షుత్వముల యనంతర జీవ బ్రహ్మైక్యానుభూతియే యని పూర్వముగాంచియున్నాము. కావున 'ఉద్ధరేత్సంసారసాగరే నిమగ్నమాత్మ నాత్మానం' (గీ. భా. 6. 5) సంసారసాగర మగ్నమైయున్న ఆత్మను ఆత్మచే నుద్ధరించుటకు 'ఆత్మైక విజ్ఞానమే' (కఠ. భా. 2. 8) కారణము గాన, ఆ జ్ఞానముచే 'అమృతత్వం ప్రాప్యతే' (కేన. భా. 2) అమృతత్వసిద్ధి గలుగును. కావున, యీజ్ఞానముచే 'సంసారబీజ మజ్ఞానం కామకర్మ ప్రవృత్తికారణ మశేషతో నివర్తతే' (కేన.భా.ఉ) కామకర్మ ప్రవృత్తికారణమైన సంసారబీజమైన అజ్ఞానము పూర్తిగ నివర్తించును గాన, అది 'నిఃశ్రేయసహేతుత్వం' (గీ. భా. 18. 66) నిశ్శ్రేయసకారణమై యుండుటచే 'జ్ఞాన

నిష్ఠా సుసంపాద్యం' (గీ. భా. 18.50) జ్ఞాననిష్ఠను సంపాదింప వలెను. ఈ జ్ఞానమార్గముచేత మాత్రమే 'న పునర్దేహ మాదదతే' (గీ. భా. 13. 34) పునః దేహప్రాప్తిరూప జననము గలుగదు. శుద్ధికారణమైన సర్వేతర మార్గములకంటె 'బ్రహ్మజ్ఞాన ముత్కృష్టతమం' (గీ. భా. 9. 2) యీబ్రహ్మజ్ఞానమే సర్వోత్కృష్టము. అది అనేకజన్మ సముపార్జిత సంచిత కర్మను గూడ నశింపజేయును. అందుచే 'కేవలా దేవ జ్ఞానా న్మోక్ష ఇత్యేషార్థో నిశ్చితో గీతాసు సర్వోపనిషత్సు చ' (గీ. భా. 3.1) జ్ఞానయోగముచేతమాత్రమే మోక్షమని గీతాశాస్త్రము నందును, సర్వోపనిషత్తులందును నిశ్చయింపబడినదని శంకర తీర్మానము. 'అజ్ఞానస్య నివృత్తిస్తు జ్ఞానేనైవ కర్మణా' (స. వే. సి. సా 510) అజ్ఞాననివృత్తి కర్మచేగాక జ్ఞానముచేత మాత్రమే యగుననియు, 'మోహనివృత్తౌ జ్ఞానం సహాయం' (స్వా ని. 70) మోహరూప అవిద్యా నివృత్తి జ్ఞానాపేక్షచే గదా అగునది! అది యితర మార్గముల నలభ్యము. కావుననే 'అజ్ఞాన సర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా। కిము వేదైశ్చశాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః॥' (వి. చూ. 63) అజ్ఞాన సర్పగ్రస్తునికి బ్రహ్మజ్ఞాన రూప దివ్యౌషధము గాక ఇతరములు వ్యర్థము. వేదశాస్త్రములు, మంత్రజపాదులు ఔషధములు ఎందులకు? అవి 'వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్ర వ్యాఖ్యాన కౌశలం। వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే॥' (వి. చూ. 60) వాక్చాతుర్యము భాషా కౌశలము, వ్యాఖ్యాన పాటవము పాండిత్యములు భుక్తికొరకే. జ్ఞాని ముక్తికొరకుగాదు. అందుచే 'బ్రహ్మైవాహ మిదం'

సర్వం ఇతి విజ్ఞానవహ్నినా । దగ్ధ్వా ద్వైతవనం సమ్యగద్వితీయో భవేన్మునిః॥' (మ. వా. ద. 303) నేనే సమస్తమును అను జ్ఞానాగ్నిచే ద్వైతవనమును దహించి ముని అద్వితీయుడు కావలయును. అందులకై సాక్షాన్మోక్షైక సాధనమైన (అ. బో. 2) సమ్యక్ జ్ఞానమును, భవమోక్ష కారణమైన బ్రహ్మాభిన్నత్వ విజ్ఞానమును (కే. అ. 3) ఆర్జింప యత్నింప వలయును. 'జ్ఞానాన్మోక్షో న కర్మభ్యః' (వే. డిం. 6) మోక్షము కర్మచేగాక జ్ఞానముచేతనే అనియు, 'యోగినో భోగినో వా ఽపి త్యాగినో రాగిణో ఽ పి చ । జ్ఞానాన్మోక్షో న సందేహః ఇతి వేదాంతడిండిమః॥' (వే. డిం. 10) యోగికాని భోగికాని, త్యాగి కాని విషయానురాగికాని, జ్ఞానము చేత మోక్షము నొందుటలో సంశయము లేదనియు శంకర ప్రతిజ్ఞ. అందుచే కర్మలతోగూడిన 'న వర్ణాశ్రమ సంకేతైః న కర్మోపాసనాదిభిః' (వే. డిం. 11) వర్ణాశ్రమాచారములచే గాని, కర్మోపాసనములచేగాని, మోక్షము దుర్లభము గాన నవి వ్యర్థము. అందుచే 'న మతాభి నివేశిత్వాత్ న భాషాఽవేశమాత్రతః' (వే. డిం. 71) మతావేశములచే గాని భాషాభిమానముచేగాని ముక్తికలుగు ననుకొనుట వ్యర్థము గదా. అందుచే రూఢిగ 'నాన్యోఽ స్తి పంథా భవబంధ ముక్త్యై ర్వినా స్వ తత్త్వావగమం సుసూక్ష్మం' (కే. అ. 1) అత్యంత సూక్ష్మమగు ఆత్మజ్ఞానమునగాక సంసారబంధ ముక్తి నొసంగు ఉపాయము అన్యములేదు. ఇది 'జ్ఞానం ప్రత్యక్ష సత్ఫలం' (వే. డిం. 10) ప్రత్యక్ష ఫలహేతువగుటచే 'జ్ఞానమే వాశ్రయేత్తస్మాత్ ఇతి వేదాంత డిండిమః' (వే. డిం. 20) జ్ఞానమే

అవలంబనీయ మని వేదాంత భేరి మ్రోగించు చున్నది. ఆ డిండిమనాదము ముముక్షులోక కర్ణముల ప్రవేశించి వారికి హృదయ పరివర్తనము గావించుగాత !

---

## సన్న్యాసము

ఈ విధముగ జ్ఞానమార్గావలంబనమునకే గాక మోక్ష ప్రాప్తికి 'న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి' (స. వే. సి. సా. 148) సన్న్యసింపనిచో సిద్ధిని బొందజాలరు అని శంకర విశ్వాసము, నిశ్చయము. సన్న్యాస తాత్పర్య, అవసర అధికారములను గూర్చియు మరియు నింక అనేక వివరము లతో సన్న్యాసమును పూర్వము సమీక్షించి గ్రహించి యున్నారము. శంకర భగవత్పాదాచార్యులు సన్న్యాసమున నతి విశ్వాసముంచి యుండుట చేతనే చిరుప్రాయంబున, ఏక పుత్రుడై యుండియు, మాతృదేవితో గూడిన ప్రపంచమును వర్జించి సన్న్యసించి యున్నాడు. కాలాంతరమున గూడ నాసన్న్యాస విశ్వాసముతోడ శిష్యులకు సన్న్యాసదీక్ష నొసంగి, పీఠ చతుష్టయమును నెలకొల్పి, ఒక విశిష్ట సన్న్యాస సంప్రదాయ మును, బౌద్ధము తర్వాత స్థాపించి యుండుటయు గాంచి యున్నాము. 'సర్వకర్మ సంన్యాసేనైవ జ్ఞాననిష్ఠాకార్యా ఇతి సిద్ధం' (గీ. భా. 18. 55) సర్వకర్మ సన్న్యాసము జ్ఞాన నిష్ఠా కార్యము నీకనుష్ఠేయముగ సిద్ధమనియు, అదియే గీతా శాస్త్ర తాత్పర్యమనియు (గీ. భా. 2. 21), అంతియగాక,-

'అతో న గార్హస్థ్య ఏవాకుర్వీత ఆసనముత్పన్న విద్యస్య' (ఐ. భా. ఉ) కర్మాతీతమైన జ్ఞాని గార్హస్థ్యమును నిర్వర్తింప నేరడు గాన 'అవిదుషాపి ముముక్షుణా పారివ్రాజ్యం కర్తవ్యమేవ' (ఐ. భా. ఉ.) ముముక్షువు అనువాడు అవిద్వాంసుడైయున్నను సన్న్యాసము అవసరమగునని శంకర నిశ్చయము.

ఈ విషయ నిర్ధారణము పూర్వమే వచింపబడి తీర్మానింపబడియున్న శ్రుతి స్మృతి తాత్పర్యము ననుసరించుటయు విస్పష్టము. 'ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయా శ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి' (బృ. 3. 5) ఈ ఆత్మజ్ఞానమును బొంది బ్రాహ్మణులు పుత్ర విత్త లోకేషణముల ద్యజించి పరివ్రాజకు లగుదురు అను శ్రుతివాక్యమునకు భాష్య రచనమున 'తస్మాత్పూర్వే బ్రాహ్మణా బ్రహ్మవిదో వ్యుత్థాయ కర్మభ్యః, కర్మసాధనేభ్య శ్చ యజ్ఞోపవీతాదిభ్యః పరమహంస పారివ్రాజ్యం ప్రతిపద్య భిక్షాచర్యం చరంతి' పూర్వము బ్రహ్మవిదులైన బ్రాహ్మణులు కర్మలను తదుపకరణములైన యజ్ఞోపవీతాదులను ద్యజించి పరమహంస పరివ్రాజకులై భిక్షాటనాదికవృత్తి నుందురనెడు అనాదికాలగత సన్న్యాస సంప్రదాయ కథనమును స్మరించుచు, 'జ్ఞానమాత్రే యద్యపి సర్వాశ్రమిణా మధికారః తథాపి సంన్యాసనిష్ఠైవ బ్రహ్మవిద్యా మోక్షసాధనం' (ముం. భా. ఉ.) జ్ఞాన సముపార్జనమున సర్వాశ్రమస్థులకు అధికారమున్నను, ముక్తికారణమైన బ్రహ్మజ్ఞానమునకు సన్న్యాసికే అధికారమను

వాక్యము ననుసరించియు, 'తస్మా దిదం త్యక్త సర్వ బాహ్యైషణై రనన్యశరణైః పరమహంస పరివ్రాజకైః అత్యా శ్రమిభి ర్వేదాంత విజ్ఞానపరై రేవ వేదనీయం పూజ్యతమైః' (ఛాం. భా. 8. 12. 1) అందుచేత పరమహంసలును, బాహ్య విషయముల సంపూర్తిగ విసర్జించినవారును, బ్రహ్మేతరశరణము లేనివారును, అత్యాశ్రములును, వేదాంత విజ్ఞానపరులును, పూజ్యులును అగు సన్న్యాసులకే ఆత్మైకత్వజ్ఞానము గలుగు నని శంకర తీర్మానము.

నీరక్షీర విభాగమును హంసమాత్రమే చేయగలుగు నట్లు, ఆత్మానాత్మ విభాగమును జేయగలవాడై పరమహంస యగుచున్నాడు (అ. అ. 77). శ్రుతులలో గూడ 'ప్రవృత్తి శ్చ నివృత్తి శ్చ ద్వే ఏతే శ్రుతిగోచరే' (201) ప్రవృత్తి నివృత్తు లను రెండుమార్గములు గలవు. అందు 'ప్రవృత్త్యా బధ్యతే జంతు ర్నివృత్త్యా తు విముచ్యతే' జీవులప్రవృత్తి బంధించును. నివృత్తి ముక్తినొసంగును గాన 'నివృత్తిః కర్మసంన్యాసః కర్తవ్యో మోక్షకాంక్షిభిః' (స. వే.సి. సా. 202) కర్మసన్న్యాస రూపమైన నివృత్తి మోక్షాపేక్షగలవారికి గర్తవ్యము. అందుచే వివేకులగువారు ప్రథమతః దీనికై యత్నింపవలెను (స. వే.సి.సా. 91). 'త్యక్త్వా బాహ్యమిదం మనోనిలయనం తుచ్ఛం మృషేతి స్వయం' (మ. వా. ద. 214) మనోనిలయమై భ్రాంతిసిద్ధమైన యీ బాహ్యప్రపంచమును త్యజించి 'జగ ద్భావం పరిత్యజ్య బ్రహ్మమాత్రత్వ భావనా' (మ. వా. ద. 300) జగద్భావమును బోనాడి బ్రహ్మభావమును అవలంబింప వలెనుచో, 'త్యక్త్వా త్మానం సదానందం విషయాన్ యస్తు

సేవతే' (మ. వా. ద. 207) సదానందమైన ఆత్మను వదలి విషయముల సేవించుట అనగా 'యస్స్వాత్మసుఖ ముత్సృజ్య సుఖం బాహ్యమపేక్షతే' (మ. వా. ద. 208) ఆత్మసుఖంబును వీడి బాహ్యసుఖమును గోరుటయు, 'కరస్థం పాయసం త్యక్త్వా స మూఢో లేఢి కూర్పరం' (మ. వా. ద. 208) చేతనున్న పాయసమును వదలి మోచేతిని నాకుచున్నట్లు అగుటయేగాక, 'పిపాసార్థం సుధాం త్యక్త్వా గరళం పాతు మిచ్ఛతి' (మ. వా. ద. 207) దాహశాంతికై అమృతమును వదలి విషము గ్రహింప గోరుటవంటిదై స్వాత్మహానికరముగ నుండునని శంకరుని హెచ్చరిక. అందుచే 'సంన్యస్య సర్వ కర్మాణి భవబంధవిముక్తయే' (వి. చూ. 10) సంసారబంధ విముక్తిగోరు ధీరుడు సర్వకర్మలను బూర్తి దవ్యజింపవలెను అని శంకర ప్రబోధ. 'జ్ఞానం సంన్యాస లక్షణం' (గీ. భా. ఉ) అనిగదా ఆర్యోక్తి.

ఈవిధముగ పండితులై వేదాంతార్థతత్పరులై విగత దోషులైన సన్న్యాసులకే ఆత్మానుభూతి శక్యము గాన (మాం, భా. 2. 35), అట్లు 'మోక్షైక సక్త్యా విషయేషు రాగం నిర్మూల్య సంన్యస్య చ సర్వకర్మ' (వి. చూ. 184) మోక్షైక కాంక్షచే విషయముల ద్రోసి సర్వకర్మ పరిత్యాగము గావించిన పారివ్రాజిక సంస్థితుల నుల్లేఖించుచు, శ్రుతిప్రోక్త కుటిచక, బహూదక, హంస, పరమహంస సన్న్యాసములగూర్చి శంకరుడు వివరించియున్నాడు (బ్ర. సూ. భా. 3. 4. 49).

శంకరాభిప్రాయమున సన్న్యాస నియమములు ఎట్లున్నవో గూడ నొకించుక చూచెదముగాక. 'త్యజాభిమానం కుల

గోత్ర నామ రూపాశ్రమే ష్వార్ద్రశవాశ్రితేషు। లింగస్య ధర్మానపి కర్తృతాదీం స్త్యక్త్వా భవాఖండ సుఖస్వరూపః॥' (వి. చూ. 298) జీవచ్ఛవమగు నీ శరీరము నాశ్రయించుకొని యుండు కుల గోత్ర నామరూపములను ఆశ్రమాధిక అహం మమాది అభిమానమును త్యజింపుము. కర్తృత్వాది లింగశరీర ధర్మములగూడ వీడి అఖండానందైక స్వరూపుడవై యుండుము. జాతికులాశ్రమవిధుల ద్యజింపుము (వి. చూ. 378, ఉ. సా. 2. 15. 8) మొదలగు అసంఖ్యాక వాక్యముల ద్వారమున సన్న్యాసపూర్వమగు జాతి కుల ఆశ్రమవిధులను ఆచారములను త్యజింపవలయునని శంకరుడు హెచ్చరిక గావించి యుండుట స్పష్టము. ఈవిధముగ స్వాశ్రమ వర్ణ ధర్మపరిత్యాగమున సన్న్యాసికి ప్రత్యవాయము గలుగదా అని శంకించుకొని శంకరుడు 'పరివ్రాజకస్య తు సర్వకర్మ సంన్యాసాత్ । ప్రత్యవాయో న సంభవతి' పరివ్రాజకునకు సర్వకర్మ సన్న్యసము వలన కర్మానుష్ఠాన నిమిత్తమైన ప్రత్యవాయము సంభవింపదు అని వచించి, 'అనుష్ఠాన నిమిత్తః శమదమాదిస్తు తదీయో ధర్మో బ్రహ్మసంస్థితాయా ఉపోద్బలకో న విరోధః' (బ్ర. సూ. భా. 3. 4. 20) అతనికి విహితమైన ధర్మమగు శమాదికము బ్రహ్మసంస్థ కుపయుక్తమేగాని విరోధికాదు కాన అతనికి శమాదులే ఆశ్రమధర్మములని నిర్ణయించి యున్నాడు. మహావాక్య దర్పణమున సన్న్యాసవిధుల ప్రస్తావించి కర్మాదులు మోక్షహేతువులుగాకుంట వాని నిషేధించి (224), 'సన్న్యస్య శ్రవణం కుర్యాత్' (225) అను స్మృతి వాక్యము నాధారముగగొని 'విధత్తే శ్రవణం భిక్షో ర్మోక్షు

మాత్రైకకాంక్షిణః' (225) ముక్తినిమాత్ర మపేక్షించు సర్వకర్మ పరిత్యాగికిమాత్రమే శ్రవణము విధింపబడినది. కాన 'అయమేవ యతేర్ధర్మః కర్తవ్యో మోక్షకాంక్షిణః । నైవ స్నానం నాపి జపో న పూజాపి న కీర్తనం॥' (226) మోక్షకాంక్షగల యతికి కర్తవ్యము ఏదనగ, స్నానముగాదు జపము గాదు, దేవతార్చనవిధులు కాదు. కీర్తనముగూడ కాదు. వేదాంతశ్రవణవిధిగాక 'యత్నేర్న కార్యం కర్మ కించన' (228) యతికి కర్మ జేయుదగినదికాదు. ఆశ్రవణముమాత్రమే బ్రహ్మాత్మైక బోధకు కారణము (229). కాన 'తత ఆలస్యముత్సృజ్య శతధాపి సహస్రధా । కర్తవ్యం శ్రవణం భిక్షోర్నికటే బ్రహ్మవిద్గురోః॥' (231) మోక్షేచ్ఛగల సన్న్యాసి యాలసింపక బ్రహ్మనిష్ఠుడైన గురువునాశ్రయించి జీవబ్రహ్మైక్య జ్ఞానము దృఢమగునంతవరకు నూరు మారులైనను, వేయి మారులైనను వేదాంత వాక్య శ్రవణము గావింపవలెనుగాని వర్ణాశ్రమాచార విధులు అవిద్యా హేతువులు గాన పరిత్యాజ్యములు అని బోధింపబడియున్నది. కావున 'కిము వక్తవ్యం బ్రహ్మచర్యాదేవ సన్న్యస్య యావజ్జీవం యో బ్రహ్మణ్యేవావతిష్ఠతే స బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి' (గీ.భా. 2. 72) బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి, యావజ్జీవము బ్రహ్మనిష్ఠలో నున్నవాడు బ్రహ్మనిర్వాణమును బొందునని వేరుగజెప్ప వలయునా?

ఈవిధముగ జీవబ్రహ్మైక్యసాధన మార్గములలో జ్ఞానమార్గ ముత్కృష్టమై తదవలంబనమునకు సర్వాశ్రమములలో సన్న్యాసము అత్యవసరముగ నుండుటయు, అందు మరల

సంచిత అవిద్యాజనిత వర్ణాశ్రమాచార కర్మా కలాపము అభావమై, కేవల మహావాక్య శ్రవణ మనన నిదిధ్యాసనమే ధర్మమై, ఆసాధనా బలముననే బ్రహ్మానిర్వాణము సాధ్యమను పరమ తాత్పర్యమును శంకర జగద్గురువు శ్రుతి యుక్తతాత్ప ర్యముల ననుసరించియే తీర్మానించి యుండుట నిస్సందేహము. అందుచే సర్వ ముముక్షుకోటికి, అదియే విధియగుటచే పరమ కర్తవ్యము ధర్మమునై చెల్వొందుచున్నది. దాని నెల్ల రవలం బించి తరించెదరు గాక.

---

# అద్వైతసిద్ధి - సిద్ధుడు

'యస్య ప్రసాదాదహమేవ విష్ణు ర్మయ్యేవ సర్వపరి కల్పితం చ। ఇత్థం విజానామి సదాత్మరూపం తస్యాంఘ్రియుగ్మం ప్రణతోస్మి నిత్యం॥' (అద్వై.అ.2) నేనే విష్ణువును. విష్ణుస్వరూ పుడనగు నాయందే విశ్వమంతయును పరికల్పితము అను జ్ఞానము ఎవని కృపచే లభ్యమో, మరియు నెవ్వాడు నిత్యాత్మ స్వరూపుడో, అతని పాదపద్మములకు నిత్యము నమస్కరించు చున్నాను. అట్టి శుద్ధాద్వైతస్థితిని అనగా 'సర్వేషు భూతేష్వేవ లోకశ్చ స్వం, సర్వాణి భూతాన్యపి చాత్మని స్వేస్వమేవ సర్వం సమవేక్ష్య పశ్చాత్, సర్వాత్మనా తిష్ఠతి యస్స ముక్తః॥' (మ. వా. ద. 219) సర్వేతరవస్తువుల ఆత్మయందును, ఆత్మను సర్వభూతములందును అవలోకించి పిదప సర్వమును స్వాత్మ గనే గ్రహించి సర్వాత్మస్థితిలో నెవడుండునో వాడు ముక్తుడు

అనుచందము 'నిత్యం సదానందరసానుభూతి మభిన్నవృత్త్యాత్మని కుర్వతాం సతాం। ఇంద్రస్య లోకేన కిమబ్జయోనేః కిం వా హరేః కిం ను శివస్య సాక్షాత్॥' (మ. వా. ద. 244) అభేదవృత్తి ఆత్మానుభూత ఆనందరసమును సదా గోలు సత్పురుషులకు ఇంద్రలోకముతో నేమి ప్రయోజనము? బ్రహ్మలోకముతో నేమి లాభము? విష్ణులోకముతో నేమి ప్రయోజనము? సాక్షాత్ శివుని కైలాసముతోగూడ నేమి ప్రయోజనము అని స్తుతింపబడిన బ్రహ్మాత్మైక్యానంద స్థితిని 'సమాధీయతేఽస్మిన్నితి వా సమాధిః' (మాం. భా. 3. 37) ఆత్మయందు మనస్సు కేంద్రీకరించును గాన సమాధి యనురీతి సమాధి యని యనబడును. 'నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః। వృత్తివిస్మరణం సమ్యక్ సమాధిర్జ్ఞానసంజ్ఞికః॥' (అ. అ. 124) నిర్వికారవృత్తిచేత మరల బ్రహ్మాకారత్వముగా పూర్తి ధ్యేయాకారవృత్తి శూన్యముగా నుండుట జ్ఞానమనెడు సమాధియగును అని సమాధినిర్వచనము, వివరణము. అది చిత్తవిభ్రమముగాక 'తత్రైవ బ్రహ్మణి సదాచిత్తవిశ్రాంతిరిష్యతే॥' (ని.మా.పూ 23) బ్రహ్మమున చిత్తముసదా విశ్రాంతి నుండు స్థితియనియు వివరణము. అట్టి సమాధినిష్ఠునకే సుఖమనియు (ప్ర.ఉ.ర.4), నందుచేతనన 'స్వాత్మన్యారోపితాశేషాభాసవస్తు నిరాసతః। స్వయమేవ పరం బ్రహ్మ పూర్ణమద్వయమక్రియం॥' (వి. చూ. 398) స్వాత్మయందు దారోపింపబడిన మిథ్యావస్తునిరాకృతిచే బరిపూర్ణమును అద్వితీయమును అక్రియమును అగు బరబ్రహ్మము తానైయుండును గదా. అందుచేత 'ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానందతత్పరః। సమాధిం

సర్వదా కుర్యాత్ --' (వా. సు. 22) నామరూపముల రెంటిని త్యజించి, సచ్చిదానంద తత్పరుడగుచు సర్వకాలముల సమాధి నభ్యసింపవలెను. అనగా 'తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనం। ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః॥' (ల. వా. వృ. 17) ఆత్మబ్రహ్మైక్యమునుగూర్చి సర్వదా చింతించుట, పలుకుట, ప్రబోధించుట అందే తన్మయమగుటయే బ్రహ్మాభ్యాసమని పండితులు వాకొందురు. అట్టిస్థితికై 'సమాధిషట్కం కుర్వీత సర్వథా ప్రయత్నో యతః' (స. వే. సి. సా. 900) యతులు యీ సమాధిషట్కమును సదా చేయుచుండవలయునని శంకరాదేశము. కాన 'అతశ్చిత్తం సమాధే హి ప్రత్యగ్రూపే పరాత్మని॥' (వి. చూ. 408) ప్రత్యగాత్మరైన పరాత్మయందు చిత్తమును నిలుపుము అని చూడామణి బోధ. ఆస్థితి 'వృత్తి విస్మరణం సమ్యక్' (స. వే. సి. సా. 921) అని యనబడుటచే 'సంకల్ప మున్మూలయ సావధానః' (యో. తా. 19) సావధానుడవై సంకల్పముల నిర్మూలింపుము. కాన 'పశ్య న్నుదాసీనతయా ప్రపంచం' (యో. తా. 19) ప్రపంచమును ఉదాసీనవృత్తితో గాంచుచుండుము అని ఆ జాగ్రత ముఖ్యముగ హెచ్చరిక జేయబడినది. ఎందుచేతననగా 'అతీవ సూక్ష్మం పరమాత్మతత్త్వం' (వి. చూ. 361) పరమాత్మతత్త్వము అతిసూక్ష్మము. కావున స్థూలదృష్టికి దాని అనుభూతి దుర్లభము. దాని గ్రహింప 'సమాధినాత్యంత సుసూక్ష్మవృత్త్యా జ్ఞాతవ్యమార్యై రతిశుద్ధ బుద్ధిభిః' (వి. చూ. 361) సమాధివలన నుత్పన్నమైన అత్యంత సూక్ష్మవృత్తివలన మిక్కిలి నిర్మల

బుద్ధిగల మహనీయులకు మాత్రమే సాధ్యము. ఇంతకాలము అవిద్యమానమైన విషయాది విభేదకల్పనమున ప్రవీణమైయున్న సంసృతి కారణమైన 'మనః నిగృహ్య సర్వైః సహాత్మని స్వస్మిన్ రమస్వాత్మసుఖేన నిత్యం' (మ. వా. ద. 202) మనస్సును సమస్త యింద్రియములతో సహా నిగ్రహించి ఆత్మసుఖమున నానందింపవలెనని మహావాక్యోపదేశము.

కాని 'సమాధౌ క్రియమాణే తు విఘ్నా ఆయాంతి వై బలాత్। అనుసంధానరాహిత్య మాలస్యం భోగలాలసం॥ (12) లయ స్తమశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా। ఏవం యద్విఘ్నబాహుళ్యం త్యాజ్యం బ్రహ్మవిదాశనైః॥' (అ. అ. 128) సమాధి నభ్యసించు వేళ విఘ్నము లనేకములు గలుగును. అనుసంధానరాహిత్యము, ఆలస్యము, భోగేచ్ఛ, నిద్ర తమస్సు, విషయగోచరము, కించిన్మాత్రానందస్ఫూర్తి, శూన్యత్వము మొదలగు విఘ్నబాహుళ్యముల బ్రహ్మవేత్తలు క్రమముగా త్యజింపవలెను. వాని నట్లు జయించి తన్మయత్వమున నున్న వానికి 'యస్య చిత్తం నిర్విషయం హృదయం యస్య శీతలం। తస్య మిత్రం జగత్సర్వం తస్య ముక్తిః కరస్థితా॥' (స. వే. సి. సా. 371) నిర్విషయ చిత్తము ఎవనికి గలదో, ప్రశాంత హృదయము ఎవనిదో, అతనికి సర్వజగత్తు మిత్రులే. అతనికి ముక్తి కరతలామలకమగును. అతడు అద్వితీయుడు అచంచలుడు.

---

## సమాధి స్వరూపము

పూర్వము 'సమాధిషట్కం కుర్వీత' (స. వే. సి. సా. 900) సమాధి షట్కము నభ్యసింపుము అని తెలుపబడి యున్నది. అందుచే, సమాధిరూపములు షడ్విధములని విదితము. ప్రథమతః 'సవికల్పో నిర్వికల్పః సమాధి ర్ద్వివిధో హృది' (వా. సు. 23) 'సవికల్పో నిర్వికల్ప ఇతి ద్వేధా నిగద్యతే సమాధిః' (స. వే. సి. సా. 819) అను రీతి సమాధి సవికల్ప నిర్వికల్పాత్మకముగ ద్వివిధము. అందు 'దృశ్య శబ్దానువేధేన సవికల్పం పునర్ద్విధా' (వా.సు. 23) సవికల్పము దృశ్యానువిద్ధము శబ్దానువిద్ధము అనుచందుము మరల రెండు విధములు. ఈ రీతిగ దృశ్య శబ్దానువిద్ధములు నిర్వికల్పము జేరి సమాధులు త్రివిధము లైనవి. అవి బాహ్యాంతర భేదమున ద్వివిధమై మొత్తమునకు షడ్విధములుగ రూపొంది యున్నవి.

వానిలో 'కామాద్యాశ్చిత్తగా దృశ్యా స్తత్ సాక్షిత్వేన చేతనం। ధ్యాయేత్ దృశ్యాను విద్ధోఽయం సమాధిః సవికల్పకః॥' (వా. సు. 24) కామాదులు మనోధర్మములు. అవి దృశ్యములు. వాని నట్లు భావించి యీ దృశ్యములకు సాక్షియైన ఆత్మను చైతన్యయుక్తముగ ధ్యానించుటచే నేర్పడు సమాధి దృశ్యానువిద్ధ సవికల్పక సమాధి యని యందురు. 'కామాది ప్రత్యయై ర్దృశ్యైః సంసర్గో యత్ర దృశ్యతే। (830) 'సో యం దృశ్యానువిద్ధః స్యా త్సమాధిః సవికల్పకః' (స. వే. సి. సా. 831) కామాది ప్రత్యయములకును దృశ్యములకును ఎచట సంసర్గము గోచరమో అది దృశ్యానువిద్ధ

మనియు తాత్పర్యము. ఇక శబ్దానువిద్ధమన 'అసంగః సచ్చిదానందః స్వప్రభో ద్వైతవర్జితః। అస్మీతి శబ్దవిద్ధోఽయం సమాధిః సవికల్పకః॥' (వా. సు. 22) అసంగుడును, సచ్చిదానందుడును, స్వప్రకాశుడును, ద్వైతవర్జితుడును అగు ప్రత్యగాత్మయే నేను అని నిరంతరధ్యానము గావించుటచే గలుగు సవికల్ప సమాధినే శబ్దానువిద్ధమని అందురు. ఇది దృశ్యానువిద్ధానంతర స్థితి. ఈ రెండును బాహ్య సవికల్పకరూపకములు. 'హృదీవ బాహ్యదేశేఽపి యస్మిన్ కస్మింశ్చ వస్తుని సమాధి రాద్యః సన్మాత్రా న్నామరూప పృథక్ కృతిః॥' (వా. సు. 27) హృదయమున జిత్తమును దాని ధర్మములను దృశ్యములుగ నెంచి, వీని సాక్షిగ ఆత్మను ధ్యానించినట్లు, బాహ్యమున గూడ సూర్యాది వస్తువుల సన్మాత్రమునుండి నామరూపముల వేరొనర్చి, వాని సన్మాత్రముగ భావించి, దేనిచే ఏకత్వదృష్టి లభించునో అదియే దృశ్యానువిద్ధము. అఖండైకరస స్వరూపమై సర్వభేదవివర్జితమై యొప్పు సచ్చిదానందమును అవిచ్ఛిన్నముగ చింతించుటచేగలుగు సమాధి శబ్దానువిద్ధము (వా. సు. 28). 'స్వానుభూతి రసావేశా ద్దృశ్యశబ్దా వుపేక్ష్య తు। నిర్వికల్పః సమాధిః స్యా న్నిర్వాతస్థిత దీపవత్॥' (వా. సు. 26) స్వానుభూతి రసావేశమున ఏకత్వము నొంది దృశ్యములగు కామాదులను, అసంగత్వాది శబ్దములనుండియు చిత్తము విడివడి నిర్వాత నిష్కంపక దీపికవలె వెలయు స్థితి నిర్వికల్పము అగును. అనగా 'స్తబ్ధీభావో రసాస్వాదవత్ తృతీయః' (వా. సు. 29) బ్రహ్మరసాస్వాదనమున వెలికి గోచరించు నిశ్చలత్వమే తృతీయమైన నిర్వికల్పము.

తనకంటె నన్యములుగఁ దోచు సమస్త చరాచర దృశ్యముల తనయందే జనించినట్లును, అందుచే నా పరబ్రహ్మము తానే యని గాంచుట బాహ్యదృశ్యానువిద్ధము నాబడును. బాహ్యమున గోచరించు సర్వ నామములు తా గానని, తద్విలక్షణమైన పరబ్రహ్మవస్తువు తానని యోచించుట బాహ్యశబ్దానువిద్ధ సవికల్పకము. కామాదివృత్తులు తా గానని నిగ్రహించి వీనికి విలక్షణమైన బ్రహ్మము తానే యని భావించుట అంతర్దృశ్యానువిద్ధసవికల్పసమాధి యగుచుండ, కామక్రోధాది సర్వాంతరముల నామముల తా గానని త్యజించి, సర్వవిలక్షణమైన బ్రహ్మము తానుగా నూహించుట అంతరశబ్దానువిద్ధ మగును. పై చతుర్విధ సవికల్పసమాధులలో సుస్థిరత గడించి, బాహ్యాభ్యంతరమగు ద్వైతమును గాంచక నేకత్వము నొందుట బాహ్యనిర్వికల్పసమాధి. అసలు వృత్తియే లేక అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపము తానే అయి యుండుట అంతరనిర్వికల్పసమాధి యని షట్సమాధుల వివరణము.

సవికల్పసమాధిని దీర్ఘకాలము నిరంతరము సంస్కారపూర్వకము గావింప నిర్వికల్పము సిద్ధించును (స. వే. సి. సా. 874). అచట 'దృశ్యస్యాపి చ సాక్షిత్వాత్సముల్లేఖనమాత్మని। నివర్తకమనోవస్థా నిర్వికల్ప ఇతీర్యతే॥' (స. వే. సి. సా. 883) దృశ్యములకుగల సాక్షిత్వమునుగూడ ఆత్మకు నివర్తింపగల మనోఽవస్థ నిర్వికల్పముగా నిర్వచనము. అనగా 'నిర్వికల్పం పరం బ్రహ్మ యత్తస్మిన్నేవ నిష్ఠితాః॥' (స. వే. సి. సా. 877) పరంబ్రహ్మమున సుప్రతిష్ఠితము గావుటయే నిర్వికల్పముగా

వివరణము. అచట 'జ్ఞాత్రాది భావముత్సృజ్య జ్ఞేయమాత్రస్థితి ర్దృఢా। మనసో నిర్వికల్పః స్యాత్॥' (స. వే. సి. సా. 823) జ్ఞాత్రాది త్రిపుటిలేక జ్ఞేయమైన బరబ్రహ్మమున చిత్తము స్థిరమై యుండుటయే నిర్వికల్పము అనియు వివరణము. అచ్చట బ్రహ్మానంద రసావేశమున ఆత్మలో వృత్తులు లయించి ఏకావస్థ నుండుననియు వేదాంతసార సంగ్రహము. 'అజ్ఞాన హృదయగ్రంథే ర్నిఃశేష విలయస్తదా। సమాధి నాఽవికల్పేన యదాద్వైతాత్మ దర్శనం॥' (వి. చూ. 354) అజ్ఞాన గ్రంథులు నిశ్శేషముగ వీడిపోవగ అప్పుడు నిర్వికల్ప సమాధిలో అద్వితీయాత్మ స్వయం ప్రకాశమై స్ఫురించును. అచట నిక స్వపరభావములు లేక 'స్ఫుటం బ్రహ్మతత్వ మవగమ్యతే ధ్రువం' (వి. చూ. 366) స్ఫుటముగ నిశ్చయముగ బ్రహ్మతత్త్వము స్ఫురించును. అందుచే 'స్వతో ఽద్వయానంద రసానుభావకః' (వి. చూ. 363) స్వయముగ అద్వయానంద రసానుభూతి సిద్ధించును. ఈ యనుభవసిద్ధి యనంతరము 'న హ్యస్తి విశ్వం పరతత్త్వబోధా త్సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే' (వి. చూ. 405) నిర్వికల్ప సచ్చిదానంద పరమాత్మయందు ప్రపంచభ్రాంతి ఎప్పటికిని గలుగదు.

ఈ విధముగ వివరింపబడియున్న అద్వైతానుభూతి యగు నిర్వికల్పము ననుభవింప గోరువాడు, 'ఏతైః సమాధిభిః షడ్భి ర్నయేత్ కాలం నిరంతరం' (వా. సు. 29) ఈ ఆరు విధములగు సమాధిసుఖము నాస్వాదించుచు కాలము గడుపుచుండవలెను. అభ్యాసము స్థిరమైనచో 'దేహాభిమానే గలితే విజ్ఞాతే పరమాత్మని। యత్ర యత్ర మనో యాతి తత్ర

తత్ర సమాధయః॥' (వా. సు. 30) దేహాభిమానము తొలగి బ్రహ్మజ్ఞానము సిద్ధింప, మనసు ఎటకు వెడలినను అట నేదో యొక సమాధిస్థితిలో నుండును. దీనినే నిత్యసమాధి యనియు నందురు. అనగా నిట జడత్వము శారీరక అవశత్వ ములు లేక నిత్యాద్వైత సమాధిలో నిర్విక్షేపమున జ్ఞాని యుండునని యర్థము.

---

## బ్రహ్మజ్ఞాని

'స్వయం బ్రహ్మా స్వయం విష్ణుః స్వయమింద్రః స్వయం శివః । స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్య న్న కించన॥' (వి. చూ. 389) బ్రహ్మజ్ఞానప్రాప్తి బిమ్మట, బ్రహ్మ విష్ణు ఇంద్ర శివాది దేవులును, సర్వప్రపంచముగూడ స్వస్వరూపమేయై అన్యము కొంచెమేని యుండదని సంస్తుతింపబడిన బ్రహ్మ విదుడు 'అభిమానాభావాత్ చ సమ్యగ్దర్శనః' (బ్ర. సూ. భా. 2. 3. 48) వ్యష్టిరూపమైన అభిమాన లేమిచే సమ్యగ్దర్శనుడై రాగద్వేషము లదృశ్యముకాగా, (బ్ర. సూ. భా. 1. 3. 2) ద్వైతవివర్జితుడై (మాం. భా. 1. 7. 18), తూష్ణీభూతుడై, 'విషయ సుఖేష్వసంగతయా శాంతః' (వి. స. భా. 75) విషయ సుఖసంబంధము లేమిచే శాంతుడై యుండును. అపుడు సర మోపశాంతుడై 'న ఖిద్యతే నో విషయైః ప్రమోదతే న సజ్జతే నాపి విరజ్యతే చ। స్వస్మిన్సదా క్రీడతి నందతి స్వయం, నిరంతరానంద రసేన తృప్తః॥' (వి. చూ. 537) శబ్దాది విష

యములచే ఖేదమోదముల జెందడు. ఎందును ఆసక్తి విరక్తుల నుండడు. సదా ఆత్మారాముడై ఆనందరస సంతృప్తి విహరించు చుండును. కాన నతనికి ఇష్టానిష్టార్థము లుండవు గాన 'న హృష్యతి న శోచతి' (మ. వా. ద. 212) అంత 'బంధమోక్షాది సర్వవ్యవహార పరిసమాప్తి' (బ్ర. సూ. భా. 1.2. 6) ఏర్పడి, జ్ఞానముచే బూర్వాజ్ఞాన వినాశమున 'జ్ఞానాజ్ఞానే పరిత్యజ్య జ్ఞానమే వావశిష్యతే' (స. ఆ. 5) జ్ఞానాజ్ఞానములు రెండును పరిత్యజింపబడి బ్రహ్మమొక్కటియే శేషించును. మానుష మహిష శ్వాన సూకరాదిక సర్వజీవరాసులలో బరమాత్మనే దర్శించుచు (ప్ర. సు 132), మిథ్యాభూతమైన 'ద్వైతాద్వైతవివర్జితే సమరసే'(ప్రౌ.అ.11) ద్వైతాద్వైతములు లేక సమరసమున అద్వయానందమున 'మౌనం పరం సమ్మతం' (ప్రౌ. అ. 11) మౌనమే సమ్మతమని అచంచలుడై యొప్పారును.

యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః।
న వై తస్య భవేన్మోహో న చ శోకోఽద్వితీయతః॥' (అ. అ. 54) ఎందు సకలభూతముల నాత్మగ గాంచుచున్నాడో ఆస్థితిలో నిక వానికి శోకమోహములెచ్చట ? అది అద్వితీయస్థితి. ఇక నతనికి భయాదు లెచ్చట? (ఉ. సా. 2. 17. 43). అందుచే 'విక్షేపజనిత దుఃఖనివృత్తి' (వి. చూ. 348) బొందినవాడై, 'ఏకంచ సర్వమాత్మాన మీక్షతే జ్ఞానచక్షుషా' (ఆ. బో. 47) జ్ఞాననేత్రముల సర్వమును ఏకాత్మగ దర్శించుచు సమ్యగ్విజ్ఞానమున 'గచ్ఛం స్తిష్ఠ న్నుపవిశన్ శయనో వాన్యథాపి వా।
యథేచ్ఛయా వసేద్విద్వాన్ ఆత్మారామః సదా మునిః॥'

(వి. చూ. 529) నడుచు నప్పుడు, కూర్చుండు నప్పుడు, విశ్రమించు వేళ, శయనించు సమయమున, సర్వక్రియాసమయములం దాత డాత్మారాముడై స్వేచ్ఛతో వర్తించును. నిరంతరాభ్యాస వశమున పక్వమైన యోగుని 'బ్రహ్మానందసుఖం సక్త్వాసతి బ్రహ్మణి తిష్ఠతి' (మ.వా.ద. 253) బ్రహ్మానంద సుఖాసక్తితో బ్రహ్మమునందే తిష్ఠుడై యుండును. అందుచే 'స్వాత్మానంద భావే పరితుష్టిమంతః, సుశాంత సర్వేంద్రియవృత్తి మంతః। అహర్నిశం బ్రహ్మసుఖే రమంతః, కౌపీనవంతః ఖలు భాగ్యవంతః॥' (కౌ. పం. 3) ఆత్మానంద పరితృప్తులును, జితేంద్రియులును, అహర్నిశము బ్రహ్మానందమున క్రీడించువారును, కౌపీన ధారులును అగు వ్యక్తులే మహాభాగ్యవంతులు అని శంకరుడు స్తుతించియున్నాడు.

అట్టివాడు యోగ యోగ నియోజితచిత్తుడై బాలోన్మత్తులవలె ఆనందించుచుండును (ద్వా. పం. 4). జడునివలె లోకమున జరించును (మాం. భా. 1. 86). ఉన్మత్తవద్బాలవ దప్యయత్నా న్నిర్వర్త్య దేహస్థితి మాత్మనిష్ఠః । స దేహగాహానుగతాత్మవృత్తి రేకాత్మనా తిష్ఠతియః సముక్తః॥' (మ. వా. ద. 217) ఎవడు ఆత్మనిష్ఠుడై ఉన్మత్తుని వలెను, బాలునివలెను, అప్రయత్నముగ శారీరకధర్మముల గావించుచు, సర్వసాక్షియై ఏకాత్మభావముతో నుండునో అట్టి మహాత్ముడు జీవన్ముక్తుడు అనియు ప్రసిద్ధము.

'జ్ఞానోత్పత్తే రూర్ధ్వం చ బ్రహ్మవిదః కర్మాభావం' (ఛాం.భా.9. 14. 2) జ్ఞానోత్పత్తి అనంతరము బ్రహ్మవిదునికి కర్మయు లేకుండుటచే, 'న స్నాన మంత్రార్చన కీర్తనాది వ్యాన

తీర్థసేవాది చ కర్మభిః। యుక్తం యతో౽నాత్మమతి ప్రవర్ధకం హ్యనాత్మ శాస్త్రైరితి మప్యశేషం॥' (మ. వా. ద. 223) ఎందుచే భేదబుద్ధిగల వారికే వచింపబడిన కర్మకాండాదులం దుపదేశింపబడిన సర్వము అనాత్మబుద్ధిని వృద్ధిచేయుచున్నదో అందుచే, భిక్షువైన అజ్ఞానికి స్నాన మంత్ర అర్చన కీర్తన మొదలైన కర్మ తగదు. అనగా నుండదు. 'కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిం । ఆత్మనా పూరితం సర్వం మహాకల్పాంబునా యథా ॥' (ఆ. పూ. 13) మహా ప్రళయజలములోలె సర్వము ఆత్మతో నిండియున్నది. ఏ మొనర్తును? ఎందేగుదును? దేని గ్రహింతును? దేని త్యజింతును? అను దృఢజ్ఞానమున నుండుటచే 'కథం వర్ణాశ్రమీ భవేత్' (బ్ర. అ. 4) వర్ణాశ్రమాచారశీలు డెట్లు కాగలడు? 'విక్షేపో నాస్తి తస్మాన్మే న సమాధి స్తతో మమ ।' (ఉ. సా. 2. 13. 14) నాకు విక్షేపముగాని సమాధిగాని లేక ఏకముగ నున్నాడనను ప్రజ్ఞలో నీత డుండిపోవును. విక్షేప సమాధులు మనోవికారములే కదా!

అట్టి ఆత్మజ్ఞుడు ఆత్మానంద మాధుర్యము నెరుంగని బ్రహ్మేంద్రాదుల గూర్చి చింతించును. అనగా నతనిస్థితి దేవతల ఆనందముకంటె నమూల్యము అని వివరించుచు 'ఈశ్వరత్వేన కిం తస్య బ్రహ్మేం ద్రత్వేన వా పునః' (ఉ. సా. 2. 14. 28) అట్టి వానికి బ్రహ్మత్వ ఇంద్రత్వ ఈశ్వరత్వముల నేమి ప్రయోజనము అని ప్రశ్నింపబడినది. ఆత్మానంద మగ్నులకు 'ఇంద్రస్య లోకేన కి మబ్జయోనేః . . .' (మ.వా.ద. 244) ఇంద్ర బ్రహ్మ విష్ణు శివలోకముల వలన ఏమి ప్రయోజనము

అనియు, అతనితో బోల్పబడుటను 'కో బ్రహ్మా కో ను విష్ణుర్వా కా తల్లోక సుఖప్రదా' (సు. వా. ద. 245) బ్రహ్మ ఎవడు ? విష్ణు నెవడు ? వారి లోకములగల సుఖములయొక్క ప్రసిద్ధియు నెంత ? అట్టు సంపూర్ణా నందైక శీలుని 'దేవైరపి తస్య బ్రహ్మప్రాప్తిం ప్రతివిఘ్నో న శక్యతే కర్తుం। ఆత్మా హ్యేషా స భవతి' (ముం. భా. 3. 2. 6) ఆ యా దేవతల ఆత్మయే యితడగుటచే దేవతలైనను అతని బ్రహ్మ ప్రాప్తికి విఘ్నములు కలుగజేయ జాలరుగదా ! అతడు 'ఉపాధిస్థోపి తద్ధర్మై ర్నిర్లిప్తో వ్యోమవన్మునిః । సర్వవిన్మూఢ వత్ తిష్ఠే దసక్తో వాయువచ్చరేత్॥' (ఆ. బో. 52) ఉపాధి నున్నను దాని ధర్మముల కతీతుడై వాయువువలె నిర్లిప్తుడై సర్వవిదుడు మూఢునివలె యథేష్ట జరించుచుండును.

---

# జీవన్ముక్తుడు

పై విధముగ 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నా పరః । జీవన్ముక్తస్తు తద్విద్వాన్ ఇతి వేదాంత డిండిమః॥' (వే. డిం. 66) బ్రహ్మమే సత్యము జగత్తు మిథ్య అనియు, జీవుడు బ్రహ్మమే అనియు నెరిగినవాడే జీవన్ముక్తు డని నిర్వచనము. అనగా 'శ్రుత్వా యుక్త్యా స్వానుభూత్వా జ్ఞాత్వా సార్వాత్మ్య మాత్మనః' (వి. చూ. 283) శ్రుతి యుక్తి స్వానుభవముల సర్వాత్మ భావమును బొంది, 'స్వరూపదర్శనేనైవ స్వస్థః ప్రశాంతః కృతకృత్యో భవతి'

(కఠ. భా.3.14) స్వస్వరూపదర్శనమున స్వస్థుడై ప్రశాంతుడై కృతకృత్యుడై 'యోగియై' (బృ. భా. 3. 5. 1) యుండును. కృతకృత్యుడనగా 'వీతశోకో భవతి సర్వస్మా చ్ఛోకసాగరా ద్విప్రముచ్యతే' (ముం. భా. 3. 1. 2) వీతశోకుడై సర్వ శోకసాగరమునుండి విమోచనము నొందినవాడని తాత్ప ర్యము. బ్రహ్మవేత్త తా ననెడి జ్ఞానమునుండి గూడ విముక్తి నొందినవాడే ఆత్మజ్ఞుడనియు (ఉ. సా. 2. 12. 13), 'అంత ర్బహిః స్వం స్థిరజంగమేషు జ్ఞానాత్మనా ధారతయా విలోక్య। త్యక్తాఖిలోపాధి రఖండరూపః పూర్ణాత్మనా యః స్థిత ఏష ముక్తః।' (వి. చూ. 339) స్థావర జంగమరూప సమస్త వస్తు సముదాయముయొక్క బాహ్యాంతరముల వ్యాపించి, సర్వా ధారమై జ్ఞానరూపమున దానై యున్నట్లు గాంచుచు, సకలో పాధులను విసర్జించి, అఖండపరిపూర్ణ స్వరూపమును బొంది యే పురుషుడు సుస్థితుడై యుండునో యాతడే ముక్తుడు. దేహాశ్రయమైన అహంకార మమకార వివర్జితుడై దేహాత్మా ధ్యాస రహితుడై బ్రహ్మాత్మభావమున నున్నవాడు ముక్తుడు (వ. వా. ద. 215). గుణముల నతీతించి, జీవత్వమునుగూడ నతిక్రమించి మాయోపాధి నిరాసము నొనర్చినవాడు 'జీవ న్నేవ విముక్తః' (గీ. భా. 14. 20) జీవించియు ముక్తుడు. అనాత్మవిషయములైన కామ అవిద్యాలక్షణమైన మృత్యువును అతీతించిన వాడు విద్వాంసుడై 'జీవన్నే వామృతో భవతి' (బృ. భా. 4. 4. 8) జీవించియుండియు అమృతుడే యగు చున్నాడు. అతడు 'జీవతోఽపి విదుషోఽశరీరత్వం' (బ్ర. సూ. భా. 1.1.4) విద్వాంసుడు జీవించియు అశరీరుడే యని భావము.

'జీవతా యత్ర కర్తవ్యం జీవం న్న న్న కరోతి యః॥' (మ. వా. ద. 263) ఎవడు జీవించియు కర్తవ్యముగ జేనివి- చేయుడో, 'యోఽహం తాం మమతాం దేహే దేహధర్మే పరిగ్రహేన కుర్యాత్' (మ. వా. ద. 264) నేను నాది భావముల దేహధర్మములందును భార్యాసుతాదులందును చేయుడో కేవలౌదాసీన్యమున నెవడుండునో (మ. వా. ద. 265, 269, 270) 'అతీతాననుసంధానం భవిష్య దవిచారణం। ఔదాసీన్యమపి ప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణం॥' (మ. వా. ద. 271) గడచిన విషయ విస్మరణము, భవిష్యద్విషయ విచారణశూన్యత, ప్రాప్తముల నౌదాసీన్యము గలిగి ఎవ డుండునో వాడే జీవన్ముక్తుడు. అవి అతని లక్షణములు. గుణదోషవిశిష్టమైన యీ లోకమున 'సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణం' (మ. వా. ద. 272) సర్వత్ర సమదర్శిత్వము, 'ఇష్టానిష్టార్థ సంప్రాప్తౌ సమదర్శిత యాత్మని। ఉభయత్రావికారిత్వం జీవన్ముక్తస్య లక్షణం॥' (మ.వా.ద. 273) ఇష్టానిష్ట వస్తుప్రాప్తియందు సమత్వముగలిగి అవికారియై యుండుట జీవన్ముక్తుని లక్షణము. అట్లు 'సర్వవాసనాప్రక్షయో మోక్షః జీవన్ముక్తి రిష్యతే' (వి. చూ. 318) వాసనలు క్షయింపగా జీవన్ముక్తి యందురు. 'తత్' 'త్వం' పదార్థశోధనముచే దృఢముగ నాత్మజ్ఞానము గలిగి స్థిరప్రజ్ఞగలిగి యుండుటయే జీవన్ముక్తి యనబడును (వి. చూ. 428). అట్లు ఆత్మజ్ఞానమున 'ప్రపంచో విస్మృత ప్రాయః స జీవన్ముక్త ఇష్యతే' (వి. చూ. 429) ఏది ప్రపంచ స్మృతి లేకుండయుండునో అది జీవన్ముక్తి అనబడును. బ్రహ్మాత్మములకు భేదముగాంచక ప్రజ్ఞతో నున్నవాడే జీవన్ముక్తుడు

(వి. చూ. 440). 'సాధుభిః పూజ్యమానేఽస్మిన్ పీడ్యమానే ఽపి దుర్జనైః। సమభావో భవేద్యస్య స జీవన్ముక్త లక్షణః॥' (వి.చూ.441) సజ్జనులచే బూజింపబడినను దుర్జనులచే నిందింప బడినను ఆత్మభావమున సమదృష్టినున్నవాడే జీవన్ముక్తుడు. 'చిదాత్మాహం పరాత్మాహం నిర్గుణోఽహం పరాత్పరః। ఆత్మమాత్రేణయస్తిష్ఠేత్స జీవన్ముక్త ఉచ్యతే ॥ (975) దేహ త్రయాతిరిక్తోహం శుద్ధచైతన్యమస్మ్యహం। బ్రహ్మాహమస్మీతి యస్యాంతః స జీవన్ముక్త ఉచ్యతే ॥ (976) అహం బ్రహ్మా స్మ్యహం బ్రహ్మాస్మ్యహం బ్రహ్మేతి నిశ్చయః। చిదహం చిద హం చేతి స జీవన్ముక్త ఉచ్యతే॥'(977) అనియు వేదాంతసార సంగ్రహము జీవన్ముక్తస్థితిని వివరించియున్నది.

---

## ప్రారబ్ధము

'యథా చ వర్తమానా బ్రహ్మవిదః ప్రారబ్ధభోగక్షయే కైవల్యం మనుభవంతి' (బ్ర. సూ. భా. 3. 3. 32) ఎట్లు నేటి బ్రహ్మవిదులు ప్రారబ్ధక్షయమున కైవల్యమును బొందు చున్నారో అను వాక్యమునను, 'జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి' (వి. చూ. 452) జ్ఞానముత్పన్నము నకు బూర్వమారంభింపబడిన కర్మము జ్ఞానముచే నశింపదు. 'ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః' (వి. చూ. 454) ప్రారబ్ధము బలవత్తరమైన విద్వాంసునికైన అనుభవింపక తప్పదు. 'స్వకర్మపాశవశగః ప్రాజ్ఞోఽన్యో వా జనో

సుప్రివం' (వే. డిం. 89) జ్ఞానియు నజ్ఞానియు బ్రారబ్ధమునకు లోబడియేయున్నారనియు, 'ప్రారబ్ధానుభవా న్నోక్షః' (వే. డిం. 26) మొదలగు వాక్యములు బ్రహ్మజ్ఞానియు బ్రారబ్ధము నను లొంగవలయునని శంకరు తాత్పర్యముగ దోచును. సంచి తాగామి కర్మలు జ్ఞానాగ్నిదగ్ధములయినను యీ ప్రారబ్ధము మాత్రము వదలదనియు దోచును (వి. చూ. 448, 449). ఈభావమే ఉపదేశసాహస్రియందును (2. 4. 3-5) గాన బడును. ఈప్రారబ్ధము అజ్ఞానికి బాధాకరముగనున్నను జ్ఞానికి మాత్రము బాధారూపముగాదు (వి. చూ. 444).

కాని యీవిషయమును శంకర గ్రంథముల దరచి చూచుచో భగవత్పాద తాత్పర్య మిది కాదని తెలియ గలదు. 'భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః । క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥' (వా.సు. 31) బ్రహ్మసాక్షాత్కారమున హృదయగ్రంథులు సడలిపోవును. అఖిల సంశయములు తొలగిపోవును. సర్వ కర్మములుగూడ నశించి పోవును అని వాక్యము. 'ప్రారబ్ధ మఖిలం భుంజన్ నోద్వేగం కర్తు మర్హసి' (89) ప్రారబ్ధము ననుభవించుచు జిత్తక్షోభమును బొందకుండుమని అపరోక్షానుభూతి బోధించి, 'ఉత్పన్నే ప్యాత్మవిజ్ఞానే ప్రారబ్ధం నైవ ముంచతి। ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియతేఽధునా॥' (90) ఆత్మ జ్ఞాన ముదయించినను ప్రారబ్ధమునుండి విముక్తిలేదని శాస్త్ర ముచే దెలుపబడిన విషయము నిరాకృతమగుచున్నది అని ప్రారంభించి 'తత్ప్రజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే॥' (91) జ్ఞానోదయము తర్వాత దేహాదులు అసత్తగుటచే

ప్రారబ్ధము లేదు అని తెలిపి మేలుకొనిన పిమ్మట స్వప్నము గలదా? అని ప్రశ్నించినది. ఆత్మజ్ఞానికి జన్మాంతర మెచ్చట? (92). స్వప్నదేహమువలె నీ అవిద్యాదేహము కల్పితముగదా. ఈ దేహమునకు జన్మయే లేకపోగా నికదీనికి ప్రారబ్ధ మెచ్చట? (93). ప్రపంచమే అజ్ఞానజన్యముగాన జ్ఞానోదయమున నది జ్ఞానికభావమై దోప నిక తద్గత ప్రారబ్ధమున కవకాశమేది? (96). పూర్వోక్త 'క్షీయంతే చాస్య కర్మాణి' అను శ్లోకమున సర్వకర్మ వినాశము గోచరించుచుండ నిక ప్రారబ్ధమునకు స్థానము గలదా! (98). కాని 'ఉచ్యతేఽజ్ఞైర్బలాచ్చైతత్' (99) అవివేక బలమున నజ్ఞానులచే నీప్రారబ్ధ మున్నటుల వాకొన బడుచున్నది. అందుచే 'అజ్ఞాని జన బోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః' (97) అజ్ఞానులకు బోధించుట కొరకే శ్రుతి ప్రారబ్ధమును బోధించియున్నదని శంకరుడు అపరోక్షానుభూతిలో ఘంటాపథముగా దీర్మానించి యున్నాడు. అటులే ప్రసిద్ధమైన వివేకచూడామణి గ్రంథమునగూడ 'ఉపాధి తాదాత్మ్యవిహీన కేవల బ్రహ్మాత్మ నైవాత్మని తిష్ఠతో మునేః। ప్రారబ్ధసద్భావకథా న యుక్తా స్వప్నార్థ సంబంధకథేవ జాగ్రతః॥' (455) దేహాద్యుపాధులతో తాదాత్మ్యభావమున నుండక, బ్రహ్మాత్మ మాత్రముగ జీవన్ముక్తుడై యుండు యోగికి, నిద్రనుండి మేల్కొనినవానికి స్వప్నదృష్టార్థ సంబంధము లేనియటుల ప్రారబ్ధకర్మ సంబంధముగూడ లేదని స్పష్టపరచినది. దానిని వివరించుచు 'ప్రారబ్ధం సిధ్యతి తదా యదా దేహాత్మనా స్థితః। దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్య

తామతః । శరీరస్యాపి ప్రారబ్ధకల్పనా భ్రాంతి రేవ హి॥' (461) ఎంతకాలము దేహాత్మభ్రాంతి యుండునో అంతవరకు ప్రారబ్ధ ముండును. అరూపునకు దేహభ్రాంతి లేదు గాన ప్రారబ్ధము లేదు. శరీరమునకు యీ ప్రారబ్ధకల్పనము భ్రాంతియే యగును. మరియు 'జ్ఞానే నాజ్ఞానకార్యస్య సమూలస్య లయో యది । తిష్ఠత్యయం కథం దేహ ఇతి శంకావతో జడాన్ । సమాధాతుం బాహ్యదృష్ట్యా ప్రారబ్ధం వదతి శ్రుతిః॥ (463) న తు దేహాది సత్యత్వబోధనాయ విపశ్చితాం । యతః శ్రుతే రభిప్రాయః పరమార్థైకగోచరః॥' (464) జ్ఞానము, అజ్ఞానమును తత్కార్యమును నిర్మూలించునేని అజ్ఞాన కార్యమగు నీ దేహ మెట్లు నిలచియుండును? అని శంకించెడు జడమతుల సమాధానపరచుటకై శ్రుతి బాహ్యదృష్టితో బ్రారబ్ధము గలదని వచించెనే గాని, దేహాదికము సత్యమే అని పండితులకు బోధించుటకు శ్రుతి ప్రవర్తింపలేదు అని చూడామణి ముఖమున శంకరభగవత్పాదుడు ప్రారబ్ధవిషయ సందేహమును బూర్తిగ నిర్మూలించి యున్నాడనుట స్పష్టము. అందుచే జ్ఞాని యెన్నటికిని ప్రారబ్ధబద్ధుడు కాడనియు, దాని నతీతించియే యుండు ననియు, గాని చూపరకు మాత్రము ప్రారబ్ధబద్ధునిగ గోచరించుననియు బరమ తాత్పర్యము.

---

## ఉత్క్రమణము

'న చ బ్రహ్మవిదః సర్వగత బ్రహ్మాత్మభూతస్య ప్రక్షీణ కామకర్మణ ఉత్క్రాంతి ర్గతి ర్వోపపద్యతే నిమిత్తా

భావాత్' (బ్ర. సూ. భా. 4. 2. 13) నిమిత్తాభావముచే సర్వగత బ్రహ్మాత్మభూతుడు క్షీణ కామకర్ముడు నగు బ్రహ్మ విదునకు గతి గాని యుత్క్రాంతిగాని యుపపన్నము గాదు. అనగా పూర్వము వచింపబడిన విధమున సర్వకామవిదూరుడై ఆత్మజ్ఞానియై సంతతబ్రహ్మైక్యానుభూతినున్న బ్రహ్మవిదునకు అవసరము లేకుండుటచే శరీరపాతమున శరీరమునుండి యుత్క్రమణముగాని లోకాంతరగమనముగాని అభావము. అతనికి పునర్జన్మలేక అమృతత్వము సిద్ధించుటచే నుత్క్రమణము లేదు అనియు (బ్ర. సూ. భా. 4. 27) వచించియున్నది. అందుచే నతనికి శరీరపాతమున ముక్తియే లభించును (బ్ర. సూ. భా. 4. 1. 14). ఈవిషయము బృహదారణ్యక భాష్యమునగూడ బ్రస్తావింపబడి 'తస్యైవ కామయమానస్య కర్మాభావే గమన [redacted]భావా త్ప్రాణా వాగాదయో, నోత్క్రామంతి' (4. 4. 6) ఆ అకామవంతునకు కర్మము లేమియు, గమన కారణశూన్యతయు నుండుటచే ప్రాణ వాగాదికములు ఉత్క్రమించవు అనియు వచింపబడియున్నది. ముక్తునికి 'న క్వచి ద్గమన మితి వాక్యార్థః' (బృ.భా. 3. 2. 11) కొంచమేని గమనోత్క్రమణాదులుండవని వాక్యార్థము.

అట్టి ముక్తులు 'ఏవం బ్రహ్మవిదో బ్రహ్మధామ ప్రవిశంతి' (ముం. భా. 3. 2. 5) బ్రహ్మధామమునే బ్రవేశింతురు. అతని 'ఇంద్రియాణి భూతాని చ పరబ్రహ్మవిద స్తస్మిన్నేవ పరస్మిన్నాత్మని ప్రలీయంతే॥' (బ్ర. సూ. భా. 4. 2. 15) ఇంద్రియములు భూతములును పరుడగు ఆత్మయందే లయించుచున్నవి. బ్రహ్మలయమునకై అవి ఎక్కడికో గమనింపక సర్వ

వ్యాప్తమైయున్న బ్రహ్మాత్మస్వరూపమున 'తస్మాదిహైవ బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' (బృ. భా 4. 4. 6) శరీర పతనమునకు బూర్వమే అతడు బ్రహ్మమున లయించును. అనగా 'స సర్వ మభవత్' (బృ భా. 2. 5. 15) అతడు సర్వస్వరూపుడై యుండును. 'ఉపాధినాశా ద్బ్రహ్మైవ సద్బ్రహ్మాప్యేతి నిర్ద్వయం (వి. చూ. 555) ఉపాధియగు శరీరము నశింపగ నతడు బ్రహ్మమునందు లయించునని అసంఖ్యాక వాక్యములు వాకొనుచున్నవి.

---

# బ్రహ్మలయము

జీవు డెట్లు ఆత్మలయము నొందునని సందేహించి, 'విలక్షణం యథా ధ్వాంతం లీయతే భాను తేజసి' (565) విలక్షణమైన చీకటి భాను తేజమున లయించునట్లు, 'ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్ఫుటం' (566) కుండ నష్టము కాగా తదాకాశము మహాకాశమున లయించునట్లు, 'తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయం' (566) ఉపాధి నశింప బ్రహ్మవేత్త స్వయముగ బ్రహ్మమే యగును. అంతియ గాక 'క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే।' (567) పాలు పాలయందు, నూనె నూనెయందు, నీరు నీటియందు ఎట్లు లయించునో అట్లు అభిన్నముగ బ్రహ్మవిదు డైక్యమును బ్రహ్మమునం దగునని వివేకచూడామణి వివరణము. 'సైంధవస్య ఘనో యద్వ జ్జలయోగా జ్జలం భవేత్' (అద్వై. అ. 52)

ఉన్నాగడ్డ జలమున నెట్లు లయించి జలమే యగుచున్నదో (స్వా. ప్ర. 25) అనియు, 'తేజ స్తేజసి వా యథా' (అ. బో. 53) కాంతి కాంతిలో లయించినట్లు అని అనేక ఉదాహరణముల ద్వారమున బ్రహ్మవి ద్బ్రహ్మైక్యమును గ్రంథములు వివరించి యున్నవి.

---

## బ్రహ్మైక్యము

'అజోఽహం చామరోఽమృత్యురజరోఽభయ ఏవచ। సర్వజ్ఞః సర్వదృక్ శుద్ధ ఇతి బుద్ధో న జాయతే॥' (ఉ. సా. 2. 17. 59) అజము అమరము అమృతము అజరము అభయము సర్వజ్ఞము సర్వదృక్ శుద్ధమునైన బ్రహ్మమునే యని గ్రహించిన జ్ఞానికి జన్మాదు లభావము. అట్టి స్థితిలో శోక మోహములు శూన్యముగాన 'నహి కర్మ జన్మవా' (ఉ. సా. 2. 10. 12) కర్మ జన్మలు రెండును లేవు. 'హానోపాదానవివర్జిత మైన బ్రహ్మమును గ్రహించినవాడు మరల జనింపడు (ఉ. సా. 2. 15. 51). 'బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః' (వి. చూ. 226) బ్రహ్మమున లయించిన విద్వాంసుడు మరల జననము నొందడు. బ్రహ్మలయము నొందినవాడు మరల పుట్టడు (హ. స్తో. 29). 'నశ్య త్సంస్కారజాతో న స కిల పునరావర్తతే యశ్చ ముక్తః' (శ. శ్లో. 70) సంస్కారములు నశించి ఎవడు మరల జనింపడో వాడే ముక్తుడని శత శ్లోకి నొక్కి వక్కాణించినది. అందుచే బ్రహ్మజ్ఞాని శరీరా

నంతరము విదేహకైవల్యము నొందినవాడై, సాక్షాద్బ్రహ్మముతో నేకమై యుండుటచే బ్రహ్మమున కెట్లు జనన మరణ రూప ఆగమాపాయినములు లేవో అట్లే తదభిన్నత్వమున నున్న బ్రహ్మవిదునకు గూడ జన్మాదులు శూన్యము. పూర్వ దృష్టాంతముల నెట్లు జలములో జలము లయింప లయించిన జలమును వేరుచేయ సాధన మసాధ్యమో అటులే బ్రహ్మజ్ఞాని యిక బ్రహ్మమునుండి అభిన్నత్వమును బొందును.

---

## ముక్తి

ఇంతదనుక అద్వైత తాత్పర్యమున బ్రహ్మజ్ఞానియొక్క సదేహ విదేహస్థితుల నవలోకించియున్నారము. అయిన నిక అద్వైతమోక్షము ఎట్లుండును అను విషయము గ్రహింపవలసి యున్నది. బ్రహ్మవిదుని శరీరపాతానంతరస్థితిని గూర్చిన మీమాంసయందే యీ విషయము సూచితమైయున్నది. కాని ఆవిషయ మింక కొంచెము వివరముగ జూచెదముగాక.

'ముక్తిర్నో శతకోటిజన్మ సుకృతైః పుణ్యై ర్వినా లభ్యతే' (వి. చూ. 2) నూరుకోట్ల జన్మములందు జేసిన పుణ్యపరిపాక హేతువుచేగాని మోక్షము సిద్ధింపదు. అనేక జన్మసముపార్జిత పుణ్యపాపరూప కర్మవాసనాబలముచే పునః పునః జన్మపరంపరల బొందుచు, గర్మ నభివృద్ధి నొందించుకొను చుండు జీవుడు యీ అవిద్యాబంధమును ఛేదించి బ్రహ్మైకత్వ ముఖిపూర్ణత్వమును గడింప గష్టసాధ్య మగుటచే నట్లు వచింప

బడియున్నది. అసంఖ్యాక జన్మ పరంపరాగత అజ్ఞానజనిత వ్యక్తిత్వమును బోనాడి 'యథా నద్యః గంగాద్యాః స్యంద మానా గచ్ఛంత్యం... తథా అవిద్యాకృత నామరూపా ద్విముక్తః సన్ విద్వాన్...' (ముం. భా. 3. 2. 8.) గంగాదిక నదులు ప్రవహించి తమ నామరూపముల ద్యజించి సముద్రమున లయించునట్లు విద్వాంసుడు, అవిద్యాకృత నామరూపములనుండి విముక్తుడై బ్రహ్మమునందు లీనమగును అను చందము బ్రహ్మైక్యము నొందినగాని ముక్తి అని అనబడదు. ఆ బ్రహ్మము సర్వగతము. అందు లయించుటయే మోక్షము (తై. భా. 1.11). విజ్ఞానమయుడైన ఆత్మ, సర్వోపాధి అపనయనమున 'పరేఽవ్యయేఽనంతేఽక్షయే బ్రహ్మణ్యాకాశకల్పేఽజేఽజరేఽమృతేఽభయేఽపూర్వేఽనపరేఽనంతరేఽబాహ్యేఽద్వయే శివే శాంతే సర్వే ఏకీభవంతి' (ముం. భా. 3. 2. 7.) పరమై అవ్యయమై అనంతమై అక్షయమై సర్వగతమై అజమై అజరమై అమృతమై అభయమై అపూర్వ మనపర మనంతర మబాహ్య మద్వయమై శివంకరమై శాంతమై సర్వమైయున్న బ్రహ్మములో నేకమగును. అచట 'అవిభక్త ఏవ పరేణాత్మనా ముక్తోఽవ తిష్ఠతే' (బ్ర. సూ. భా. 4.4.4) ముక్తుడు పరాత్మతో నవిభక్తముగ నుండును. ముక్తుడు పరమాత్మైకత్వమున బరమాత్మ ధర్మము లనబడు అనంతర అబాహ్యమును కృత్స్నమును అయి (బృ. భా. 2. 5. 15), 'యల్లాభాన్నాపరోలాభో యత్ సుఖాన్నాపరం సుఖం। యత్ జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ (ఆ. బో. 55) దేని బొందుటకంటె నుత్తమలాభ మభావమో, ఏసుఖము

కంటె శ్రేష్ఠసుఖము లేదో, ఎద్దాని జ్ఞానముకంటె మించిజ్ఞానము గానమో అదియే బ్రహ్మమని గ్రహింపుము. 'యద్దృష్ట్వా నాపరం దృశ్యం యద్భూత్వా న పునర్భవః । యత్ జ్ఞాత్వా నాపరం జ్ఞేయం తద్ బ్రహ్మేత్యవధారయేత్॥' (ఆ. బో. 55) దేనిగాంచిన నిక దృశ్యమే అదృశ్యమో, ఏది అయినచో నిక పునర్జన్మ లేదో, దేని నెరింగిన నిక జ్ఞేయమే శూన్యమో అదియే బ్రహ్మముగా గ్రహింపుమని నిర్వచింపబడిన 'బ్రహ్మ ధామ ప్రవిశంతి' (ముం. భా. 3. 2. 5) బ్రహ్మమున బ్రహ్మ విదుడు లయించును.

ఇంతకాలము అనాది కాలమునుండి అంటిపెట్టుకొని ప్రవృత్తికర్మరూపముననున్న 'అవిద్యాస్తమయః' (ప్ర. ఉ. మా. 66) అవిద్య అస్తమించును. ఆ యవిద్యాంశములు 'నామ మాత్రావశేషః ప్రదీప నిర్వాణవత్' (బృ భా.ఉ. 3.3) ఆరిన దీపికవలె నామమాత్రావశిష్టమగును అనగా సమసిపోవును. అంత 'తథా ముక్త్యవస్థాయా మప్యవిద్యాధ్వాంతం విద్యా ప్రదీపేన విధూయాత్మైవ కేవలో నిర్వృత్త స్సుఖీ భవతి' (బ్ర. సూ. భా. 2. 3. 40) ముక్తస్థితిలో విద్యాతేజముచే నవిద్యాంధము సమయగా ఆత్మవలె కేవలుడై నిర్వృత్తిసుఖమున ముక్తుడుండును. అనగా మోక్షస్థితిలో 'అఖిల విరమాత్కేవలీభావ ఆస్తే' (శ. శ్లో. 72) సర్వము విరమించుటచే కేవలత్వముండునని తాత్పర్యము. కైవల్యమనగా 'అపాస్త భేదకల్పనా' (ప్రౌ. అ. 8) భేదకల్పనము లేకుండుట యనియు నిర్వచింప బడియున్నది. అనగా నది 'బ్రహ్మైవ హి' (బ్ర. సూ. భా. 3.4.52) బ్రహ్మమే అనియు అశరీరత్వం

మోక్షాఖ్యం' (బ్ర. సూ. భా. 1. 1. 4) అశరీరత్వమే మోక్షమనియు, వచింపబడినది. 'స్వాత్మన్యవస్థానం మోక్ష ఇతి' (తై. భా. 1. 11) స్వాత్మేతర స్థితిగాక స్వాత్మయందే యుండుట మోక్షమని దెలుపుచు, 'ఆత్మైవైకః కేవలో నిత్య ముక్త ఇతి' (బృ. భా. 3. 5. 1) ఆత్మ మాత్రమే ఏకమై కేవలమై నిత్యముక్తమై యుండుటచే నా స్వాత్మ యందు లయించి 'స్వరూపావస్థాన మేవ మోక్ష పదం' (స. సు. భా. 4) స్వస్వరూపమున నుండుటయే ముక్తి అని వక్కాణింపబడియున్నది. అచట విషయ విషయి సంబంధ జనిత సుఖముగాక 'అభిన్నః స్వాభావిక ఆనందః పరమాత్మైవ॥' (తై. భా. 2. 8) స్వాభావికమును అభిన్నమును పరమాత్మ్యమును అగు ఆనందమున నుండును. ద్వైతవివర్జిత స్థితిలో నిక భయ మెచ్చటిది నందుచే నది 'సదాఽభయం' (ఉ. సా. 2.16.17.) అభయమునై అమృతమై (బృ. భా. ఉ. 3.) యుండును. ఇంతగ వివరించి తెలిపియున్నను, ముక్త స్థితి అగ్రాహ్యముగనే యుండుట స్పష్టము. అవాఙ్మానస గోచరమైన బ్రహ్మస్థితియే అది యగుటచే నదియు సకల త్రిపుటీరహితమై అత్యంతప్రమాతీతమై యుండుటయు సహజము. అందుచే అనేకజన్మ సంసర్గమున నానంద లేశమును అనుభవింపక నతి దూరయానము గావించి విశ్రాంతిగాంచని జీవులెల్లరు 'విజ్ఞాతవ్య మతః సమ్యగ్బ్రహ్మాభిన్నత్వ మాత్మనః' (వి. చూ. 226) బ్రహ్మాభిన్నత్వజ్ఞాన ప్రాప్తికై పూర్తిగ బ్రయత్నింపవలెను అని శంకరుని ఉద్బోధ. ఈమహోపదేశ సారమును గ్రహించి అనుసరించెదరుగాక అని ఆకాంక్ష.

# పరమార్థము

'వేదాంతైః స్పష్టరూపం సమ్యక్ నిర్ణీతం వస్తుతో నయాత్ ।అద్వైతమేవ సత్యం త్వం విద్ధి ద్వైతమసత్ సదా॥' (త. ఉ. 50) ఉపనిషత్తులలో బ్రహ్మవస్తువు యుక్తియుక్తముగ నిర్ణీతమై యున్నది. సర్వదా అద్వైత బ్రహ్మమును సత్యముగను, ద్వైతమును అసత్తుగను నీవు గ్రహింపుము. 'సుఖరూపం చిదద్వైతం' (త. ఉ. 49) చిదంశమైన అద్వైతమే సుఖరూపము. ఈ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము 'సమ్యగ్జ్ఞానం శ్రుతేర్మతం' (వి. చూ. 204) సమ్యగ్ జ్ఞానము. అది శ్రుతి సమ్మతము సుమా. అది సమ్యగ్ వివేకమువలనే సిద్ధించును. 'సర్వోపనిషదాం సర్వాత్మైకత్వ ప్రతిపాదకత్వం' (మాం. భా. 1. 3) సర్వోపనిషత్తులను సర్వాత్మైకత్వమునే ప్రతిపాదించుట స్పష్టముగ చూచియున్నారము. కేవలము శ్రుతి ప్రమాణము మాత్రమేగాక 'శాస్త్రోపపత్తిభ్యామవధారితత్వాత్ అద్వయాత్మ దర్శనం సమ్యగ్దర్శనం' (మాం. భా. 3.17) అద్వయాత్మ జ్ఞానమునే శ్రుతియుక్తులు తీర్మానించును. అదియే యథార్థ జ్ఞానము. మరియు 'శ్రుతేః స్మృతేశ్చాపి తత్త్వం పర్యాలోచ్య స్వయుక్తిభిః । బ్రహ్మాత్మనో నైవ భేదమీషత్పశ్యంతి సూరయః॥' (మ. వా. ద. 168) శ్రుతి స్మృతి యుక్తులచే తత్త్వమును విమర్శించి బ్రహ్మాత్మలకు కొంచెమేని విభేదమును విబులు గాంచరుగాన 'యత్ప్రమాణం వేదాంతాగురవోఽనుభవస్తథా । బ్రహ్మైవాహం న సంసారీ న చాహం బ్రహ్మణః పృథక్॥' (బ్ర. అ. 27)

ఈ విషయమున సర్వవేదాంతములును, గురువాక్యములును, అనుభవముగూడ ప్రమాణములగుచున్నవి. నేను బ్రహ్మస్వరూపుడను, సంసారిని కాదు. బ్రహ్మేతరమును కాదు అను అసంఖ్యాకవచనములు శ్రుతి యుక్తి అనుభవసమ్మతమగుటయేగాక విద్వదనుభవరూపమనియు దీర్మానించుచున్నవి.

అపగా 'మోక్షస్య జ్ఞానహేతుత్వా న్న తదన్య దపేక్షతే' (ఉ. సా. 2. 11. 15) మోక్షమునకు జ్ఞానమే కారణమగుటచే అన్యము నపేక్షింపరాదనియు, 'అద్వైత మేకవస్తు ప్రతిపాదయతి ప్రసిద్ధం' (స్వా. ని. 50) అద్వైతసిద్ధాంతము ఏకమైన బ్రహ్మమునే ప్రతిపాదించుట ప్రసిద్ధముగాన, 'స్వల్ప మప్యంతరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః। యోఽవతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాభిభాషితం॥' (అ. అ. 52) కొంచెమేని భేదమును జీవబ్రహ్మములకు ఏమూఢాత్ముడు గాంచుచున్నాడో వాడు సంసారభయమున నుండును. అందుచే నీ 'పరమార్థతత్త్వం అమహాత్మభిరపండితై ర్వేదాంతబహిష్ఠైః క్షుద్రరల్పప్రజ్ఞైః అనవగాహ్యం॥' (మాం. భా. 4. 95) పరమార్థము అల్పజ్ఞులును, వేదాంతదూరులు, క్షుద్రబుద్ధులును అగువారికి అగ్రాహ్యము. కాని 'అజే సామ్యే పరమార్థతత్త్వే ఏవమేవేతి యే కించిత్ స్త్ర్యాదయోఽపి సునిశ్చితా భవిష్యంతి చేత్ తే ఏవహి లోకే మహాజ్ఞానా నిరతిశయతత్త్వవిషయజ్ఞాన॥' (మాం. భా. 4. 95) స్త్రీలు మొదలగువారైనను, కొలదిమందియే యీ పరమార్థతత్త్వముగూర్చి దృఢ

త్వముగలవారై అది అజము అభిన్నములని విశ్వసించి నిరతిశయ తత్త్వజ్ఞానమును గలిగియుందురని శంకరుడు అద్వైత తత్త్వప్రమాణ సుస్సాధ్యత్వమును బ్రకటించియున్నాడు.

శుద్ధాత్మైకజ్ఞాన తత్పరునకు సర్వద్వైతదృష్టి లేకుండుటచే 'నహి ప్రపంచో నహి భూత జాతం న చేంద్రియం ప్రాణగణో న దేహః । న బుద్ధి చిత్తం న మనో న కర్తా బ్రహ్మైవ సత్యం పరమార్థరూపం॥' (స్వా.ప్ర.17) ప్రపంచము లేదు, భూతములు లేవు, ఇంద్రియ ప్రాణ దేహములు శూన్యము. మనోబుద్ధి చిత్త అహంకారను లభావములు. పరమార్థరూపమైన బ్రహ్మము మాత్రము సత్యముగ గ్రహించి, 'విక్షేపో నాస్తితస్మాన్మే న సమాధిస్తతో మమ' (ఉ. సా. 2. 13. 14) విక్షేప సమాధులు మనోవికారములు మాత్రమగుటచే నాకు విక్షేపమును లేదు, సమాధియు లేదు. 'న మేఽస్తి కశ్చిన్న చ సోఽస్మి కస్యచి ద్యతోఽద్వయోఽహం న హి చాస్తి కల్పితం। అకల్పితశ్చాస్మిపురా ప్రసిద్ధితో వికల్పనాయాద్వయ మేవ కల్పితం॥' (ఉ. సా. 2. 19. 12) నే నద్వయుడను కాన ద్వితీయుడు లేడు. కల్పిత జగత్తు వాస్తవము కాదు. సంకల్పములకు బూర్వప్రసిద్ధుడ నగుటచే నేను అకల్పితుడను అను సత్యము నారసి, ఆత్మస్థితి నుండదగును. అందుచే నిక 'న నిరోధో న చోత్పత్తి ర్న బంధో న చ సాధకః । న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (వి. చూ. 575) ఆత్మకు ఉత్పత్తియు లేదు. బంధమును లేదు. నిరోధము లేదు. సాధకుడు ముముక్షువు ముక్తుడు అనుటయు బుద్ధికల్పితమే గాని వాస్తవములు కావు.

ఇదియే పరమార్థము అని శ్రీశంకర భగవత్పాదాచార్యుడు తన వివేకచూడామణి గ్రంథమును యీపరమార్థ బోధతో ముగించి యున్నాడు. అంతకు మించిన సత్యము లేదని నిశ్చయము.

---

## సమాప్తి వచనము

ఇంతటితో శ్రీశంకరభగవత్పాదునిచే విరివిగ నుల్లేఖింపబడి దేశవ్యాప్తముగ బ్రసరింపజేయబడిన అద్వైతసుధ కేవలము వేదసాగర మథన జనితమనియు, గాన నది వేదపరమ తాత్పర్యమనియు స్పష్టమగుచున్నది. అది పూర్వోక్తచందము, ఒ వేదజనిత స్రవంతి క్రమన్యాయమున ననంఖ్యాక బ్రహ్మవేత్తల హృదయ ప్రవేశమున నధికతర మాధుర్యమును ఆస్వాదించి, సర్వపరిమితుల నధిగమించి, గంగావాహినివోలె నపారమై, నారాయణ సమారంభితమై, వ్యాసశుకుల బునీతుల గావించి, గౌడపాద సంస్పర్శచే మహాహ్లాదధియై, శంకరహస్త పవిత్రస్పర్శామాహాత్మ్యమున విశ్వవ్యాప్తి నొందియుండుట గాంచనగును. అప్రధానవిషయముల నెట్టి అవాంతరవిభేదములు గోచరించినను, పరమతాత్పర్యమున శ్రుతులకును, వ్యాసాదులకును, గౌడపాదాచార్యునికిని శంకరభగత్పాదునికి నెట్టి భిన్నత్వము గానబడదు అనుటకు శ్రుతి గౌడ శంకరులచే బరమార్థముగ బర్యవసానముగ స్వీకరింపబడిన 'న నిరోధో న చోత్పత్తి ర్న బంధో న చ సాధకః। న ముముక్షు ర్న వై

ముక్తి ఇత్యేషా పరమార్థతా.’ (త్రిపురతాపిని, అ. నా., ఆత్మ, మాం. కా. 2. 32, వి. చూ. 575) అను శ్లోక ప్రమాణము లత్యంత ప్రబలము. సిద్ధాంతమున భేదము లేదు గాన, నా సిద్ధాంత తాత్పర్యమైన నాత్మాద్వైతస్థితి నార్జింప నుపదిష్టమైన సాధనాది విధానములు గూడ త్యాజ్యము గానరాదు. అందుచే వేదప్రోక్త ఆశ్రమ ధర్మములలో ముఖ్యమైన సన్న్యాసాశ్రమమే యీ అద్వైతసిద్ధి కుపాయముగ నేర్పడుటయు నిస్సందేహము. కావున శ్రీశంకర ప్రతిపాదిత అద్వైత సిద్ధాంతము సంపూర్తిగ శ్రుతి స్మృతి యుక్తి అనుభవసమ్మతమై అనాది పరంపరాగత పరమసిద్ధాంతముగాని శంకరకపోల కల్పితము ముమ్మాటికి గానేరదని సిద్ధాంతము.

ప్రస్తుతము మనము సమీక్షించియున్న శంకరాద్వైత వాదము పారమార్థికముగ నీ జీవ బ్రహ్మ విభేదమును, బాహ్యమున స్థూలముగ భోగ్యముగ దోచుచున్న యీ ప్రకృతిరూప సృష్టిని కేవలము మిథ్యారూపముగ విశ్వసించుట గానగును. అందుచే నీ అద్వైతము అలౌకికమై మానసికమై సంఘదూరమై నిష్ప్రయోజనమై యుండుననుభావము పలువురకేర్పడుట సహజము. కాని సిద్ధాంత మెప్పుడును పారమార్థిక పర్యవసానమును ప్రథమతః బోధించుననియు, నంత తత్సిద్ధికై సాధనోపాయముల నుపదేశించుననియు గమనింపవలయును. అనగా లోకదృష్టిలోనుండి, అద్వైతానుభూతినొందనివా రెల్లరు పారమార్థికసత్యమును బొందనివారగుటచే, వారు ఉత్తీర్ణత నొందుటకు వారికై సంబోధింపబడిన శాస్త్రములు కేవల పారమార్థికస్థితినే బోధింపక క్రిందిస్థితినున్నవారి యుపయోగార్థము

అసంఖ్యాక సాధనోపాయముల బోధించియున్నవి. అందుచే బోధించు శాస్త్రము, స్థూలదృష్టులనుండువారి స్థితికి దిగినట్లుండును. అదియే వ్యావహారిక సత్యమందు, అటులే సుతీక్ష్ణ అద్వైతసిద్ధాంత ఆచార్యుడైన శంకరుడును శాస్త్రమురీతి పారమార్థికసత్యమునుండి క్రిందికిదిగి, తన జీవితమున గల ఉద్యమముల ద్వారమున, గ్రంథ ప్రబోధముల ద్వారమున, అనుష్ఠానమార్గముల బోధించుట గమనార్హము. ఆస్థితిలో అజ్ఞలోకమునకై సాధారణ ముముక్షువు లంగీకరించు సర్వవిషయముల దా గూడ సమ్మతించి, ఆస్థితినుండి వారుత్తీర్ణత నొందు ఉపాయముల బ్రతిపాదించి యున్నాడు. కాన తన రచనములలో ప్రతిమ ప్రతీక ఉపాసనా విధానముల ననేకము బోధించుటయే గాక, మఠముల దేవతార్చనాదుల నెలకొల్పి దేవాలయములగూడ నిర్మించినట్లు చరితాకథనము వానినైన సక్రమరీతి ననుష్ఠించుటకు సాధనచతుష్టయము నర్హతగ నుంచి యుండుటయు ముఖ్యము. అందుచే నద్వైత గమ్యమునకై సాధించు ముముక్షువులు సంఘమున కెట్టి సంఘవిరుద్ధ ప్రవృత్తులుగాక సామాన్య ముముక్షువుల వలెనే రూపొంది యుండుటగాని వ్యతిరేకముగ నుండుట యుదుర్లభము, అంతియ గాక నీ సువిశాలహృదయుడు, కేవలము సర్వ మిథ్యా వాదమును చరమస్థితిగ బోధించియున్నను, నాడు సుప్రఖ్యాతముగనున్న షణ్మతములగూడ సమర్థించి, యుద్ధరించి, బోధించియుండుట చేత ఏ ఆచార్యునికి లభింపని 'షణ్మతాచార్య' అను ప్రసిద్ధి కూడ శంకరునకు ప్రాప్తించెను. ఉపాసనావిధానములో నాడు ముఖ్యముగ అవలంబింపబడుచుండిన శైవ శాక్త వైష్ణవ

సౌర గాణా ద్యుల సమన్వయింప పంచాయతన పూజావిధాన మును నెలకొల్పి ఆదర్శమూర్తిగ రూపొందుటయు గణ నీయము. కాన క్రమన్యాయమున ప్రథమతః సర్వజగత్తును సత్యమని యెంచి, దాని నుపయోగించుకొని సత్త్వవర్తనమున పరిశుద్ధత నార్జించి, ఉపాసనారంగమున మునిగి, సూక్ష్మ చిత్తము నార్జించి, అంత నధికారియై, గురు కృపాసిద్ధిచే అద్వై తానుభవసంధానమున మునిగి, అంత సర్వమిథ్యాదృష్టితో సంపూర్ణ బ్రహ్మానుభూతిలో మగ్నతనుందుటయే శంకర తాత్పర్యము. కాన శంకరాద్వైతము అనుటతోడనే, మాయా వాదము స్ఫురించి భీతావహమునొంద నిట నెట్టిఅవకాశము లేదని వ్యక్తము. సిద్ధాంతమున బోధింపబడినను సర్వమాయావాదము ప్రాథమికస్థితులలో భావరూపమున మాత్రమే యుండగలదు గాని, ఆచరణయోగ్యము కానేరదు. అది కేవల బ్రహ్మానంద మగ్నునికే అనుష్ఠేయము అని సాధకలోకము ముఖ్యముగ గ్రహించెదరుగాక।

కావున నీ పరమార్థ రూపమైన అనాదిగతమైన శంకర రాభిమానపాత్రమైన అద్వైత రససింధువును జేరి అందు సుస్నా తులై, తన్మయులై, తల్లయమునొంది, సంపూర్ణ బ్రహ్మైక్య సిద్ధిని గాంచెదరుగాక అని ఆశించుచున్నాము.

యస్త్వం పృచ్ఛసి మాం కోహం
బ్రహ్మైవాసి న సంశయః (వా. వృ. 8)
నేను ఎవడను? అని నన్ను అడుగు.
నీవే బ్రహ్మమవు సందేహము లేదు.
ఓం తత్ సత్

---



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## అభిప్రాయములు

## సాధనరహస్యము

(ద్వితీయ ముద్రణము)

| | | |
|---|---|---|
| 1/8 క్రౌను | 330 పుటలు | రు 2-25 |

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రభ, | మద్రాసు | 30-8-1953 |

శ్రీ పతంజలి ప్రోక్తాష్టాంగయోగము, వివేక వైరాగ్య శమాది ముముక్షుత్వాలనబడే సాధనచతుష్టయ రహస్యాలు యీ గ్రంథంలో సర్వులకు బోధపడేరీతిని సులభ వ్యావహారిక భాషలో వివరింపబడినవి. ఆధ్యాత్మిక జ్ఞానాసక్త అయిన పదమూడేళ్ళవయస్సుగల బాలిక అభివృద్ధిని కాంక్షించి లేఖల రూపములో స్వామి రచించిన యీ గ్రంథం కేవలము ముముక్షువులకేగాక ఆధ్యాత్మిక జిజ్ఞాసపరులైన వారందరికి ఉపయోగకరంగా ఉందనడంలో సందేహం లేదు.

సంతతాభ్యాసంద్వారా ఏకాగ్రత వైరాగ్యాలను అలవరచుకొని ఆత్మతత్త్వానుభూతిని పొందడానికి భారతఋషులు ప్రతిపాదించిన సూత్రాలను అవగాహన చేసుకోడానికి యీ గ్రంథం చాల సహాయం చేస్తున్నది.

పండితులకే కాకుండ పామరులకుకూడా ఆధ్యాత్మిక విషయ పరిజ్ఞానం అందుబాటులో ఉండాలనే లక్ష్యంలో పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్ అనుభవానంద స్వాములు చేస్తున్న కృషి ప్రస్తుతించతగింది. శ్రీ రామకృష్ణపరమహంస శిష్యకోటి సంప్రదాయానికి అనుగుణమైనది.

2. ఆంధ్రపత్రిక, మద్రాసు 13-6-1954

ఈ గ్రంథం 36 లేఖల సంపుటి. ఈ లేఖలలో సాధకులకుపయోగించే విషయములను గురించిన చర్చే ప్రధానవిషయం. బ్రహ్మచర్యం అసనాభ్యాసం మొదలైన విషయాలెన్నో ఉన్నాయి. మొత్తంమీద లేఖలన్నీ జ్ఞానయోగం, రాజయోగ, భక్తియోగాలకు సంబంధించినవి.

అయితే ఇవన్నియూ ఒక బాలిక నుద్దేశించి వ్రాయడంచేత రచయిత ఎక్కువ పాండిత్యధోరణి లేకుండా ఆ విషయాలన్నీ అతిసులభమైన శైలిలో వివరించారు. వీరి లేఖల్లో వాడిన వ్యావహారికం అనర్గళప్రవాహంలాగా సాగిపోతూ పాఠకులలో బాగా అభిరుచి కలిగిస్తున్నది.

3. ఆంధ్రపత్రిక, మద్రాసు 7-10-1956

శ్రీ అనుభవానంద స్వాములవారు ఆంధ్రులకు విదితచరులై యున్నారు. వారి 'సర్వసిద్ధాంత గ్రంథం' ఆంధ్ర హృదయోద్యానాల్లో విశృంఖలంగా వ్యాపిస్తూంది. 'సాధనరహస్యం' సాధక కల్పతరువు.

ఇది పదమూడేండ్ల బాలికకోసం వ్రాసిన గ్రంథమైనా, భోగులకూ యోగులకూ, విరాగులకూ కూడా పఠనీయము అనడానికి ఇంకొకరు 'సర్టిఫికెట్టు' ఈయనక్కర లేదు.

వ్యాఖ్యాసాధ్యములైన భగవద్గీతాద్యుపనిషత్తులన్నీ తేట తెలుగున అభివ్యక్తములౌటయే సాధన రహస్యం. ముముక్షువునకే గాదు, తెలుగెరిగిన ప్రతిచదువరికీ పఠనీయమైన రచన ఇది.

ఈ గ్రంథములోని ప్రత్యక్షరంలోనూ శ్రీమదనుభవానందులు అనుభవానందులుగా ప్రత్యక్షమవుతూ, ఉత్తరాలమూలకంగ ఆ బాలికకూ, ఉపనిషణ్ణులై పాఠకులకూ సాధనరహస్యాన్ని బోధిస్తున్నట్లు గుర్తించి అనుభవానందం పొందవచ్చు.

ఈ పద్ధతిలో ఒక్కొక్క ఆధ్యాత్మిక విషయాన్ని శ్రీ స్వాములవారు తేటతెల్లమైన తెలుగులో వివరించి, బోధించి నివృత్తిమార్గాన్ని [illegible]జనసులభం చేసిన దివ్యరచన 'సాధన రహస్యం.'